

**సేకరణ : రచన సుగంధం సాయి బాబా చార్య స్వామీజీ (విశ్వకర్మ)**

**శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు - విజయవాడ**

**శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాధాలయ నిర్మాణకర్త**

| | | |
|---|---|---|
| జననము | : | 5-7-1943 |
| జననీ జనకులు | : | కీ.,శే.బ్రహ్మశ్రీ సుగంధం వెంకటేశ్వరరావు, శ్రీమతి సుగంధంపాపాయమ్మ |
| జన్మస్థలం | : | రావులపాడుగ్రామము, గుడివాడ తాలుకా, కృష్ణాజిల్లా |
| విద్య | : | 1952 సం॥ లో 9వ తరగతి -1952 నుండి స్వర్ణవృత్తి నభ్యసిస్తూ దైవచరిత్రలు, వేదాంత, విశ్వకర్మ, గ్రంధముల పఠనము, వాస్తు, జ్యోతిష్యములు, అభ్యాసము, పౌరాణిక నాటక ప్రదర్శనలు |
| వృత్తి | : | స్వర్ణశిల్పము, |
| ప్రవృత్తి | : | ఆధ్యాత్మిక భావనలు, కులసనాతన సాంప్రదాయములందాసక్తి శ్రీశ్రీశ్రీ సనారీపూజా, చరిత్ర ప్రచారము,బ్రహ్మవిద్యాభ్యాసము. |
| రచనలు | 1. | శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి నిత్య పూజా విధానము, సంధ్యావందనము, కేదారేశ్వర వ్రతము |
| | 2. | శ్రీ సనారీ మాలాధారణ, పూజావిధానము, |
| | 3. | శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానం & మహిమలు |
| | 4. | శ్రీ సనారీశ్వర వ్రత కల్పము |
| | 5. | శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు అముద్రితములు |
| | 6. | శ్రీ సనారీ యోగజ్ఞానామృతము |
| | 7. | శ్రీ సనారీ స్టేజీ నాటకము |
| | 8. | శ్రీ సనారీ హరికథ |
| బాధ్యతలు | | శ్రీ విశ్వకర్మ బి.సి.క్లాస్ బిల్డింగ్ సొసైటి అధ్యక్షులు విజయవాడ. |

శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు

సేకరణ రచన, శ్రీ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ



# శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్థములు

సేకరణ రచన, బ్ర॥సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ


ప్రధమ ముద్రణ : శ్రీ జయనామ సంవత్సరం (డిసెంబర్ 2014)
ప్రతులు : 1000 కాపీలు
వెల : అమూల్యం

ప్రతులకు : శ్రీ సాయిజ్ఞాన నిలయం
చి॥ సుగంధం శివప్రసాద్
డోర్ నెం. 23-11-1-6/బి,
ఓగిరాలవారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.సెల్ : 9290582110,9949495178

శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాథ దేవాలయ నిర్మాణ్యాధ్యక్షులు
బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామీజీ (విశ్వకర్మ)
మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం,
గుంటూరు జిల్లా : 522 501, నవ్యాంధ్ర

కొండూరు కమలాప్రసాదాచారి
సంతోష్‌నగర్, హైదరాబాద్, తెలంగాణా
సెల్ : 9032307487

కంటే శివకుమార్
రజకవీధి, లాలాజీకాంప్లెక్స్,
షాపు నెం-5, విజయవాడ - 520 001
సెల్ : 9885083676

ప్రింటింగ్
మెట్రోప్రింటర్స్, విజయవాడ-2





లీగల్ ఎడ్వైజర్ : చేవూరురమేష్, M.A.B.L. అడ్వకేట్, నవ్యాంధ్ర
విశ్వబ్రాహ్మణ సంఘ లీగల్ ఎడ్వైజర్, మచిలీపట్నం. సెల్ : 9849088719


విషయ సూచిక

# శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు

అంకితం

జగద్గురువులు,సద్గురువులు, మద్గురుదేవులగు

**శ్రీశ్రీశ్రీ అన్నపూర్ణాసమేత సింహాద్రి విశ్వనాధావదూత స్వామివారికి**



| | |
|---|---|
| **శ్రీశ్రీశ్రీ సనారీపీఠమ్ శ్రీ సాయి జ్ఞాననిలయమ్,**<br>ఓగిరాలవారివీధి,<br>డోర్ నెం: 23-11-1-6/బి,<br>సత్యన్నారాయణపురం, విజయవాడ-11<br>సెల్ : **9290582110, 90322 53205, 8099203873** | **శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు**<br>ప్రథమ ముద్రణ 2014 శ్రీ జయ<br>**ముద్రణ**<br>మెట్రోప్రింటర్స్, విజయవాడ.<br>**ప్రతులు : 1000** |

**చెన్నపట్టణ మహానగరంలో :** శృంగేరి పీఠాధిపతులతో జరిగిన వాగ్వివాదంలో సింహాద్రి విశ్వనాథావధూత స్వామి చూపిన సనారీ సాక్షాత్కారమును ఆనాటి హైకోర్టు చీఫ్ జస్టిస్ రాజమన్నార్ సమక్షంలో 1878లో ఎ.కె.వేలన్ తీసిన ఛాయాచిత్రం।

**కవినిగాను వ్యాకరణ కావ్యముల్ చదువనులేదు।**
**నేను పండితుడనుగాను శుద్ధపామరుండ, విమలభక్తి**
**భావమున సద్గురు కృపాకటాక్ష వీక్షణములతో।**
**వ్రాసితి సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములన్।**

**సేకరణ: రచన; సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ (సనారీభక్తరేణువు)**





గ్రంధకర్త మాతాపితరులు

**కీ॥శే॥ బ్రహ్మశ్రీ సుగంధ వేంకటేశ్వరరావు, ధర్మపత్ని సుమంగళి పాపాయమ్మ**

# ముందుమాట

**శ్రీశ్రీశ్రీ సనారీ సంవాదగ్రంథ అర్థములకు** ముందుమాట కలియుగ ధర్మముగా ధర్మ దేవత ఒంటికాలిపై నిలుచుటచే ఈ యుగారంభము నుండి క్రమక్రమముగా కలిప్రభావముచే నరులు ఈషణత్రయములకులోనై, మనసు నందలి కోర్కెలు తీర్చు కొనుటకు అవినీతి అక్రమమార్గములనాచరించుతూ, సత్య దూరులై మానవతను కోల్పోయి, దానవ ప్రవర్తనులై నరకములబడుచున్న ఈఘోర నరలోక జనులను ధ్ధరించుటకు "ఆదిదంపతులు" తమ సంతతి దుర్గతులను తొలగించి సద్గతులను ప్రసాదించుటకై 17వ.శతాబ్ధిలో కర్మభూమియగు భారతావనిలో, శ్రీకాకుళం జిల్లాపాలకొండ గ్రామమున పౌరుషేయకులము, సింహాద్రివారిఇంట పరమేశ్వరుడు విశ్వనాధునిగాజన్మించి బాల్యము నుండి సత్యధర్మ వ్రతాచరణులై యోగసాధనచేయుచూ విరాగియైచంచరించుతూ అనేక మహిమలు ప్రదర్శించుచూ, మానవుడే మాధవుడుకాగల యోగసాధనా పద్ధతులెరింగించుచూ, శక్తిస్వరూపిణియగు అన్నపూర్ణామాతను వివాహమాడి"రాజయోగియై" కొన్నేండ్లు గృహస్థాశ్రమధర్మము గడిపి, నిత్యాన్నదానములు చేయుచూ,యోగసాధనాపద్ధతులు, సనాతనధర్మములు తెల్పుచూ, పరమశివునివాలే తన అర్ధాంగిని తనయంద్యైక్యముచేసుకొని "సనారీ"యై దేశసంచారము చేయుచూ, మానవతాధర్మములు, ఆధ్యాత్మిక విషయములుతెల్పుచూ, షన్మతములు సమానమని సర్వమానవులు సృష్టికర్తయగు విరాట్‌విశ్వకర్మ సంతతియేయని,కుల,మత, జాతిబేధముల నరికట్టుచూ కొండలు, కోనలు, కీకారణ్యములు దాటుచూ, బొబ్బిలి, విజయనగరం, పిఠాపురం రాజాస్థానములందు రాజగురువుగా కొన్నేండ్లు మన్ననలనంది, బీద, ధనికబేధంలేకుండా తన్నాశ్రయించినవారికి మంత్ర ఉపదేశములొసంగి జీవన్ముక్తి మార్గములు చూపుతూ, హరిజన, గిరిజన, పల్లెపట్టణ జనులకు యోగమార్గములు తెల్పుచూ, పాలకొండనుండి నాటి చెన్నపట్టణం నేటి "చెన్నై"వరకూ కాలినడకన ప్రయాణిస్తూ, మార్గమందలి గ్రామాలలో దునియావైచి పగలు ఉదరపోషణార్ధము పంచశిల్పములు చేయుచూ, రాత్రులందు అష్టాదివర్ణయోగసాధనాఉభిలాషులకు మోక్షాపేక్షకులకు జీవన్ముక్తిమార్గములు యోగసాధనలనెరింగించుచూ, దుష్టులను శిక్షించి ధర్మవర్తనులును గావించుతూ, భక్తులను రక్షించుచూ, ధర్మసంరక్షణచేయుచూ, సనారీ సంవాదంబను మంత్ర, యంత్ర, తంత్రయోగ యుక్తంబగు మహాప్రబంధమును రచియించుచూ, చెన్నపురిచేరి వారురచియించిన సంవాదప్రధమ ముద్రణ తిరువేంగడ మొదలారి కుమారుడగు టి.సి. మాణిక్య మొదలారి వారిచే చెన్నపురిలో అల్బీనియన్ ముద్రాక్షరశాలయందు,1878లో చిత్తుక్కాడ"అ" సభాపతి మొదలారి ద్రవ్యసహాయముతో



ప్రచురింపబడినట్లు కొన్ని ఆధారములచే తెలియుచున్నది. తదుపరి ఎన్నిముద్రణలు చేశారో తెలియదు. తర్వాత ముద్రణలలో క్రమక్రమంగా తప్పులు పెరుగుతూ గ్రంధము తప్పులతడికగా తయారైనది. ఆస్థితిలో యన్.వి. గోపాల్ అండ్‌కో "మద్రాసు"వారు కంచిదొరస్వామి మొదలియార్& సన్స్ వారి వద్ద గ్రంధ సర్వహక్కులు పొంది, కొండపల్లి పెదసంగయ్య గారు **అడ్రసు :** చోడవరం గుండేపల్లిపోస్టు, నల్లజర్ల మండలం ప॥గో॥జిల్లా వారిచే పండిత పరిష్కారంచేయించి విక్రయిస్తున్నారు. ఈ గ్రంధ సవరణ ఏసంవత్సరంలో చేసారో తెలియదు. నేను 1996లో గ్రంధంలోని కొన్ని సందేహాలనివృత్తికై సంగయ్యగారికి రిప్లైకార్డు వ్రాసాను. కార్డు తిరిగి వచ్చింది జవాబులేదు. తరువాత తిరుపతి వాస్తవ్యులు చుక్కలచంగయ్యగారు గోపాల్ అండుకో వారివద్ద హక్కులు పొంది ముద్రించి విక్రయిస్తున్నారు. యిది ఏసంవత్సరమో యిప్పటికి ఎన్నో ముద్రణో తెలియదు. అయితేపెదసంగయ్యగారు గ్రంధాన్నిచాలావరకూ పరిష్కరించారనే చెప్పాలి. కానీ కొన్ని సందర్భాలలో అతిని ప్రదర్శించారు. అవికొన్ని అర్ధశూన్యాలు,కొన్ని విపరీతార్ధాలు వచ్చేవిగా ఉన్నాయి. ఉదా॥మకారపంచక భక్ష్యం మత్స్యమాంస, మధు, మనుఃమాషం అని స్వామివారు అంటే, సంగయ్యగారు డిక్షనరీలో ఉన్న మత్య, మాంస, మధు, ముద్ర, మనువు అని వ్రాశారు. స్వామివారు కేవలం భక్ష్యమన్నది వారు గ్రహించక, తినడం,తాగడం, తొంగోడంగా చెప్పారు. ఇలా ఎన్నో ఉన్నాయి.స్వామివారు ఆరోహణ,అవరోహణ క్రమంలో చెప్పిన మంత్రాలను రెండుసార్లు ఎందుకని కుదించారు. కొన్ని సందర్భాలలో చెప్పిన బీజాలను కూడా కుదించారు. ఉ॥బ్రహ్మే బ్రహ్మభూయిష్టా అద్వైత, అనాద్వైతఅద్వయానందమయ సాగర సుధాసముద్ర ముద్రితయోగ నిద్రా ప్రచారాయైనమః అన్నదానిని ఓం బ్రహ్మభూయిష్టాద్వయానంద సముద్రముద్రితయోగ నిద్రాప్రచారాయైనమోనమః అని కుదించారు "అంటే" స్వామివారి అనుగ్రహం లేక వారు ప్రక్కదారిన పడ్డారని ఊహించవచ్చు.యిందలి భావాలను గ్రహించాలంటే,కేవలం పాండిత్యంతో సాధించలేరు స్వామివారి అనుగ్రహంతో, వారితత్వాన్ని పూర్తిగా అవగాహన చేసుకుని, ఆభావంతో ఉన్నవారుగానీ దీన్ని పరిపూర్ణంగా గ్రహించలేరు. అంటే వేదాంతం సిద్ధులభాష, యోగవిద్య రసవాదం, భాషాపాండిత్యం, సృష్టిరహస్యాలు, మరుగుపద ప్రయోగం ప్రాంతీయభాషాపరిచయం ఉంటేగానీ బోధపడదు అన్నిటికన్నా స్వామివారి కరుణ ముఖ్యం అది లేకుంటే అసాధ్యం "అంటే" సనారీవారే మళ్ళీవచ్చి చెప్పాలి గానీ ఎంత మందిఎన్ని పరిశోధనలు చేసినా ఫలితం అంతంతమాత్రమే. స్వామివారు సృష్టి మొత్తాన్ని శరీరంతో పోల్చుతూ, సామాజిక ఆచార్యవ్యవహారాలను యోగాసనాలను, పూజా పద్ధతులను వాటి ప్రయోజనాలను, రసవాదప్రక్రియలను, మానవుడే మాధవుడుకాగల అనేక రహస్యాలను గ్రంధస్థంగావించారు. ఇది ఎలా

ఉందంటే 6వ తరగతి విద్యార్థికి డిగ్రీలలోని సాహిత్యం బోధపడనట్లుగా ఉన్నది. పండితులకు కూడా అగమ్యగోచరముగా ఉన్నది. యోగసాధనలో అణిమాదులను దాటి ఈశ్వరత్వాన్ని పొందిన గానీ దీనిని గ్రహించలేరు. సనారీవారు సంవాదములో "నేనే విశ్వబ్రహ్మము ఆననమున మున్ను బుట్టి నామయ వంశంబేనని తలపుడి, దయ పంచాననకుల ముద్ధరింప జననంబైతిన్", అంటూ తమ జనన కారణాన్ని తెలియ పర్చారు. పంచాననులు దైవశాపములచేత, ఆర్షేయద్వేషంచేత సమాజంలో అణగ ద్రొక్కబడి నీచాతినీచంగా కాలం గడుపు తరుణంలో జాతినుద్ధరించుటకు, తమ సంతాన మగు అష్టాదివర్ణస్థులను ఘోర నరకములనుండి తప్పించి సద్గతులు ప్రసాదించుటకు సాక్షాత్ పరమశివుడు మానవరూపంలో అవతరించిన విషయం విశ్వబ్రాహ్మణులకు, అష్టాది వర్ణస్తులకూ ఎంతమందికి తెలుసు నంటే మనం యిలా ఊహింపవచ్చును. పరమేష్టి సర్వజనుల నుద్ధరించుటకు పాలకొండలో సింహాద్రివారి యింట విశ్వనాధునిగా ఉద్భవించారని స్వజనులలో 1000 మందిలో ఏ ఒకరికో తెలుసేమో, అలా తెలుసుకున్న 1000 మందిలో స్వామి వారొక గ్రంధాన్ని వ్రాసారని ఏఒకరికో తెలుసేమో, అలా తెలిసిన 1000 మందిలో ఏఒకరో ఆగ్రంధాన్ని చూచి ఉంటారేమో? అలా చూచిన1000 మందిలో ఏఒకరో కొని చదవటానికి ప్రయత్నిస్తారు. కానీ ఈభాష మనకర్ధం కావటంల్లేదని జాగ్రత్తగా భద్రపరుస్తారు. యిలా దాచిన వెయ్యిమందిలో ఏ ఒకరో అప్పుడప్పుడు మళ్ళీమళ్ళీ ప్రయత్నిస్తారు. అలా ప్రయత్నించిన వెయ్యిమందిలో ఏ ఒకరికో కొంచెం అర్ధమవుతుంది. అలా అర్ధంచేసుకున్న వందమందిలో ఏ ఒకరో తీవ్రకృషిచేసి యింకొంచెం అర్థం చేసుకుంటారు. అలాంటి వందమందిలో ఏ ఒకరో ఆచరణలో పెడతారు. ఆలా ఆచరణపెట్టిన వారిలో 99మంది రసవాదానికి ప్రయత్నించి అసలు విషయాన్ని వదిలి భ్రష్టులై సనారీ వారికి అపఖ్యాతిని ఆపాదిస్తున్నారు. యిలా ప్రయత్నించిన 1000 మందిలో ఏఒకరో "వాదభ్రష్టోవైద్య శ్రేష్ఠః" అన్నట్లు తయారవుతారు. యిలాంటి వారుకూడా స్వామివారు సంవాదంలో యిదిసిద్ధులకు మాత్రమే బద్ధమని వ్రాశారనిగానీ దీనికొక స్వర్ణ మంత్రమున్నది. దాన్ని జపించిసిద్ధి పొందాలనిగానీ, అదికూడా నిత్యఉపాధికిమాత్రమేనని గ్రహించక, 250 పేజీలు గల గ్రంధాన్ని పూర్తిగా చదవక రసవాదంగల పేజీలు మాత్రమే పదేపదే వల్లెవేసుకుంటూ కొండలు కోనలూ మూలికలకోసం తిరుగుతూ, శివవీర్యమగు పాదరసాన్ని నిర్వీర్యం చేస్తూ సంసారానికి, సంతానానికి చెడి, స్వామివారు చెప్పారు ఎందుకు కాదనే వితండ వాదంతో శరీరాన్ని చాలిస్తారు. అన్నిటికన్నా ఆశ్చర్యవిషయమేమంటే సనారీ భక్తులమని చెప్పుకునేవారి లో 100మందిలో ఏ ఒకరో సంవాదాన్ని చూస్తారు. గ్రంధాన్ని చదివిన వారు అందులో పూజావిధులనుగానీ యోగసాధనా పద్ధతులనుగానీ ఆచరించక కేవలం



ధనకాంక్షతో రసవాదంచేయువారు సర్వభ్రష్ఠులగుచున్నారు. యిలాప్రక్కదారిన పడకుండా యోగ సాధనలు చేయువారు ఏ కొంతో అర్ధం చేసుకునియిదే పరిపూర్ణమనే భ్రమలో ఉంటారు. ఈ భావాన్ని మనసుకు రానీయకుండా నిరంతరంతీవ్ర కృషిసలుపువారికి సనారీ వారి కృపగలిగి మోక్షానికి అర్హులగుదురు. ఈ స్థితికి రావడానికి ఎన్నో సామాజిక ఆర్థిక, ఆరోగ్యకుటుంబ సమస్యలనధిగమించాలి. యివన్నీ దాటి స్వామివారి పరీక్షలో ఉత్తీర్ణులగుట చాలా కష్టం. స్వామివారికరుణతోనే యిది సాధ్యం. కేవలం మానవ ప్రయత్నంతో అసాధ్యం, బోధగురుని ద్వారా గురుపాదంపట్టి స్వామి వారిని సేవిస్తూ వారికృపకు పాత్రులు కావాలి. సంవాదంలో సాగరగర్భంలో అనేక నిధులున్నట్లుగా గ్రంధంలో లెక్కలేనన్ని వెలకట్టలేని అమూల్యదివ్య సంపదలున్నవి. "యద్భావం తద్భవతి" అన్నట్లుగా ఎవరిమనోభావాలకు తగినట్లుగావారు ప్రయత్నిస్తారు. వారి వారి పూర్వజన్మ వాసనలను బట్టి వారికవిసాధ్యమవుతాయి. యిందులో ఏ ఒకటైనా మానవ ప్రయత్నంతో సాధించగల వారి జన్మ ధన్యము. అట్టివారే సనారీ శిష్యగణములోనివారు. స్వామివారు గ్రంధంలో నా శిష్యులు "అవనికాలాగ్ని రుద్రులై" చరింతురు అని తెల్పారు. అలాంటి వారు ఆచంద్రతారార్కము కీర్తింపబడుదురు. అట్టి వారే సువర్ణసూర్యాకాంతం, కొమ్మోజుకూర్మన్నగార్లు. అజ్ఞాతంగా ఉన్న మహనీయులింకెందరో. యిలాంటి పుణ్యపురుషుల చరిత్రలు విన్నకొందరు గ్రంధాన్ని చదివి ఏదైనా సాధించాలని తీవ్రకృషి సలుపుతారుకానీ, గ్రంధం నడక చాలా సందర్భాలలో రామునితోక, పివరుండిట్లనియే అన్నట్లుగా నడుస్తుంది. నేను కూడా యిలాంటి అనుభూతులు పొందినవాడినే, కాబట్టి గ్రంధాన్ని ఎలా చదవాలన్నదినాకు అర్ధమైనంతవరకూ రికార్డు చేసాను. యిది గ్రంధ ఆరంభ పాఠకులకు చాలా వరకూ ఉపయోగపడవచ్చు. ఆ చదివిన దానికి అర్ధంకొంతైనా తెలిస్తే ఆచరణకు సులువుగా ఉంటుందని నా బుద్ధి సహకరించినమేరకు అర్ధాలు వ్రాసాను. స్వామివారు సర్వమానవ శ్రేయస్సుకై పడినతపనకు ఉడతా భక్తిగా నావంతుకృషిచేసాను. స్వామివారిసేవ, ప్రచారం ధ్యేయంగా యిలాచేసాను. యిది జనంలోకి రావాలంటే స్వామివారి అనుజ్ఞ కావాలి. దీని పర్యవసానం కాలం తెలియపరుస్తుంది. గ్రంధంలోని రసవాద ప్రక్రియలు స్వర్ణయోగంజోలికి నేనుపోలేదు. అవినా ఊహకందనివి. స్వామివారికే అవిసాధ్యం. సనారీ సంవాదం చదివినవారు రసవాదులై సర్వభ్రష్ఠులగుచున్నారు. అలాంటి విషయాలను తెలిసీ తెలియని వ్యాఖ్యలు చేసినచో వాటిని ప్రయత్నించి యింకొందరు భ్రష్ఠులు కావచ్చు. నాకు తెలిసినంత వరకూ రసవాదం సంసారులకు సాధ్యపడదు. కావున రసవాద ప్రక్రియలు స్వామికే వదిలి, యోగములయొక్క, పూజలయొక్క, ఫలితములను, స్వామివారెవరో వారిశక్తి ఏమిటో అర్ధంచేసుకోవడానికి ఉపకరించేవిషయాలను మాత్రమే ప్రస్థావిస్తున్నాను.

యిదంతా స్వామివారు సర్వమానవులందు , పంచాననులందు ప్రేమతో సర్వమానవాళియందు కరుణతో నరజాతి ఘోర నరకముల పాలుకాకుండుటకు రచించిన గ్రంధము సర్వులకు అర్ధమై ఆచరించి సత్ ఫలితములను పొందితే నాజన్మ ధన్యమైనట్లుగా భావించుతాను. "ఆ పైన గురుకృప" ఈ కృషికూడా వారికరుణతో, అనుజ్ఞతో సాగినట్లుగా భావిస్తున్నాను. ఈ నా సాహసాన్ని గురుదేవులు శిష్యవాత్సల్యంతో కరుణిస్తారని తలంచుతూ ఈ నాకృషి పరిపూర్ణం కాదని ఆరంభము మాత్రమేనని సహృదయులు గ్రహించి రాయంచ క్షీరమందలి జలాన్ని వదిలి పాలను గ్రహించినట్లుగా యిందలి దోషములు మాకు తెల్పిన మలిముద్రణలో సవరించుదుము. ఈనాసాహసాన్ని జగద్గురువు, సద్గురువు, మద్గురుదేవులగు సనారీ విశ్వనాధులు క్షమించి ప్రోత్సహిస్తారని సదావారికి అంజలి ఘటిస్తూ, అర్ధిస్తూ ప్రయత్నిస్తున్నాను. ఈ నాకృషిలోని దోషాలునావి, భూషణలు గురుదేవులకర్పిస్తున్న.

మీ సనారీ భక్త రేణువు : బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామిజీ (విశ్వకర్మ)
9032253205 & 7075649084, 9290582110& 8099203873
వ్యవస్థాపకులు: **శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాధ దేవాలయమ్,**
మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం, గుంటూరు జిల్లా : 522 501, నవ్యాంధ్ర



## గ్రంధకర్త రచనలు

మేము ప్రధమంగా వ్రాసి2007లో ముద్రించిన సంధ్యావందనము, శ్రీసూక్త పురుష సూక్తములతో శ్రీ సనారీ నిత్యపూజా,పంచబ్రహ్మల సాంప్రదాయములతోగల కేదారేశ్వర వ్రతవిధాన పూజాపుష్పాన్ని ఉయ్యూరు వా॥లు బ్ర॥బంగారునాగేశ్వరరావు గారిచే ముద్రింపబడి విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘ మాజీ అధ్యక్షులు విజయవాడ నగర మాజీ స్టాండింగ్ కమిటీ ఛైర్మన్‌గారగు బ్ర॥జవ్వాది రుద్రయగారిచే విజయవాడ 1టౌన్ స్వర్ణకారసంఘ కార్యాలయమునందు, విజయవాడ విశ్వబ్రాహ్మణసంఘ, స్వర్ణకార సంఘ, ప్రముఖులు మరియు "ప్రముఖ జ్యోతిష పండిట్ పి.ఎ. రామన్" గారు కాళహస్తి దేవస్థానం భువనేశ్వరి పీఠం సంస్కృతి టి.వి.ఆస్థాన సిద్ధాంతిగారును "వాఖ్యాత శిరోమణి" ప్రముఖ న్యాయవాది వేములహజరత్తయ్యగుప్తా గారి సమక్షంలో ఆవిష్కరించబడినది. పంపిణీ చేసాము.

చి॥కొండూరు కమలాప్రసాద్ చి॥కంటే శివకుమార్ చి॥పాలతీర్ధపు శ్రీనివాసాచారిగారిచే మాద్వితీయ ముద్రణశ్రీశ్రీశ్రీ సనారీ దీక్షావిధానము2009లో ముద్రించి సనారీ మలాధారులమై సతీశిష్య సమేతముగా పాలకొండ శ్రీశ్రీశ్రీలోకమాత అన్నపూర్ణమ్మ మఠములో మఠాధ్యక్షులు దేవునరసింగరావు (తవుడు) ప్రధాన కార్యదర్శి కొక్కెరగడ్డ బ్రహ్మాజీ మఠం ప్రధానార్చకులు దుర్గాప్రసాద్ పాడీ తదితర భక్తుల సమక్షంలో మఠం అధ్యక్షులవారిచే మహాశివరాత్రినాడు ఆవిష్కరణచేయించి పంపిణీచేస్తున్నాము.

మాతృతీయ ముద్రణ శ్రీశ్రీశ్రీసనారీ విజ్ఞానం,మహిమలు 2011లో బ్ర॥జవ్వాదికూర్మాచారి గారిచే ముద్రించబడి శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగసహిత సనారీ విశ్వనాధస్వామివారిదేలయ విగ్రహప్రతిష్ఠాసందర్భములో విజయవాడ విశ్వబ్రహ్మణ సంఘాధ్యక్షులు, దేవాలయ గౌరవా ధ్యక్షులగు బ్ర॥జవ్వాది కూర్మాచార్యులగారిచే ఆంధ్రప్రదేశ్ స్వర్ణకారసంఘాధ్యక్షులు, యమ్.యస్. ప్రకాష్ గారు, విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘం, స్వర్ణకారసంఘ ప్రముఖులు మహానాడు గ్రామ ప్రముఖుల సమక్షంలో దేవాలయ ప్రాంగణంలో ఆవిష్కరించి పంపిణీ చేస్తున్నాము.

చి॥కొండూరు కమలాప్రసాద్ చి॥కంటే శివకుమార్ చి॥పాలతీర్ధపు శ్రీనివాసాచారిగారిచే మాచతుర్ధముద్రణ శ్రీశ్రీశ్రీ సనారీశ్వరవ్రతాన్ని 2013 లో ముద్రించి శ్రీశైలంలో అన్నపూర్ణమాత మఠమందు మఠస్థాపకులగు రెడ్డినాయన ధర్మపత్ని వర్ధంతిరోజున మఠాధ్యక్షులు సనారీ భక్తవరేణ్యులగు రెడ్డినాయనగారిచే వారి"160గ్రామాల" శిష్యగణసమక్షంలో ఆవిష్కరించబడి పంపిణీ జరుగుతున్నది.

మా పంచమ ముద్రణ శ్రీశ్రీశ్రీ సనారీ సంవాదగ్రంధములు 2014 లో గ్రంధ ముద్రణకర్త **మహారాజశ్రీ వేగేశన రాధాకృష్ణ** B.E(Civil) గారిచే ముద్రింపబడినది.

**శ్రీశ్రీశ్రీ వేంకటాచారియర్** (చతుర్వేది) గారి అమృత హస్తములతో 13-12-2014వ తేదిన వారి 42వ జన్మదిన శుభసందర్భములో హైదరాబాద్ లో పల్లవిగార్డెన్స్, కె.యమ్.జి. పారడైజ్ పంక్షన్‌హాలు నందు ఆవిష్కరణ జరుగును. కొనిజేటి ఎన్‌క్లేవ్

## నవ్యాంధ్ర దేశమందలి శ్రీ సనారీ పీఠములు

**1) శ్రీ సింహాద్రి విశ్వనాథావధూతస్వామివారి** జన్మస్థలమగు శ్రీకాకుళంజిల్లా పాలకొండలో వారి స్వగృహమందుగల శ్రీశ్రీశ్రీఅన్నపూర్ణాదేవి మఠంలో కార్తీక శుద్ధపంచమీనస్వామివారి జన్మదినోత్సవం

వైశాఖశుద్ధ ఏకాదశినాడు విశ్వనాథాచారి అన్నపూర్ణమ్మల కళ్యాణం, శరన్నవరాత్రులలందు అమ్మవారికిపూజలు, ప్రతీమాసపూర్ణిమకు సనారీవారి విగ్రహానికి పంచామృత అభిషేకం, సాయంత్రం కుంకుమార్చనలు, మహాశివరాత్రినాడు అన్నపూర్ణామాత ఆరాధనలు ప్రతీసంవత్సరం తెనాలినుండి బ్రాాతుమపాలసత్యనారాయణ, బ్రాాగుంటముక్కల రాజేశ్వరరావు గార్ల ఆధ్వర్యంలో 3,4బస్సులతో భక్తులు, మచిలీపట్నం నుండి (ఒక బస్సుతో) బ్రహ్మశ్రీ దేవువెంకటేశ్వరరావుగారి ఆధ్వర్యంలో బస్సు వెళ్ళి పూజాకార్యక్రమాలు నిర్వహించుట తెనాలి వారి ఆధ్వర్యంలో అన్నదాన కార్యక్రమాలు జరుగుతాయి.

**2) బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాస్వామీజీ** గుంటూరుజిల్లా తాడేపల్లిమండలం ఉత్తరావాహినిగాల మహానాడు గ్రామంలో నిర్మించిన శ్రీశ్రీశ్రీశ్రీశ్రీత్రిశక్తి సహస్ర లింగసహిత సనారీ విశ్వనాథస్వామివారి ఆలయమునందు ప్రతీ సంవత్సరము వార్షికముగా జరుగు కార్యక్రమములు

1. కార్తీక శుద్ధ పంచమి సింహాద్రివిశ్వనాథావధూత స్వామివారి జన్మదినోత్సవము
2. వైశాఖ శాద్ధ ఏకాదశినాడు విశ్వనాథాచారి అన్నపూర్ణమ్మల కళ్యాణం.
3. దేవీ శరన్నవరాత్రులందు స్వామివారు రచియించిన పద్ధతితో ఉదయం తర్పణలు, పూజకు వచ్చినవారికి భోజనములు.పూజలు జరుగును. సాయంత్రం సహస్ర నామాలతో కుంకుమపూజలు జరుగును.
4. మహాశివరాత్రికి పార్వతీపరమేశ్వరులకల్యాణము జరుగును.
5. ప్రతీమాసశివరాత్రికీ శివలింగానికి అన్నాభిషేకముచేయించి దాదాపు 100మందికి అన్నసంతర్పణజరుగును. దేవాలయములోని ప్రతీకార్యక్రమానికి అన్నదానం జరుగును.
6. ప్రతీ శనివారం నవగ్రహపూజలు, ప్రతీరోజు ప్రతీ శుక్రవారం అమ్మవారికి కుంకుమార్చననుశివలింగానికి అభిషేకములు.
7. ప్రతీ సోమవారం శివలింగానికి పంచామృత అభిషేకములు.
8. సుబ్రహ్మణ్యషష్టి బాలసుబ్రహ్మణ్యస్వామికి
9. హనుమజ్జయంతి అభయాంజనేయస్వామివారికి
10. మంగళవారంనాగదోషమున్నవారికి సుబ్రహ్మణ్యస్వామిపూజలు
11. నాగుల చవితికి పంచముఖనాగేంద్రునకు జంటనాగులకు ప్రత్యేకపూజలు

**3) తెనాలి మఠంబజారులో** సువర్ణ సూర్యాకాంతంగారి మఠంలోని సనారీ దేవాలయంలో వార్షికంగాజరుగు కార్యక్రమములు. తెనాలి గుంటూరుజిల్లా , న్యూఆంధ్ర.



1. కార్తీకశుద్ధ పంచమి స్వామివారి జయంతి& కల్యాణం.
2. వైశాఖశుద్ధ ఏకాదశినాడు స్వామివారి కల్యాణం.
3. మహాశివరాత్రినాడు పార్వతీపరమేశ్వరుల కల్యాణం.
4. సువర్ణ సూర్యాకాంతాచారిగారి ఆరాధన.
5. సువర్ణలక్ష్మీ నరసమ్మగారి ఆరాధన.

**4) శ్రీశైలంలోని రెడ్డినాయన ఆశ్రమంలో** గల అన్నపూర్ణాదేవి మఠమును 1972లో స్థాపించారు. స్వామివారి జయంతి ఫిబ్రవరి 7వతేదీన, కార్తీకమాసంలో అభిషేకములు, మహాశివరాత్రికి అన్నపూర్ణావిశ్వనాథుల కల్యాణం.

మార్గశిరమాసంలో అన్నపూర్ణాదేవి వ్రతం 16రోజుల కార్యక్రమములు చప్పటి భోజనం,తీపి పదార్ధములతో నివేదన జరుగును.

**5) తాండూర్‌లో కార్తీక కృష్ణ** ఏకాదశినాడు సనారీ జయంతి చేస్తారు.(తెలంగాణ)

**6) వాడ్యాలతో** సనారీవారి జయంతి కార్తీకశుద్ధ పంచమి చేస్తారు.

**7) పోలకంపల్లిలో కార్తీక** శుద్ధఏకాదశినాడు సనారీ జయంతి చేస్తారు.

**8) మొహబూబ్‌నగర్‌జిల్లా** జిల్లేళ్లలో సనారీ జయంతి కార్తీకకృష్ణ పంచమిన చేస్తారు.

**9) భీమవరం రెల్లివీధిలోగల** సనారీపీఠాన్ని 1949బ్రాాతాతోలు వీరరాఘవాచార్యులు గారు స్థాపించి సనారీ వారు ప్రసాదించిన పూజావిధానంతో ప్రతీ సంవత్సరం దేవీ నవరాత్రోత్సవములు నిర్వహించి పూర్ణాహుతి రోజున అన్నదానం చేసెడివారు యిలా 1990వరకూ పీఠాన్ని నిర్వహించి 1991లో శివైక్యముచెందారు. నాటినుండి వారి రెండవ కుమారుడు కాళీవరప్రసాద్ పీఠాన్ని పరిరక్షించుచూ జ్యోతిష శాస్త్రముచే జీవనము సాగించుచున్నారు. ప్రతీసంవత్సరం దేవీ నవరాత్రులు పూజాకార్యక్రమములు జరుపుచున్నారు. భీమవరం, రెల్లివీధి, ప॥గో॥జిల్లా, న్యూఆంధ్ర.

**10)తూ॥గో॥జిల్లా చరిత్రప్రసిద్ధి** కెక్కిన ద్రాక్షారామమందు సనారీఆశ్రమముకలదు.

11) తూ॥గో॥జిల్లా రావులపాలెం మండలంలో గోపాలపురమందు పాకలపాటిగురువులచే నెలకొల్పిన శ్రీశ్రీశ్రీ సనారీ వారి ఆశ్రమముకలదు.

12) తూ॥గో॥జిల్లా రాజరాజనరేంద్రుడు పరిపాలించిన రాజమండ్రి కోటిలింగాల రేవు వద్దనున్న సుబ్రహ్మణ్యశర్మ గారిసమాధిని సనారీవారుగా ఆప్రాంతీయు మరికొందరు కలసి మఠం లాగా నిర్మించి పూజించుచున్నారు.

13) ప॥గో॥జిల్లా పెనుగొండ దగ్గరలో గల ములపర్రుగ్రామములో రామరాజుగారు సనారీ ఉపాసకులై సనారీ దేవాలయములన్నీ వారి గృహప్రాంగణంలోనే నిర్మించారు. అయితే వారు సనారీవార్ని వేరే రూపుతో పూజిస్తారు వారు శ్రీశైలంలో మరణించగా యింటికి దేవాలయానికి మధ్యలో సమాధిని చేసారు.

14. ములపర్రు సరిహద్దున గల యలపర్రులో సనారీపీఠం ఆశ్రమమున్నది. అక్కడ పవన్‌కుమార్ బ్రదర్ ప్రతిరోజు కొబ్బరిపీచుతో హోమం చేస్తూ సనారీవారి అష్టోత్తర శతకేత నామావళి చేబుతూ అన్నాన్ని హోమ ఆహుతి చేస్తూ వచ్చిన వారందరితో ఆహుతి లిప్పిస్తారు.

## మయబ్రహ్మ వర ప్రభావము

ఋగ్వేదాన్ని "కావ్యతీర్థ" శ్రీ నేమాని వెంకట నరసింహ శాస్త్రిగారు 1926-1932 సంవత్సరముల మధ్య"శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత" అనుపేరుతో అసమగ్రంగా ఆంధ్రంలో అనువదించిన వ్రాతప్రతిని వారితదనంతరం రాజమండ్రి "గౌతమీ గ్రంథాలయం"లో భద్రపరచగా తిరుమల తిరుపతి దేవస్థానంవారు దానిని గ్రహించి "బ్రహ్మర్షి వాఙ్మయమహాధ్యక్ష" కళాప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి పూర్తి చేసేబాధ్యతను అప్పగించగా కళాప్రపూర్ణగారు యిందలి దోషాలను వేద ప్రమాణంగా వివరించుతూ సవరించి,సంపూర్తి చేసినారు. అందలి చతుర్థసంపుటి నవమదశమ మండలములందలి 8వ, 9వ,సూక్తములలోని "కావ్యతీర్థ"వారి భాష్యానికి గోపాల కృష్ణయ్యగారు ఆంధ్రానువాదం చేస్తూ విరాట్ విశ్వకర్మ పశ్చిమ శిరమునుండి ఉద్భవించిన త్వష్టబ్రహ్మకుమారుడగు విశ్వరూపాచార్యులు అను "త్రిశిరస్కుడగు" వానిని దత్తాత్రేయునిగా భాష్యం చెబుతూ ఈ విషయాన్ని పురాణాలలో ఏవోకథలల్లారని విమర్శించారు. యిట్టి రచనలతో వేదాలలోని విషయాలకు వక్ర భాష్యం చెప్పు వారికి గల అనేక జన్మల పుణ్యఫలితాలు నశించి పాపకర్మల పాలౌదురని హెచ్చరించినారు.

ఆదిలో దాయాదులైన బ్రాహ్మణ, "విశ్వబ్రాహ్మణులు" కాలప్రవాహంలో దాయాదద్వేషులైన తరుణంలో బ్రాహ్మణ ఆధిక్యతకై వేదవ్యాసుడు మయ బ్రహ్మవద్ద శిష్యుడై వేదవేదాంగములనభ్యసించి యంత్రమంత్రతంత్రముల రహస్యముల నెరింగి, శుశ్రూష చాలించి, విప్రజాతి ఔన్నత్యమునకై వేదములు పురాణములందు విప్రశబ్దమును చేర్చి మార్పులు చేసి, తానురచించిన గ్రంధములకు, విప్రులకు, వారి పీఠములకు రాజపూజ్యత కొరకు దీక్షబూని గురువునకై ఘోరతపమాచరించగా సంతుష్టుడై న "మయబ్రహ్మ" శిష్యవాత్సల్యంతో ప్రసన్నుడై" వత్సానాకొరకింత కఠోరదీక్ష సల్పిన కారణమేమి? నీయభీష్టము తెలుపుమనగా!

గురుదేవా! నేను రచించిన గ్రంధములకు పీఠములకు విప్రులకు రాజ్యపూజ్యత నొసంగుడని ప్రార్థించెను.......అంతమయ బ్రాహ్మఆశీర్వదిస్తూ

వ్యాసప్రోక్తం మయాదత్తం విప్రోసర్వత్ర పూజితః అనగా! వ్యాసుడు గురుదేవా! ఈప్రభావమెంతవరకుండునని వినమ్రుడై నమస్కరించగా! కలౌ పంచసహస్రాణి-- జాయతేవర్ణసంకరః అంటూ అదృశ్యుడాయెను. మయ బ్రహ్మ వరం ఫలించు విధివిధానంగా విప్రులు యోగసిద్ధిని పొంది ఔన్నత్యముపొందుటకుగాను వారి పీఠములు, మార్పుచేసిన వారి శాస్త్రములు పూజింపబడుట కొరకు ఉపదేశార్హత గల త్వష్టప్రజాపతి కుమారుడగు విశ్వరూపాచార్యులు(దత్తాత్రేయులు)వారిని త్వష్ట వంశీయునకు విప్రబాలవిధవకు శంకరాచారిగా ఆవిర్భవింపజేసి వారితో విప్రసంతతికి



ఉపదేశములు చేయించి ప్రస్తుతం అష్టాదశపీఠములు స్థాపించి, విప్రులకు,వారి పీఠములకు రాజపూజ్యతకు కారకులైరి. ఈ విధంగా మయ బ్రహ్మ వరఫలితాన్ని విప్రులు పొందు చున్నారు.దీనికి ప్రమాణము శంకర విజయంలో శంకరాచారిగారు వారి జననకారణాన్ని ఈ విధంగా తెలిపిరి. ఆచార్య శంకరోనామః-త్వష్టపుత్రోన సంశయః। విప్రకులగురోర్దీక్షా విశ్వకర్మంతుబ్రాహ్మణః

### జరుగబోవునది

కలౌపంచసహస్రాణి...జాయతే వర్ణసంకరః కలి ఐదువేల సంవత్సరములు గతించిన పిమ్మట విప్రులు మయబ్రహ్మ వర ప్రభావంచే సంకరులై హీనస్థితి పొందుదురు. అటుపిమ్మట విశ్వబ్రాహ్మణులు మూడు దైవశాపముల నుండి విముక్తులై పూర్వఔన్నత్యము పొందెదరు. ఈ లోకంలో కృతయుగంలోవలె సర్వులు సర్వసౌఖ్యములు పొంది వర్ణాశ్రమధర్మంనాలుగు పాదాల నడుస్తుంది. మయబ్రహ్మవాక్ ఫలితంగా భవిష్యత్తులో విశ్వకర్మజాతి ఉన్నతస్థితిని పొందుటకు, సర్వమానవ శ్రేయస్సునకై **"సాక్షాత్ పరమశివుడు"** శ్రీకాకుళంజిల్లా పాలకొండ గ్రామంలో 1794వ సంవత్సరంలో సింహాద్రి వీరాచారి గౌరమాంబ తపఃఫలంగా వారికి తనయుడై విశ్వనాధునిగా అవతరించి బాల్యాంనుండి అనేక మహిమలు ప్రదర్శించి మానవుడే మాధవుడుకాగల యోగసాధనా పద్ధతులు, సిద్ధుల జీవనార్థమై రసవాదమును, సర్వమానవుల ఆరోగ్యము కొరకు ఆయుర్వేద ఔషధ తయారీ విధానమును,అనేక సృష్టిరహస్యాలను, భూలోకంలోగలదంతా మానవశరీరంలో ఉన్నదని పోలికలతో తెల్పుచూ మంత్ర తంత్ర యంత్ర యుక్తమగు గ్రంధాన్ని రచియించి సమస్త మానవాళికి కరుణతో అందించి శ్రీశైల గుహాంతర్భాగమున మహాతపోదీక్షలో ఉండి తన భక్తుల మనోవాంఛితముల నీడేర్చుచూ,ఆచంద్రతారార్కము ఉందునని తెలిపిరి.అట్టి మహాద్గ్రంధమగు **"సనారీ సంవాదము"** పండిత పామరులకు సహితము అగమ్య గోచరముగా నుండుటచే గురుకృపచే నాకు తెలియపరచిన ఆగ్రంధవివరాలను ప్రస్తుత వాడుక భాషలో రచయించి ఆస్తికులకు మోక్షాపేక్షకులకు అందించుచున్నాను. ఇందలి విషయములు మూలగ్రంధ వరుసక్రమములో ముద్రించినాము. సనారీ సంవాదగ్రంధ **సహాయముతో** ఇందలి అర్థాలు గ్రహించి క్రమశిక్షణతో త్రికరణసుద్ధిగా ఆచరించి మీమీ కోర్కెలు గురుకృపతో తీర్చుకోగలరు.

శుభంభవతు. సర్వేజనాః శుఖినోభవంతు. గురుబ్రహ్మార్పణమస్తు.

శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాధ దేవాలయ నిర్మాణాధ్యక్షులు
**బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామిజీ (విశ్వకర్మ)**
మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం, గుంటూరు జిల్లా : 522 501, నవ్యాంధ్ర

**యోగివేమన అక్షర సత్యాలు : -**

విశ్వకర్మ సుతులు వెలయు దేవతలెల్ల। కానక తిరిగేరు కష్ట జనులు।
అట్టివారి యెంగిలందరుతిందురు। విశ్వదాభిరామ వినురవేమ॥

విశ్వకర్మలేక విశ్వంబుతాలేదు। కుడువ కూడులేదు గృహంబులేదు।
విశ్వకర్మ గురుడు వేల్పులకెల్లను।విశ్వదాభిరామ వినురవేమ॥

పుట్టినప్పుడట్ట బొడ్డుకోసిన నాడు । అప్పుడెగురుముద్రయంటియుండె ।
ముద్ర తాకనివారు ముజ్జగంబులలేరు। విశ్వదాభిరామ వినురవేమ ॥

అన్నిజాతులకు ఆధారమైనట్టులున్న।సానగాది మిన్నఋషుల।
నెన్ని జన్మలకునెక్కడగానము।విశ్వదాభిరామ వినురవేమ॥

విశ్వకర్మ గురువు విశ్వంబునకునెల్ల।ప్రణవమంత్రమొకటి పరమగురుడు।
కన్నకడుపు గురువు గాయత్రిమంత్రంబు।విశ్వదాభిరామ వినురవేమ॥

వివరణ : మాతృగర్భమునుండి శిశువును వేరుచేయు నాభినాళమును ఖండించుటకు ఉపయోగించు రుద్రరూపమగు కత్తితో మొదలగు చతుర్విదపురుషార్ధములకు కావలసిన కర్రమొన, కత్తిమొన, కదురుమొన, త్రాసుమొన మరియూ ఘంటమొనలను పంచ విధములగు పరికరములను తయారుచేసి, అంత్యేష్టిచేయుట వరకూ కావలసిన సమస్త వస్తువులను తయారు చేసి సమస్తమానవాళి నిత్యకృత్యములకు ఆధారులైన విశ్వకర్మీయులు జగద్గరువులైనారు.

దుర్గాదేవి సుప్రభాతం లోని విశ్వకర్మ ?
శివసహస్రనామస్తోత్రంలోని విశ్వకర్మ?
మహా భారత అనుశాసక పర్వం17వ అధ్యాయంలోని విశ్వకర్మ?
రాజరాజేశ్వరి అష్టోత్తర శతనామావళిలోని విశ్వకర్మణి?
విష్ణుసహస్రనామస్తోత్రంలో విశ్వకర్మ?
పురుష సూక్తంలోని విశ్వకర్మ?
మంత్ర పుష్పంలోని విశ్వకర్మ?
ఆదిత్య హృదయంలోని విశ్వకర్మ?

విశ్వకర్మ సూక్తము ఋగ్వేదమందలి అష్టమాష్టక తృతీయమందు, ద్వితీయాది తృతీయ మంత్రపర్యంతమూ చెప్పబడినది. ?

కృష్ణ యజుర్వేదమందును, తైత్తరీయ సంహితయందును, చతుర్ధకాండ షష్టప్రపాఠక ద్వితీయ అనువాకమందు ఆరు మంత్రములుగా నున్నవి. యివి శుక్ల



యజుర్వేదమునందు కించిద్భేదముతో చెప్పబడియున్నది. యందలి యదార్ధమును ఆస్తికులు గ్రహించగలరు.

**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ విశ్వకర్మ మహిమలు**

సీ॥ ఎల్లలోకములనెవరు సృజించెను? ఏరీతి కనుగొన్నను
కల్లలాడుదురు కలియుగంబున। కారణ భూతుండెవ్వరో తెలియరు?
అల్ల విష్ణుబ్రహ్మరుద్రాదులను।అగణితముగ నెవ్వరు సృజియించెను?
నుల్లాసముతోడ త్రిమూర్తులకు।నూహనెవరు గల్పించుచుండెను.
పంచభూతములు ఏ క్రియనుండును। ప్రణవంబనునది ఏబయలుండును.
గీ॥ అంచితముగ పాప పుణ్యకర్మములు లోభించుతూమించి మెరుగుటద్దంబుల
మేడలకొన్నాళ్లోనరించి కొంచెమైన రూపులేక కోటీశునిభిక్షమెత్తించును॥
**ఎల్లలోకములనెవరు సృజించెను। ఏరీతి కనుగొన్నను**

**శ్రీశ్రీశ్రీసనారీవారి వీభూతి మంత్రం**

మహా గ్రహపీడాం మహోత్పాతపీడాం, మహారోగ పీడాం, మహా తీవ్ర పీడాం, హరత్యాశు శుభే, క్షీరాద్రివాసాం, జగద్గురుం,"సనారీశ్వరాయ" శ్రీకరం, నిత్యం శుభకరం, దివ్యం, పరమం పవిత్రం, మహాపాపహరం, సద్గురు విభూతింధారయామ్యహం పరమ పవిత్రం, సనారీవిభూతిం, పరమంవిచిత్రం లీలావిభూతిం, పరమార్ధ, యిష్టార్ధ, మోక్షప్రదం, సనారీ విభూతిం మహమాశ్రయామి.

**సూచన :** ఎవరికైనా తొక్కిడి దోషాలతో, జ్వరం, శిరోవేదన, ఉలిక్కిపడుటవంటి సమయాలలో విభూతి చేతపట్టుకుని ఈ మంత్రాలన్నీ ముమ్మారు ఉచ్చరించి బాధితునికి బొట్టుపెట్టి, కొంచెం నీళ్ళలో కలిపి త్రాగించిన అన్నిబాధలు క్రమముగా తొలగిపోవును.



## మహదానందము

శ్రీ శైల గుహవాసిని, కాశీవిశ్వేశ్వరుడ్ని కైలాసపతిన్-కేశవమూర్తిని
బ్రహ్మ నిజేసులపై ఆది బ్రహ్మశక్తియునేనే

అని అవతార విశేషమును తెల్పిన సింహాద్రి విశ్వనాధావదూత స్వామి వారు రచించిన సనారీ విశ్వేశ్వర సంవాదమను గ్రంధరాజము పండిత పామరులకు సైతము అర్ధం కాని తరుణంలో గ్రంధ అనువాదకులైన బ్ర॥సుగంధంసాయిబాబాచార్య స్వామీజీ వారు నేటివాడుకబాషలో ప్రతి విషయములను వివరిస్తూ వ్రాసిన

శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములను ఈ గ్రంధము యోగసాధకులకు ఒక పెద్ద బాల శిక్ష వంటిది. యిందులో స్వామివారు పార్వతిదేవికి తెల్పిన ఆత్మానాత్మ విచారణ యోగాసనములు, యోగ ముద్రలు, యోగవిద్య, సృష్టిరహస్యములు, రసవాదము, సిద్ధ ఆయుర్వేదము, హంస సంచారల క్షణము, నాలుగు రకముల సాధనా పద్ధతులు విశ్వేశ్వరుల అవతారనిర్ణయము, పిండోత్పత్తి క్రమము, దేహమందలి 25 తత్వముల పంపకము, వాటిఅధిపతుల వివరము,13వర్గముల నిర్ణయము విశ్వ రూపనిదర్శనము విరాట్ పురుషునికి పార్వతీ పరమేశ్వరుల ప్రార్దన చేయుట, వారిని విరాట్ విశ్వబ్రహ్మ ఆశీర్వదించుట, గురువులనడవడిక, శిష్యుల ప్రవర్తనలు, జ్ఞాన లక్షణములు, దంభ జ్ఞాని క్షణములు, అదికుల వందనక్రమము, సమస్తదేవతల నర్చించు పద్ధతులు, పంచ తత్వముల శోధన , జీవాత్మను పరమాత్మతో కలిపి జీవన్ముక్తి పొందు పద్ధతులు, బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంధుల ఏర్పాటు, అష్టవిధలింగములు, ఆకారములు, ఉపాసనలు ఐదు రకముల సిద్ధుల ఉపాధిమూలికలు, మానవుల నాలుగు రకముల జీవన విధానములు, రాద్రాక్షల ఫలితములు, విశ్వేశ్వరుడు పార్వతీ దేవికి తెల్పినవేదాంత విద్యా వివరములు, మహామంత్రయుక్తముగా సకల దేవతలను పూజించు పద్ధతులు, దానిచే కలుగు ఫలితములు, మంత్ర, లయ, హఠరాజయోగముల వివరము, ఆత్మపూజా విధానము రసవాద విద్యామర్మములు, ఔషధీభావము, భస్మకమము, వాదవిద్యా విషయములు, ఉప్పుయోగము, కాలజ్ఞానములతో కూడిన ఈ గ్రంధము పండిత పామరులకు సైతము అగమ్యగోచరముగా నున్న తరుణంలో బ్ర॥ సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ వారిచే వాడుకభాషలో రచియించి ఆధ్యాత్మికాపరులకు రసవైద్యులకు ముముక్షువులగువారు విశ్వబ్రహ్మను చేరుటకు ఉపయోగపడు ఈ గ్రంధరాజమును రచియించినవారికి ధన్యవాదములు తెల్పుచూ......

జ్యోతిష, వాస్తు గ్రంధకర్త
**వేగేశనరాధాకృష్ణ మూర్తి** B.E. (Civil)



Director - Projects, NCC
(Formerly Nagarjuna Construction company Ltd.) Hyderabad.

## శుభాభినందనలు

మేము ఈ అర్ధములు వ్రాయుటకు కారకులు బ్ర॥కర్రి లక్ష్మీనారాయణగారు రిటైర్డ్ మైక్రోబయాలజీ ప్రొఫెసర్ " విజయవాడ , వారు సనారీ సంవాదానికి అర్ధాలను (మరుగ పదాలను కఠిన పదాలను వదిలి) అసంపూర్తిగా ద్వితీయాధ్యాయం వరకూ వ్రాసినవి నాకు 2004లో చూపించారు. అప్పుడునాకు ప్రతీదానికీ వివరంగా వ్రాయాలని పించింది. నాటినుండి ఆప్రయత్నంలోఉన్నాను. సనారీ వారి దేవాలయనిర్మాణం, స్వామివారి పూజావిధానాలు, మాలాధారణ, స్వామివారి మహిమలతో కూడిన జీవిత చరిత్ర సనారీశ్వర వ్రతం వ్రాయుటచే, అర్ధాలు వ్రాయుటపట్ల జాప్యం జరిగినది. 2013లో సనారీ సంవాదం ఎలా చదవాలో మొత్తం చదివి "సిడి" లో రికార్డుచేసి శ్రీకాకుళం పట్టణవాస్తవ్యులు మా బావగారగు **బ్ర॥ సింహాద్రి గోపీకృష్ణ** గారికి యిచ్చాను. దానిని వారు మెమిరీ కార్డులో రికార్డు చేయించుకుని సెల్‌ఫోనులో వింటూ నాకు ఫోనుచేసి "బావగారు" యిదివినటానికి బాగానే వుందికానీ ఏమీ అర్ధంకావటం లేదు."భగవద్గీత "శ్లోకాలు చెప్పినట్లుగా, దీనికికూడా ప్రతీదానికి మూలము తర్వాత అర్ధంచెప్పి రికార్డుచేస్తే చాలామందికి అర్ధమై స్వామివారి గురించి పూర్తిగా అవగాహన అవుతుందని, నాకు 5వేలు పంపి మీరు గుడి కడుతున్నారు మీ యిష్టమొచ్చినట్లు వాడుకొమ్మన్నారు. చాలాకాలం నుండి నాకుగల ఆలోచనకు ప్రోత్సహించినట్లై, మూలపెట్టిన వ్రాతప్రతిని బయటకుతీసి వ్రాయడం మొదలు పెట్టాను యిదిచూచిన మాబంధువులు, మిత్రులు పుస్తక రూపంలో ముద్రించితే సనారీ భక్తులకు ఆధ్యాత్మిక పరులకు,సనారీ సంవాదం చదువుతున్నవారికీ చాలా ఉపయోగంగా ఉంటుందని చెబుతూ, శ్రీశైలవాసి సనారీవారు చెప్పినట్లుగా పుటములువేసి మందులు తయారుచేసి దీర్ఘవ్యాధులను తగ్గిస్తున్నది. డా॥ ఆనంద్ అనే ఆయుర్వేద వైద్యులు ముద్రణకు 10వేలు యిచ్చి వెళ్ళారు. దానితో గ్రంధముద్రణ ప్రయత్నాలు చేస్తుండగా, ఆనంద్ మిత్రులు పూర్ణచంద్రరావు, శ్రీనివాసరావుగారు రికార్డుచేసిన సంవాదాన్ని సెల్‌ఫోనులో విని వెంటనే నాకు ఫోనుచేసి నాకృషికి అభినందనలు తెల్పుతూ మా దేవాలయానికి బ్ర॥అమ్మనబ్రోలు పూర్ణచంద్రరావుగారు,వారిమిత్ర దంపతులతో హైదరాబాద్‌నుండివచ్చి స్వామివారి పూజలు చేయించుకొని 15వేలు యిచ్చి వెళ్ళారు. స్తానికులు కొందరు ఆర్ధిక వాగ్దానం చేసారు. యిలోగా స్వామివారి చరిత్ర హరికధారూపంలో ఉంటే బాగా ప్రచారం జరుగుతుందనే ఉద్దేశ్యంతో నెల్లూరు పరిసర వాస్తవ్యులగు కొండపల్లి విశ్వనాధ్ భాగవతార్‌గారిచే హరికథను రెండున్నర గంటల సమయం ఉండేటట్లు

రికార్డు చేయించాను. ఈ రెండిటినీ కార్తీక శుద్ధపంచమీ 28.10.2014 తేదీన ఆధ్యాత్మిక సంపన్నులచే ఆవిష్కరణ చేయించాలని మానవ ప్రయత్నం చేస్తున్నాను. నా ఈ రచనలో తెనాలి వాస్తవ్యులు చి॥**మానేపల్లి భాస్కర్** సహకరించగా మెట్రోప్రెస్‌లో డి.టి.పి. చేస్తున్న శ్రీమతి మంగళాపురపు సునీత అక్షరములను కూర్చగా సకాలంలో ముద్రించిన మెట్రోప్రింటర్స్‌వారికి, దీనిపై తమ అభిప్రాయములను సకాలములో తెలియపరచిన వారికి మా అభినందనలు

1. శ్రీ బ్రహ్మపుర నిర్మాత బ్ర॥**లక్కోజు బ్రహ్మదాసు**గారికి,శ్యావల్యపురమండలం, బ్రహ్మపురం,గుంటూరుజిల్లా.
2. శ్రీశ్రీశ్రీ అచలానందస్వామి వారిఆశ్రమవాసులు "కాలజ్ఞానసుధ ఎడిటర్" **శ్రీ పూర్ణానందస్వామి (ఒంగోలు)**
3. బ్ర॥యలవర్తి ఆంజనేయశాస్త్రి గారి తెనాలి వేదపాఠశాలప్రధానోపాధ్యాయులు,స్మార్త ఆగమ,వాస్తు,జ్యోతిష పండితులు బ్ర॥ **యిడమకంటి జనార్దనశివాచార్యులు**(తెనాలి)
   5.యదార్థకేంద్ర పీఠం వ్యవస్థాపకులు బ్ర॥ **రఘుప్రోలు జనార్దనస్వామి**(రాజయోగి) ×సాతాపూర్ గ్రామము× మహబూబ్‌నగర్‌జిల్లా తెలంగాణా రాష్ట్రం
6. బొబ్బిలి వాస్తవ్యులు ఆయుర్వేదరత్న బ్ర॥ **అండలూరి సోమేశ్వరరావు** గారిని
7. తెనాలి వాస్తవ్యులు యోగామాష్టారు **కాకుమాను రామకృష్ణ** గారికి
8. కందిమల్లాయపల్లి శ్రీ జగజ్జ్యోతి వీరబ్రహ్మేంద్రస్వామి మఠం ఆస్థాన పండితులు మహామహోపాధ్యాయ **బ్రహ్మశ్రీ పెదపాటి నాగేశ్వరరావు** గార్కి

ఆంధ్ర రాష్ట్ర విశ్వబ్రాహ్మణ ధర్మపీఠాధ్యక్షులు

**బ్రహ్మశ్రీ రాపాక ఏకాంబరాచార్యులు** గార్కి

**బ్రహ్మశ్రీ సోపెంటి చంద్రశేఖరరావు** గార్కి (సకాలంలో అందలేదు)

ఈగ్రంథ ముద్రణకు పూర్తి ఆర్థిక సహాయాన్నందించిన

**మ॥వేగేశన రాధాకృష్ణ** గార్కి

తమ అమూల్య అభిప్రాయములు తెల్పిన వీరందరికి

ఈ గ్రంథావిష్కరణ ది.13-12-2014 చేసిన

**శ్రీశ్రీశ్రీ ఉ.వే.ప్ర.ఎస్.ఎ. ఆర్. ప్రసన్నవేంకటాచారియర్ చతుర్వేది స్వామి** వారికి

మా అభినందన మందారములు

**శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాథ దేవాలయ** నిర్మాణ్యాధ్యక్షులు

**బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామిజీ (విశ్వకర్మ)**

మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం, గుంటూరు జిల్లా : 522 501,

**నవ్యాంధ్ర**



## పండితాభిప్రాయము

[illegible]

జగద్గురు శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారి మఠం

కందిమల్లయ్యపల్లి, కడపజిల్లా, ఆంధ్రప్రదేశ్,

ఇంటి నెం. 402, అనంతమేన్షన్, బి-64, జి.డి.కాలనీ, హైదరాబాద్ - 500 007



ఓం శ్రీ మహాగణాధిపతయేనమః

## అభినందన

బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాంతిగారు మిక్కిలి కృషిచేసి రచించిన "శ్రీసనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు "అను గ్రంధము పఠితల మనస్సరో వరములలో ఆధ్యాత్మిక కమలములను వికసింపజేయునదిగా నున్నది. ఈ గ్రంధము నందలి ముఖ్య విషయములను శ్రీ సాయిబాబాచార్య ముఖతః వినుటయేగాక నేనును పరిశీలించితిని.

గ్రంధకర్త స్వతహా నిరాడంబరుల, సదాచార సంపన్నులు, సద్గ్రంధ పఠనాసక్తులు, కులధర్మములు కొఱవడుచున్న ఈ రోజులలో సనాతన సత్ సాంప్రదాయములను పునఃప్రతిష్ఠించుటకు, విశ్వబ్రాహ్మణుల ఔన్నత్యమునకు ఎంతగానో కృషి చేయుచు, శ్రీ విశ్వకర్మ బి.సి.క్లాసు బిల్డింగ్ సోసైటి అధ్యక్షునిగానుంటు విశిష్ట సేవలను అందించుచు వృత్తిరీత్యా తాను స్వర్ణకారుడైననూ, ప్రవృత్తి రీత్యా వాస్తు,జ్యోతిష, రామాయణ, భారత, భాగవత పురాణేతిహాసములతోపాటు శ్రీ విరాట్ విశ్వకర్మ శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి, శ్రీ. సనారీ విశ్వేశ్వరస్వామి సచ్చరిత్రలను పఠించి అందలి విషయములను ఆత్మావలోకనము చేసికొనిరి.

**"పుస్తకములు చదువ పూర్ణత్వమబ్బదు,**
**హృదయ సంపుటములు చదువవలయు,**
**పారిశుద్ధ్యమొకటి పరమాత్మను చేర్చును**

కాళికాంబ హంసకాళికాంబ॥"....జగద్గురు శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారు ప్రపచించినటుల పసితనమునుండి ఆధ్యాత్మిక చింతనతోనున్న శ్రీసాయిబాబాచార్య సిద్ధాంతిగారు బ్రహ్మవిద్యను అభ్యసించుటకు సంకల్పించి ప్రప్రధమముగా భారత రాష్ట్రపతి మాన్యశ్రీ జ్ఞానీ జైల్‌సింగ్ గారి గురువులగు బ్రహ్మశ్రీ బోనుమద్ది రామలింగ సిద్ధాంతి గారి వద్ద 1978సం॥లో శివభక్తాగ్రేసర శ్రీ రావణబ్రహ్మచే ప్రతిష్టింపబడిన పరమ పవిత్రమగు కపాలేశ్వరాలయము (మద్రాసు) లో మైలాపూర్ దివ్యమంత్రోపదేశమును పొందిరి.

1995సం॥లో గుంటూరుజిల్లా నులకపేట గ్రామములో బోధగురువుబ్రహ్మశ్రీ తణుకు సాంబశివానంద రాజయోగి వర్యులువద్ద సతీసమేతముగా బ్ర॥శ్రీ సాయిబాబాచార్య సిద్ధాంతి శ్రీ సనారీ వారి దీక్షనుగైకొని గృహస్థాశ్రమమునందుంటు విజయవాడ సత్యన్నారాయణపురంలో గల స్వగృహమందు భక్తిప్రపత్తులతో శ్రీసనారీ వారి



నిత్యపూజలను చేయుచు, గురూత్తముల సాంగత్యము, సేవనములవలన ఆధ్యాత్మిక, వేదాంత అమనస్కములను అభ్యసించుటయేగాక"కృషితో నాస్తి దురిభక్షం జపతో నాస్తిపాతకం" అన్న సూక్తికి అక్షరసత్యముగా ఎన్నోవ్యయ ప్రయాసలకోర్చి శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్త్రలింగసహిత సనారీ విశ్వనాధాలయమును నిర్మించి, ఆలయ ప్రాంగణము నందే వాన ప్రస్థాశ్రమమును గఱపుచు అత్యంత భక్తి ప్రపత్తులతో అనునిత్యము శాస్త్రవిధిని శ్రీ సనారీవారి పూజలను నిర్వర్తించుచు, శ్రీసనారీవారి నిత్యపూజావిధానము, శ్రీసనారీ వారి మాలాధారణపూజావిధానం, శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానము-మహిమలు, శ్రీసనారీవారి వ్రతం వంటి ఉత్తమ గ్రంధములను ముద్రించుటయేగాక తాను (గ్రంధకర్త) సాంగోపాంగముగా అభ్యసించి మృదుమధురముగా పఠించిన "శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాదము" తోపాటు శ్రీ కొండపల్లి విశ్వనాధ భాగవతార్‌తో హరికధారూపములో అభివర్ణించిన శ్రీ సనారీ వారి చరిత్ర-మహిమలు కూడా ఆడియోకేసెట్ చేయించి తద్వారా శ్రీసనారీ విశ్వేశ్వరస్వామివారి దివ్య చరిత్ర మహిమలను విస్తృతముగా ప్రచారమొనరించుచు "శ్రీసనారీబాబా" పేరిట వీరు సార్ధక నామధేయులైరి.

విశ్వరూప దర్శనము(174), పార్వతీదేవి విశ్వకర్మకు చేయు ప్రార్ధన (188) పార్వతీపరమేశ్వరులనువిరాట్ విశ్వకర్మ ఆశీర్వదించుట(198)పార్వతీదేవి ఆత్మానాత్మ వివేకమును గురించి ఈశ్వరుని ప్రశ్నించుట, ఇత్యాది విషయములను గ్రంధకర్త అత్యంత సులభశైలిలో పఠితులకు అర్ధమగునటుల రచించిరి. సాక్షాత్తు పరమేశ్వరావతారులగు శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధావధూత స్వాములవారి దివ్యానుగ్రహమువలననే ఇట్టి గ్రంధరచనను చేసిరనుటకు సందేహము లేదు.

శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వీయకృతంబగు "శ్రీసనారీ విశ్వేశ్వరసంవాదము"అను యంత్ర, మంత్ర, తత్త్వ, యోగ, జ్ఞానయుక్తంబగు మహాప్రబంధమునకు సమగ్ర స్ఫూర్తితో "శ్రీసనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు అను భక్తిజ్ఞాన ప్రబోధదాయకమగు విశిష్ట గ్రంధమును రచించిన బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాంతి గారికి శ్రీశ్రీశ్రీ విశ్వేశ్వరస్వాముల వారు శతాయురారోగ్యభోగభాగ్యములనిచ్చి సర్వదా సంరక్షించుగాక-

భక్తమహాశయులెల్లరును ఈ గ్రంధమును పఠించి శ్రీసనారీ విశ్వేశ్వరస్వాములవారి కృపకు పాత్రులై తరింతురుగాక.

శుభంభూయాత్

శుభాభినందనములతో.....

**మీ అండలూరి సోమేశ్వర రావు, బొబ్బిలి,** విజయనగరజిల్లా.

ఓం శ్రీగురుభ్యోనమః

## శుభాభినందన

84లక్షల జీవరాసులలో మానవ జన్మ అతిశ్రేష్ఠమైనది. పరమాత్మనుండి విడివడిన జీవి మరల ఆ పరమాత్మకు చేరుటకు నర జన్మయే ఉత్తమమార్గము. ఆత్మ అనేక జన్మలు సృష్టికర్తను మానవజన్మ ప్రసాదించమని ప్రార్ధించగా విరాట్ విశ్వకర్మదయతో మానవ జన్మను ప్రసాదించగా మానవులు భూపతనమైనపిదప కలి ప్రభావంచే గత జన్మలలో తాను విశ్వబ్రహ్మకు చేసిన ప్రార్ధనలను మరచి,యిహలోక భ్రాంతులచే మనసునందలి కోర్కెలు తీర్చుకొనుటకు అనేక దుష్కృత్యముల నాచరించి ఘోరనరకముల పాలవుతున్న తమ సంతతిని ఉద్ధరించుటకు "ఆది దంపతులగు" పార్వతీ పరమేశ్వరులు మానవులుగా అన్నపూర్ణా విశ్వనాధులుగా అవతరించి సనాతన ధర్మములు తెలిపి, యోగసాధనలచే జీవన్ముక్తి పొందుమార్గములు తెలుపు "సనారీ సంవాదంబను" గ్రంధ రాజమును రచించి మానవ జాతికి ప్రసాదించి శ్రీశైల గుహలో మహాతపో దీక్ష యందుండి తన్నునమ్మినవారి కోర్కెలు తీర్చుతున్నారు. అట్టి మహనీయుడు రచించిన గ్రంధమునేటితరముల వారికి అర్ధంకాక సత్ ఫలితములను పొందలేకున్నారు. ఆ భావంతో గ్రంధార్ధములను నేటి వాడుక భాషలో రచియించిన బ్రహ్మ జ్ఞానాశక్తులకు మోక్షాపేక్షులగు జిజ్ఞాసులు యిందలి అర్ధములు సులువుగా గ్రహించి జన్మను సార్ధకం చేసుకోగలరన్న భావంతో.....

పరమేశ్వరునితో ఉత్పన్నమైన వేదములను వారిభక్తుడగు రావణబ్రహ్మ త్రేతా యుగంలో వేదముల జటిలతను పరిష్కరించి క్రమబద్ధంచేసినట్లుగా

కలియుగంలో ఆది దంపతులు అన్నపూర్ణా విశ్వనాధులుగా అవతరించి సర్వ మానవ శ్రేయస్సుకై సనారీ వారు రచించిన సంవాదము సామాన్యులకు అర్ధంకాని స్థితిలో రావణబ్రహ్మపాత్రధారియైన బ్ర॥ సుగంధంసాయిబాబాచార్య స్వామీజీయగు సనారీ భక్తుడు శ్రీశ్రీశ్రీసనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధములను పేరుతో నేటివాడుక భాషలో రచియించి నేటియోగసాధకులకు, భావితరముల మోక్షాపేక్షకులకు మార్గదర్శులైనారు. వీరి కృషి అభినందించతగినది. వారికిగల గురుభక్తిచేస్వామివారి కృపగలిగి ఈ కార్యము సాఫల్యమైనది.

**కలదీతని కేదో స్వామివారితోగతజన్మబంధము**
**లేకున్న స్వామివారికొరకింతటి కృషిసల్పుకారణమేమి?**
**నిక్కముగాకలదిందేదో నిఘూఢమగు దైవరహస్యము**
**అదే శ్రీశ్రీశ్రీసనారీ శిష్యసాయిబాబాచార్య జన్మకారణము**

ఇట్లు - **కాకుమాను రామకృష్ణ,**
యోగా మాస్టర్, తెనాలి. గుంటూరు జిల్లా ,నవ్యాంధ్ర.



ఓంనమో వీరబ్రహ్మణే-ధృఢసంకల్పమే-కార్యసాఫల్యము.

శ్రీశ్రీశ్రీసనారీ విశ్వేశ్వర సంవాదమనుగ్రంధము సప్తసముద్రములతో కూడిన "మహా సముద్రము" దాని సారాంశము సముద్రమడుగునున్న మంచిముత్యాలు,రత్నాలు ఈ మణులను ఆణిముత్యాలను సేకరించడానికి సముద్రపు అట్టడుగుకు వెళ్లాలి. అందుకు అనేకానేక జన్మల సుకృతం కావలయును.

అందుకే శ్రీ వీరబ్రహ్మేంద్రులవారు చెబుతారు. "పూర్వజన్మవాసనే నన్నా ఈ జన్మకెంతో ముక్తిమార్గము చూపునోయన్నా"అని

అభ్యంతరరహిత, నిరాకార, నిర్గుణ,నిర్వికల్ప "విరాట్ విశ్వబ్రహ్మ"సృష్టినిగూర్చి చేసిన సంకల్పమే పంచబ్రహ్మల ఆవిర్భావము మరియు పంచశక్తుల ఉత్పత్తి వీరికి మను బ్రహ్మతో ఆదిశక్తిని, మయబ్రహ్మతో పరాశక్తిని తృష్ణబ్రహ్మతో యిఛ్ఛాశక్తిని, శిల్పి బ్రహ్మ యగు దేవేంద్రునితో క్రియాశక్తియగు శచీదేవిని, విశ్వజ్ఞబ్రహ్మయగు సూర్యునితో జ్ఞానశక్తి యగు సంజ్ఞాదేవిని జతచేసిరి.

వారే మను బ్రహ్మయగు పరమేశ్వరుడు, మయబ్రహ్మయగు విష్ణువు, త్వష్ణబ్రహ్మయగు బ్రహ్మదేవుడు, శిల్పిబ్రహ్మయగు దేవేంద్రుడు, విశ్వజ్ఞబ్రహ్మ యగు సూర్యభగవానుడు వారు నిరాలంబనమైన సూన్యమునుండి ప్రణవనాదాన్ని గ్రహించిన సారాంశాన్ని పంచవేదాలుగా రచియించి ఆవేదాలలోని సారాన్ని జగత్పోషకమార్గాలుగా విభజించి ఈ ప్రపంచమహాసృష్టికి కారణభూతులైనారు. వారినే విశ్వకర్మలని, సృష్టికర్తలని, విశ్వబ్రాహ్మణులని యుగధర్మానుసారంగా పిలుస్తూ యున్నారు.

అందునా పంచబ్రహ్మల వంశీయులైన "విశ్వబ్రాహ్మణులు"గా జన్మించుట మహాదుర్లభము. ఎన్నోజన్మల సుకృతము చే లభించును.

యుగముల ప్రారంభంనుండి అవతరించిన అనేకావతారముల లాంటివే" శ్రీవీరబ్రహ్మేంద్రస్వాముల వారు" వారు రచియించిన కాలజ్ఞానములో "శ్రీసనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధసృష్టికర్తయగు సింహాద్రివిశ్వనాధఅవధూతస్వాములవారు శ్రీశ్రీశ్రీ విరాట్విశ్వబ్రహ్మ ప్రకాశరేణువునుండి మానవునిగా పుట్టి, అనేక జన్మల సుకృత పరిపాకమున బాల్యమునందే పుష్పము విచ్చగానే సువాసన వెదజల్లునట్లు కారణజన్ములు కావున మానవులు జన్మతరించుటకు కావలసిన మార్గాలను గ్రహించి తన జన్మకారకుడగు విరాట్ విశ్వబ్రహ్మనుగూర్చి ధ్యానించి అందు సత్యజ్ఞానాన్ని పొందుటకు మూలమైన మనుషత్వం ముముక్షుత్వం మహాపురుషత్వం అవసరమని గ్రహించి దానికి సంబంధించిన కఠినమైన అనేక సాధనలు చేసి "మహాపురుషుడై" సృష్టిరహస్యాన్ని ఛేధించి సృష్టికి మూలమైన మాయాశక్తిని తోడుచేసుకొని అనేక రహస్యములతో కూడిన

ఈ సంవాదాన్ని తెలుగు సంస్కృత సిద్ధుల భాష మరుగు పదాలతో రచియించి ఆధ్యాత్మికపరులకు ఎంతో మేలుచేసినారు.

**ఇప్పుడు ముఖ్యముగా చెప్పుకోతగిన విషయము**

"శ్రీ వీర బ్రహ్మేంద్రస్వాములవారు చెప్పినట్లుగా గురువుశిష్యుడాయె, శిష్యుడు గురువాయె గురుశిష్యులమధ్య గుర్తులొక్కటాయె"ఈ మహా సంవాద రూపమైనశ్రీశ్రీశ్రీ సనారీ సంవాదము తెలుగు,సంస్కృతము, సిద్ధులభాషా మరుగు పదప్రయోగములు గల ఈ మహా ప్రబంధము శ్రవణమననాదులద్వారా నిదిధ్యాసను పొందిన ఆసర్వస్వాన్ని ప్రస్తుతవాడుక భాషలో రచించి సర్వజనులకు అర్ధమగునట్లు గ్రంధరూపము దాల్చుటకు "అకుంఠిత దీక్షతో"గ్రంధకర్త కృషిచేసి యున్నారు. ఈ సంవాద గ్రంధార్ధములు సుగంధ పరిమళములు , శ్రీగంధం ఎచట ఉన్నా దానిపరిమళం అనంతదూరంలో గుబాళిస్తుంది. నలుదెసలా వ్యాపిస్తుంది.

ఈ రచయితగారి యింటిపేరు సుగంధం వారు. వీరుయింటిపేరును సార్ధకం చేసుకున్నారు. ఈ సుగంధంసాయిబాబా స్వామిజీవారు.

ఈ దంపతులకు శ్రీవిరాట్‌పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు జగద్గురు శ్రీసనారీ విశ్వనాధఅవధూత స్వాములవారు ఆయురారోగ్య, భోగభాగ్య భక్తిజ్ఞానవైరాగ్య ఆత్మజ్ఞానప్రాప్తిగలుగ చేయమనికోరుతూ....

బ్రహ్మాదాసు

**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీవీరబ్రహ్మేంద్రవిజ్ఞాన సేవాశ్రమము.**

వేల్పూరు, బ్రహ్మపురము,శావల్యాపురం మండలం,

వేల్పూరుపోష్టు ,గుంటూరుజిల్లా, న్యూఆంధ్ర.



**దేవాలయములోని వినాయకుడు**



**శుభకామన (లేఖ) మున్నుడి**



మనది వేదభూమి, ధర్మభూమి, పుణ్యభూమి, జ్ఞానభూమి, తపోభూమి,మరియు త్యాగభూమి, మన మాతృభూమి ధర్మానికి తత్వజ్ఞానానికిప్రఖ్యాతిగాంచిన పవిత్రభూమి, మహోన్నతులైన ఆధ్యాత్మికవేత్తలకు,సర్వసంఘపరిత్యాగులైన మహర్షులకు, తాపసులకు, పరివ్రాజకులకు, యతీంద్రులకు, దివ్యతేజో సంపన్నులకు జన్మభూమి.

అనాదికాలంనుండి ఆధునికకాలం వరకు మానవుడా చరించవలసిన, అనుసరించ వలసిన నిత్యసత్యాలను అందజేసిన ఏకైక భూమి మన పవిత్రభారతభూమి, మనదేశ మనుగడకు మూలం"మతము"దైవభక్తి ఇచట మతమనగా ఆదర్శప్రాయమైన జీవన విధానమే, సక్రమమైన ఆలోచనాసరళి ధార్మిక భావనుకృతి మానవుని మాధవునిగా మార్చేదీ, నరుణ్ణి నారాయణునిగా తీర్చిదిద్దేదిమతమే.

దైవభక్తికి మూలంమతం, ఆమత బోధలు దైవస్వరూపాన్ని దర్శింపజేసి దైవ సాక్షాత్కారాన్ని అనుగ్రహించి మానవుల సుఖసంతోషాలను, శాశ్వత శాంతిని మనోధైర్యాన్ని నిగ్రహశక్తిని అనుగ్రహిస్తాయి.

"జంతూనాం నరజన్మ దుర్లభం" అని జగద్గురు శ్రీశంకర భగవత్పాదాచార్యులు ప్రవచించారు. ఈ ప్రపంచంలో ఏ జీవిగానైనా పుట్టవచ్చు,పెరుగవచ్చు మరియుగిట్టవచ్చు కానీ సర్వోత్కృష్టమైన మానవజన్మ దొరుకుట కష్టసాధ్యం.

**శ్లో॥ ఆహార నిద్రాభయమైధునాని, సామాన్యమేతత్పశుభిర్నరాణాం।**
**జ్ఞానంహితేషామధికోవిశేషోజ్ఞానేన హీనాపశుభిస్సమానాః॥**

అఖిలలోకమున ఆహారం,నిద్ర, భయము, సంసార సుఖము ఇవన్నియూ మానవుల తోపాటు పశుపక్ష్యాదులకు సమానమే. అయితే మానవ విశిష్టత యేమనగా పశు పక్ష్యాదులలో లేని జ్ఞానమును ప్రత్యేక లక్షణముగా కల్గినాడు. అందుకే మానవుని ప్రధమ కర్తవ్యము జ్ఞానసముపార్జనయే.

సమర్ధులైన సద్గురు దివ్యచరణార విందములను ఆశ్రయించి గురుకృపను పొంది వారు ప్రసాదించిన లక్ష్యార్ధమును సాధించుటకు త్రికరణ శుద్ధిగా నిర్విరామ కృషి సల్పడమొక్కటే దీనికి మార్గము. ఇది సఫలీకృతమవ్వాలంటే గురుసాన్నిధ్యం చేయుట, సద్గురు దివ్యరూపమును పరంజ్యోతిగా భావించి మనస్సున లగ్నంచేసి త్రికాలములందు ధ్యానించుటయేగాక, ఆదివ్య గురుదర్శనమాత్రముచేతనే పుణ్యమార్జించవచ్చును. శిష్యుడు ఆదివ్య చరణారవిందములను శరణు వేడినా అతని పాపములన్నియు ప్రక్షాళన మౌతాయి. ఆదివ్యతేజోమూర్తులతో సంభాషించినను కోటితీర్ధస్నాన ఫలములభించును.

శరణాగతితో ఆర్తిగా సాష్టాంగ నమస్కారము చేసిన సాధకుడు తప్పక మోక్షప్రాప్తి పొందగలడని నా విశ్వాసము.

**శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం- స్పర్శనంపాపనాశనం।**
**భాషణం కోటితీర్ధానాం- వన్దనం మోక్షసాధనమ్॥**

గురులక్ష్యార్థం స్వీకరించనిదే మానవుడు ఎన్నటికీ తరించలేడనుటలో అతిశయోక్తి కాదు. ఆధ్యాత్మిక జీవనమంటే అంత తేలికయైన విషయంకాదు.అదొక పుష్ప కంటకములున్న బాటగానే భావించాలి. కఠోర శ్రమలకోర్చాలి. నిర్విరామ కృషిచేయాలి. పూర్వ కాలంలో వేలకొలది సంవత్సరాలు తపస్సుచేస్తేనే గాని బ్రహ్మజ్ఞాన ప్రాప్తికలిగేది కాదు. అట్టిది గురువును ఒకసారి దర్శించి, కానుకలు సమర్పించి గురువొసంగిన మంత్రమునో గ్రంధాన్నో నాల్గుసార్లు చదివినవారు మోక్షప్రాప్తి వచ్చెననుకొనుట అవివేకమే. అదియునుగాక కొందరు బోధగురువులైన బాధగురువులువారి శిష్యపరంపరకి మోక్షమొందుటకు తర్వాతవారు యితరులకు మోక్షం పొందించుటకు పత్రము నొసంగుట ఎంతవిడ్డూరమో? గురువు మోక్షసాధనోపాయమును నొసంగుట వరకే. శిష్యుడు అచంచల విశ్వాసముతో సాధనా సంపత్తిచే జన్మరాహిత్యమును పొందవలెనని ఆర్యోక్తి.

**శ్లో॥ యధాయధాహిధర్మస్య గ్లానిర్భవతిభారతా**
**అభ్యుథ్థానమధర్మస్య తదాత్మానాం సృజామ్యహమ్॥** అన్నట్లుగా

ధర్మానికిహాని కల్గుచున్న తరుణంలో ధర్మరక్షణ కొరకు ఎందరెందరో మహనీయులు అవతరించియున్నారు. అట్టి పరంపరలోనివారే "శ్రీవిరాట్‌విశ్వకర్మ" ప్రథమ సంకల్ప సంభవుడగు సాక్షాత్ పరమశివావతారులు శ్రీ సనారీవిశ్వనాధ స్వామివారు,వారు రచియించిన "సనారీ విశ్వేశ్వర సంవాదము" అందుఎన్నోమహత్తర మంత్రయంత్ర తంత్ర యోగ రసౌషధవిషయములెన్నియో కలవు" ఆదిశంకరులు సౌందర్యలహరిలో ఎన్నో మంత్ర యంత్ర రహస్యములు మాత్రమే కలవు. సనారీ సంవాదమగు మహత్తర గ్రంధమును 1878వ సం॥లో మొదలియార్ ప్రెస్సునందు మొదటి ముద్రణ జరిగిన పిదప 1902లో ముద్రించిన గ్రంధమే మనకు లభించినది.

ప్రస్తుత గ్రంధాఆంధ్రానువాద కర్తలైన బ్రహ్మశ్రీ సుగంధంసాయిబాబాచార్య స్వామిజీ వారు 1902 ముద్రణ ప్రతి ఆధారముతో ఎన్నో వందల పర్యాయములు గ్రంధమును చదివిరి. యిది పండితపామరజనమునకు అర్ధము అగుటకు, క్లిష్టముగా వున్న ఎన్నో విషయములను ఎన్నో నిఘంటువులను శోధించి పెద్దలను సంప్రదించి ఎన్నో గురులక్ష్యార్థములను జీర్ణించుకుని, ఆ అర్ధముల కొసంగురుదేవులనే స్మరిస్తూ ప్రార్ధించిన సమయములో గ్రంధ అనువాదకులైన వీరికి స్వామి వారు తన శిష్యుని మనస్సు



తట్టినట్లు అర్ధాలను స్ఫురింపచేసియున్నారు. వీరి స్వానుభూతిని ఎంతో సాధనా పూర్వకంగా ప్రయత్నించియున్నారు.
శ్రీ సనారీ వారినిత్య పూజలో సంధ్యావందనం, కేదారేశ్వరవ్రతము
శ్రీ సనారీశ్వర వ్రతము, శ్రీ సనారీదీక్షా విధానము
శ్రీ సనారీ విశ్వనాధ విజ్ఞానం మహిమలు, శ్రీ సనారీ సుప్రభాతం
యిపుడు శ్రీశ్రీశ్రీ సనారీ సంవాద గ్రంధార్ధములు

ఇలా శ్రీ సనారీవారి సారసత్వాన్ని మొత్తము శ్రీ సుగంధం వారి కలమునుండి పరిమళించినవే. అదియునుగాక శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధస్వామి వారి ఆలయాన్ని నిర్మించి త్రికాలర్చనను నిర్వహించుట ప్రతీ మాస శివరాత్రినాడు దేవాలయమున అన్నాభిషేకముచేసి, అన్నదానము చేయుచున్నారు. ఇంతటి మహత్కార్యములు నిర్వహించుచున్న వీరికి శ్రీ సనారీవిశ్వేశ్వర స్వామి వారు ఆయురారోగ్యఐశ్వర్యాదులనిచ్చి ఎల్లవేళల వీరిని కాచికాపాడాలని నా ప్రార్ధన

మీ - భవధీయ

శ్రీ స్వామివారి భక్తరేణువు - **ఇ.జనార్ధనశివాచార్య**

స్మార్తాగమవాస్తు జ్యోతిషపండిట్ తెనాలి -26-11-2011, నవ్యాంధ్ర



**మాస శివరాత్రి అన్నాభిషేక ఛాయాచిత్రం**

## ఓం‌శ్రీగురుభ్యోనమః

మహనీయ మాన్యశ్రీ మహిమాన్వితులు మహాతేజోవిరాజితులు సాక్షాత్ శ్రీమన్నారాయణాంశ సంభూతులు విరాడ్విశ్వకర్మ వంశపయఃపారావారరాకాసుధాకరులైన శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మరుజన్మావతారసంభూతులైన శ్రీ సనారీ విశ్వేశ్వరులవారిని గురించి వారి అనుగ్రహములుగురించిన ఈగ్రంధరచన గావించిన బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాస్వామిజీ గారి వచన రచనాకృషి అమోఘము అద్భుతము సంవాదాభి ప్రాయమును వాడుక భాషలో అందించిన చరిత్రాత్మకమైన ఈగ్రంథం చాలా రమణీయంగా భావాలు మేళవించి కమనీయంగా అలరారుననుటలో సందేహంలేదు.

వీరి ప్రార్ధనలో దేవ బ్రాహ్మణులు అనగా విశ్వబ్రాహ్మణులు లేదా విశ్వకర్మబ్రాహ్మణులు స్వామివారిని అక్షర పుష్పాలతో అభిషేకించిన విధానము అనిర్వచనీయము.

ద్వితీయాశ్వాసములోషన్ముఖి ముద్రయున్నా, అంతర్లక్ష్యం, బాహ్యలక్ష్యం మధ్య లక్ష్యములు, సాంఖ్య, తారక, అమనస్కయోగములు గురించి అష్టాంగయోగా భ్యాసములను గురించిన ఫలితాలు వివరింపబడినది.

యోగాభ్యాసం వలన రోగాలు దూరమౌతాయి. మాయఅంటదనే విషయంతెల్పుతూ 17 ఆసనాల గురించి బాగుగా సులభశైలలో వివరించినారు.పార్వతీ పరమేశ్వరుల సంవాదము ప్రపంచమానవాళికి పరమపదసోపానమే. విశ్వబ్రహ్మ కరుణించినవారికి కలిమాయలు దరిజేరవనుట సత్యము. విశ్వేరులవారికి పార్వతీ దేవిచేయుస్తవము ఒక అద్భుతముగా భావించవచ్చును. పంచభూతతత్వాలు, పరమభాగవోత్తమము, భూత గణాదుల పంచీకరణము ఆనందదాయకము. శ్రీ విరాట్ విశ్వకర్మ స్తోత్రము ఎంతో వర్ణనాతీతము.పంచమాశ్వాసము పార్వతీ పరమేశ్వరముఖతా వెలువడిన భావాంశములు బహు ప్రశంసనీయము. తృతీయాశ్వాస ఉత్తరభాగప్రారంభంలో గల మంత్రములకు చెప్పిన అర్ధములు మానవులను మంత్ర ముగ్ధులను జేయుచున్నవి. చతుర్ధోధ్యాయంలోని అరిషడ్గుణాలను నిగ్రహించిన విశ్వ బ్రాహ్మణులకు యోగమే కానీ, రోగంరాదని తెల్పి నారు. షష్టమాశ్వాసమాలోని రసవాదము, ఆయుర్వేదరహస్యాలను పొందుపర్చుట చదువరుల పూర్వజన్మ సుకృతం, స్వర్గభోగం, ముక్తికాంతను గూర్చి తెలుసుకొనుటను గురించి మంచి వివరణ ఇచ్చియున్నారు.

సీ॥ శ్రీసుగంధము వారు సూక్ష్మంబు – నెరిగితా శ్రీసనారీశునిసేవజేసి
సంవాదఫలితమున్ సవివరంబుగదెల్పి – లోకోపకార్యార్ధి లోలుడాయ్యె
విశ్వభూసురుడునై విజ్ఞానమంతటిన్ – పంచిపెట్టిన మహాబ్రహ్మతేజ
యోగక్రియలుదెల్పి భోగాలుగాంచిక – మోక్షంబుదెల్పె ఆమునుల సాక్షి

తే॥గీ॥ అర్ధమైయుండు తెలుగులో అందరికిల –సద్గతికి మార్గమునుదెల్పె సంయమీంద్ర
సాయిబాబాయె సర్వమున్ సమతపూజ–ఆయురారోగ్య భాగ్యముల్అందుకొనుము.

ఇట్లు విశ్వతపస్వి – **రామడుగు నరసింహాచార్యస్వామి.**
వామకుంట్ల పీఠాధిపతి.



నహీం అహోం ఓం

## పరిపూర్ణ చరిత్ర

వీరబ్రహ్మేంద్ర స్వామి ఉవాచ:

**విశ్వంబులో విశ్వనాధావదూతయను విశ్వబ్రాహ్మణుడొకడు పుట్టేనిమా**
**విశ్వంబులోతాను శాశ్వతంబుగనుండు – విశ్వనాధుడననిపల్కేనిమా॥**

అనాది విరాట్‌వీరబ్రహ్మేంద్రస్వామి వారు రచియించిన గోవిందవాక్యములలోని 10 వాక్యమిది వీరబ్రహ్మేంద్రస్వామి వారు సనారీ వారి జననానికి షుమారుగా 150 సం॥ల ముందే ఈ భవిష్యవాక్యమును రచియించిరి. సనారీవారు సాక్షాత్ పరమశివాంశ సంభూతునిగా ప్రవచించారు.

శ్రీశైలమల్లిఖార్జునుడే విశ్వనాధునిగా జన్మించారని పూజ్య గురుదేవులు శ్రీశ్రీ “శ్రీయోగి” అచలానంద స్వామివారు చెబుతుంటారు. గురూజీ వారు అనేక సందర్భాలలో సనారీ వారి మహిమలను గురించి చెప్పడం జరిగింది. సనారీ వార్ని కొలచిన వారికి “కొంగు బంగారమే” వారి అనుగ్రహంపొందినవారి జన్మధన్యం.

శ్రీకాకుళం జిల్లాలో నాగవళీ నదీతీరాన గల “పాలకొండ” యను గ్రామమందు బ్రహ్మశ్రీ సింహాద్రి వీరాచారి గౌరీదేవీయను నిష్ఠాగరిష్టులైన విశ్వ బ్రాహ్మణదంపతులకు తప: ఫలంగా జన్మించారు. సాక్షాత్ పరమేశ్వరాంశలు సంభూతుని తనయునిగా పొందుట సామాన్యులకు సాధ్యమౌతుందా? ఆ పుణ్యదంపతులు మనందరకూ పూజనీయులే సుమా!

విశ్వేశ్వరుడు చిన్నప్పటినుండి నిష్ఠాగరిష్ఠుడైన అనుష్ఠాన పరుడు. తపస్సుచేసి అద్భుత శక్తులను సాధించిన మహోన్నతుడు.

అన్నపూర్ణాదేవి ప్రాతఃకాలంలో నిద్రలేచి దేవతార్చన చేసిన తరువాతే ఏ పనైనా ముట్టేది. బ్రహ్మానందాచారి భ్రమరాంబయను పుణ్యదంపతుల తపఃఫలంగా పుత్రికగా పుట్టిన “శక్తి స్వరూపిణి” వారిది సుమంగళీపురము జన్మస్థలం ఆయమ్మ జన్మించటం ద్వారా ఆగ్రామము చరితార్థమైనది.

ఆమెదిన చర్య అందరికీ వింతగా వుండేది. ఎవరితోనూ పెద్దగా మాట్లాడేదికాదు నిరంతరం తనలోతాను ఏదో మననం చేస్తున్నట్లుండేది. యితరులకు అది అర్థంకాక ఏమిటీయమ్మ యిలా వుంటుంది? అనుకునే వారు ఆమె అంతర్ముఖ స్థితిలో వుంటుందని ఎవరికీ అర్థమయ్యేదికాదు.

ఆది దంపతులను కలియుగంలో విశ్వనాధుని అన్నపూర్ణదేవిగా కలిపి దంపతులను చేసింది. చూపరులకు చూడ ముచ్చటగా ఉండి ఆది దంపతులవలే అలరారుచున్నారు.

స్వామి వారి చరిత్రను రచయిత శ్రీ సాయిబాబాచార్యులవారు చాలా హృద్యంగా తీర్చిదిదినారు. మిగతా చరిత్ర విషయాలను నేను ప్రస్థావించదలచలేదు. ఎందుకంటే వారు వ్రాసిన సనారీ వారి చరిత్రను చదివి ఆస్వాదించండి. సంవాద గ్రంథ అర్థ తాత్పర్యాలు వ్రాయడమంటే అంతసులువైన పనికాదు. సాయిబాబాగారు ఎంతో సాహసం చేసారు. సఫలీకృతులయ్యారు. వారు ఎంతో శ్రమించి పూర్తికావించిన పవిత్రగ్రంధమిది. ఇలాంటి బృహద్గ్రంధాలు వ్రాయాలంటే అందరికీ సాధ్యంకాదు.

ఏకొందరికి మాత్రమే సాధ్యమయ్యే ఈ బృహత్తర రచనను సుసాధ్యంచేసుకున్నారు. వారి కృషి అనితర సాధ్యం ఇలాంటి గ్రంధాలు ఒక తపస్సులాగా వ్రాస్తేనే పరిపూర్ణత సంతరించుకుంటాయి. రచయితగారి తపస్సు ప్రశంశనీయము. వారికఠోర దీక్షా దక్షతలను కొనియాడక తప్పదు.

వారి కృషిఫలితంగా రూపుదిద్దుకున్న ఈ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంథార్థములను చదివిన పాఠకులు ఆనంద డోలికలలో తేలియాడుదురుగాక!సనారీవారు తెల్పిన పూజావిధులను, యోగసాధనలను, సిద్ధమూలికలను, మంత్రసాధనలను, రాజవైద్యమును సంపూర్తిగా గ్రహించి, వారివారి కోర్కెలను సనారీ వారి దివ్యానుగ్రహముతో సిద్ధించుకుందురుగాక పాఠకలోకానికి సర్వదా సర్వత్రస్వామివారి కరుణాకటాక్షవీక్షణలు సంప్రాప్తించు గాక.

శ్రీ గోవిందమాంబా వీర బ్రహ్మేంద్రులదివ్యానుగ్రహము మరియు సనారీ వారి మహాదాశీస్సులు రచయితకు వారి కుటుంబ సభ్యులకు సర్వదా సర్వత్రా సంప్రాప్తించాలని ప్రార్థిస్తూ............ **భగవత్ సేవలో పరిపూర్ణ సిద్ధానందస్వామి.**

---

ఈ గ్రంధమందలి అర్ధాలను "సనారీ విశ్వేశ్వర సంవాద" మందలి వరుస క్రమములోని మూలములను పూర్తిగా అవగాహన చేసుకొని మీకు కావలసిన వాటిని త్రికరణశుద్ధిగా ఆచరించి ఫలితాలను పొందండి.

**కవినిగాను వ్యాకరణకావ్యముల్ చదువనులేదు।**
**నేను పండితుడు గాను శుద్ధపామరుండ విమలభక్తి**
**భావమున జగద్గురు, కృపాకటాక్ష వీక్షణములతో**
**వ్రాసితి సనారీవిశ్వేశ్వరసంవాద గ్రంధార్థములన్॥** గ్రంధకర్త



## ఓంశ్రీగురుభ్యోనమః



శ్రీశ్రీశ్రీ సనారీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీత్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాధాలయ నిర్మాణాధ్యక్షులైన బ్ర॥ సుగంధం సాయిబాబాచార్య స్వామీజీ(విశ్వకర్మ) గార్కి జగద్గురు శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి వారి యదార్ధ కేంద్ర పీఠాధిపతులు నిర్గుణ అచల దీక్షితులు బ్రహ్మశ్రీ రఘు ప్రోలు జనార్ధన స్వామి వారు హృదయ పూర్వక వందనములతో తెలుపు అభినందన సుమాంజలులు

నాన్నగారు మీరు వ్రాసిన సనారీ విశ్వేశ్వర సంవాదానికి అర్ధముల అత్యంత ప్రశంసనీయములు సంవాద గ్రంధముద్రణ జరిగి 125 సం॥లు దాటిన నేటి వరకు ఎవ్వరూ దీనిని పరిష్కరించి ప్రచురించకపోవుటచే ఆధ్యాత్మిక పరులు యిందలి రసామృతమును పరిపూర్ణముగా గ్రోలలేకపోయారు.మీరు తెలిపిన వివరణ మాటల కందని మాధుర్యమును ఎవరికి వారు అనుభవించవలసినదే గానీ, పదముల కందని హృదయాను భూతిని గ్రంథస్తముగావించి, మోక్షాపేక్షకులకు, సాధకులకు, సుగమునము చేసితిరి. ఈ రచనా యోచనయనే బీజము మీ హృదయమున పడి మహావృక్ష మైనది. ఈ జ్ఞానవృక్షము ఎంతోమంది గురువులకు, శిష్యులకు, పండితులకు, సాధువులకు, సత్ పురుషులకు, వయోవృద్ధులకు, రసవాదులకు, మూలికా వైద్యులకు, సిద్ధులకు, పీఠాధిపతులకు, ఋషులకు, బ్రహ్మఋషులకు సైతము మార్గదర్శకము కాగలదు. జగద్గురువులగు సనారీవారి కృప లేక వారి అనుజ్ఞలేక గ్రంధ వివర యింతవరకు ఆస్థికులకు అందలేదు. యింతవరకూ ఈ గ్రంధ విషయములు సంపూర్ణంగా గ్రహించిన మహానీయులు వారి హృదయములందు భద్రపరచుకుని, అర్హులకు కావలసినంత మాత్రమే తెలిపి కనుమరుగైపోయినారు. లోక విద్యలు పెరిగి బ్రహ్మవిద్య మరుగౌతున్న సమయంలో ఈ గ్రంధము బ్రహ్మజ్ఞానాసక్తులకు అత్యంత సహకారియై వారిని గమ్యమునకు చేర్చగలదు. యిది సామాన్యులకు సైతం ఎంతో ఎంతోంతో ఉపయోగపడి సంశయములు తీర్చి, సక్రముమార్గమును సూచించగలదు. పాండిత్య ప్రతిభకు సంబంధంకానీ ఈ గ్రంధ వివరణను ఈ జగద్గురు విశ్వనాధు ప్రభువులే మీతో ఈ కార్యాన్నిచేయించినారే గానీ మరి వేరు కాదు.గురుదేవులకు మీ యందు గల శిష్య వాత్సల్యమునకు గురుబిడ్డలందరూ ఆనందించిచుచూ, మీ వలే గురుప్రేమను పొందుటకు, నిర్మలహృదయంతో ప్రతిఫలాపేక్షలేనినవవిధ భక్తి మార్గములలో ఏదైనా ఒకదారిలో ప్రయాణించి జన్మను సార్ధక్యం చేసుకొని తరించగలరు. మూల గ్రంధమందలి ప్రతీ పదానికి పండితపామరులకు సైతం అర్ధం మగునట్లు వ్రాసి యోగసాధకులకు చక్కని మార్గమును చూపిన మీరు నేటి నుండి
సుగంధం సనారీ బాబాచార్య స్వామీజీ పిలువబడుదురు గాక!
శ్రీశ్రీశ్రీ సనారీ యదార్థపీఠాధిపతి

బ్రహ్మశ్రీ రఘుప్రోలు జనార్ధనస్వామీజీ

## తెలంగాణాలో సనారీ వారి శాఖాపీఠములు

1. **శ్రీవడ్డే తారకమ్మ** బాణాలగ్రామం బల్మూర్ మండలం, అచ్చంపేట, తాలూకా మహబూబ్‌నగర్‌జిల్లా, సెల్9704235160

2. **మ॥సర్వన్నగారు** ముచ్చింతలగ్రామం, చిన్నచింతకుంట మండలం,

3. **శ్రీ వేములకంటే వెంకటయ్యగారు** లక్నారము గ్రామం, తెల్కపల్లిమండలం మెహబూబ్ నగర్‌జిల్లా. సెల్ : 7036395711

4. **శ్రీమతి గజ్జా అంజమ్మ గారు** పల్కపల్లిగ్రామం, అచ్చంపేట మండలం మెహబూబ్ నగర్ జిల్లా. సెల్ : 9553004139

5. **బ్రహ్మశ్రీ కొండోజురామాచారి & శ్రీమతి పద్మమ్మగారు,** అంకెన్ గ్రామము అనుకొండపోస్ట్, ముక్తకమండలం, మెహబూబ్ నగర్ జిల్లా. తెలంగాణా, సెల్ : 9010748198

6. **శ్రీరామదాసు భాగ్యమ్మ గారు,** ఉప్పునుంతల గ్రామం& మండలం, మహబూబ్‌నగర్‌జిల్లా. సెల్ : 9440571974

7. **శ్రీ ఎలకల లక్ష్మమ్మ గారు,** అచ్చకర్మ గ్రామం& మండలం,మహబూబ్‌నగర్‌జిల్లా.

8. **శ్రీ లక్ష్మమ్మ గారు,** ములగర గ్రామం, ఉప్పునుంతల మండలం, మహబూబ్‌నగర్‌జిల్లా.

9. **బ్ర॥గణేష్ ఆచార్యులు,** కురంపల్లి గ్రామము, చింతపల్లి మండలం, నల్గొండజిల్లా

10. **శ్రీ నాగమణీ వెంకటయ్య గారు ధర్మపత్ని ప్రభావతమ్మ** గార్లు, చెరుకుపల్లి గ్రామము, డిండిమండలం, నల్గొండజిల్లా, సెల్ : 9951862896

11. **శ్రీ యింద్రకంటి అక్బర్ గారు** పెద్దకొత్తపల్లి, పోస్ట్ & మండలం, మహబూబ్‌నగర్‌జిల్లా, సెల్ : 9542377031

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు

సనారీ విశ్వేశ్వర దేవం - విశ్వనాథం మహేశ్వరం
సాక్షాత్ పార్వతీనాథం - పరంజ్యోతి నమామ్యహం
**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాథాలయమ్**
మహానాడు గ్రామం - తాడేపల్లిమండలం పోస్ట్
గుంటూరుజిల్లా - నవ్యాంధ్ర, ఆంధ్రప్రదేశ్ :522 501











గ్రంధకర్త 3వ కుమారుడు చి॥వెంకటేష్, కోడలు చి॥ల॥సౌ॥పద్మజ
3వ మనుమరాలు - భువనేశ్వరి, 4వ మనుమరాలు - మీనాక్షి



గ్రంధకర్త 4వ కుమారుడు
చి॥ రాజేశ్వరరావు, కోడలు చి॥ల॥సౌ॥ మాధవీలత
5వ మనుమరాలు-పూజిత, 6వ మనుమరాలు - హర్షిత



గ్రంధకర్త దంపతులు

సంగీత గురువు **శశిధర్** దంపతులతో



గ్రంధకర్త సనారీ బోధగురువుతో

బ్ర॥ **తణుకు సాంబశివానంద రాజయోగి** గారితో

**తెలంగాణా రాష్ట్రంలో శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న సనారీ పీఠములు**
**బ్రహ్మశ్రీ రఘుప్రోలు జనార్ధనస్వామివారిచే స్థాపించబడిన**
**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి వారి**
**యదార్ధకేంద్ర పీఠం మరియు కేంద్ర ఆశ్రమమునందు**

1. కార్తీక శుద్ధ పంచమినాడు సనారీ వారిజయంతి
2. వైశాఖశుద్ధఏకాదశి నాడు అన్నపూర్ణావిశ్వనాధుల కల్యాణం
3. చైత్రబహుళ పంచమినాడు గురుపూజా కార్యక్రమంలో కొత్తశిష్యులకు ఉపదేశములిచ్చి సనారీవారి శిష్యపరంపరలో చేర్చుట
4. యోగసాధనలో పరిపూర్ణులైన పాత శిష్యులకు వారి అర్హతకు తగిన బిరుదులతో సత్కరించి గురుహోదాగల పట్టాలనిచ్చి శాఖాపీఠములనేర్పరచి, గురుహోదా గలవారు తమ శిష్యులకు ఉపదేశార్హతనొసంగుట మొదలగునవి.
5. యోగనిష్ణాతులను ఆహ్వానించి వారిచే ఆధ్యాత్మిక ఉపన్యాసములిప్పించుట.
6. ఉదయం తమ శిష్య ప్రశిష్యులతో కలసి నిజగురుడగు సనారీ వారి పూజలు హోమములు జ్ఞానయజ్ఞముగా జరిపించుట,
   మధ్యాహ్నం కార్యక్రమమునకు వచ్చినవారందరికీ విందుభోజనములు
7. సాయంత్రంనుండి రాత్రివరకూ సనారీవారి భజనాకార్యక్రమములు
8. ప్రతీమాస పూర్ణిమనాడు ఉమామహేశ్వరంలో శిష్యబృందముతో సనారీ అష్టోత్తర శతకేతనామావళిచే హోమముచేయించుట
9. రాత్రికి సనారీ వారి సంకీర్తనలతో భజనాకార్యక్రమములు చేయుట.

## శ్రీశ్రీశ్రీ సనారీ సంవాద గ్రంధార్ధములందలి 253పేజీలోని 4వదియగు శిల్పి సంతతిగురించి

శిల్పి బ్రహ్మసంతతివారగు శిల్పులు సకల శిలానాణ్యతలను పరిశీలించి ఏ శిల ఎట్టి నిర్మాణమునకు ప్రశస్తమో గ్రహించి, రాజుల నివాసములకు రాజ ప్రాసాదములు, విలాసమందిరములు,సభావేదికలను,ఉద్యానవనములను నిర్మించి, శత్రురాజులనుండి రక్షణకు దుర్భేద్యమగు కోటలను కందకములనూ, ధనికుల నివాసములకు వారి వారి ఆర్ధికస్థితికి తగు భవంతులను,మధ్యతరగతివారి కనుకూలమగు యిండ్లను,పేదవారికి సైతము వారికి మృగములనుండి చోరులనుండి రక్షణ కలుగు నివాసముల వాస్తు శాస్త్ర బద్ధముగా నేర్పరచి జలతటాకములు ఉద్యానవనములతో కూడిన గ్రామ నిర్మాణములుచేసి సర్వమానవులు భక్తిమార్గమున సక్రమజీవనముతో తరియించుటకు ప్రధమసోపానము దేవాలయములుగావున వాస్తుబద్ధముగా దేవాలయగోపురములను నిర్మించి అందలి దేవతావిగ్రహములను అత్యంత కళానైపుణ్యముతోమలచి దైవచరిత్రలను ప్రాకారములందు చెక్కి నాస్థికులకు సైతము మనసుభక్తిమార్గమునకు మళ్ళునటుల నిర్మించి అష్టాది వర్ణస్థులూ ఆధ్యాత్మిక జీవనముచే ముక్తులగుటకు మార్గదర్శులైరి.

## సనారీశ్వరం నమామి

అక్షరకర్షక బహుభారత బ్రహ్మ, **బ్ర॥ ఫణిదపు ప్రభాకరశర్మ** (విభావసు)

సనారీ విశ్వేశ్వర సంవాదమనే గ్రంధము- సాక్షాత్తు సింహాద్రి విశ్వేశ్వర స్వామివారు రచించిన గ్రంధరాజము ఆయన గొప్ప తపశ్శక్తి సంపన్నులు యోగీశ్వరులు వేదాంత విద్య నౌపాశన పట్టిన వేదవిద్యా విశారదులు. అగ్రంధము మంత్ర తంత్ర తత్వ యోగజ్ఞాన రసవాద భాండాగారము సనారీ అంటేనే పార్వతీ దేవితో కూడిన పరమేశ్వరుడని తెలుస్తూనే ఉంది. ఆయన స్వరూపమే విశ్వేశ్వర స్వామి అటువంటి మహానుభావుడు రచించిన ఈ మహోత్కృష్ట మహాద్భుత గ్రంధము పద్య, గద్య కావ్యమై యుండుట వలన సామాన్య మానవునకందుబాటుగాకుండినది. ఈ కావ్యము తుష్టి, సంతుష్టి, పుష్టి, రసపుష్టి కలిగిన కావ్యము. ఈ గ్రంధము 8 ఆశ్వాసములతో గూడి 136 వివిధ విషయాలను విశ్లేష పరచిన అత్యుత్తమ కావ్యమే గాక అత్యద్భుతఅమృత రస వాహిని

**శ్రీశైల గృహవాసిని కాశీ విశ్వేశ్వరుణ్ణి కైలాసపతిన్!**
**కేశవ మూర్తిని బ్రహ్మ నిజేశులపై నాది బ్రహ్మ శక్తియునేనేనని!!**

విశ్వేశ్వరస్వామి తన సర్వాంతర్యామితనాన్ని చాలాచక్కగా ఆ పద్యంతో ఉదహరించారు. .అటువంటి మహానుభావుడు రచించిన గ్రంధాన్ని గద్యానువాదం చేయడం నిజంగా సాహసమే అటువంటి సాహస కృత్యాన్ని బృహత్తర కార్యక్రమాన్నిబ్రహ్మశ్రీ సాయిబాబాగారు తలకెత్తుకొని అందులో విజయం సాధించారు.ఇంతవరకెవ్వరూ ఈ గ్రంధానికి అర్ధ తాత్పర్యాలు వ్రాయడానికి సాహసించిన దాఖలాలు లేవు. అది శ్రీ సుగంధం సాయిబాబాచారిగారి ద్వారా జరుగవలసిన యోగమున్నందు వలన గతంలో ఎవ్వరూ ఆ కార్యక్రమానికి సిద్ధపడలేదు. అది శ్రీ సాయిబాబా స్వామీజీ జనావళికి సుగమం చేశారు.

శ్రీ సనారీ వారి పద్యాలు పదగుంభనం కలిగిన అర్ధప్రపూరణాలు వాటికి ప్రతి పదార్థము తాత్పర్యము వ్రాయడం సామాన్యమైన విషయం కాదు. శ్రీ సనారీ వారి కృపాకటాక్షం సమృద్ధిగా పొందిన శ్రీ సాయిబాబాగారికి అది సుసాధ్యమైనదనడంలో సందేహము లేదు. శ్రీసాయిబాబాగారు ప్రస్తుతం శ్రీ సనారీవారి ప్రగాఢ భక్తులు ఆయన శ్రీ సనారీవారిని నిత్యోపాసన చేస్తున్న భక్త శిఖామణి.ఆసనారీ స్వామియే స్వయంగా సాయిబాబాగారిలో ప్రవేశించి ఈ గ్రంధాన్ని వ్యాఖ్యానింప జేశారు. సాయిబాబాగారి కృషి బహుదా ప్రశంశ నీయము. ఆయన పద విభాగం చేయడం ఆపదాలకు బహుఅలత అలతి పదాలతో అర్ధాలు చెప్పడం చదువరులను బాగా ఆకర్షిస్తుంది. అర్థం చేసుకోవడానికి చక్కని వీలు కల్పిస్తుంది. ఎలాగైనా శ్రీసాయిబాబాగారు ధన్యజీవులు. శ్రీ సనారీవారు1878లో ఈ గ్రంధం మొదలియార్‌తో అచ్చు వేయించినంతమాత్రం చేత మొదలియార్ గారి కుష్ఠువ్యాధి సంపూర్ణముగా నయమైపోయింది. అటువంటి పవిత్ర గ్రంధానికి శ్రీ సాయిబాబాగారు సుధాతరంగిణి వ్యాఖ్య వ్రాయడం వలన వారి జన్మ చరితార్ధమైంది.ఇప్పుడీ గ్రంధం సాయిబాబా



గారివి పులాంశతో వివరణలతో విశ్లేషణలతో ఎంతోమందిని ఆకట్టు కుంటుంది.ఆకర్షిస్తుంది. వారికోర్కెతీరుతుంది.ఇన్నాళ్ళు అదిమాకు అర్ధంగాదని చెప్పడం యిక ఆగిపోయి, అగ్రంధంలోకి భక్తులు చొరబడతారు. జనంఅందులోని వేదాంత విషయ పీయూషాన్ని కడుపార త్రాగి ధన్యులవుతారని ఆశిస్తూ.....

ఇంతటి మహోత్తర కావ్యాన్ని చేపట్టిన సుగంధం సాయిబాబాగారు కీర్తి ప్రతిష్ఠలు సుగంధంలా నలుమూలలకు ప్రాకుతాయని ఆశిస్తూ వారికి నా నమస్సులర్పిస్తూ

**ఫణిదపు ప్రభాకరశర్మ** (విభావసు), ఒంగోలు, హరిహరనగర్ , 7.1188 సాయినగర్.

## శ్రీ ప్రభాకర శర్మగారు వ్రాసిన సుగంధం వంశమ్

ఆ॥వె॥ పర్న విశ్వకర్మపరమపూజ్యుడనంగ-అతని వంశమందు అవతరించి
శ్రీ సనారీవారి శిష్యుడైచెలగిన-సాయిబాబా ధరలో సత్యమూర్తి.

2. వీరశైవములో విఖ్యాతిచెందిన-అగ్రగాములు వీరు అందగాండ్రు
ధరను సుగంధవంశధన్యాత్ములగువీరు-సాయిబాబా వంశ సత్పురుషులు

3. ఆడవారు చూడ అకళంక మూర్తులు-శివుని పూజనెపుడు చేయుచుండ్రు
పిత్రు కార్యములలో ప్రీతిపాల్గొందురీ-సచ్చరిత్రులంత-సరసగుణులు

4. అమల గుణవిశాలి ఆదినారాయణ-గర్వరహితుడు సుగంధవంశ మందుపుట్టి
భువిలోగంధపరిమళములు-దశదిశలజల్లె సద్యశముఁజెలగ

5. అన్నపూర్ణయతని అర్ధాంగి భద్రాంగి-భర్తపాదసేవపరమభక్తి
తోడనెపుడుసేయు-తోయజాక్షియనంగ-భవ్యగుణసవిత్రి పరమమైత్రి

6. చేతులార నెపుడు శివపూజలల్జేయు-పార్వతమ్మపూజ ప్రతిదినమ్ము
శివుని భవుని ఎపుడు చిత్తమునధరియించి-పూజచేయునామెపుణ్యమూర్తి

7. సంతుకోసమామె సాంబశివార్చన-వదలకుండజేసి వరములందె
సత్తుచిత్తునెరిగి సాధ్విసంబరమున-గిరికుమారిమెచ్చి వరములిచ్చె

8. కరుణకల్గి శివుడు కరమెత్తి దీవించె-శ్రీభవాని కూడ శుభముపలికె
ముగ్గురుకొమరులు ముదమారనొసగె-నా"రజిత గిరి" గిరినివాసిరాజమౌళి

9. వేంకటేశ్వరుడు విజ్ఞాని, రెండవ-సుతుడుకల్గె వార్కి శోభ కలుగ
చూడముచ్చటగన సూర్యనారాయణ-పుట్టివర్ధిలంగ పుడమియందు

10. మూడవ కొడుకు కలిగె ముద్దు ముచ్చటలతో-గంగరాజుపేర గరిమిగలుగ
ఆలుమగలు ఎంతో ఆనంద పడిరహో-బంధుజనములంత విందుగుడిచె

11. వెంకటేశ్వరుండు విజ్ఞులు,విభుదులం-దరతని కొనియాడ సరసగుణుడు
బంధుజనములంత పాపమ్మతోపెండ్లి-జరిపినారువారు చతురగతిని

12. ధన్య జీవుడతడు ధరవేంకటేశుడు-పాపమాంబకూడ పరమపూజ్య
నిరతమాలు మగలు షిరిడిసాయినినమ్మి-పూజలెన్నో చేసెపుణ్యమబ్బ !

13. సాయిబాబా చరిత సాధ్వీసప్తాహము-ల్చ దివిపూజలెన్నో చేసిచేసి
చివరికామెబడసె చిన్నారికొడుకునిల-సాయిబాబానంగసాధ్వియామె

14. సిరులనెన్నాయతడె సిద్ధాన్తిగురునేడు-సాయిబాబాయనగ సన్నుతులతో
మెలుగుచుండెనయ్య మేలిమిబంగారు-గుణముకలిగి ధరలోగురువుగారు

15. శ్రీ సుగంధ వంశ సుగుణాకరుండన-సాయిబాబాచూడ సద్యశముతో
పెరుగుచుండునపుడు పెండ్లిమాటలురాగ-సిగ్గుపడెను సాయిమొగ్గలాగ

16. శాంతిమూర్తి సాయి సదసద్వివేకము-మంచితనము గూర్చిఎంచుకొనుచు
అమలగుణవిశాలివిమలమ్మయనుబాల-పెండ్లికొప్పుకొనెనుపెద్దలడుగ

17. విమల సాయి పెండ్లి వైభవమ్ముగ జరిగె -పెండ్లిపెద్దలంత పేరుపేర
అక్షతలనుజల్లి ఆశీస్సులిడినారు-నూత్నదంపతులను నృహరిమెచ్చ

18. కాలమిట్లు కొంత గడచిన పిమ్మట-జీవితాశయమ్ము చేరువవగ
కలిగినారు సుతులు నలుగురు వారికి-నలువ మెచ్చధరలో కలిమికలుగ

19. శ్రీనివాసుమొదట శివుడురెండవవాడు-వేంకటేశ్వరుండు వేడ్కతోడ
మూడవకొడుకామె ముచ్చటల్దీరగ-ప్రభవమందినాడు విభవములతో

20. రాజునామకుండు రాజీవనేత్రుడు-రంజితముగ రాజరాజనంగ
నలువమెచ్చనతడు నాల్గవకొమరుడై-వెలసెవంశమందు విలువపెరుగ

21. సాయివిమలగార్లు శంభుప్రసాదమా-యనినయట్లు సుఖముగాఽడపిల్ల
లనిరువుర కనిరి సులక్షణముగ-అన్నపూర్ణపెద్దదందులోన

22. రెండవ సుత దుర్గ-బండెడుసంతోష-తతులతోడబుట్టి తన్మయమున
కంటెవారి ఇంట కాలూనెదుర్గమ్మ-కన్నవారికీర్తి ఘనతకెక్క

23. అన్నపూర్ణ ఎంతోఆనందరూపిణి-బంధువర్గమంత భోగమందె
కోడలయ్యెఘనముగా కొండూరివారింట-బంధుజనము మరియుబుధులు మెచ్చ

24. మానుపాటి బుజ్జి మహనీయచరితుడు-శ్రీసనారిసహిత శక్తిపీఠ
మొకటిమొగసాలలోనిల్పు- కార్యసిద్ధితనకు కలుగలేదు

25. ఇంతలోనేకతని కీశ్వరుపిలుపొచ్చె-తప్పదాయెతానిల తరలివెళ్ళె
మరణమాపగల ధీరుడెవ్వడుధర-చనియె బుజ్జి శివుని సన్నిధికని

26. కాని అతని భార్యగ్రహియించి విషయమ్ము-ఆలయమునకామెఅయిదుసెంట్లు
భూమిదానమిచ్చె పుణ్యవతిసుశీల-భవ్యగుణ పవిత్ర భరతపుత్ర

27. శ్రీసుగంధకులుడు శ్రీసాయిబాబాతో-విశ్వభూసురులను వేడ్కమీర
కలసి విజయవాడ నేలపై నిర్మించె-శక్తిపీఠమొకటిముక్తికలుగ

28. కృష్ణవేణినదికి కలిమినుత్తరగట్టున - శక్తిపీఠమలరె సాయిబాబా
శ్రీసనారీగూర్చి శ్రమయించి ప్రతిరోజు - పూజచేయుచుండె పుణ్యుడితడు

29. శ్రీసనారి గురుడుశివుడు చిన్మయమూర్తి-సతతముండుగాక!శక్తితోడి
సర్వజనులనెపుడు శాంతితో జీవించ- కరుణజూడు నీలకంఠుడెపుడు



**డా॥రాపాక ఏకాంబరాచార్యులు ఎం.ఇ.డి.లిట్**

జాయింట్ రిజిష్టార్ ఆప్కో-ఆపరేటివ్ సొసైటీస్
సభాపతి విశ్వబ్రాహ్మణ ధర్మపీఠము హైదరాబాద్.
అధ్యక్షులు ఆంధ్రపద్యకవితా సదస్సు -జంటనగరాలశాఖ
ఎం.ఐ.జి.2నెం.56-మస్కమహల్కాంప్లెక్స్-అత్తాపూర్,
బహదూర్ పురాపోష్టు-హైదరాబాద్-64. సెల్:9440494752.

మాన్యమహోదయ బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్యస్వామీజీగారు శ్రీశ్రీశ్రీసనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు మూడువందలపైనున్న పేజీల గ్రంధమును రచించారు. వారు వృత్తిరీత్యా స్వర్ణకారులైనా ప్రవృత్తి మాత్రం వాస్తు జ్యోతిష, సనాతన ధర్మములు, వేదాంతశాస్త్రములను పరిశోధించుటయనిచెప్పాలి. వారు1995లో రాజయోగయైన తణుకు సాంబశివానందం గారివద్ద దంపతీయుక్తంగా సనారీ దీక్షగైకొని వారి పీఠంలో 5సంవత్సరములు పూజాకార్యక్రమములు నిర్వహించి బోధగురుని ఆశీస్సులతో విజయవాడ సత్యన్నారాయణ పురంలో గల వారి స్వగృహము "**శ్రీసాయిజ్ఞాననిలయ**'మందు శ్రీశ్రీశ్రీసనారీ పీఠాన్ని స్థాపించి నిత్యపూజలు చేయుచూ సనారీ వారు ప్రసాదించినట్టి పూజాపద్ధతులతో కార్తీక శుద్ధ పంచమి నాడు సనారీవారి జయంతిని, శ్రీ దేవీశరన్నవరాత్రి మహోత్సవములు విజయవంతంగా జరుపుతూ కృష్ణానదీతీరమున శ్రీశ్రీశ్రీత్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాధాలయమును 2011లో నిర్మించి ఆలయ ప్రాంగణమందే ఆదంపతులు వాన ప్రస్థాశ్రమము స్వీకరించి నిత్యపూజలు సల్పుచున్నారు.

సుగంధం వారు ఉదయం లేచినదిమొదలు రాత్రి పరుండువరకూ స్వామివారి సేవకు సమయాన్ని వెచ్చించుచూ వారు 2007లో సనారీస్వామివారు రచించిన సంధ్యా వందనము, శ్రీసూక్త పురుషసూక్తములతో సనారీ నిత్యపూజ,పంచబ్రహ్మలు సాంప్రదాయముల తో గల కేదారేశ్వర వ్రతవిధానములుగల పూజా పుష్పాన్ని, 2009లో శ్రీశ్రీశ్రీసనారీదీక్షా విధానమును, 2011లో శ్రీశ్రీశ్రీ సనారీ విజ్ఞానం మహిమలు గ్రంధమును 2013లో ఐదు అధ్యాయములతో శ్రీశ్రీశ్రీసనారీ విశ్వేశ్వర వ్రత విధానమును 2014లో శ్రీశ్రీశ్రీసనారీ సంవాద గ్రంధార్ధములను గ్రంధరాజమును ఎనిమిది అధ్యాయములతోపార్వతీదేవి విశ్వేశ్వరులను ప్రశ్నించుట పరమేశ్వరుడు సమాధానం చెప్పుట యిలా అనేక విషయాలపై పిపీలికాది బ్రహ్మపర్యంతం అనేక విషయాలను ఆధ్యాత్మిక సందేహాలకు సమాధానములుగల ఈ గ్రంధాన్ని రచించినారు . ఈ గ్రంధాన్ని సర్వులూ పఠించి ఆచరించతగినది.యిందు ముఖ్యమైన మంత్రాలకు అర్ధములున్నాయి. యింకా రహస్యముగా ఉంచబడిన యోగవిద్యా రహస్యములు, రసవాదము, మూలికా వైద్యము, సృష్టి రహస్యములు మొదలైనవెన్నో వాడుక భాషలో పామరులకు సైతం అర్ధమగునట్లు వివరించారు గ్రంధకర్త.

సింహాద్రి విశ్వనాధావధూతస్వామి కాశీవిశ్వేశ్వరుని అవతారమే వాని గురించి వీరబ్రహ్మేంద్రుని కాలజ్ఞాన గోవింద వాక్యములలో ఈ విధంగా భవిష్యత్తును తెలిపారు.

**విశ్వమ్ములో తాను విశ్వనాధావధూతయై విశ్వేశ్వరుడవతరించేనయా।**
**విశ్వమ్ములో తాను శాశ్వతమ్ము గ నుండు విశ్వనాధుడనని పల్కేనయా॥**

ఆవిధంగానే సనారీ వారు శ్రీకాకుళంజిల్లా పాలకొండలో 1794సం॥లో కార్తీక శుద్ధపంచమినాడు బ్ర॥సింహాద్రి వీరాచారి శ్రీమతిగౌరీదేవి తపఃఫలంగా వారికి పుత్రుడై జన్మించారు. బాల్యంలో విశ్వనాధుడు వేద శాస్త్రపురాణేతిహాసములు. ఉపనిషత్తులు,కావ్యములు

అవపోశనపట్టారు. బాల్యంనుండి అనేక మహిమలు ప్రదర్శించారు.వారు తమ గ్రామమునుండి శ్రీకాకుళంమొదలు రాజమహేంద్రి వరకూ అనేక గ్రామాలు పట్టణాలు సందర్శించి అనేక అనేక మహిమలు చూపారు. వేదాంత ప్రసంగాలు చేసారు. తమ ఉపదేశాల వలన తమ ఆచరణ వలన ప్రజలను ఉత్తేజపరచారు. కాశీ సమయములందు సనారీ విశ్వేశ్వర సంవాదాన్ని రచియించారు. ఈ గ్రంథరాజమును చెన్న పట్టణంలో ముద్రించి తాము పరమేశ్వరుడని రుజువు చేసుకున్నారు. ఈ గ్రంథంలోని సంగతులను బ్ర॥సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ అరటి పండొలచి చేతపెట్టినట్లుగా మనకు కరతలామలకంచేసారు. సంవాదానికి చక్కటి అర్ధవివరణను సుగంధంవారు చేయడం వలన సామాన్య మానవులుకూడా దీనిని చదివి అర్ధంచేసుకో గలగుతారు. యిట్టి ఉత్తమ గ్రందాన్ని రచించి మనకందించిన సుగంధం వారికీర్తిదశదిశలా వ్యాపించగలదు.

జగత్ కళ్యాణమూర్తియైన విరాట్ విశ్వకర్మభగవానుడు సాయిబాబాచార్య దంపతులకు ఆయురారోగ్యైశ్వర్యములు, సుఖశాంతులు కలుగజేయగలరని ఆశించుచున్నాను.

శుభంభూయాత్

**రాపాక ఏకాంబరాచార్యులు,** హైదరాబాద్, 20-12-2014.

## శ్రీశ్రీశ్రీసనారీ కోటి వ్రాసిన పుస్తకాలను హోమం చేయువిధానము

ముందుగా విరాట్ విశ్వకర్మ బీజమగు ఓంకారమును 5సార్లు ఉచ్చరించి ఓంనమో బ్రహ్మాదిభ్యోబ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యోనమోగురుభ్యః

సర్వోపప్లవ రహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థోబ్రహ్మైవాऽ హమస్మిసోహऽ మస్మీ బ్రహऽ హమస్మి గురు శూలీగురోచక్రి, గురుధాతృ బృహస్పతి, గురుశుక్రా, గురుత్వష్టా, యిమేదేశిక వర్ధకి

1.ఓం శ్రీ సనారీ ఈ పంచాక్షరీ కోటిగానీ, ఓంశ్రీసనారీ విశ్వనాధాయనమః గానీ

ఓంహ్రీం శ్రీం ఐం క్లీం సౌః-సౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఓం ఈద్వాదశాక్షరీ మంత్రాన్నిగానీ

నామకోటి వ్రాసిన పుస్తకాలకు హోమం సహస్ర నామాలతో

చేసివ్రాసిన పుస్తకాలను హోమగుండంలో అర్పించి హోమగుండంచుట్టూ

సహస్రదీపాలనలంకరించి పూర్ణాహుతి చేసి అన్నదానం చేయాలి.

అన్నంవడ్డించేటప్పుడు జై విశ్వనాధాజై -అన్నపూర్ణాంబాజై ఈనామాలు చెప్పించి

అన్నపూర్ణాధ్యానంచెప్పించి ప్రసాదాన్ని భుజించాలి.

పంచాక్షరీతోగాని ద్వాదశాక్షరితోగాని అక్షరలక్షలుజపంచేసినమాలలను హోమ

వేదిక వద్ద అలంకరించాలి.

ఏకనామం 24గంటలు చేయించి పురవీధులలో సనారీవారి చిత్ర పఠాన్ని అష్టోత్తర శతకేత నామావళి చెబుతూ ఊరేగించి సాయంత్ర కనీసం 5జంటలతో సహస్రనామ కుంకుమార్చన పూజలుచేసి తీర్థప్రసాదాలు పంచాలి.గురుపూర్ణిమనాడు స్వామివారి శిష్యులంతాచేరి ముందుగా నిజగురుని పూజించి తర్వాత బోధగురుని పూజించి మహాప్రసాదాన్ని అక్కడకు వచ్చిన వారంతా భుజించి పీఠాధిపతులచే ఆధ్యాత్మిక ప్రవచనములు చెప్పించి సాయంత్రం కుంకుమార్చనలు చేసి తీర్ధ ప్రసాదములు స్వీకరించాలి. (యిలా హోమాన్నీ పూర్తిచేయాలి)



## పీఠిక

సజ్జనసాంగత్యము, సాధు జనగోష్ఠి, సత్సంభాషణ, సాధుజన సంరక్షణ పరోపకార చింత, ఈశ్వరభక్తి ఈ గుణములన్నీ పూర్వ జన్మాంతర వాసనల వలన రావలయును గాని, ప్రస్తుత జన్మమున వచ్చునవి కావు. ఈశ్వరభక్తి పక్వమునకు వచ్చిన పండవుతుంది. పండిన తరువాత యోగం అబ్బుతుంది. యోగమువల్ల జ్ఞానం, జ్ఞానంవల్ల మోక్షం సిద్ధిస్తుంది. పురాకృత జన్మ విశేషము లేనిదే ఇటువంటి గ్రంథాలు స్పృశించడం సాధ్యం కాదు. దశాబ్దకాలం క్రితం శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాదగ్రంథం నాకు లభించినా ఆ గ్రంథం పూర్తిగా పఠించలేకపోయాను, కారణం అందున్న నిగూఢ అర్థము అవగతం కాకపోవడమే! శతాబ్దాల నుండి ఈ గ్రంథం లభ్యం అవుతున్నా మూలప్రతికి తాత్పర్యం వ్రాయాలనే ఆలోచన ఎవరికీ రాకపోయింది. సాధారణ వ్యక్తులు పండితులు కూడా ఈ గ్రంథానికి తాత్పర్యం వ్రాయడానికి సాహసించలేదు. ఇందు యోగ, రస, రసేంద్ర, రసాయన విషయములున్నవి. యోగులకు భోగులకు గృహస్థులకు సదాచారులకు మోక్షార్థులకు అవసరమగు అనేక విషయములు, మణి మంత్ర, యంత్ర, తంత్ర, ఔషధ సిద్ధుల సమాచారం నిక్షిప్తమైంది. అష్టసిద్ధుల, వేద, వేదాంగ విషయములు. దేవతార్చనము ఉపాసనలు, వివిధ దేవతా మూర్తుల చేతుల ఆయుధములు శంఖ, చక్ర, గదా, శూలాది నానా ఆయుధ ధారణ విషయము అందలి అంతరార్థములు వివరించబడినాయి.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

సహస్ర సంఖ్యాకులలో ఒకానొకడు మోక్షసిద్ధి కొరకు ప్రయత్నించుచున్నాడు. అట్లు ప్రయత్నించిన వారిలో (సిద్ధి అనగా ప్రయత్నించిన వారిలో) వేయింట ఒక్కడు మాత్రమే నన్ను తెలుసుకొనుచున్నాడని గీతాచార్యుని అనుసరించి గురు కృపచే. ఈ గ్రంథం వ్రాయబడింది - అట్లు ప్రయత్నించిన వారిలో ఒకరు. బ్ర॥శ్రీ, సుగంధం సాయిబాబాచార్య సిద్ధాంతిగారు— సాక్షాత్తు శ్రీస్వామివారే సిద్ధాంతిగారి శరీరమందు ప్రవేశించి దీనిని వ్రాయించినట్లు తెలుస్తోంది.

సాధారణం. 9 వతరగతి వరకు చదివిన వారంటి. ఈ గ్రంథం వారికి ఏమేంటి?
అను. శంక తెలుగక మానదు. వాస్తవి. మరియు, (శ్రీ) గిర్మపూర్ణా విశ్వేశ్వర
అనుగ్రహమేతప్ప వేరు. కానే కాదు. అనాశ్యమైన విషయాలను సునాయాసం
చేసే విధంగా. జిజ్ఞాసువులకు మోక్షార్థులకు. అర్థమయ్యే రీతిలో
గ్రంథస్థంగా ఉన్న మరెన్నో విశేషాలను వ్రాశారు.

జన్మాంతరాలలో ఉన్న అనేక సందేహాలను నివృత్తి చేసి. అపోహలకు
తావులేని విధంగా. పంచీకరణ విధానము సృష్టి రహస్యాలు గాత్రి.
ఉపాసన వారి పత్నీ పుత్రుల విషయాలు పూర్వగ్రంథానికి ఏ విధమైన
వైరుధ్యము తెలుగతుంగా (శ్రీ) సాయి వారు సిద్ధాంతి గారి కరకమలముల పై
వెలువడుట. ఇది. నిత్య పారాయణ గ్రంథంగా ఉండుట. ఎంతో మహదావకాశ
దైవం అనుగ్రహించిన గురువు రక్షించగలడని. గురువు ఆగ్రహించిన దైవము
కూడా రక్షింపలేడని పెద్దల వాక్యము, (శ్రీ) సిద్ధాంతి గారికి గురు కటాక్షము
సంపూర్ణంగా ఉంటుందనుటకు; కలౌ పంచ సహస్రాణి గతాయితా
వర్ష సంతరః ఇదే. విశ్వబ్రహ్మ శాప విమోచన కాలం ఆగమనమని వాళ్ళ.
(శ్రీ) సనారీ గురు సార్వభౌములు (శ్రీ) సిద్ధాంతి గారికి తన మార్గ
దర్శనం చేయగలరని ఎంచి. వారిచే ఈ గ్రంథ రచన గావించుమని స్ఫురణ నొసగి
భావన — ఇలాంటి కృషి సల్పి. అజ్ఞాతంగా ఉన్న సనారీ భక్తులకు తెలియచేయు
జ్ఞాన కాంతి అందించిన. (శ్రీ)మతి సుగంధం సాయిబాబా గార్కి
స్వామీజీ గారికి. ఆయురారోగ్య భోగ, భాగ్యములు ప్రసాదించాలని.
ఇలాంటి ఉద్గ్రంథానికి గ్రంథ సహాయము చేసిన వారికి ఉపకారం చేసిన
వారలకు కూడా. (శ్రీ) స్వామి వారి కటాక్షం కలగాలని. అలాగే. ఇటువంటి
ఉత్తమ గ్రంథాలు సిద్ధాంతిగారి కలముల ద్వారా వెలువడాలని. వారికి
ఆ శక్తి యుక్తులను. భగవానుడు ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

అట్టి ఈ గ్రంథం పఠించిన వారికి.

ఇహ జన్మ. పరజన్మ కర్మ బంధములు తప్పక తొలగ గలవని. ఇహమందు
సకలైశ్వర్యములు పరమున మోక్షమును పొందగలరు.

ఇట్లు
(శ్రీ) ఆదిశంకరాచార్య వేద ధర్మ పీఠము
వ్యవస్థాపక చైర్మన్.
ప. రంగస్వామి కోటాచార్య గురుజీ.
4/1/15.



శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ విరాట్ విశ్వకర్మ భగవాన్ జయంతి మహోత్సవ సందర్భమున
మాగురువుగార్కి **-: సన్మాన అభినందన పత్రము :-**

సౌగంధగృహనామ సాయి వ్యవహార నామ- సశాస్త్ర సంగీత కళోద్ధామ
సౌశీల్యగుణాబ్ధిసోమ మీకు కలవు సులోచనములు-ఆ వెనుక త్రిలోచనములు-బద్ధాబద్ధ నిర్ణయాలోచనలు, సర్వజనసుఖాశీర్వచనములు మీకు కలదు సర్వులకు శాస్త్రబోధనా పేక్ష-పాండితీ ప్రతిభా తితీక్ష ధనసంపాదనయందుపేక్ష జ్ఞానవైరాగ్యముల యందు దీక్ష-సనారీ పదపీఠమందు శిరస్సు-పరమపదసోపానమందు తరస్సు-తర్క-వితర్క జ్ఞానపాండితీ తపస్సు-నిత్యనూతన సంస్కార తరస్సు- స్వర్ణకళాప్రవీణా మీకు సనారీ విశ్వనాధ గురువరేణ్యుని యందు నిర్మలభక్తి- సదసద్విశ్వనాథశిష్యరేణువుయందు ప్రేమానురక్తి -శ్రీసత్యనారాయణపుర నివాసికి-శ్రీసాయిజ్ఞానగృహవాసికి- సత్యభాషికి-నిత్య గురుపూజా నివేశికి- శ్రీగంధం కుంకుమ విభూతిరేఖావిభూషికి- **స్వర్ణ కంకణ సన్మాన శుభవేళ**-అలౌకిక విద్యల పునశ్చరణకిది తరుణము.శ్రావ్యకంఠస్వరమొక వరము- శ్రద్ధాభక్తులొకవరము-సుగుణములొక వరము-గురు సేవా సిద్ధాంత మింకొకవర్గము- మాన్యుడగు ఈతని ఇచ్ఛపరమపదము -మంత్రోచ్చారణము ఒక ఘనము-మౌనధ్యానమొకఘనము -నిత్యదేవతార్చన మరియొక ఘనము- బాహ్యాంతరార్థమధిక ఘనము-గురుపూజా విధానమొక విద్యుక్రియ- నిత్య గురుపూజా మహత్వ ప్రచారమొక సత్క్రియ-అక్షత కుంకుమాద్యమోఘ పూజావిధి-అక్షయ వరమంత్రవేది-ఆద్యాత్మికవాది-అతడొక దోష భేది- సర్వజనసుఖజీవనార్థమై -ఈతడునేర్చె వాస్తుకళ- సర్వార్థసార సంగ్రహమెరిగి నడుచునెల్లవేళల-శాస్త్రమర్మమెరిగి చేయుగృహ మరమ్మత్తు - మర్మమేమియు లేని మార్గంబు చెప్పు-పూజావిధిని చెప్పు-పూజ చేయించి వచ్చు- పూజల ఫలము కోరి- అన్యులెరుగని వాస్తునతడు కూర్చెమాన్యులెరుగని మంత్ర మతడు నేర్చె-కర్మల తొలగించుక్రియల తరశిచెప్పుకర్మసాక్షిరీతిని కలియదిరుగు-గ్రహగమన గతిఫలముల గుర్తెరిగి ఈతడు జ్యోతిషశాస్త్ర విజ్ఞానజ్యోతియయ్యె-అనేక జ్యోతిషాగ్ర గ్రంధపఠనానుభవశాలియయ్యె-శాస్త్ర పంచాంగ విద్యల ప్రావీణ్యుడయ్యె- భవిష్యజనజీవన చక్రనిర్మాణ శిల్పియయ్యె- జనజాతక పరిశీలనాశీలియయ్యె-యంత్ర మంత్ర తంత్ర నిర్మాణకళాభినివేశియయ్యె- కాలసర్ప ప్రదోష పూజలెరుగు-కాలరీతినెరుగు- సుముహూర్తము లెరుగు- శుభహోర లెరుగు- సులభదోష పరిహారమ్ములెరుగు-సూర్యాది నవగ్రహశాంతు లెరుగు- సకల పరిహారములెరుగు- ముక్తి నెరుగు-యుక్తినెరుగు- గురుభక్తినెరుగు-కాలగమన మెరుగు- కాలపరిసమాప్తినెరుగు-సాధుమూర్తియై జనసంఘముల కూర్చి సుజ్ఞానబోధచేయు-సర్వులకు సనారీబాబాయై కానుపించుయోగమెరుగు- భోగమెరుగు- ఆనందయోగమెరుగు-ఆత్మజ్ఞానమెరుగు-యిహపరములసాధించు విద్యలెరుగు-ఈతడెరుగకగల వారినెల్ల నెరుగు.

**ప్రియ శిష్యుడు గెద్దం విశ్వనాథ్**

## మా గురువు గారు పూజించు
## పరమేశ్వరావతారులగు సనారీ వారు ఎట్టి వారనిన

చం॥ కరుణకుసాటి లేదు సరిగావగ మేటి జగంబులన్నియున్
వరదుడ వీవెగావే విధిగీయు విధాతయు నీవె ధాతయున్
మరుతము భూమినగ్ని జలమాకసమాదిగ తారలన్నియున్
కవనము నాదు గానము సుయానము సంగమయవ్వనాదులున్

చం॥ ఫలముల నీవు, సర్వవిధరుచులన్, పలురూపము రంగులన్నిటన్
సలిలమునీవు, సర్వవిదతరులన్, పలుగుల్మలతా వితానమున్
హలమున నీవు సర్వవిధ బీజములందును నీవె హాలియున్
కలలను నీవు, నాదుమది నీవు మహా శివ నీవె సర్వమున్

చం॥ ఆదికనాదికిన్ విలయవేదికి శూలికి కారణాదికన్
భూదికపాలికిన్ సకల లోక సుపాలికి వారాణాసికిన్
వేదనివేదికిన్ విమల సాదుకి పాపవిభూషధారికిన్
సాధన పూజలన్ సిరుల పారధనాది సుభోగభాతికిన్

**అట్టి పరమేశ్వరుడు ఉగ్రుడై శివతాండవము చేయునపుడు**

ఆడెనటరాట్-మోహోన్మార్గవిభుగ్న రసరాట్
కవిగాయకనటవైతాళికసకల చరాఽచర-జగత్ భూత సృజనవిరాట్
విఘూతపదతాడనోద్భూత ప్రళయ ఫెళ ఫెళా ర్భటుల
ఉల్లోలవిచల సంచలనాట్యకరధ్వయ ధరధమరుక భీకరధ్వనుల్
ఉగ్రభయానక దహత్ నేత్ర విషాగ్ని జ్వాలా ఽజాల జ్వలితకీల భీస్పృతుల్
భయద భీభత్సరసోజ్జృంభ, దశత్ సహస్ర పణిఫణవిషాగ్ర దంష్ట్ర భుజంగ భూశృతుల్
విచ్ఛేదవిహతో చ్ఛేదాఽ గ్రత్రిశూలాస్త్ర ఖ సఖసాస్రవమ్ముల ఖేస్పృతుల్
ఉద్రవ్తోల్లీఢఖడ్గ మారణఖేలారుధిరోద్వేలఘోశృతుల్
నిఖల జగత్ భీతాత్తగాద్గ దోల్లాపజన సంహారాహార కపాలహారసీస్ శృతుల్
ఆడె తాండవమాడెవిభుడు -కైలాసగిరి ప్రభుడు
శివుడు అనంతలయుడు - ఆడె తాండవమాడెఅర్చి
విలయతాండవ ఉదర్శిర్చి - సమదర్శన చక్రవర్తి
శవభస్మవిలేపగాత్రి - సకల భువనలయమూర్తి
నీకిది వందనం - స్తుతవితతిహృదిస్పందనం

ఇట్లు ప్రియశిష్యుడు
సంస్కృతాంధ్ర భాషాప్రవీణః బ్రహ్మశ్రీ గడ్డెంవిశ్వనాథ్(ఆసుకవి)



## మెక్షమార్గం కలిగించు పరబ్రహ్మస్థాన నిర్ణయము

మహనీయులు మహర్షులు నగు శుకయోగి,వశిష్ఠ,శమంతక, కశ్యప, భరద్వాజ, గౌతమ, గాంగేయ, పరాశర, వాల్మీక, జనకముని, జనమేజయ, వైశంపాయనుడు, శాండిల్య, మార్కండేయ, సూతుడు, శవనకాదులు, నారద, మాతంగ, విశ్వామిత్ర, అగస్తేయ, ఆత్రేయ, ఋష్యశృంగ, భీష్మ,ధర్మరాజు మొదలగు మహాయోగులు **భృకుటి**ని మోక్షస్థానముగా నిశ్చయించి, నమ్మిధ్యానించిన పరబ్రహ్మస్థానం, దేహమందలి ద్విదళపద్మమందు హంస రూపమై ప్రకాశిస్తూ లీలా రూపవినోదుడై, జ్యోతిరూపమై సర్వజీవులయందు నేత్రరూపమై సాక్షిగా చూస్తున్నాడు. **"పరమాత్మ"** ఈ చూపే సుషుమ్న బ్రహ్మరంధ్రమిది నిజం, దేహమందు నేత్రరూపమై జ్యోతిర్మయుడై సూక్ష్మరూపమై అఖండ స్వరూపమై సర్వేశ్వరుడు మెరుపై తళుక్కున వెలుగుచూయున్నాడు. అని వేద ప్రమాణం దేహమందు నేత్రమై త్రికూటస్థానమున బ్రహ్మం వెలుగుచూయున్నది. దీనికి వివరము "కన్ను" కన్నులందు గల నలుపువర్ణం ప్రకృతి భావంగల జీవుడనిపించుచున్నది. కన్నుహంసమార్గమై దృష్టిమధ్యను విరాట్ పురుషుని స్థానమై యున్నది. కంటిపాపమధ్యనున్నవారు పరమస్వరాట్, కంటిలోపల తెలుపును తెలిపేస్వరూపము ఈశ్వరుడు ఈ తెలుపే గంగానది,ఇచట తామసహంకారముండును. యిదియే మకారమాత్రుక యిచట ఈశ్వరుడును **క్రియాశక్తి** యుందురు. యిదియే లయకర్త శివపథము, కన్నులందుగల నలుపులో గల నీలివర్ణం విష్ణుస్వరూపం అదియే అగ్ని మండలం, ఆనీలి వర్ణమే యమునానది యిచట సాత్వికహంకారముండును. యిచట ఉకారమాత్రుక యున్నది.యిక్కడ విష్ణువు **జ్ఞానశక్తి** అధిపతులైయున్నారు. వీరికి హిరణ్యగర్భుడనిపేరుగలదు. యితడు పోషణకర్త విష్ణుపథం.యిరు నేత్రములందలి ఎరుపు బ్రహ్మస్వరూపం, అదియే సూర్యమండలం, అదే బ్రహ్మతేజమైన బంగారు వర్ణం యిచట రాజసహంకారమాతృకయున్నది. యిచట **యిఛ్ఛాశక్తి** బ్రహ్మఅధిపతులై యున్నారు. యితడే సృజనకర్త . యిదే బ్రహ్మపథం నేత్రములో తెలుపులో నలుపు,నలుపులో నీలివర్ణం నీలివర్ణంలోగల చుక్కనడుమను పీతవర్ణమై పాపవలే లీలారూపమై యున్నది. ఆ పాపే బ్రహ్మం కంటిపాపే పరమాత్మ ఆ పాపే ఆత్మ. యిదే పరంజ్యోతి,ఈ పాపే పరమేశ్వరుడు, యిదే యాగంటిలింగడు. ఈపాపే వైకుంఠము కైలాసము,కంటిదృష్టే బ్రహ్మ రంధ్రము యిదే దేహమందలి దశమ రంధ్రము యిదే బ్రహ్మనాడి, యిదే సుషుమ్న యిదే ముక్తి ద్వారము, యిదే ముక్తి కాంతస్థలము యిదే చతుశృంగాటకం, యిదే త్రికూటస్థలం, యిదే మేరుశిఖరం, యిదే కుండలిని,యిదే కర్ణాంతరము యిదే చిన్మయ పాత్ర యిదే అగ్ని మండలం, యిదే సహస్రారము దీనినే అష్టదళము, ద్విదళమందురు. యిదేనాదబిందు కళావాసము, యిదే పరంజ్యోతి, యిదే నలుత్రోవల నడుమయున్నా, యిదే కొల్లాట మండలం, యిదే ముమ్మూర్తులనిన్నీ, దీనినే రమాకాంతస్థలమనీ, సోమసూత్రమనిన్నీ శిఖాయమధ్య మార్గమనిన్నీ, యిదే ఓంకారమని, దీనినే నీలతోయద మధ్యస్థమనిన్నీ, పశ్చిమమార్గమనీ, మోక్షద్వారమని దీనినే వినీలమని ఉదయాద్రి అనీ,నాశికాగ్రమని భూమధ్యమనీ తూర్పుబయలు అనీ, దృక్కుఅనీ దృశ్యమనీ, పరమహంసయనీ, శాశ్వతమనీ, పరమపదమనీ, ఐక్యస్థలమని, జీవన్ముక్తిఅనిన్నీ, జీవరహితమై పునరావృత్తి లేదు గనుక యిదే రాజయోగసిధ్ధాంతం దీనిని నమ్మి మనసును దృష్టి యందు విలీనముచేసిన పాపరహితమై మోక్షము ప్రాప్తించును.

**-:యిదే బ్రహ్మ జ్ఞానులు తెలిపిన యోగమార్గము:-**

శుభాభినందనలు

సనారీ పీఠాధిపతులు, సనారీ ప్రచారకులు, శాక్తేయోపాసకులు, వాస్తు సిద్ధాన్తి, స్వర్ణశిల్పి, ఉత్తమనటుడు - అయిన బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాన్తి గారి షష్టిపూర్తి మహోత్సవం - విజయవాడ శ్రీ కామాక్షి ఏకాంబరేశ్వర కల్యాణ మండపంలో 16-3-2007 సోమవారం నాడు వైదిక ఆగమ శాస్త్ర నియమానుసారం జరగటం అస్మదాదులకు మహానందకారణం.

ఒక అరువది సంవత్సరాలు ఆలస్యంగా జరుగుతున్న శాస్త్రోక్తంగా ఉగ్రరథశాంతి పూజా కార్యక్రమ సహితంగా జరగటం ముదావహం.

'సుగంధ' మనే ఇంటిపేరే మధురపరిమళాలవారుల స్ఫురింపజేస్తుంది. శ్రీ సాయిబాబాచార్యుల పితరులు శ్రీ సుగంధం వెంకటేశ్వర్లుగారు, శ్రీమతి సావిత్రమ్మగారు. వీరు 1943లో కన్న ఈ కుమారుడు స్వర్ణశిల్పంలో [illegible] రత్నప్రశక్తి, కళాత్మకంగా నిర్మించే [illegible] కళలలో కూడా నైపుణ్యం గడించాడు. అంతే కాదు; వాస్తు జ్యోతిష విద్యలలో కూడా ప్రావీణ్యం సాధించాడు. అంతవరకే కాదు - ఈన [illegible] నాటకరంగంలో కూడా ప్రవేశించి - విశిష్టమైన 'రావణబ్రహ్మ' పాత్రను పోషించాడు. దుర్యోధనుడు, భవానీశంకరుడు మొదలైన పాత్రలు కూడా నిర్వహించి రసజ్ఞప్రేక్షకుల అభినందనలందుకొన్నాడు. చిత్రరంగంలో కూడా ప్రవేశించి ఉండేవాడే కాని పరిస్థితులు అనుకూలించక అనారోగ్యాది కారణాలవల్ల విజయవాడలో ఇక్కడే స్థిరపడినాడు.

శ్రీ సాయిబాబా గారి శ్రీమతి విమలాదేవి గారు ఏలూరు వాస్తవ్యులైన శ్రీ [illegible] బ్రహ్మంగారి తృతీయపుత్రిక.

శ్రీ సాయిబాబాచార్య / విమలాదేవి దంపతులు దివ్యానుభూతులతో రాజయోగ అభ్యాసకు సాంబశివానందగారి వద్ద సనారీ ఉపదేశం పొంది - స్వగృహంలోనే సనారీ పీఠస్థాపన చేసి నిత్యానుష్ఠాన నియమాలతో అనేక భక్తులకు మార్గదర్శకులు కావటం అభినందనీయమైన అంశం.

అంతే కాదు; నాలుగు సంవత్సరాలుగా ఘంటసాల సంగీత కళాశాలలో వీణావాదనం కూడా నేర్చుకొని చదువుల తల్లి సరస్వతీదేవి పలికించే కచ్ఛపీ వీణానాదాన్ని వినిపించటం శ్రీ సాయిబాబాచార్య భక్తిశ్రద్ధా విశ్వాసాలకి విశిష్ట నిదర్శనం.

అష్టజన్మ వివాహాది బాధ్యతలు సంతృప్తిగా నెరవేర్చుకొని రాజయోగ మార్గంలో వానప్రస్థాశ్రమంలో ఉంటూ "శ్రీ త్రిశక్తి సహిత విశ్వనాథ దేవాలయ" నిర్మాణ సంకల్పంతో అహర్నిశలు కృషి చేస్తున్న - బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాంతి గారు ఇంకా ఇంకా సప్తతి పూర్తి, అశీతిపూర్తి, సహస్రచంద్రదర్శనోత్సవాదులు నిర్విఘ్నంగా నిర్వహించుకొంటారు.

ఉత్తమదాతలు భక్తిభావంతో విరాళాలు సమర్పించి శ్రీ సాయిబాబాచార్య సంకల్ప సిద్ధికి తప్పక తోడ్పడ గలరు.

శుభమ్ భూయాత్!

ఇట్లు
వాసిరి వెంకటలక్ష్మీనరసింహారావు
13-3-2007

**డా॥ వి.వి. ఎల్. నరసింహారావు గారు జీవించి ఉంటే ఈ నా కృషికి అభినందించేవారు (గ్రంథకర్త)**



## శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విశ్వనాథాలయ

నిర్మాణ సమయము నుండి నేటి వరకూ జరుగు ప్రతీకార్యమునకు **1. బంగారు మధుగణేష్, 2. కొండూరు ప్రసాదాచారి 3. కంటే శివకుమార్ 4. పాలతీర్థపు శ్రీనివాసాచార్యులు** వీరు నాలుగు స్థంబాలుగా నిలబడి ఇప్పటివరకు ప్రతికార్యక్రమమును జరుపుచూ ప్రతీ **మాస శివరాత్రి**కి అన్నాభిషేక కార్యక్రమమునకు కంటే శివకుమార్ పాలతీర్థపు శ్రీనివాసాచారి 1000 రూపాయలు ఇస్తుండగా, కొండూరు కమలా ప్రసాదాచారి తన శక్తి మీర ఆర్థిక సహాయము చేస్తూ, నలుగురితో చేయిస్తూ సహకరిస్తుండగా మా పుత్రులు శ్రీనివాస్ & బ్రదర్స్ భోజన కార్యక్రమాన్ని శివ ప్రసాద్ పూజా కార్యక్రమానికి నాకు సహకరిస్తూ అన్ని కార్యక్రమములు దిగ్విజయముగా చేయిస్తున్నారు. కొండూరు ప్రసాదాచారి ప్రస్తుతము హైదరాబాదులోని ప్రముఖులను, సనారీ భక్తులను కలసి దేవాలయ కార్యక్రమాలను అచట కూడా నిర్వహిస్తూ సనారీ వారి దేవాలయ ప్రచార అభివృద్ధికి సహకరించుచున్నారు. ఇలాగే అన్ని పట్టణములందు ఆధ్యాత్మిక పరులు సనారీ వారి ప్రచారకార్యక్రమాలలో పాల్గొని విస్తృతంగా ప్రచారం గావించి సనారీ వారి కృపకు పాత్రులై మానవ జన్మను సార్థక్యము చేసుకొని చరితార్థులు కాగలరని ఆశిస్తున్న శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్ర లింగ సహిత సనారీ విశ్వనాథాలయ నిర్మాణాధ్యక్షులు

**బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబా చార్యస్వామీజీ**

మేము రచించిన శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాదగ్రంథార్థములు సనారీ విశ్వేశ్వర సంవాదములోని వరుస క్రమముతో వివరణ వ్రాయుట జరిగినది. దీనిని చదువరులు గ్రహించి ఇందలి భావములు పూర్తిగా అవగాహన చేసుకొని మీకు కావలసిన విషయాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించి దైవ కృపచే సత్ఫలితములను పొందగలరని ఆశిస్తూ ఇందలి దోషములు మాకు తెలిపిన మలి ముద్రణలో సవరింతునని సవినయముగా మనవి చేస్తున్నాము **ఈ గ్రంథకర్త.**

మాకు వాస్తు జ్యోతిష్య ప్రోత్సాహకులు
మా బావగారు కీ॥శే॥
**బ్రహ్మశ్రీ అనుపోజు జేజిబాబు,**
**ధర్మపత్ని వరమల్లికాంబ**
(ఆనందాఆర్ట్స్),
విజయవాడ-1

**శ్రీ గురుభ్యోం నమః**

## దేవు గిరిరాజ భాగవతార్ వ్రాసిన పద్యములు

1. ఘన విశ్వకర్మ కులజుడు - ప్రణవోపాసకుడు దోషరహితుడు, ధీరుం
డనుపమ గంభీర గుణుడు - కనగా మన సాయిబాబా కవిహితుడుర్విన్॥
2. స్వకుల గౌరవమ్ము శాశ్వతముగానిల్ప - పూర్వగ్రంథములు ప్రోవుచేసి
తగినధనమొసంగి ధాతృత్వమున గ్రంథ-రచనసేయ కోరెరహినినన్ను॥
3. వాగీశ్వర కరుణముతో- కాగలనట చక్రవర్తి గంభీరముగా
రాగములన్ పదగుంభన-ధీగతివినిపింపగల్లు తేజసుడితడే ॥
4. మరుగున పడియున్న మన విశ్వకర్మకుల-చరితల రమ్య గాథ
లాంధ్రభాషా వ్రాసి యనుపమానందము-కూర్చుడీదయకవికోవిదవడి ॥
5. విశ్వకర్మకుల పవిత్రత చాటు-చరిత్రవ్రాసి మీరు మిత్రతగొని
మమ్ము తృప్తిపరుచుడిమ్మహి కవివర్య -యనియె సాయిబాబా అపుడునన్ను॥
6. సీ॥ మయసభేకపాత్రను సమానసమాన-కళాధురీణుడై హోయలును హావభావము
లనున్నత పాత్ర విచిత్ర పోషణన్ భయమును-వీడి సల్పుచు శభాసనమెచ్చగ
నటించు నేర్పున వ్యయమృదుభావ-సంపుటి మహా శివుడిచ్చెను సాయిబాబాకే॥
7. గీ॥ అనుపమ నటనాకౌశలమున - మయసభ ఏకపాత్ర భువినపురూపం
బని జనులనగనటించును - అనల్పముగ సాయిబాబా అద్భుతగతులన్ ॥
8. చిరునగవుదోపబలుకును - నిరతము పండితుల యెడ వినిర్మలబుద్ధిన్
సరసమతిగౌరవించు-సుచరితుడీ సాయిబాబా జగతిభళీయనన్ ॥
9. సభికులుమెచ్చి భళీయన - విభిన్న పాత్రల ధరించి విద్వన్నుతుడై
యభిమాన నటకుడాయెన్ శుభచరితుడు-సాయిబాబా చూడ ధరిత్రిన్
10. రావణబ్రహ్మకు గల పరాక్రమము-మహిసుయోధనుఠీవి యనన్య దివ్య
నవ్య గంభీరగుణముల నటనయందు-పాత్రచిత్రీకరణ సాయిబాబా సొమ్ము॥
11. రహిసుగంధ వంశ రాకాశశాంకుడు-విమలాదేవి మనోహరుడ
మలిన గుణుడను పమ యశుడరిభీకరుండుత్తమ కళారాధకుడిల
క్షమాధనుడు సాయిబాబా-కవినుతుడరయన్॥
12. సీ॥ అన్నమాటయటన్నయసమాన భక్తితో - తలయొగ్గి దిరుగు సోదరులు వినయ
మతులు గంగాచారి మరియు బ్రహ్మాచార్య-లనువారలిర్వురును సమప్ర
జ్ఞ కులవృత్తినేర్చిన కోవిదులుగలుగ - నేకొరంతయులేక విశ్వమందు
సాయిబాబా నటన సాహిత్య సంగీత విద్యలందుత్తీర్ణులే గనంగ ॥
13. గీ॥ శ్రద్ధ యత్నించుహృదయ విశాలుడెన్న-వీరగురుదేవుడు విరాట్టు విశ్వకర్మ లీ
సుగంధ వంశీయుల కిష్ట సుఖము లిచ్చి గాపాడు గావుత నిచ్చదీర॥





## వాస్తు గురువు

కవిరాజు,

వాస్తు పండిత

వైద్య కళావిభూషణ

బ్రహ్మశ్రీ కీ॥శే॥

**అరసవల్లి కామాచార్యులు,**

మచిలీపట్నం,

## పెద్దలు చెప్పిన శుద్ధులు

1. పుణ్యానికి క్షేత్రం । రాగానికి గాత్రం । వివాహానికి సూత్రం । మానవునికి నేత్రం। జీవించుటకు।ఇవిముఖ్యం
2. పొలానికి గట్టు। కుండకి మట్టు। స్త్రీలకు బొట్టు। గురునిపాదము పట్టు। రక్షణకు ఇవి చాలా ముఖ్యం
3. వర్షానికి మబ్బు। స్నానానికి సబ్బు। సంభాషణకు క్లబ్బు। కార్యనిర్వహణకు కావాలి డబ్బు। తప్పనిసరిగా ఇవి ఉండాలి.
4. ఊరికి కరణం। పందిరికి తోరణం। పెండ్లికి పూర్ణం। వాదానికి కారణం। తప్పక ఉంటాయి.
5. రుచికి ఉప్పు। బ్రాహ్మణునికి పప్పు-యింటికి కప్పు। స్త్రీలకు కొప్పు। యివి ఉంటేనే రాణిస్తాయి
6. వేటగానికి బళ్ళెం । గుర్రానికి కళ్ళెం। తలుపుకు గొళ్ళెం। పురుషునికి పెళ్ళాం। చాలా అవసరము.
7. వ్యాపారానికి మదుపు। ఆడవారికి అదుపు। చంటిపిల్లలకు కుదుపు । సంసారానికి పొదుపు। తప్పక ఉండాలి.
8. మానవులకు పొగడింపు। బట్టలకు జాడింపు। కూరలకు తాలింపు। చేతులకు దానము చేయు ఆడింపు। ఇవిఉంటే బాగుంటాయి.
9. పురోహితులకు నత్తి। వేశ్యలకు భక్తి। అధములకు శక్తి। యువకులకు విరక్తి। ఇవి ఉంటే జీవితం నిష్ప్రయోజనము



కళారంగానికి ప్రోత్సహించిన బావగారు, అనుపోజు ఆనంద్, బాల్యమిత్రుడు యమ్.యస్. ప్రకాష్

## నాటకరంగము

వేము 1970 లో ప్రముఖ పౌరాణిక రచయిత నాగశ్రీగారు వ్రాసిన **"విజయ కంకణం"** రామ రావణసంగ్రామం అనే స్టేజీ నాటక వ్రాత ప్రతిని 5 సంవత్సరములు ఆంధ్రప్రదేశ్‌లో ప్రదర్శనలకు అధికారము పొంది **జగజ్యోతి నాట్యమండలి** పేరుతో నాటక సమాజాన్ని ఏర్పరిచి నిర్వహిస్తూ రాష్ట్రములో ప్రదర్శనలు విరివిగా యిస్తూ ప్రజాదరణ పొందుచు 1974 లో హనుమంత రాయ గ్రంథాలయములో నాటక ప్రదర్శనానంతరము వేదికపై కవిగార్ని పూలమాలతో సత్కరించి పారితోషకం ఇచ్చి దుశ్శాలువతో కప్పినటప్పటి దృశ్యం.



నాటకరంగ సభ్యులు కవి నాగశ్రీ, మిత్రుడు వేముల మధుసూదనరావుతో






గ్రంధకర్త దంపతులు
శ్రీవీరబ్రహ్మేంద్ర మఠాధిపతి **శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వామి**
వారితో దేవు గిరిరాజయాచార్య భాగవతార్ & గ్రంధకర్త



గ్రంధకర్త - శ్రీశ్రీశ్రీ సనారీపీఠం ముందు
బ్ర॥ **సాయిబాబాచార్య** (సనారీ శిష్య రేణువు)



పీఠాధిపతుల 50వ కళ్యాణ దినోత్సవ సందర్భంగా
పట్టు వస్త్రములతో సత్కరిస్తున్న
గ్రంధకర్త ప్రధమ పుత్రిక చి॥ల॥సౌ॥ అన్నపూర్ణమ్మ,
అల్లుడు చి॥ కొండూరు కమలాప్రసాదాచారి



పీఠాధిపతుల 50వ కళ్యాణ దినోత్సవ సందర్భంగా
పట్టు వస్త్రములతో సత్కరిస్తున్న
గ్రంధకర్త ద్వితీయ పుత్రిక చి॥ల॥సౌ॥ దుర్గాంబ,(సుమంగళి)
అల్లుడు చి॥ కంటెశివకుమార్



# శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్ధములు

## అవతారిక ఆరంభము

(1) ఎ) శ్రీ విద్యా=లక్ష్మి, సరస్వతులను। పరవిశ్వకర్మయతి = పరలోకానికి అధిపతి యగు విశ్వకర్మయతీశ్వరుని। సంసిద్ధప్రచారాదులన్= ప్రచారంచేయుటకు యిష్టమై సిద్ధపడి। సేవోపాధివశంబునై=వారిసేవజేసి, ఉపాదిపొందుచు। శృతివచో సిద్ధాంత= వేదములందు తెల్పిన ఆ సిద్ధాంతములను విని। శాస్త్రములా భావోపాంగ పురాణ హాసములు = శాస్త్రములు పురాణ యితి హాసంబులు। నిన్ భావింపగానిల్చు= వినినినుతలచుచూ। శ్రీసావిత్రీ తనువొందియున్= శుభకరము కీర్తియుగల శరీరముగల్గి। దశదిశాచ్ఛాఉదంబులున్= పదిదిశలలోనిండి। చంద్రుడున్ శ్రీవెల్గొందుచు= చల్లని చంద్రకాంతిగల కీర్తితో। భాస్కరాగ్నులు వసించున్ కాల దీర్ఘంబునై= సూర్యాగ్నులున్నట్టి ఎల్లకాలములందును కీర్తింపబడుదురు॥

**1. శ్రీ విద్య = యిహలోక సంబంధ సకలకోర్కెలు తీర్చునది.**

**2.పరవిద్య = సృష్టికర్తసన్నిధిలో పరలోక సంబంధ శాశ్వతమహదానందమునిచ్చునది.**

(1) బి) వేదములు ఆగమశాస్త్రంబులు, పురాణములు, సిద్ధాంతశాస్త్రములయందు సృష్టి స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాది, పంచకృత్యం తర్గతమైన, శ్రీ విద్యాపరుడగు, విశ్వకర్మ పరమేశ్వరుని గూర్చి స్థుతించి, వర్నించి, ప్రార్ధించబడుచున్నవో, అట్టిపర బ్రహ్మయైన విశ్వకర్మను సేవించి, తరింప చేయు తత్వ జ్ఞానముతో ప్రకాశించునట్టి ఈ గ్రంధము దశదిశలయందువ్యాపించి సూర్య, చంద్ర అగ్నులున్నంతకాలము వర్ధిల్లును.

తా॥ఎ) లక్ష్మి సరస్వతులను, పరలోకానికి అధిపతియగు విశ్వకర్మ భగవానిని సేవించు తూ, ప్రచారము చేయుటకు సిద్ధపడి, త్రికరణశుద్ధిగా వారి సేవ చేయుచూ ఉపాది పొందవచ్చునని, వేదములు, శాస్త్రములు, పురాణములు, యితిహాసముల వలన తెలుసుకుని, ఆచరించి, సిరిసంపదలు కీర్తియుగల పరిశుద్ధమగు శరీరముతో, అష్టదిశలు, భూమి, ఆకాశమందు చల్లని చంద్రకాంతి గలిగిఅట్టివారు, సూర్యుడు అగ్ని ఉన్నంత కాలము కీర్తింపబడుచుందురు.

(2) ఎ) మమ్ము సనారీశ్వర గురు = మమ్మల్ని సనారీశ్వర సద్గురువులు। యిమ్మగ కామ్యముల నొసగి = యుక్తమగు కొర్కెలను తీర్చి। యిల బ్రోచుట= ఈ భువిపై రక్షించి కాపాడుట। సిద్ధమ్మని నమ్మిన మనమున = తథ్యమని నమ్మిన మనసుతో । సమ్మతిగా వేడి మీకు సాగిలబడితిన్. = యిష్ట పడివేడుకుని సనారీ వారికి సాష్టాంగ

దండ ప్రమాణము చేసితిని॥

తా॥మమ్మల్ని సనారీశ్వర సద్గురువులు,(యుక్తమగు) న్యాయమగు మా కోర్కెలన్నీ తీర్చి, ఈ భూమి మీద రక్షించి కాపాడుట, సత్యమని నమ్మిన మనసుతో, యిష్టపడి వేడుకుని సనారీవారికి సాష్టాంగ నమస్కారము చేసితిని.

(2) బి) అట్టి పరమపవిత్ర గ్రంధమందలి అర్ధములు మాకు సంపూర్ణముగా అవగాహన చేసి న్యాయము, ధర్మమగు మా కోర్కెలను తప్పకతీర్చుదురను నమ్మికతో సనారీవిశ్వేశ్వర సద్గురు దేవుల పాదపద్మములకు సాష్టాంగ నమస్కారములు చేయు చున్నాను.

## అవతారిక

1. శ్రీ ధన్యులైన గౌరీనాధుడు = సిరిసంపదలు గల్గి ధన్యులైన గౌరీదేవి, ఆమె భర్త। వీరాగ్రయోగనామాచార్యులు=ప్రభావముగల గొప్ప యోగములు చేసిన పేరుగల ఆచార్యుడు (వీరన్న పుణ్యదంపతులు)। ఈ ధన్యునిగనియె= ఈ కారణాచార్యుడగు మహనీయుని కన్నారు। దేశికనాధుడు= జగద్గురువైనట్టి । సింహాద్రి విశ్వనాధాచారిన్.

తా॥ సిరిసంపదలుగల్గి పుణ్యవంతులైన గౌరీదేవి, ప్రభావముగల గొప్ప యోగములు చేసిన పేరుగలట్టి వీరాచార్యులువారు, మహాపుణ్య వంతుడగు, జగద్గురువులైన సింహాద్రి విశ్వనాధాచారి గార్ని కన్నారు.॥

(2) ధాత్రియు భూతము లైదును మాత్రము = భూమి, ఆకాశము, గాలి, నీరు, నిప్పు ఈ ఐదునూ । నావలనుగాక=నాచేగాక। మా జనకునిచే = మా తండ్రి విశ్వకర్మచే। గాత్రంబులు గలుగుచు = స్థూలరూపములు గలిగి । బహు గాత్రాధారముల నుండె = చాలా ఆకారములు ఆధారములతో। గడికదలకయున్ = వాటి వాటి హద్దులు దాటకయున్నవి।

తా॥ భూమితో సహా ఐదు భూతములు. నాచేగాకుండా మా జనకుడైన విరాట్ విశ్వకర్మ భగవాన్‌చే, సృష్టింపబడి ఆకారములు గలిగి, పిదప వివిధరూపులతో సత్యమే ఆధారముగా వాటి, వాటి హద్దులుదాటక యున్నవి.

(3) తక్కిన లోకవాసులగు = యితరలోకములలో నివసించు। ధాతయు= బ్రహ్మయు। విష్ణువు=విష్ణువు। రుద్రుడు=శివుడు। యింద్రుడున్= దేవేంద్రుడు। నిక్కముగాను భాస్కరుడు=యదార్ధముగా సూర్యుడు। నిర్జరలోక= దేవ లోకములో। సురారురగ్రులున్= దేవతలు గొప్పవారు। మిక్కిలిగాను మానవులు = ఎక్కువగా భూలోకమందలి మానవులు। మీనసమూహము = చేపజాతులన్నీ। పక్షులన్నియున్= పక్షిజాతులన్నీ। మక్కువగా మృగంబులును= ప్రేమతో చెలిమితో నుండు మృగములు (జంతువులు)।





మారుగణంబులు = వేరేరూపగు యితర సమూహములు। కీటఖేటముల్= పురుగులు, గడ్డిసంబంధమగు అన్ని పురుగులు।

తా॥ అట్టివిరాట్ విశ్వకర్మచే నియామకుడనై, పంచభూతాత్మకుడనై, విశ్వబ్రహ్మనై, చతుర్ధశభువనాత్మకుడనైయుండి యితర లోకములలో నివసించు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, యింద్ర, సూర్యులును, దేవలోకంలోని దేవతలు గొప్పవారునూ, భూలోకంలో నివసించుమానవులు, జంతువులు, చేపజాతులు, పక్షిజాతులు, మానవులతో స్నేహంగా నుండు జంతువులు వేరేరూపములతో నున్న యితర సమూహములు, పురుగులు, సూక్ష్మక్రిములు, యిట్టిరూపములు గలట్టి అన్నియూ।

(4) నానారూపములన్నియు= అనేక రూపములుగల శరీరాలు। గానాతను సంభవములు = శరీర సంబంధంతోనే పుట్టుచూ। గనుమను= చూచుటకు, చెప్పుటకు। చేపొద్భుతంబును గల్గి= తెలుసుకొనుట ఆశ్చర్యముగా ఉంటుంది। గా-నాధులపైని విశ్వకర్మయు నేనే= వీటిన్నిటి కంటే పై వాడనగు విశ్వకర్మ= విశ్వాన్ని సృష్టించినవాడను నేనే ॥

తా॥ అనేక రూపములుగల శరీరాలు, అన్నీశరీర సంబంధంతోనే పుట్టు చుండును, **"మను విశ్వకర్మయను నాచే పోషింపబడుచున్నవి"** యివి చూచుటకు చెప్పుటకు తెలుసుకొనుటకు ఆశ్చర్యంగాఉంటుంది. వీటన్నిటికన్నా పై వాడను,ఈ సమస్తచరాచరజీవులను, అనేకకోటి బ్రహ్మాండాలను సృష్టించిన, విశ్వకర్మనునేనే నా యొక్క పంచ ముఖముల నుండి ఉద్భవించిన అయిదు వేదములచే నిర్దేశించబడిన 64 విద్యలు॥

(5) వేదాగమములు నిర్మిత = వేదములు, ఆగమ శాస్త్రములు నిర్మాణము। సాధారణ లోక సంఖ్య చౌప్రష్ఠి విధోపాదన విద్యలన్నియు= మానవలోకంలో 64 విద్యలు జీవనము కోసం ఉన్నవి। వాదంబులు= రసవాద విద్యలు। నాకు హస్తవాటంబాయెన్= నా చేతికి అనుకూలమైనవి.

తా॥ వేదములు ఆగమ శాస్త్రము లందలి విషయములు, 64 పోషణార్ధమగుకళల విద్యలన్నియూ, రసవాద ప్రక్రియలు నాకుచేతనయి యున్నది (నా వశమైనవి);

(6) ఆకాశమే నా భువనము = ఆకాశమే నా జగము (నా లోకము)నే కాకియునేను = నేను ఒక్కడనే। (సర్వసమర్ధుడను) శక్తి ఎడమనుగలిగెను= నా అర్ధాంగినా శరీరవామ భాగమున ఉన్నది। ఏకాలమందు నిలచెద = అన్ని కాలాలలోను భూతభవిష్యత్ వర్తకాలములందు ఉంటాను। నాకేకలిగుండు = నాకు కలదు। విశ్వనాధాఖ్యమున్= విశ్వనాధుడని పేరు (అనగా విశ్వానికి అధిపతియని)

తా॥ ఆకాశమే నాలోకము, నేను ఒక్కడినే, నా అర్ధ శరీరమగు ఎడమభాగమందు

నా అర్ధాంగియగు శక్తియున్నది, అన్ని యుగములందు నేను ఉంటాను, నాకు విశ్వ నాధుడని పేరు గలదు.

(7) నేను నిజంబు చెప్పితిని= నేను యదార్ధంచెప్పాను। నిశ్చయము= నిర్ణయము। ఈ పరతత్వ బోధయున్= పరలోకము చేరుటకుచేయు యోగ సాధనలు। దానవులు= రాక్షసులు। నిర్జరులు= దేవతలు। ఉదార మనుష్యులు= ఉదార స్వభావముగల మానవులు। సంయములు = హింసాదిపనులను వదిలిన వారు। దీని గ్రహించి =యిందలి విషయములుతెలుసుకుని। విశ్వమయ దేవునిగాంచు = విశ్వమంతా నిండిన పరమేశ్వరుని చూచుటకు। నిదానమార్గ సోపానములు= ఆదారిలో వరుసగా మెట్లనెక్కి। అన్నియూ తెలిసి= ఆక్రమములన్నియూ తెలుసుకుని। పావనమొందుటే = పరిశుద్ధులగుటే। గ్రంధ మెట్లనన్ = ఈ గ్రంధమందలి విషయములివి । గ్రంధమందున్న విషయములివి।

తా॥ నేను నిజమే చెప్పాను, సరియైనదీ గ్రంధమందలి పరతత్వబోధ, పరమాత్మలో చేరుటకు చెప్పిన యోగసాధనలు చేసి, రాక్షసులు, దేవతలు, ఉదార స్వభావము గల మానవులు, హింసాది పనులను వదిలిన శాంత స్వభావులు, ఈ విషయములు తెలుసు కుని, సిద్ధించుకొని సృష్టి అంతా నిండినట్టి విరాట్‌విశ్వకర్మ పరమాత్మను చూచుటకు ఆ మార్గములలో ప్రయాణించి, యోగ సాధనలుచేసి షట్ చక్రసంచారము చేసి, జన్మను తరింపజేసు కొనుటయే ఈ గ్రంధసారాంశము ఆ మార్గములెట్లనిన.

(8) ఒకటియు, రెండు, మూడు, పరవాటము గల = 1,2,3,వరుస క్రమముగా। నాల్గుభావముల్= నాలుగు సాధనా పద్ధతులను। సకలము బోధయౌనటుల = పరిపూర్ణముగా అర్ధమౌనటుల। సాక్ష్యము వేదము, శాస్త్రముల్ = వేదములు శాస్త్రములు ప్రమాణముగా। యొకయొకచోట = ఒక్కో దగ్గర। సంఖ్యగనుంచితి = వరుస క్రమముగా ఉంచాను। యిందులో నున్నయర్ధముల్= యిందులో గల అర్ధాలు। సుకముగ తెల్చినను = సులువుగా తెలుసుకుంటే । సుస్థిరసాధను పాధియౌగదా= చక్కగా నిలకడగా సాధనచేస్తే ధర్మచింతన కలుగుతుంది సుమా। జీవనోపాధికల్గుతుంది.

తా॥ 1-2-3 వరుసక్రమముగా స్థూల, సూక్ష్మ, కారణ, లింగదేహముల నాలుగింటినీ గ్రహించుటకు నాలుగు సాధనా పద్ధతులను పూర్తిగా అర్ధమయ్యే టట్లు వేదాలు, శాస్త్రాలు, సాక్షిగా ఒక్కోదగ్గర వరుస క్రమంగా ఉంచాను, యిందలి అర్ధాలుమీరు సులువుగా తెలుసుకుంటే, చిత్తశుద్ధిగా సాధనచేస్తే ధర్మచింతనతో యోగసిద్ధి అవుతుంది. జీవనోపాధి కల్గుతుంది. (పునరపి మరణం పునరపి జననాం) ఈ జన్మచక్రము నుండి తప్పించుకొను మంచి విధానము (జ్ఞానము)

(9) ఇందుగలపద సంఖ్యయు = ఈ గ్రంధంలో వరుసగా అద్యాయములలో తెల్పిన విషయములు, అందునగల కథల లెక్కలు= అందులోని కథల వరుస క్రమాన్ని। అధ్యాయములున్ = అధ్యాయముల। వరుసక్రమాన్ని। ముందుగ పీఠికలో =ముందు





విషయసూచికలో। నురువందగ = సులువుగా తెలియుటకు। కోరి వాటముగడితిన్ = కావాలని వ్రాసాను।

తా॥ ఈ గ్రంధంలో వరుసగా తెల్పిన విషయములు, అందులోని కథల వరుస క్రమాన్ని అధ్యాయముల వరుసను ముందు విషయసూచికలో, సులువుగా తెలుసు కొనుటకు కావాలని వ్రాసాను.

(10) అవతారికయు= గ్రంధారంభకారణము । వశిష్ఠాశ్రమవర్ణన= వశిష్ఠుని ఆశ్రమ తీరును। పార్వతితో ఋషి ప్రశ్న భావమందియ్య = పార్వతీదేవి ప్రశ్నలకు విశ్వేశ్వరుడు సమాధానము చెప్పుటయు। నాధుని యారాధనము = విశ్వేశ్వరునిపూజ। నిండుచేసిన స్తోత్రము = పరిపూర్ణమైన స్తుతి (పొగుడుట) । సేవగొనుట = శుశ్రూష స్వీకరించుట। పార్వతియడిగిన భావంబులను గల = పార్వతి అడిగిన ప్రశ్నలలోని అభిప్రాయము గల। భక్తి, కర్మయోగ = భక్తిచేచేయు యోగపద్ధతులు। బ్రహ్మతత్వ సాధనంబులు = బ్రహ్మము నంద్వైక్య మగు సాధనల ఉపాయములు। గ్రంధసాకల్యముగ = గ్రంధమందు పూర్తిగా। అనుభవంబైనవన్నియు = నా అనుభవంలోని విషయాలన్నింటినీ।అడ్డులేక = ఆటంకము లేకుండా । అరసిచెప్పుదు= గ్రహించి (తెలుసుకుని) చెబుతున్నాను। ఆనందమవని జనులు = సంతోషంతో భూమి మీద ప్రజలు । వినియు భోగింపవేడుక = అన్నీవిని అనుభవించి। విశ్వబ్రహ్మపదముచేరుట = విరాట్ స్వరూపములో కలియుటకు। భాగ్య సంభావ్యమిదియె = ఆ పుణ్యాన్ని పొందే మార్గ మిదియే.

తా॥ గ్రంధారంభానికి కారణము, వశిష్టునిఆశ్రమవర్ణన, పార్వతి ప్రశ్నలకు విశ్వనాధుడు సమాధానము చెప్పుట, విశ్వేశ్వరుని పూజా పద్ధతులు, పరి పూర్ణమైన స్తుతులు, సేవలను స్వీకరించుట, పార్వతి అడిగిన ప్రశ్నలలోని అభిప్రాయము, భక్తితో చేయు పద్ధతులు, బ్రహ్మతత్వ సాధనలు, బ్రహ్మంలో చేరు ఉపాయములు గ్రంధమందు పూర్తిగా, నా అనుభవములోని విషయాలన్నింటినీ నేను తెలుసుకుని, ఎలాంటిమర్మములు లేకుండావివరంగా చెబుతాను. వీటినిసంతోషంతో విని ఆచరించి అనుభవించి, విరాట్ పురుషుని లో కలిసి జన్మరాహిత్యము పొందు భాగ్యమిదియే

(11) భర్తకు పార్వతియొనర్చు బ్రస్తుతియును = పతిదేవునకు పార్వతి చేయు గొప్ప స్తోత్రమును కీర్తించుటయు। బ్రహ్మ సంయమవాస ప్రాబల్యముకు = విరాట్ స్వరూపునితో కలిసియుండు గొప్పతనమునకు। ఆసనారీశ్వరులకు = పార్వతితో కూడిన పరమేశ్వరునకు (అర్ధనారీశ్వరునకు) ఆ సంయమనుతి= యోగీశ్వరు డగు వశిష్ఠుడు స్తుతించుటయు। విశ్వనాధుని పార్వతి వినుతిదలప = విశ్వనాధునికి పార్వతిదేవి విన్నపములు చేయుట।

తా॥ పతియగు విశ్వనాధుని పార్వతిదేవి కీర్తించుటయు, సృష్టికర్తతో కలిసియుండు గొప్ప తనమును, శక్తికి అర్ధశరీరాన్నిచ్చిన పరమేశ్వరుని, యోగీశ్వరుడగు వశిష్ఠుడు కీర్తించుటయు, విశ్వనాధునికి పార్వతీదేవి విన్నపములుచేయుటయు.

(12) అవతారంబును = తన యొక్క జన్మరహస్యము। ఆ పతివ్రతకు = పతియందు అమితభక్తి గల యిల్లాలికి। మోక్షార్థంబు = జీవాత్మను పరమాత్మతో కలిపి మోక్షము పొందు పద్ధతులు। బోధించుటన్ = వివరంగా చెప్పుట। ధవుతో తత్వముఫృచ్ఛ చేయుటయు = పరమేష్ఠితో శరీర మందలి తత్వ విషయములు ప్రశ్నించుటయు । ఈ ధాత్రి జనసృష్టియున్ = ఈ భూమిపై జనులు పుట్టు క్రమమును। భవమున్‌కోరియు = సంసారము చేసిన। పిండ మౌటగతియున్ = ఎలా గర్భము వచ్చునో । ఆభావపంచీకృతమ్ = శరీరమందలి పంచ భూతముల పంపకము। ఏ విధంబాయెనో = ఎలాగయ్యెనో । సాంఖ్య దేవతలయున్ = ఈ 25 తత్వాలకు దేవతలెవరో। స్థూలకాయాధిపుల్ = ఈ స్థూల శరీరానికి అధిపతులెవరో ।

12) తా॥ తన జన్మయొక్క రహస్యమును, పతియందు భక్తిగల యిల్లాలికి తెలిపి, జీవాత్మను పరమాత్మతో కలిపిమోక్షం పొందు పద్ధతులు వివరంగా చెప్పుట, పార్వతీదేవి పరమేశ్వరునితో శరీరమందలి తత్వవిషయములు ప్రశ్నించుట, ఈభూమిపై జనులు ఎలా పుడుతూ దంపతుల సంపర్కలో గర్భం ఎలా వస్తుంది. శరీరములో పంచభూతమల స్థానం ఏమిటి, ఎలా ఏర్పడ్డాయి. ఈ 25 తత్వాలకు దేవతులలెవరు, ఈ స్థూలశరీరానికి అధిపతులెవరు.

(13) భూతగణావరణంబులు= పంచభూతములు గల స్థలాలు । భూతముల యిదింటి గుణములు = పంచభూతముల గుణములు। భూతములైక్యోపేతములు = ఈ భూతములతో ఎవరు కలిసిఉంటారో । ఖ్యాతిగ ఆధారచక్రగడినిర్ణయముల్ = ప్రసిద్ధియైనఆధారాది చక్రములు గల స్థల గురుతులుతెల్పుట।

తా॥ పంచభూతముల ప్రదేశాలు, వాటి గుణములు, వీటితో ఎవరు కలిసి ఉంటారో, ముఖ్యమైన ఆధారాది చక్రములుగల ప్రదేశములు తెల్పుట.

14. అజపాక్రమంబు = అజపయొక్క పద్ధతి । సూక్ష్మాంగ లక్షణము = సూక్ష్మదేహ లక్షణము। కారణదేహము = కారణశరీరములో। లింగాంగ గురుతు = లింగదేహ అవయవముల గురుతు। పంచకోశ సంభావ్యము = పంచ కోశములు 1 అన్నమయ, 2 ప్రాణమయ 3 విజ్ఞానమయ 4. ఆనందమయ 5. బుద్ధిమయ కోశములు ఎలా ఏర్పడ్డాయో। దేహమందంగ లక్షణము = దేహమందలి అవయవ లక్షణములు। సర్వాంగగురుతు = సర్వఅవయవములు తెలుసుకోవడము। పదమూడు వర్గములు =





13 రకములగు గుణములు ।పతులు పాలించుట = వాటిని పాలించు వారి విషయములు । జ్ఞానంబు నెరుకయు = జ్ఞానాన్ని తెలుసుకొనుట । జ్ఞానగురుతు = దాన్ని గుర్తించుట। వస్తువిశేషముల్ = వస్తువుల గుణగణాలు। భ్రాంతి నివృత్తియు = భ్రాంతిని తొలగించు కొనుట। ప్రకృతి పరుడు = సృష్టిలో పరమాత్మను తెలుసుకొనుట । సాధన చతుష్ట భూతముల్ । నిత్యానిత్యవివేకము 2 యిహాముత్తరార్థఫలము 3 శమాదిషట్కసంపత్తి4 ముముక్షత్వం ఈ = నాలుగు రకములు సాధనలకు పద్ధతులు । సాంఖ్యలయము = 25 తత్వములకు దేవతలు । విశ్వరూపంబు= సమస్త సృష్టి వివరణ। దేహమున్ వెలయు పతులు = దేహమందున్న దేవతలు। ఆదియగువిశ్వబ్రహ్మకు అర్చన=మొదటిదైవమగు విశ్వ బ్రహ్మకుపూజ స్థవము– స్తుతించుట (పొగుడుట)। పార్వతీబ్రహ్మకు ప్రార్థనంబు = పార్వతీదేవి విశ్వబ్రహ్మను ప్రార్థించుట॥

తా॥ అజపయొక్క వివరణ, సూక్ష్మదేహలక్షణము, కారణదేహము, లింగదేహముల, అవయవముల గురుతు, 5 కోశముల వివరము, అవి ఎలా ఏర్పడునది, దేహమందలి అవయవముల లక్షణము సర్వఅవయవములగురుతు, 13 రకముల గుణములు వాటిని పాలించువిషయములు, జ్ఞానాన్ని తెలుసుకొనుట దాని గురుతు, వస్తు విశేషాలు వాటి విషయములు, భ్రాంతిని తొలగించు కొనుట, సృష్టిలోని పరమాత్మను తెలుసుకొనుటకు, నాలుగురకముల సాధనలు, 25 తత్వములకు దేవతలు, విశ్వరూప వివరణ, దేహ మందున్న దేవతలు, ఆదిపురుషుడగు విశ్వబ్రహ్మకు పూజ స్తుతించుట పార్వతీదేవి విశ్వబ్రహ్మను ప్రార్థించుట.

15. వధూవరులకు దీవనయును = విరాట్ పురుషుడు (విశ్వకర్మ) పార్వతీ పరమేశ్వరులను దీవించుట। వధూవరులిరువురునూ కలసివేడు వందనము= దంపతు లిరువురునూ కలసి చేయు ప్రార్థన। ఈ అధిపుని బహురూపత్వము = సకలదేవతలకు అధిపతియొక్క గొప్పరూపము। విధి యాత్మానాత్మ= బ్రహ్మయొక్క ఆత్మ, జ్ఞానశూన్యమగు శరీరాత్మ। పంచవింశతవస్థల్=25 తత్వముల।కాలకృతమైనపనులు।

తా॥ సృష్టికర్త పార్వతీ పరమేశ్వరులను దీవించుట, దంపతులిరువురూ కలిసి విశ్వకర్మకు జేయుప్రార్థన, సకల దేవతలకు అధిపతి యొక్కగొప్పరూపము, **బ్రహ్మజ్ఞానం గల ఆత్మ, జ్ఞానసూన్యమగుఆత్మ** 25 తత్వములయొక్క కాలకృతమైన పనులు.

16) ఆపంచీకరణము= శరీరమందలి25 తత్వములపంపకము। లోపల హంసుండే మర్మము = దేహంలో హంసఉండు రహస్యములో గల । ప్రశ్నరూపము = లోపలహంస ఎలా ఉంటుందన్న ప్రశ్నకు। కర్మబలంబును = మానవులయొక్క కర్మబలము। యేపున హంసస్వరూపు= ఎలాంటి ఆకారముతో హంస ఉన్నదో। నేగినిలుచుటన్ = దానినడక సంబంధ విషయాలు.

తా॥ శరీరమందలి 25 తత్వములపంపకము, దేహంలోహంస ఉన్న రహస్యము, లోపలహంస ఎలా ఉంటుందన్న ప్రశ్న, మానవులయొక్క కర్మబలము, ఎలాంటి ఆకారంతో హంసఉన్నదో దాని నడక సంబంధ విషయాలు.

17) బంధముల లక్షణంబు సంభావ్యము = మానవుల జన్మతోనే మోహబంధ స్వభావములు ఉన్నాయి। పంచభూతగుణములు =పంచభూతములగు ఆకాశము, గాలి, నీరు, నిప్పు, భూమి గుణములు। రూపములు = ఆకారములు। భూత ధర్మము = వాటి స్వభావము। వర్ణములు=రంగులు । పూర్ణవిధము= పూర్తిగా ఆ ప్రకారము। మరియు = యింకా। అధ్యాస లక్షణం = భక్తితో పుణ్యప్రదేశములు తిరుగుట, సాష్టాంగ నమస్కారములు చేయుట, నదీనదములలో స్నానములు దానములుచేయుట, ఉపవాసములుండి కాయకసరులుతినుట। మాయచింత = మాయలో పడినతలపులు.

తా॥ మానవులుజన్మతోనే మోహబంధములలో తగుల్కొనగా,వారికి పంచభూతముల గుణములు ఆకారములు, నడవడికలు, రంగులు పూర్తిగా ఉంటాయి. యింకా (అధ్యాస) భక్తి లక్షణములతో మాయ తలపులు కలిగి ఉంటారు.

18) మాయస్వరూపము = మాయ యొక్క స్వభావము। మరియు = యింకా। దేశికుతావు = గురువుండుచోటు। గురువుల చరితంబు= గురువుల నడవడిక । గురుతున్యాయ = స్వధర్మముచేచలింపకుండటాన్ని గుర్తించుట । జ్ఞానిరూపము = మోక్ష విషయముగల వానిని । దంభజ్ఞాని లక్షణము = మోక్షవిషయములు చెప్పుచూ వాటి సాధనచేయనివాడు । జ్ఞానంబుచే = మోక్షవిషయసాధన చేయువాడు (జ్ఞానం గలవాడు) అజ్ఞానమిడిచి = తెలివితక్కువ తనాన్నివదిలి। మహినిచరించుట= భూమిపై తిరుగుట। మాయను జయించు ఉపాయంబు= మాయను జయించు నేర్పుతో । వస్తు ప్రకృతి బంధము= కంటికి కన్పించు వస్తువుపై భ్రాంతితో । అయ్యేనవాంతరము = వీటివలన మోక్షసాధనకు ఆటంకములు। అధికులవందన=గొప్పవారికి చేయు నమస్కారం। ఈ వరుసతో 58 కధలుగలది ప్రధమాధ్యాయం।

తా॥ మాయ స్వభావము, గురువులుండుచోటు, గురువుల చరిత్ర,గురువులనడవడిక, వారు ధర్మాన్ని వీడకయుండుట, మోక్షసాధనలు చేయువానిని, ఊరకే తత్వోపదేశం చేయువానిని, బ్రహ్మజ్ఞానం గలిగి, దేహభ్రాంతులను వదిలి భువిపై తిరుగువానిని, నేర్పుతో మాయను జయించువానిని, కంటికి కన్పించువాటియందు భ్రాంతితో కలుగు మోక్షసాధనకు ఆటంకములు, గొప్పవారికి నమస్కారము చేయుట యిలాంటి 58 కధలుగలవు. **ప్రధమాధ్యాయములో** చావుతెలిసేఉపాయము సాధన= మృత్యు సమయము తెలుసుకునేసాధనా పద్ధతులు। బహుతర చాలారకములు। జ్ఞానయోగ సంభావ్యక్రమము = జ్ఞానాన్ని పొందగలయోగములు। గురువునందష్ట లక్షణగుణ విశేషము= గురువు





లందుగల 8 స్వభావముల వివరము। ఆత్మవై కారము = ఆత్మ వికారముచే లోకమంటుబడుట = ప్రాపంచిక విషయములలో తగులుకొనుట।

తా॥ చావును తెలుసుకొనుటకు చేయుసాధనలు, పద్ధతులు, చాలా రకముల జ్ఞానాన్ని పొందుయోగములు, గురువులందుగల 8 రకముల స్వభావములు, మనస్సు చంచలముచే ప్రపంచవిషయములందు చిక్కుబడుట.

19) తను గుణవిముక్త లక్షణము = శరీరానికి గల గుణములు వదులుకొను అలవాటు। జీవన్ముక్తిరూపము= జీవిని పరమాత్మయందైక్యము చేసే । చక్షురింద్రియ గోచరము= లో చూపుతో చూచుట। బ్రహ్మైక్యంబును =జీవాత్మను పరమాత్మలో కలుపుట। గ్రంధులమరుత్రయమును= బ్రహ్మ, విష్ణు, రుద్రగ్రంధులు ఏర్పడే విధానము। ఘనతర లింగాష్టకంబు రూపవిధుల్= గొప్పవగు 8రకముల లింగముల రూపములువాటి పూజా పద్ధతులు.

తా॥ శరీరానికి గల గుణములు వదులుకొను అలవాటు, జీవిని పరమాత్మయందు ఐక్యముచేయులోచూపుతో, జీవాత్మను పరమాత్మలో కలుపుట, మూడు గ్రంధులు ఏర్పడేవిధానము ।

20) మరియు నవవిధస్థానమాద్యంత = యింకా తొమ్మిది ప్రదేశములో అఖరివరకు ।గుహ్యపంచాక్షరీ = రహస్యముగాయున్న ఓం, నమఃశివాయ। పరశివస్థవ మత్తేభషష్టకం= పరమశివుని కీర్తించు మత్తేభమకుటంగల ఆరుపద్యాలు। రసవాద క్రమంబును = పాదరసంతో చేయుపనులు। సిద్ధబద్ధంబయిన మూలికాపంచకమును = రసవాదమునకు ఆరోగ్యమునకు ఉపకరించు ఐదు మూలికలు ।

తా॥ యింకా 9 స్థానాల్లో రహస్యపంచాక్షరీతో, పరమశివుని కీర్తించు ఆరుమత్తేభ మకుటం గల పద్యాలు, రసవాదము, ఆరోగ్యముసిద్ధించు ఐదు మూలికలు।

21) చతురాశ్రమ లక్షణములు=మానవులకు గల నాల్గు విధములు జీవన పద్ధతులు। గతిజ్ఞానతరంబు= జ్ఞానాన్ని పొందు సాధనలు। కీటకంబు సమాధిన్ = పురుగు చేయు సమాధిన బోలిన తపస్సు। యతులకు రుద్రాక్షఫలము = సన్యాసులకు రుద్రాక్షలఫలితము । భసితగుణము = విభూతిస్వభావము । దానిని నిర్మించు విధం = దానిని చేయుపద్ధతి।

తా॥ మానవులకు గల నాలుగు విధముల జీవనాపద్ధతులు జ్ఞానాన్ని పొందుటకు చేయుసాధనలు, పురుగు చేయు సమాధిని బోలిన తపస్సు సన్యాసులకు రుద్రాక్షల ఫలితము, విభూతియొక్క స్వభావము, దానిని తయారుచేయు విధానము.

22) యిటుల సనారీ విశ్వేశ్వరుల వారి అన్వయంబునున్గ ల = యిలా సనారీ విశ్వేశ్వరస్వాముల వారు పొందికపరచినట్టి । నీ యిరువది కథలంగూడి = ఈ 20 కథలతో కలసి। ద్వితీయంబయ్యె= 2వ భాగమయ్యింది।

తా॥ యిలాగు సనారీ విశేశ్వరస్వాములవారు పొందికపరచిన 20 కథలు కలసి రెండవ భాగమయ్యింది.

**గమనిక : గ్రంథ విస్తరణ భీతిచే యికనుండి తాత్పర్యము మాత్రమే వ్రాస్తున్నాను.**

23) ఆ సనారీ విశ్వదేశికార్చకులకు = ఆ సనారీ జగద్గురువులను పూజించుటకు । ఆసనయంత్రంబు, వాసి హృదయ, కరఅంగన్యాస, దిగ్బంధన, ధ్యానము, పంచపూజలు, కవచ, బంధనంబు, మాల, పంజర, జీవ, మంత్ర, చైతన్య,పాద, శిరము, ఆత్మ, మాతృకావరణి, పరవిద్యా భక్షిణి, పగిది, యమృత, విలాస, దరిశనం, వారి జాతా శౌచమును, మృతయశౌచ, చతుర్థంత్య, మించు శాంతి, స్తవము, యంత్రావతారిక ఈ తంత్ర విధులనుంచి యిరువది ఆరును యొక వరుసను పూర్వభాగంబు నొప్పు సంపూర్ణత్రయము.

తా॥ జగద్గురులైన సనారీ వార్ని పూజించుటకు, ఆసనం, యంత్రము, కరన్యాసం హృదయాది న్యాసం, ధ్యానం, మూలమంత్రం కరన్యాసం , పంచపూజలు, కవచం, దిగ్బంధనం, మాలామంత్రం, పంజరం, సంజీవనం, చైతన్యం,పాదం, శిరం, అంత ర్మాతృకా, బహిర్మాతృకా, పరవిద్యా భక్షిణి, అమృతం, విలాసం, దర్శనం, జాతాశౌచం, మృతాశౌతం, చతుర్ధ్యంత్య, శాంతి, యంత్రోద్ధారం, ఈ 26 పూజా క్రమములతో తృతీయాశ్వాసముముందు భాగము అయినది.

**తృతీయాశ్వాసమందుత్తరభాగారంభం**

24) వారలకర్మారంభము, ద్వారపతుల్, పంచపూజ, తత్వార్చన, యాతీరున గృహ పూజయు, నదికారులు పీఠంబు, ధ్యాన కర్మవిశేషన్.

**అర్థం :** తృతీయశ్వాసము తర్వాత భాగమునందు ద్వారపూజ, గృహపూజ, కలశస్థాపన, గురుపూజ, భైరవపూజ, తర్పణలుగలవు.

25) పార్వతీ పరమేశ్వరులధ్యానం, ప్రాణప్రతిష్ఠ, విభూతిధారణ, వస్త్రం, గంధం, కలశంశంఖం ప్రతిష్ఠలు, మామిడి, రావి ఆకులు, కొబ్బరికాయ, వస్త్రం కలశంపై నుంచి ప్రతిష్ఠ చేయుట గణపతిని, విరాట్ విశ్వకర్మనుధ్యానించి పూజించుట.

26) గురుపూజ, సంధ్యార్ఘ్యము, కుంకుమాక్షతలు, బిల్వదళం, పుష్పం, ధూపం, దీపములురెండు, ఘంట, శంఖు ప్రతిష్ఠలు మొదలగునవి.

27) శుద్ధిచేయుట ఆసవశాప విమోచన, కుంభ ప్రతిష్ఠ, త్రిపురసుందరి యొద్ద గాయత్రీమంత్రముతో నివేదనచేయుట.





28) తర్పణచేయుట, శరీరసంస్కారము, భైరవపూజ, పీఠస్తుదు మొదలుకుని అక్కడున్న వారందరూ, కులమత బేధములు లేక ప్రసాదములు స్వీకరించుట.

29) ఆ తర్వాత తాంబూలంబును, చక్కగా కర్పూర నీరాజనంబునిచ్చి ఏలోపము చేయక, పరమేశ్వరుని ప్రార్థించి, అలాగే పార్వతీమాతను ధ్యానించుటయు.

30) యిలా మొత్తం 52 ప్రధాన ఉపచారములతో గల తృతీయాశ్వాసమునందలి తరువాత భాగము సంపూర్ణము.

**చతుర్థాశ్వాసము :**

31) గురువుల జన్మస్థానము, గురుసేవకు ఉండవలసిన పద్ధతులు, చేసిన గురు సేవకు ఫలితము, గురుపూజ, హృదయ,కర, అంగన్యాసములతో గురు దంపతులకు చేయుపూజా పద్ధతులు వివరములు చతుర్థాశ్వాసములో ఉన్నాయి యింకా

32) 172 సహస్రనామస్తోత్రాలు 1128 నామాలు, అష్టోత్తర శతకేతనామావళి (108)తో ఎనిమిది దిక్కులతో నిండియున్న భూమిపై గల జనులు గురుని పూజించుతూ, మంగళహారతులిచ్చు పద్ధతులు (4వ అశ్వాసమునందు గలవు)

33) యిలా గురుయంత్రానికి, విగ్రహములకు పూజలు చేయు పద్ధతులు 4వ అశ్వాసములో గలవు.

**పంచమాశ్వాసము :**

34) మొట్టమొదటి పురుషుడగు విరాట్ విశ్వబ్రహ్మకు, అద్భుతమైనట్టి ఆత్మపూజయు, ఆ విరాట్ పురుషుని ఐదు ముఖములనుండి పంచబ్రహ్మలు ఉద్భవించిన క్రమము. వారి జనకుడైన విరాట్ విశ్వబ్రహ్మ తనయులగు ఐదుగురికి, ప్రపంచమందలి మానవులను ఐదురకముల బాధ్యతాభావములతో పాలించు అధికారములనిచ్చి, శివ, విష్ణు, బ్రహ్మ, యింద్ర, సూర్యులను పేర్లతో వారు ప్రపంచమందలి 84 లక్షల రకముల జీవరాసులను, సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహమనెడు ఐదు కార్యములు నిర్వహించుటయు.

35) ఆ తర్వాత పంచబ్రహ్మల పరిపాలనావిధానంబు, కలియుగంలో పంచాక్షరితో సమానమగు మంత్రంగానీ, పంచాననులనుబడు విశ్వబ్రాహ్మణులతోసమమగు కులం లేదని, పంచాననులనబడు బ్రహ్మ, విష్ణు, రుద్ర, యింద్ర, సూర్యులతో సమానమగు దైవములులేరని, వశిష్టుడు చెప్పుటయిది యదార్థ మనుటయు.

36) నాలుగు యుగములలో దేవతల శీలము, వారి ప్రవర్తనలు, చేయు తపస్సులు, ఆచరించు కార్యములతో గొప్ప ప్రభావము కలిగియుండుట, సందర్భోచితంగా వశిష్ట ముని పొగడుటయు.

37) మరియూ కులనిర్ణయంబులు గల ఈ 16 కథలతో పంచమాశ్వాసము అ నుండి క్ష వరకూ, క్ష నుండి అ వరకూ మకుటం గల పద్యములు, ఓం నమఃశివాయ శిద్ధంనముమూ, అనుమకుటాక్షరములు గల సనారీవార్ని స్తుతించు కంద పద్యములు మొదలునుండి చివరకు, చివరనుండి మొదలు వరుసక్రమంగలవి. మంత్రము, రసవాదము, యోగజ్ఞానాన్నిచ్చు పద్యములు " సింహాద్రి విశ్వనాథాచార్యావ ధూత స్వాములవారుయిచ్చెన్" అను మకుటాక్షరములు గల వంద పద్యములతో షష్ఠమాశ్వంబును, గురుభస్మ ప్రభావంబును, మందు స్వభావంబును, ఆభస్మము చేయుపద్ధతులు, రసవాద విద్యయొక్క విశేషంబు ను, ఉప్పుతో చేయు భస్మక్రమంబును గల ఈ ఐదు కథలతో సప్తమాశ్వంబును, భవిషత్తును తెలుపు కాలజ్ఞానముగల ఒకే కథతో అష్టమాశ్వాసంబును.

38) నూట తొంభై కథలు ప్రతివారికి తెలియుటకోసం ఉంచాను. ప్రజలు ఈ విషయాలు తెలుసుకొని, ఆచరించి జీవనాధారం పొందగోరు. జ్ఞానులు ఆనందంగా చదువుకుంటూ, వారికి అర్థమైన విషయాలతో అనుభవించి భూమిపై శాశ్వతకీర్తి నొందుదురు.

39) 1500 లకు పైగా పద్య గద్యములతో ,తెలుగు పద్య రూపంగా, అందరికీ అర్థమయ్యేటట్లు, ముఖం అద్దంలో కనబడినట్లుగా రచించిన ఈ గ్రంథాన్ని మీ చేతికి యిచ్చాను. యిందలి మూడు భావాలలో 1. రసవాదం, 2. ఆథ్యాత్మికం, 3. ఆయుర్వేదం ఉన్నాయి. మీకు కావలసినదాన్ని తీసుకొండి. వీటిని కూలంకషంగా గ్రహించి ఆయా పద్ధతులను ఆచరించి సత్ఫలితాన్ని పొందండి.

40) శ్రీ శైల గుహలో నివసించేవాడిని, కాశీలో విశ్వేశ్వరుడ్ని, కైలాసనాధుడిని, విష్ణుని, బ్రహ్మని, దేవతలపైగల మొట్టమొదటిబ్రహ్మ (విశ్వబ్రహ్మని) శక్తియునేనే.

41) అలాంటి నన్ను గ్రంథాన్ని నా భార్యను, నాశక్తిని, చక్కని విజ్ఞానంతో, మంచిభక్తి మనసుగల్గి మనసు వశపరచుకున్న వారు ప్రార్థిస్తూ పూజించినను, అలాగే ఉపాసనా పరులగు మాంత్రికులకు గల అజ్ఞానాన్ని పొగొట్టి వారు చేసిన ఎలాంటి తప్పులనైనా క్షమించి వారి కొర్కెలను తీర్చెదను, యిందులో ఎలాంటి అనుమానములేదు.





42) మాఘ, కార్తీక, వైశాఖమాసములలో, మూలానక్షత్రం నుండి శ్రవణానక్షత్రం వరకూ, శుక్రవారము, సోమవారములు, మరియూ ప్రతిరోజునన్ను పూజించే వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాను.

43) నా గ్రంథాన్ని చదివినవారికి సకల సౌఖ్యము, సంపద, దీర్ఘాయుష్షును, స్థిరంగా (కదలకుండా) ఉండు భోగములు, వారి మనసునందలి సకల కొర్కెలు తీర్చెదను. మరియు ఎవరైతే గ్రంథాన్ని 11సార్లు అర్థంచేసుకుంటూ చదివి, పూజలు ఎలాచేసినాసరే, అలాంటి వారికి (నరులలో గొప్పవారు) సృష్టి మొత్తాన్ని యిస్తాను. (పంచభూతములను వారి వశంచేస్తాను)

44) ఎ) ఎడమవైపున పరాశక్తి రెండు ప్రక్కల, సరస్వతీ, లక్ష్మీలతో గరుడ గంధర్వ, దిక్పాలగణాలతో, మేఘాన్ని వాహనం చేసుకుని దిక్కులను పాలిస్తూ సామవేద పద్ధతి తోను, నిన్నుకోరిన వారి కొర్కెలు తీర్చుటకై సిద్ధంగా నున్న ఓ దేవా। గానం, ధ్యానములతో నిన్ను అర్చించువారి కోర్కెలు తీర్చుతూ, ఆకాశమధ్యన (మానవశరీర మందలి దహరాకాశమధ్యన) గల విశ్వనాధుని భజిస్తూ పూజిస్తున్నాము.

44) బి) మా హృదయమందిరమున నిన్ను స్థిరపరచుకొని, నీవామ భాగమున పార్వతినీ, యిరువైపులా లక్ష్మీ, సరస్వతీదేవి లిద్దరూ ఉండగా, గరుడ, గంధర్వ, దిక్పాల గణాలు, మానవులు వారివారి కోర్కెలు నెరవేర్చు దైవమని ఎరింగి సామవేద గానముతో విశ్వనాధునిగా నినుభజయించుతున్నాము పరమపురుషా.

45. నిరంతరయోగినిష్టతో బ్రహ్మపదార్థాన్ని భోగిస్తూ బలము గలవాడివై భవిష్యత్తులో సృష్టి విధానములైన యోగ షట్కర్మలను రచనచేయుచున్న ఓ దేవరా!

46. **వచనం :** యిది సరస్వతీ ప్రసన్నతో సంపూర్ణ విద్యాపటిమతో ప్రకాశించు సరసకవిత్వముతో అనంతమగు సుగుణజ్ఞానుల మనస్సును సంతోషపరచునట్టి ఆగమ సిద్ధాంతమగు యోగములుగా, గొప్ప మంత్రములతో జ్ఞానము, మహాజ్ఞానములతో కూడినట్టి "సనారీ విశ్వేశ్వర సంవాదం" బనుగొప్ప గ్రంథమునందు 90 ప్రధాన ప్రశ్నలు విషయములతో 8 అధ్యాయములు, 11వందలకు పైగా పద్యములు వచనములు గలట్టిగ్రంథముగలదియై భూలోకంబున మంచి గంధం చెట్టువలేయున్న, ఈ గ్రంథమునకు మొదలుయగు **అవతారిక సమాప్తము.**

# విశ్వేశ్వరఉవాచ గ్రంధారంభము
# ప్రధమా శ్వాసము

**విశ్వేశ్వరుల వారికి పార్వతీదేవిచేయుస్తవము :**

1.ఎ. ఎవరిచే సృష్టి, స్థితి, లయాదిపంచకృత్యములు, ఆవరణాదికర్మలకు, మహాకారణాధిపతివైన ఓదేవా!నీ రూపము భీకరమైన కరుణతో కూడిన"నిధి వంటిది" సర్వమూ నీవైన ఓ దేవా నీ కొరకు నమఃస్సుమాంజలులు.

1.బి. శుభకరమగు రక్షణలు కల్గినట్టి ప్రాకారమును వశపరచుకున్న జగద్గురువువై న మయుని సంతతిలోని వారును, లోకులకు భయము కల్గించువాడ వై యుండియూ, భక్తుల కోర్కెలు తీర్చుకరుణకల్గిన నీ కొరకు ప్రార్ధింతును, మాకు అన్నియూనీవే.

**వశిష్టుల వారి ఆశ్రమ వర్ణన**

2. వివిధ రకములైన బంగారు స్థంభాలు, కెంపులు, పచ్చులు చేర్చి తయారు చేయబడిన ఎత్తైన స్థంభాలుగలిగి, వజ్రాలు పొదగబడినట్టి వేదికకు వజ్రాల మాలలతో అలంకరించగా అవి చంద్రునికాంతిని ప్రసరించు చుండగా, వెండితో స్పటికములు కూర్చబడినటువంటి విచిత్రమైన మెట్లున్నటువంటి, ఆప్రదేశములో గోపురపైభాగమున అనేకమంది మునులు యోగములు చేయుచుండగా, అక్కడ నరసింహస్వామి నాట్యము చేయుచుండగా, పరమశివుడునిలిచి యుండగా, దక్షిణమునుండి ఆంజనేయుడు రాగా, గొప్పదగు వృక్షమువలె ఎత్తైన ఆశ్రమములో లెక్కకు మించిన వృక్షములు చల్లని గాలిని వీస్తుండగా, మంచి గుణములు గల స్త్రీల మధ్య, మహాపతివ్రతయగు అరుందతి శుభం చెబుతుండగా.

3. దేవశిల్పి (విశ్వకర్మ) తో మంచి అందముగా తయారుచేసిన బంగారు మండప మధ్యన, మంచిగంధము కస్తూరీ మొదలగు సుగంధపు వాసనలు అచటనుండి అద్భుతముగా వస్తూండగా, నిర్మలమైన గౌతమీనది సుళ్ళు తిరుగుచుండగా, గోపురం ఆకాశాన్నంటినట్లు కనబడుచుండగా, యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన ప్రతిగ్రహమను ఆరుపనులు చేయు, యోగీశ్వర బృందములు చేయు హోమగుండము లందలి అగ్ని ఆవునేతి ఆజ్యములతో ప్రకాశింపు చుండగా అట్టి ప్రదేశమందు లేత ఎరుపురంగు దేహంగల బ్రహ్మనిష్టలో గొప్పవాడు బ్రహ్మ ఋషియైన వశిష్టుడు ఆ ఆశ్రమమునకు నాయకుడైయున్న సమయమున, అచటికి పార్వతీ పరమేశ్వరులురాగా.

4. ఆది దంపతులకు, వశిష్టుడు పత్నీ సమేతంగా అర్ఘ్య పాద్యాదులలొసంగి పాదములు పూజించి, మణులతో, కూర్చబడిన సువర్ణ వేదికా మధ్యమున, ఆది





దంపతులనాశీనులనుగావించి, చేతులు, జోడించి, అంజలి ఘటించి, వీర మహాపతివ్రతా శిరోమణియగు పార్వతీదేవితో, అరుంధతితో కూడిన వశిష్టుడిట్లనుచున్నాడు.

5. అమ్మా నీ భర్తముల్లోకములను పాలించువాడు, నీవు మూడు జగములకు తల్లివి, యింకా పాలించు తల్లులకు తల్లివి, అమ్మా యిపుడు మేము చెప్పునది వినుము. మాప్రార్ధనలాలకించి మా కోర్కెలుతీర్చుము.

6. అంతర్వీధియను మానవ హృదయాంతరమునందు అనేకలోకములందలి జనులలో శ్రేష్టులు తపములు చేస్తుంటారు. అలాగే అరుంధతితో నేను కూడా తపస్సు చేస్తుంటాము.

7. మీరుఎంతో గొప్పపుణ్యుల దగ్గరకే వెళతారు, మీమహిమలు కీర్తించిన యోగసిద్ధి కలిగి బ్రహ్మపదంచెంది బ్రహ్మంలోచేరుతారు. నేను మిమ్ములను దేహ సర్వతత్వముల సారాన్ని అన్నియంత్రములనర్చించు విషయములు తెలుపుమని ప్రార్ధిస్తున్నాను.

8. యిలా ముని పుంగవులలో గొప్పవాడైన వశిష్ఠుడు, అవధూత దంపతులగు ఆ పార్వతీ పరమేశ్వరులను ప్రస్తుతిస్తూ, భార్యయగు అరుంధతితో కలిసి సాష్టాంగదండ ప్రణామము లాచరింపగా, పరమేష్ఠి వారిని చూచి తలయూపి, ముఖము వికసించునట్లు చిరునవ్వు నవ్వి ఊరకుండెను.

**వశిష్ఠుడు సనారీశ్వరులకు చేయుస్థవము**

9. మోమున విభూతి, మెడలో, శిరస్సు పై రుద్రాక్షమాలలు ధరించి, దండం చేబూని కమండలం నుండి ఎల్లప్పుడూ గంగాజలం ప్రవహిస్తుండగా, లేత ఎరుపురంగు కాంతులు విరజిమ్ముగోచిమొలకు గట్టిగా బిగించి, బ్రహ్మాసనంతో దిగంబరంగా నున్న వాడును, పులిచర్మము ధరించువాడును, నిత్యము లయ కార్యములో నుండువాడును, కొండగుహ లందు సదా యోగమందుండు వాడును, క్రూరమగు ఘోరపాపములను సైతము నశింపజేసి, సర్వులను రక్షించెడి శాంత స్వభావుడు, పంచాననం వారిలో పరమపావనుడు, భక్తులను రక్షించు ప్రభావము కలిగి బ్రహ్మతేజస్సు గల పార్వతీ నాధుడగు పరమశివా మునులనెల్లప్పుడూ కాపాడు ఓ సర్వేశా, విశ్వేశా, బ్రహ్మమూర్తి పాహి పాహిపాహి,

**విశ్వేశ్వరులకు పార్వతీదేవి చేయుస్థవము**

10.ఎ. మూడు శిరస్సులుగలిగి తలకు మూడు కనులు చొప్పున 9 నేత్రములతోను అమితమగు శక్తిగల భుజములతోను, అనేక మండలములతో కూడిన సమస్త విశ్వాన్ని దర్శించగల దృష్టితో, అనేకములైన హస్తములతో సర్వకార్యములు నిర్వహించగల ఓదేవా!

11.ఎ. శ్రీ విద్యారూపిణియగు (రమాదేవి) సేవకులగు, శివయోగులు మొదలుకొని, శిద్ధులు, అమరులు, కవులు, మానవులు, సంయములు, ఏ గురు పరంపరలచే మాయనుగెలిచి పరమాత్మయందులీనమైనారు?

### విశ్వేశ్వరుల వారి అవతార నిర్ణయము

12. మొదట శంకరుడు, రెండు పార్వతీ యిద్దరును, మూడు దక్షిణామూర్తి నాలుగు హయగ్రీవుడు,(గుఱ్ఱంతల అతికించిన వాడు) ఆ పైన చూడగా బోధాయ నుండు, (మయసంతతివాడు) భువిపై మార్కండేయుడు మహామునీశ్వరులగు ఈ ఆరుగురు మూర్తులు, అవతరించిన ఫలితముగాఈ భూ మండలముఈ సమస్తము పావనమయి భద్రముగానున్నది. ఓ విశ్వేశ్వరా! ( ఈ ఆర్గురు మూర్తుల రూపులతో పరబ్రహ్మ జ్ఞానాన్ని బోధించి, సమస్త భూమండలాన్ని పావనమొనర్చు చున్న ఓ విశ్వేశ్వరా)

13. ఇలా పార్వతీదేవికి విశ్వేశ్వరులు సాక్షాత్కరించగా, ఆమె అమితముగా వరించి తరగని ప్రేమతో పరమేశ్వరునకు సేవలుచేస్తూ యిలా చెప్పుచున్నది.

ఒకరి పై అనురాగము వేరొకరిపై ద్వేషము లేక అందరియందు జాలితో రక్షించు నట్టి. విశ్వనాథా రాజులకు రాజువగు ప్రభువుగా కీర్తిగల దేవా!

14. సమస్త జగములు నీలో ఉంచుకుని వాటిని భరిస్తూ అన్ని లోకములు, సృష్టి అంతయూ నీ దేహమై విరాట్ విశ్వకర్మ కులమందలి ప్రముఖుడవగు ఓసంయమీశ్వరా, సమస్త ద్వేషములను నాశనం చేయువాడా, గొప్పవాడివి శ్రేష్ఠుడవు పవిత్రుడవు,అన్నిటా అధికుడవు మహా కొండగుహలలో నివసించు యోగీశ్వరులకు ప్రభువా! సదా సృష్టి స్తితి లయములను వీక్షించుచూ అన్ని నిర్వహిస్తున్న విరాట్ స్వరూపా ఈవిశ్వమంతయూ నీవే కదా!

15. నీ హృదయంలో సృష్టికర్త, సూర్యచంద్ర అగ్నులు నీ మూడుకనులుగా, నీ హృదయ పద్మములో దేవతలలో ప్రముఖులునిల్చున్నారు. నీ హృదయం లోనూ, వెలుపల భుజస్కంధములపైన దేవతలు, నదులున్నాయి. నీ హృదయ మంతా పార్వతీదేవితో నిండియుండి, నీ శరీరసగభాగమై నిన్ను కౌగలించుకొని యున్నది.

16.ఎ. నీ వలనసృష్టియంతయూ కనబడుచూ అర్థమగుచున్నది, విశ్వకర్మ కులమందలి మూలపురుషుడవు నీవేగదా, నేను చేయుప్రార్థనలు, అభ్యర్థనలువినుము, అచేతనముగా నుండు పరబ్రహ్మమా, అన్ని స్వరూపములు నీవేగదా!

16.బి. నీచే నడుపబడు కంటికి కనుపించు ఈ విశ్వమందలి సర్వకర్మలు నెరవేరుటకు మూలమైన పంచ కృత్యములు నెరవేర్చుకుల ప్రముఖుడవు నీవేగదా! చక్కని జ్ఞానబోధలు చేయునట్టి ఓదేవా! బ్రహ్మ జ్ఞానసముపార్జనకు మూలమైన పరబ్రహ్మమా! నా ప్రార్ధన ఆలకింపుము.





17. **వచనం :** యిలాగు అవధూతలకు గురువునగు, సనారీశ్వరుల భార్యయగు పార్వతీదేవి ప్రార్థించి, ప్రస్తుతించి, ముఖ్యమగుయోగ ఫలితములు జనులకు ఉపయోగ పడునవి క్లుప్తంగా నాకు చెప్పుమనికోరగా! ఆ పార్వతీదేవితో, హృదయకమలములందు (సర్వులహృదయములలో) రేయింబవళ్ళు కోటి సూర్య కాంతితో ప్రకాశించు దివ్యకాంతి గలిగి, పద్మములందలి సుగంధ పరిమళములు తన చుట్టూ ఆవరించియున్నటువంటి ఆ విశ్వేశ్వరుడు యిలా చెప్పుచున్నాడు.

18. సర్వాలంకారములతో ప్రకాశించుదానవు, పతివ్రతలలో ఉన్నతులతో పాదసేవ లందుచు, పద్మములవంటి కన్నులు గలదానవు (యిట్టి లక్షణములతో వెలుగొందు దానవు) భక్తులను రక్షించుటయందు

యిష్టమగుదానవు, పరి శుద్ధమగు ఆత్మగల నీప్రశ్న మెచ్చుకొనదగినది. తక్కువ మాటలతో సులువైన పద్ధతులుచెబుతాను. నాకు తెలిసిన బ్రహ్మతత్వాన్ని, ఎలాంటి మోహాలులేక అజ్ఞానాన్ని తొలగించుమార్గాన్ని!

19. శ్రీశైలం, కాశీ, రామేశ్వరం, తిరుపతి, మొదలగు పుణ్యక్షేత్రములు తిరగటం కాదు, గంగ, యమున, సరస్వతీ, కావేరీ, గోదావరి, కృష్ణ మొదలగు పుణ్యనదులలో స్నానంచేయుట కాదు. నీవు సాహసివయితే గత జన్మల నుండిగల కర్మలకుతోడు, ఈ జన్మలో ఆ కర్మలకు తోడుపెంచకుండా, జన్మజన్మల కర్మలను మొత్తాన్ని తగులబెట్టు యోగాగ్నిచేత. అలాకాకుండా జప మాలికలతో జపం చేయడంవల్ల ఉపయోగం లేదు. నేను గొప్ప కులంలో పుట్టానని సంతోషించుటకాదు. ఆత్మనుపరమాత్మలో చేర్చుటయే పునర్జన్మ లేకుండా చేయుట (జన్మరాహిత్యాన్ని పొందుట.)

20. పూర్వజన్మలలో మనస్సుతో చేసినట్టి కోర్కెలను అనుభవించుటకై మళ్ళీ జన్మకు వచ్చి, గత జన్మకోర్కెల ప్రకారము చేయవలసిన పనులుచేసి, ఈ కోర్కెల కోసమే చావు పుట్టుకలనెడు చక్రంలో బడి తిరుగుచున్నారేగానీ, తనకు తెలిసినదే సత్యమనే భ్రాంతితో ఆయాకోర్కెలసాధనతో, జన్మరహస్యాన్ని తెలుసు కోలేకున్నారు భార్యామణీ.

21. యిలాంటి కోర్కెలు లేని మహాత్ములు, ఈ భూమిమీద ఎలాంటి కర్మలు తనకు తగులకుండా, తామరాకుపైనీటిచందాన, జీవన్ముక్తి పొందుటకు మానవ జన్మపై విరక్తి చెంది యోగసాధనతో ఆత్మను పరమాత్మలో కలుపుతారు. అది ఎట్లా ఉంటుందంటే పాదరసంలో నాగం చేరినట్లు.(రెండూ ఒకేలాగా కలసిపోవడం)

22. సర్వమూతానైన గురుదేవుల మనస్సులో తానుస్థానం పొంది, సద్గుణములతో, ప్రవర్తించుతూ, ఎటువంటి దోషములు లేని మనస్సాక్షి గలవాడై, అంతాతానై, తానన్నింటా ఉంటూ, కులములు, మతములు, జాతి బేధములు, నిజమగు జ్ఞానులకు

లేవను, స్థిరమగు జ్ఞానమే వినోదమునకు మూలమని తలంచుటయే, "జ్ఞానలక్షణము" ఎలాగంటే నీకూ నాకూ బేధం లేదన్నట్లు.

23. కొంచమై యింకా తక్కువై చాలా సూక్ష్మమై, జీవనస్థానానికి మూలమై, ఐదవ స్థానమగు ప్రాణమై, పరాత్పరుని హృదయస్థానమై, పందిరంతా అల్లుకున్న లతారూపముగా నిండుగా ఉంటుంది జ్యోతి. విరాట్ స్వరూపముగా (సృష్టి కర్త అంతా అన్నిటాతానైనట్లుగా)

24. కొంచెముకన్నా మరీ కొంచమై పెద్దదానికన్నా మరీ పెద్దదై, పొట్టిదాని కన్నా మరీ పొట్టిదై, పొడవు కంటే మరీ పొడుగై, అంతయింతయని చెప్పలేనట్టి, ఇక్కడ, అక్కడ, ఎక్కడైనా, స్వర్గలోకము నరకలోకములలో, మండుతున్నకట్టెలో అగ్నివలే, గింజలలో నున్న నూనెవలే, పాలలోనున్న వెన్నవలే, శరీరంలో గల మారుతాకారంవలే, బయటలోపల నుండి, ఎచట నూలేక అది, యిది యని ఏ పేరు, ఏరూపు, ఏ పనులులేక, మరియూ ఉన్నట్లుండి, ఉందనువారికి ఉన్నట్లు లేదనువారికి లేనట్లు సత్యంగా ఉండ వలసిన చోట్లయందు వెలుగొందునదియే విరాట్ స్వరూపము.

25. విరాట్ స్వరూపుడగు ఆవిశ్వబ్రహ్మలో, ఈ చరాచర జగత్తంతయూ అద్భుతముగా నిండియున్నది, ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఈ ఐదు భూతములు ఆ మహనీయునిచే సృష్టించబడినవి. వీటిని గురించి చెప్పడానికి, నాకు, నీకు, అనంత మూర్తికి ఏమని తెలుపను? ఆ తర్వాత లోకములు ఏర్పడినవి చూడు పార్వతీ.

26. ఈ లోకంలో మానవకంటికి కన్పించునది ఏమేమి ఉన్నవో, అవన్నీ మానవ శరీరంలో కూడా ఉన్నాయి. సృష్టిలో ఉన్నవన్నీ మానవ దేహములో ఉన్నాయి. చూడా లంటే, సద్గురుని ద్వారా విషయాన్ని గ్రహించి, ఈ సృష్టిక్రమాన్ని చీకటిలో చూడు కనబడుతుంది.(నీ లోపల)

27. నీ దేహము, నా దేహము మరియూ అన్ని దేహములందు, నీవే నేనుగా ఉన్ననూ, నీచమైనది గొప్పదైనది, ఉన్నతమైనది హీనమైనది, సుఖము, దుఃఖము, జీవులందరికీ ఒక్కటే, సన్మానము, అవమానమనునది మాయ, ఈ మాయ ఎటువంటిదో గదా అక్కటా ?

28. పార్వతీ దేవి రెండు చేతులు జోడించి స్వామికి నమస్కరించుతూ, పాదముల వద్ద కూర్చుండి అర్థించునటుల స్థిరమగు మనస్సుతో, పరమేశ్వరుని దివ్య తత్వముల గూర్చి చెప్పమని యిలా కోరినది.

29. నాథాసృష్టిమొదలు నుండి సాధనలో గల సమస్యలను క్లుప్తంగా, అనుభవ పూర్వకముగా తెల్పుము, ఈ చరాచరసృష్టికి మూలమగు పరిపూర్ణరూపా ।





30.ఎ) శూన్యమందు, శూన్యం, ఆశూన్యమందు శక్తి ఉద్భవించె, ధ్వనిధ్వనులందు ఓంకారము, ఓంకార మందు బిందు రూపమగు భూమి ఏర్పడెను, అందుసకల చరాచర జగత్తును సృష్టికర్తయగు విశ్వకర్మభగవానుడు ఈసర్వసృష్టి చేసెను. (84 లక్షల జీవ రాసులను)

30.బి) ఆదిలో పరమాత్మ నుండి ఆకాశము దాని నుండి వాయువు దానినుండి అగ్ని దాని నుండిజలము దాని నుండి భూమిని సృష్టించి, అట్టి భూమియందు విశ్వకర్మ సృష్టి సంబంధమగు పంచకృత్యములు ప్రారంభించెను.

31. మానవ నేత్రమునకు కానరానిదే **పరం** అదియేవిశ్వకర్మ భగవానుడు, పరమన గా అతనిమాయ, అదేశక్తి స్థిరమైన ఓంకారనాదముతో గూడినదై, సర్వప్రపంచములు సృజించిన పిదప సృష్టికార్యములో చరాచరములగు సర్వాన్ని సృష్టించెను.

32. అట్టి సృష్టి ఎలా జరిగిందంటే, విరాట్ విశ్వకర్మ 5 ముఖములనుండి తూర్పున సానగ ఋషియను ఈశ్వరుని సద్యోజాతముఖమునుండి, దక్షిణమున సనాతన ఋషి యను విష్ణువును వామదేవముఖము నుండి, పశ్చిమమున అహభూన ఋషియను బ్రహ్మను అఘోరముఖము నుండి, ఉత్తరమున ప్రత్నస ఋషియను యింద్రుని తత్పురుష ముఖము నుండి, ఈశాన్యమున సుపర్ణఋషియను సూర్యుని ఈశాన్య ముఖము నుండి, దేవ బ్రాహ్మణులుగా ఆవిర్భవింపజేసి వీరలకు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ నామములతో, మనుబ్రహ్మకు కమ్మరం, మయ బ్రహ్మకు వడ్రంగం, త్వష్ట బ్రహ్మకు కంచరం, శిల్పి బ్రహ్మకు శిలా శిల్పము, విశ్వజ్ఞ బ్రహ్మకు సువర్ణ వృత్తులునియమించి, వృత్తి ఆధారంబుగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర,చండదేవతలనామంబులతో దేవ ఋషులుగా ఆవిర్భవింపజేసి, సమస్తలోకంబులు, సృష్టి, స్థితి, పోషణ, ఆకర్షణ, లయంబు లకు అధికారులుగా నియమించెను.ఆమహాత్ములు తండ్రి యొక్క ఆజ్ఞ ప్రకారము సమస్తలోకములను పాలించుచుండిరి.

1.సృష్టి = పుట్టుటకు, 2. స్థితి = పెరుగుటకు 3. పోషణ = జీవనాధారము నకు, 4. ఆకర్షణ = కార్యక్రమనిర్వహణకు, 5. లయము = తనలోకలుపుకొనుటకు.

33. పంచబ్రహ్మలు పితరుని ఆజ్ఞచే ఆయాదిక్కులకు అధిపతులై ఆయాస్థానాల్లో ఉండి సృష్టి కార్యాన్ని ఆరంభించారు. సర్వలోకాలు రూపుదిద్దుకున్నాయి. అందులో చిన్న పెద్దలోకాలు (మాయతో) తయారయినవి. పార్వతీ నీవు, నేను మాత్రము ఏమలినమూ లేకుండా నిర్మలంగాయున్నాము.

34. ఆదిలో ఏ భూతములు పుట్టకముందు సర్వభూతములకు పెద్దయగు విరాడ్విశ్వ కర్మ, తన ముఖమునందలి మూడు కళ్ళలో 1.ఆవాహనీయ, 2.గార్హపత్య, 3.

దక్షిణాగ్నులను త్రేతాగ్నులను, వాటినే 1సత్వ2రజో 3 తమో గుణంబులుగా, వాటినే ఆధ్యాత్మిక, ఆది భౌతిక, ఆది తేయంబులను తాపత్రయంబులుగా, వాటినేకర్తృత్వ, వ్యవహారికత్వ, హేత్కారత్వంబుగా జేసి, ఆ మహాగ్నుల ముఖంబున పంచమహా భూతములను పశువులుగా నియమించుకొని దేవాదిదేవుండగువిరాట్ విశ్వకర్మ సృష్టికార్యమునకు కామాన్ని కల్పించి సర్వప్రపంచములలో సృష్టులు చేయచుండెను.

1. అట్టి సృష్టి ఎలా జరిగిందంటే విరాట్‌యగు విశ్వకర్మ భగవానుని ఐదు ముఖములలో తూర్పు ముఖమగు సద్యోజాతమునుండి సానగఋషి, మనుబ్రహ్మయగు ఈశ్వరునిచే సృజించి, ఋగ్వేదమునకు, కమ్మరపనికి, జీవులను తనయందైక్యము చేసుకొనుటకు అధికారములొసంగి, గాయత్రీదేవి ఐదు ముఖములలో తూర్పు ముఖము నుండి ఆదిశక్తి యగు పార్వతినావిర్భవింపజేసి సకల జీవరాసులు సర్వకార్యములు నిర్వహించుటకు వలయుశక్తినిచ్చు నాయికను జేసి శివునితో జతపరచి, కైలాసమును సృజించి, ఆదిదంపతుల కొసంగివారి బాధ్యతలు నిర్వహించు శక్తి అధికారములనిచ్చిరి.

2. విశ్వకర్మ భగవానిని దక్షిణ ముఖమగు వామదేవము నుండి సనాతన ఋషియను మయ బ్రహ్మయగు విష్ణువును సృజించి యజుర్వేదమునకు, వడ్రంగిపనికి, జీవులస్థితికి అధికారములొసంగి, గాయత్రీదేవి దక్షిణ ముఖము నుండి పరాశక్తి, యగు లక్ష్మినావిర్భవింప జేసి సకల జనులు సుఖజీవనముకు కావల్సిన ధనధాన్యాదులకధికారిణి జేసి విష్ణువుతో జతపరచివైకుంఠమును సృజించి లక్ష్మినారాయణులకొసంగి వారి బాధ్యతలు నిర్వహించుశక్తి అధికారములనిచ్చిరి.

3. విశ్వకర్మభగవానుని పశ్చిమ ముఖమగు అఘోరముఖము నుండి అభవన ఋషి త్వష్ట బ్రహ్మయగు బ్రహ్మను సృజించి సామవేదమునకు, కంచరపనికి, సకల ప్రాణుల పూర్వకర్మలననుసరించి తగు జీవనవిధానము లిఖించు అధికారములొ సంగి గాయత్రీ దేవి పశ్చిమముఖము నుండి యిచ్ఛాశక్తియగు సరస్వతీదేవి నావిర్భవింపజేసి సకలజనులకువారివారి పూర్వకర్మలననుసరించి తగువిద్యను ప్రసాదించు అధికారము నిచ్చి బ్రహ్మతో జతపరచి బ్రహ్మలోకమును సృజించి వాణీహిరణ్యగర్భుల కొసంగి వారి బాధ్యతలు నిర్వహించు శక్తి అధికారము నిచ్చిరి.

4. విశ్వకర్మభగవానుని ఉత్తరముఖమగు తత్పురుషముఖమునుండి ప్రత్నఋషి, శిల్పి బ్రహ్మయగు దేవేంద్రుని సృజించి అధర్వణ వేదమునకు, శిలాశిల్పవృత్తికి, సకల ప్రాణులకు తగు భోగములనిచ్చు అధికారములొసంగిగాయత్రీదేవి ఉత్తర ముఖము నుండి క్రియాశక్తియగు శశీదేవిని సృజించి వారివారి పూర్వకర్మలకు తగు పనులు చేయుటకు తగు శక్తి నొసంగు అధికారములనిచ్చి దేవేంద్రుని జతపరచి అమరలోకమును సృజించి శశీపురంధరుల కొసంగి వారి బాధ్యతలు నిర్వహించు శక్తి అధికారములనిచ్చిరి.





5. విశ్వకర్మ భగవానుని ఐదవ ముఖమగు ఈశాన్యముఖము నుండి సుపర్ణస ఋషియు విశ్వజ్ఞబ్రహ్మయను సూర్యుని సృజించి ప్రణవ వేదమునకు బంగారు పనికి, కాంతిప్రదాతగా సకలచరాచరములకు (84 లక్షల జీవరాసులు) జీవన శక్తి నొసంగు అధికారములొసంగి, గాయత్రీదేవి ఐదవ ముఖమునుండి జ్ఞానశక్తి నావిర్భవింపజేసి, సకలజీవులకు వలయుజ్ఞానము నొసంగు శక్తి నొసంగి సూర్యునితో జతపరచి అంతరిక్షమును సృజించి సంజ్ఞాభాస్కరుల కొసంగి వారి బాధ్యతలు నిర్వహించుశక్తి అధికారములొసంగిరి.

36. విశ్వకర్మచే సృజింపబడిన భువిపై త్వష్ట బ్రహ్మదేవుడు 84 లక్షల జీవరాసుల సృష్టి చేసి అందులో కొన్ని చైతన్యము కలవి, మరికొన్ని కదలిక లేనివి యిటుల, లెక్కపెట్టలేనన్ని సృజించెను.

37. చేతులు, తల, పాదములపై అవయవములు గల అనేక రూపములు గల జీవులను క్రిములు, కీటకములను త్వష్ట బ్రహ్మదేవుడు పుట్టించుచుండును. ఈ చిత్ర ప్రపంచములో విచిత్రముగా తన చిత్తముననుసరించి.

38. కళ్ళు కంఠములు గలజీవులు, వీటితో మాట్లాడగల మానవులను, బ్రహ్మదేవుడు సృష్టించెను. ఈ విషయాన్ని కాదనలేముగదా? శాస్త్రోక్త విషయము చెబుతా విను, ఈ భువిపై వేరే దైవములు లేరు. విశ్వబ్రహ్మయే సర్వము. అందరూ ఆ మహనీయుని నుండి ఉద్భవించినవారే.

39. మొదట వ్యవసాయము చేయుటకు నాగలి తయారుచేసి, భూమిని దున్ని ధాన్యము పండించుటచే, సర్వులూ ఆహారమును తిని శక్తిని పొంది రతిని చేయగలుగుచున్నారు.

40. స్త్రీ పురుషసంపర్కంలో కామోద్రేకముతో వీర్యము పడి, స్త్రీలకు గర్భము వచ్చును. స్వాధిష్ఠాన చక్రమందలి త్వష్ట బ్రహ్మ శరీరమందు అంగములు, అవయవములు ఏర్పరచును. "తల్లిదండ్రుల రూపములతో", జీవిగతజన్మమందు చేసుకున్న కర్మలననుభవింప తగుస్థితిగతులను, దేహారోగ్యమును, భోగ భాగ్యములను, తెలివితేటలను, బంధుమిత్రులను, సమకూర్చును. యిటుల లక్షలకొలది జీవులు సృష్టించబడుతున్నారు. యిదంతయూ సృష్టికర్త పని ఆయన సర్వమెరింగిన వాడు, కావున ఎవరికి ఏమేమి యివ్వాలో అవన్నీయిస్తూ పరిశుద్ధంగా, చిత్రనక్షత్రమై ఆకాశమున ఉన్నాడు యిది నిజము. నిజము.

41. తల్లిదండ్రుల రతిలో వారి మనోభావములననుసరించి, భూమిపై ఆ ఫలితములను భవించుట కొరకు ఎక్కువ, తక్కువ జీవనంతో కాలం గడుపుతారు.

42. వీర్యము స్త్రీ గర్భంలో చేరి రోజు రోజుకూ వృద్ధి చెంది, ఒక బంతి ఆకారంలో పిండమై, ఉండవలసిన వేడి ఉండి, చల్లబడకుండా ఉంచుతూ, పిండాన్ని పెంచుతూ ఉంటుంది.

43. తల్లిదండ్రుల శుక్ల శోణితములు కలిసి ఒక గోళమై పిండాకారము కలిగి, 15 రోజులలో ఆ శరీరానికి తలపొట్ట తయారగును.

44. నెలచివరలో మాయ ఏర్పడును, రెండవ మాసములో రొమ్ము, మూడవ మాసములో అవయవములు ఏర్పడును. నాల్గవ మాసములో వాయుచలనము, ఐదవ మాసములో వెంట్రుకలు వచ్చును, ఆరవమాసములో అవయవములు దేనికవి అంటు విడిపోవును, 7వ మాసములో ప్రాణము, 8వ మాసములో జ్ఞానోదయము గల్గును.

45. మొదట తల్లిదండ్రులు మోహావేశమున చేసిన రతిక్రీడ, తాను గతజన్మలో చేసిన పనులు ఫలితాన్ని అనుభవించడానికి యిలా పుడుతున్నానా? ఎవరు చేసుకున్నది వారు అనుభవింపక తప్పదు. అనుకొనుచూ శిశువు.

46. తన పూర్వజన్మను తలంచుకొని దిగులు చెందుచూ, సృష్టికర్తయగు విరాట్ విశ్వబ్రహ్మను స్తుతించ ప్రయత్నించును. "ఎట్లంటేను". నిరంజన, నిర్వికారా, నిష్కళంకా, నిరుపద్రవ, నిరామయా, నిస్సంగా, నిష్ప్రపంచా, నిరాకారా, నిరీశ్వరా, నిరాభాసా, స్వప్రకాశా, మహాదేవా, దీనదయాపరా, దివ్య రూపా, అనంతా, అత్యానందా, అమోఘా, అతులితా, ఆదిమధ్యాంత శూన్యా, అభవా, అనాదిపురుషా, ఆర్తజనరక్షకా, పరమపావనా, వేదాన్తమయా, విశాలా,వినోదా, అజితా, అచలా, అవ్యక్తా, అఘోరా, విరాడ్రూపా, విశ్వకర్తా, విశ్వపాలా, విశ్వా, విశ్వసృజనా, విశ్వగోళ, విశ్వహృదయా, విశ్వకర్మా, విశ్వబ్రహ్మా, ఆపదోద్ధారకా, యను ఈనామంబులచే అనేకంబులగు స్తవంబులు చేయుచు, ఇటుల నాజన్మంబులనేకంబు లాయెను. భువిపై ఈ జన్మంబులు అంతులేనట్లు పుట్టుచూ గిట్టుచూ, ఆ గామిసంచిత ప్రారబ్ధములనుభవించుచుంటిని. యింకనాయందు సంపూర్ణ కటాక్ష వీక్షణుండవై, దయజూపుదేవా పూర్వకర్మలచే ఈ షణ త్రయములబడి సంచితముల ననుభవించితిని, మాతృ గర్భమందుండి జన్మించు ఈనరకబాధలు బాపి, జీవన్ముక్తి మార్గముజూపరావే, నన్ను కాపాడుమని అనేక విధములుగా ఆ మహాదేవుడగు, విశ్వబ్రహ్మను తదేకనిష్ఠతో రెండు చేతులు జోడించి శిశువు ప్రార్థించి, పూర్ణఖేచరీ లక్ష్య భావంబున శరీరస్మారకములేక, పూర్వజన్మ విషయములు తెలుసుకొని తల్లి గర్భమందుండుట తనకు నరకమనియు, తల్లిమోయలేని బరువు మోయు చున్నదనియు, వగచుచూ, యిహలోక సంబంధముగావిచారించుచూ, సుఖ దుఃఖ, ప్రేమ, పగ, భయములనను భవించుటకు, 9వ మాసమున ప్రసవబాధకలిగించి, తల్లిగర్భభారాన్ని తప్పించి, జన్మించి, దినదిన ప్రవర్ధమానుడై తల్లిగర్భంలో 8వ మాసమున చేసినట్టి





భగవధ్యానములన్నియూ కలిమాయచే మరచి, పంచభూతములతో కల్గిన యింద్రియ వర్గఈషణాదులతో చిక్కుపడి, జ్ఞానాన్ని మరచి పూర్వజన్మలో తాను ఆచరించిన కర్మ ఫలితములను భవించుచుండునని క్లుప్తంబుగా ఆ విశ్వేశ్వరుడు పత్నియగు పార్వతీదేవితో పిండోత్పత్తి క్రమము తెలియజేయగా. ఆ పతివ్రతాకాంతామణి అన్ని విషయములు శ్రద్ధగా విని యిట్లనియె.

47. యిలాగునైన శరీరంలో తాను ఎలా ఉన్నాడు, అతనుతానెట్లాగయ్యాడు, ఈ దేహంలో గల తత్వాలు ఎన్ని, అవి ఏమేమి పనులు చేస్తుంటాయి, ఆ విషయాలన్నీ చెబితే తెలుసుకోవాలని వుంది ఆత్మనాధావేడు కొంటున్నాను అన్నీ వివరంగా చెప్పండి.

48. యిది పరమ రహస్యము మదించిన ఏనుగువలే నడుచుదానా పరము అపరము (ఇహము,పరము) ఒక దాని వెంటమరొకటి గడిగడి వరుసగా ఉన్నాయి. ఈ శరీరంలో నాదంతోకూడిన శక్తి బిందురూపముతో యున్నది. దీనితో బాటుగా శరీరమంతా పంచభూతములతో నిండియున్నది.

49. అలాగపుట్టిన పంచభూతములకు అదేవిధముగా జ్ఞానేంద్రియములైనవి, 1. ఆకాశతత్వమగు చెవులు వినుటకు, 2. వాయు తత్వమగు చర్మానికి స్పర్శకు, 3. అగ్ని తత్వమగు కన్నులు చూచుటకు, 4. జలతత్వమగు నాలుకకు రుచినెరుంగుటకు 5. భూతత్వమగు ముక్కుకు వాసన తెలుసుకొనుటకును ఈ 5 కార్యములను, అలానే శబ్దంతో కూడిన యింద్రియాలు 5, ఆకాశత త్వానికి బుద్ధి, వాయుతత్వానికి మనస్సు, అగ్నితత్వానికి అహంకారము, జలతత్వానికిఆత్మ, భూతత్వానికి జీవుడు యిలా ఉన్న ఐదు తత్వాలకు, 5×5=25 ఐ, సాంఖ్యంబై స్తూల శరీరమగుచున్నది. (కర్మేంద్రియములైన, వాక్కు, చేతులు, పాదములు ఉపస్త గుదము ఉపవాయువులచే, చేయబడు కర్మలను (గ్రహించుట పనులు)

50. శరీరంలోని ఈ 25 తత్వాలను గుర్తించి గమనించిన, పరమతత్వమగు ఆత్మకానవచ్చును. అది ఎలాగంటే దృష్టినిలబెట్టి చూడదం తెలిస్తే "అంటే" శరీరంలోని గల బయలందు ఆత్మయనెడి జీవాత్మను దర్శింపవచ్చును.

51. ఆ వెలుగు ఆరంభమందు అణువువలే నుండి, చూడగా చూడగా అనంత కోటిబ్రహ్మాండమంతా నిండియుండి, సూదిమోన పెట్టుటకాళీ లేక యుండును, ఆ అఖండమగు వెలుగును గురించి యోచిస్తే బ్రహ్మంఅదే.

52. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములనుఐదు భూతములందు ఓజ భాగము వలన "అగ్ని" సగ భాగంలో నేత్రములు, చర్మము, చెవులు,ముక్కు, నాలుక, ఈ ఐదు జ్ఞానపంచకము నిర్మించెను.(సాజముగ) కర్మేంద్రియ ములు - వాక్కు - పాణి - పాదము ఉపస్త గుదము వాయువులు - ఉర్విపాళ్ళు.(భూమి)

53. జ్ఞానేంద్రియములు చెప్పిన చోటులు గుర్తించుకొనుము, కర్మేంద్రియములు 5 వాటి స్థానము చెప్పెద, పాదములు, చేతులు, గుదం, మర్మస్తానం, నోరు.

54. శబ్దములు, ఆకారములు, రుచులు, వాసనలు, శరీరమునకు తాకునది స్పర్శపంచతన్మాలని చెప్పాను, "జలమునకు" 5 రుచులనిచ్చి, అందులో సగం భాగం పంపకమయ్యాయి, తన్మాత్రభావం యిలాగున.

55. ఆకాశమందలి సగంలో నాల్గుభాగములలో మానవులకు, బుద్ధి, చిత్తము, మనస్సు, అహంకారము, ఈ నాలుగు అంతఃకరణములైనవి. ఆ తర్వాత జీవాత్మ పరమాత్మ కలసి శరీరమైనది.

56. వినుము పార్వతీ ప్రాణము యింద్రియములు, దేహంలో కలసిన పిదప దేహంలో పూర్తిగా కళలతో నిండి. 1. ప్రాణవాయువు, 2. అపాన వాయువు, 3. ఉదానవాయువు, 4. సమానవాయువు, 5. వ్యాన వాయువులతో కలసి ఐదు వాయువు లయ్యెను.

57. యిటుల స్థూలంబైన శరీరమందలి సాంఖ్యతత్వ పంచీకరణంబు సూక్ష్మంగా చెబుతావినుము. యిరవై అయిదు సాంఖ్యతత్వపంచీకరణ లక్షణము.

58. శ్రీమన్ 1) మహాకాశభూతంబురెండయ్యి, అందొక్కటి మానవుని నుదిట భాగమగు దహరాకాశమందుండి జ్ఞాతృత్వమయెన్, అనగా మానవులు యింద్రియాలచేత పాపపుణ్యాలు చేయిస్తూ, ఆత్మకు ఒక కర్మకూడా అంట కుండా సాక్షిగా యుండునది."పరబ్రహ్మం" యిది గురుస్తాన మగు నుదిటి మధ్యభాగాన్నుండును. రెండవభాగం నాలుగై శిరస్సునమనస్సు, నాభి స్థానమున చిత్తము నేత్రస్థానమున బుద్ధి, హృదయ స్థానమున అహం కారము 2) సమీరాఖ్యవాయు భూతంబురెండై, నందొకటి వ్యానవాయువై దేహ మందుండి, మిగిలినదినాల్గైనాభియందు సమాన వాయువు,కంఠమందు ఉదాన వాయువు, గుదస్తానమందు అపానవాయువు హృదయమున ప్రాణవాయువులై, 3) అగ్నిరెండు భాగాలై ఒక భాగమునేత్రేంద్రియంబులై, మరోభాగము నాల్గుభాగములై, 1. చెవులువినికిడి, 2. చర్మానికి స్పర్శ 3. ముక్కు వాసన, జిహ్వనాలుకయై 4) అలాగే నీరు 2 భాగాలై అందొక్కటిరుచులు తెలియుటకు, మిగిలిన సగం నాల్గుభాగాలై 1. రంగు, 2. రూపము, 3.వాసన, 4. శబ్దములై, 5) అలాగే భూభూతమురెండై అందొక్కటి గుదస్థానమై, మిగిలిన సగం నాల్గు భాగాలై 1. మర్మస్థానము, 2. పాదము, 3. హస్తము, 4. నోరు ఈ 25 తత్వస్థానములు వాటి విధులను నీవు కోరిన మీదటలోకోపకారముగా నీకు చెప్పాను నా ఆత్మపత్నివగు పార్వతీ **శృణుత్వం?**(శ్రద్ధగావినుము)





59. **పార్వతీప్రశ్న :** స్వామీ ఐదు దిశలకు అధిపతులెవరు, వారు చేయుపనులు తెలియజేయండి. నాధా నమస్కారము.

60. **ఈశ్వర ఉవాచ :** ముందుగా తూర్పు ముఖం నుండి సానగుదు ఉద్భవించి, 14 మనువులై ఈ భూమి మీద శివునిగా భూమి తత్వం అధిపతిగా, "మనుబ్రహ్మయు". దక్షిణ ముఖమున సనాతనుడను విష్ణువు ఉద్భవించి 21 అవతారములుగల ఆది మూర్తిగా జలతత్వ అధిపతిగా, "మయబ్రహ్మయు", పశ్చిమముఖమున అహభవను దుద్భవించి అగ్నితత్వాధి పతిగా "త్వష్టబ్రహ్మ" సర్వలోకములకు గురువుగా, ఉత్తర ముఖము నుండి ప్రత్నసుడను యింద్రుడు ఉద్భవించి, శిల్పియై గాలి తత్వాధిపతిగా "శిల్పి బ్రహ్మయు", ఈశాన్యదిశయగు ఐదవముఖము నుండి విశ్వజ్ఞుడను సూర్యుడు ద్భవించి స్వర్ణ శిల్పియై, ఆకాశాధి పతిగా "విశ్వజ్ఞ బ్రహ్మయును", యిలా పంచముఖముల నుండి ఉద్భవించిన పంచ బ్రహ్మలు విరాట్ విశ్వకర్మ సంతతియైన పంచాననులు.

61. 1. కమ్మరం, 2. వడ్రంగం, 3. కంచరపని, 4. శిలాశిల్పము, 5. స్వర్ణ వృత్తులతో ఈ ఐదుగురు విశ్వబ్రహ్మము నుండి సృష్ట్యాదిలో ఉద్భవించి యుగ యుగంబులనుండి వరుసగా సృష్టికార్యక్రమము సక్రమముగా నిర్వహించుటకు గాను, పంచవృత్తులు చేయుచూ ప్రపంచమందలి జన జీవనము నిర్విఘ్నంగా కొనసాగించు చున్నారు.

62. వారే పంచభూతములై, వారైదుగురు ఐదేసి తత్వములతో మొత్తం 25 తత్వములై, అనేక రూపములతో 25 తత్వాధీసులై యుండిరి.

63. మనువు, కశ్యప, విశ్వాత్మక, మన్యు, మామన్యులై భూపంచతత్వ పాలకులు వారు. చిత్ర, జయసేన, విఘన, విచిత్ర, ప్రభువు స్వప్రకాశకులై జలపంచ తత్వపాలకులు.

1) 1. **ఎముకలకు** – సుపర్ణ బ్రహ్మర్షి అధిపతిగా
 2. **మాంసమునకు** – కశ్యప బ్రహ్మర్షి అధిపతిగా
 3. **చర్మమునకు** – విశ్వాత్మక బ్రహ్మర్షి అధిపతిగా
 4. **నరములకు** – మామన్యు బ్రహ్మర్షి అధిపతిగా
 5. **రోమములకు** – మన్యుపతి బ్రహ్మర్షి అధిపతిగా

ఈ ఐదుగురు భూతత్వము వల్ల జనించిన పంచతత్వములకు అధిపతులు మరియు పాలకులు వీరే.

2) 1. **మజ్జకు** – ప్రత్నసబ్రహ్మర్షి, చిత్రసేన బ్రహ్మర్షి, అధిపతులుగా
 2. **మూత్రముకు** – జయసేన బ్రహ్మర్షి అధిపతిగా

3. **చమటకు** – విఘనస బ్రహ్మర్షి అధిపతిగా

4. **రక్తముకు** – విచిత్ర బ్రహ్మర్షి అధిపతిగా

5. **శుక్లముకు** – స్వప్రకాశ బ్రహ్మర్షి అధిపతిగా

ఈ ఐదుగురు జలభూతములచే జనించిన పంచతత్వాలకు అధిపతులు మరియు పాలకులు వీరే.

64. **విమల, బోధన,** శశ్వర, వేదపాల, రాజదర్మ, సురాజ్ఞి వీరు అగ్ని పంచతత్వ పాలకులు. వేద సంయమ, ఉపయజ్ఞ, విప్రత్నస, ప్రత్నస,రుచిదత్త, వీరువాయు పంచతత్వపాలకులు.

3) 1. **క్షుదకు** – అభవన బ్రహ్మర్షి, సుభోదన బ్రహ్మర్షి అధిపతిగా

2. **దప్పికి** – శశ్వర బ్రహ్మర్షి అధిపతిగా

3. **నిద్రకు** – వేదపాల బ్రహ్మర్షి అధిపతిగా

4. **మైధునముకు** – రాజధర్మ బ్రహ్మర్షి అధిపతిగా

5. **ఆలస్యముకు** – సురాజ్ఞ బ్రహ్మర్షి అధిపతిగా

ఈ ఐదుగురు అగ్నిభూతములచే జనించిన అయిదు తత్వములకు అధిపతులు మరియు పాలకులు వీరే

4) 1. **పరుగెత్తుటకు** – సనాతన బ్రహ్మర్షి, వేదసంయమ బ్రహ్మర్షి అధిపతిగా

2. **ఉండుటకు** – ఉపయజ్ఞ బ్రహ్మర్షి అధిపతిగా

3. **ముడుచుటకు** – విప్రత్నస బ్రహ్మర్షి అధిపతిగా

4. **నడచుటకు** – ప్రత్నస బ్రహ్మర్షి అధిపతిగా

5. **నిలుచుటకు** – రుచిదత్త బ్రహ్మర్షి అధిపతిగా

ఈ ఐదుగురు వాయుభూతములచే జనించిన అయిదు తత్వములకు అధిపతులు మరియు పాలకులు వీరే.

65. **సువర్ణను, విశ్వజ్ఞులు,** సుపరితాఋషి, సౌరసేనుడు, సాంఖ్యమును, సంయ ముండు, ఆకాశపంచతత్వపాలకులు, వీరు ప్రాణమున్నంతవరకూ దేహంలో ఉండి సర్వపనులు చేయించుతారు.

5. 1. **ఆశకు** – సానగ బ్రహ్మర్షి, సుపర్ణ బ్రహ్మర్షి అధిపతిగా

2. **సిగ్గుకు** – విశ్వజ్ఞ బ్రహ్మర్షి అధిపతిగా

3. **భయముకు** – సుపరితా బ్రహ్మర్షి అధిపతిగా





4. **లజ్జకు** – సౌరసేన బ్రహ్మర్షి అధిపతిగా

5. **మోహముకు** – సాంఖ్యముని బ్రహ్మర్షి అధిపతిగా

ఈ ఐదుగురు ఆకాశ భూతములచే జనించిన పంచతత్వములకు అధిపతులు మరియు పాలకులువీరే.

66. దేహమందు ఈ యిరవై అయిదు తత్వంబులు గల సాంఖ్యము(శరీరము) నందు వీరు అది దేవతలుగా యుండి, యిరవై ఆరోసంఖ్యగల పరమాత్మయను విరాట్ విశ్వబ్రహ్మమను మహా తత్వంబుతెలియజాలక, మానవులు శరీర సంబంధమగు భ్రాంతులచే ఆయాగుణంబులు యందు తగులుకొని యుందురని తెలియును.

67. పార్వతీదేవి పరమేశ్వరునితో యిలా అడుగుచున్నది. పంచతత్వములకు అధిపతు లెవరో పూర్తిగా తెలుసుకోవాలని చాలా కోరికగాయున్నది. ఏ భూతానికి ఎవరు నాయకుడో పరిపూర్ణముగా చెప్పుము అన్నియూ శోధించి సాధించిన మహనీయా.

68. మణిభద్ర, సుప్రతాన్వయమనువు, శృతి వర్ధక వృద్ధి మనువు , సౌజ్ఞకమనువు, అర్వంతమనువు ఈ ఐదుగురు భూమికి అధిపతులుగా యున్నారు.

ఓ పార్వతీ! వినుము, స్థూల శరీరము నందు భూ తత్వములచే ఏర్పడిన కర్మేంద్రియము లైన,

1. **గుదస్థానమున** – మణిభద్ర బ్రహ్మర్షి అధిపతిగా

2. **గుహ్యస్థానమున** – మునిసువృత బ్రహ్మర్షి అధిపతిగా

3. **పాదస్థానమున** – శృతివర్ధన బ్రహ్మర్షి అధిపతిగా

4. **అరచేతి స్థానమున** – సౌజ్ఞిక బ్రహ్మర్షి అధిపతిగా

5. **వాక్కు స్థానమున** – అర్వంత బ్రహ్మర్షి అధిపతిగా

వీరుఅధిపతులుగా పాలించుచున్నారు.

69. వాస్తుపతి, కౌశల, సనాభస, ప్రహర్షణలోకవేత్తలు ఈ ఐదుగురు జలానికి అధిపతులు. భోక్తవ్య, ప్రజ్ఞమతి, అభూనస, భద్రదత్త, కాండవులు ఈ ఐదుగురు అగ్నికి అధిపతులు.

ఈ స్థూల శరీరమునందు జల తత్వములచే ఏర్పడిన

1. **గంధతన్మాత్ర**కు వాస్తుక బ్రహ్మర్షి అధిపతిగా

2. **రసతన్మాత్ర**కు సనాభస బ్రహ్మర్షి అధిపతిగా

3. **రూపతన్మాత్ర**కు ప్రహర్షణ బ్రహ్మర్షి అధిపతిగా

4. స్పర్శతన్మాత్రకు లోకవేత్త బ్రహ్మర్షి అధిపతిగా

5. శబ్దతన్మాత్రకు కౌశల బ్రహ్మర్షి అధిపతిగా

ఈ అయిదుగురుపంచ తన్మాత్రలకు అధిపతులుగా ఉండి పాలించుచున్నారు. ఈ స్థూల శరీరమునందు అగ్ని తత్వములచే ఏర్పడిన

1. వాసనపసిగట్టు ముక్కు స్థానమునకు భోక్తవ్య బ్రహ్మర్షి అధిపతిగా

2. రుచిచూచు నాలుక స్థానముకు ప్రజ్ఞామతి బ్రహ్మర్షి అధిపతిగా

3. చూపు స్థానమైన నేత్రస్థానమునకు అభూనస బ్రహ్మర్షి అధిపతిగా

4. స్వరమునకు గొంతు స్థానములో భద్రదత్త బ్రహ్మర్షి అధిపతిగా

5. వినుట అను చెవుల స్థానమునకు కాండవ బ్రహ్మర్షి అధిపతిగా

ఈ అయిదుగురు జ్ఞానేంద్రియములకు అధిపతులుగాఉండి పాలించుచున్నారు.

70. విశ్వచక్షుడు, సునందనమనువు, వితక్షక, మానుష, సనత్కుమారులు ఈ ఐదుగురు వాయువుకు అధిపతులు యిలా పంచభూతములకు ఈ ఐదుగురు అధిపతులు. ఈ స్థూల శరీరము నందు వాయు తత్వముచే ఏర్పడిన

1. ప్రాణమునకు హృదయస్థానము నందు విశ్వచక్షు బ్రహ్మర్షి అధిపతిగా,

2. అపానవాయువుకు గుదస్థానమునందు సునందన బ్రహ్మర్షి అధిపతిగా,

3. ఉదాన వాయువుకు కంఠ స్థానమునందు వితక్ష బ్రహ్మర్షి అధిపతిగా,

4. వ్యానవాయువుకు సర్వ శరీరమునందు మానుష బ్రహ్మర్షి అధిపతిగా,

5. సమాన వాయువుకు నాభిస్థానమునందు సనత్కుమార బ్రహ్మర్షి అధిపతిగా.

ఈ అయిదుగురుపంచప్రాణేంద్రియములకు అధిపతులుగా పాలించుచున్నారు.

71. మరియూ పార్వతీ పురంజయ, భానుమతీ, జయదేవ, జయత్కుమార, వనజులు ఈ ఐదుగురు ఆకాశభూతంబునందు పంపకంగావించబడి అధిదేవతలుగా పాలించుచుందురు. మరియూ ఈ చెప్పినయిరవై అయిదు గురున్నూ స్థూలపంచీ కరణము నందు వరుసగా పంపకంబు గావించబడినాయాస్థానాది దేవతలయి పాలించు చుందురని ఎరుంగుము.

1. అహంకారమునకు హృదయస్థానమున పురంజయ బ్రహ్మర్షి అధిపతిగా,

2. చిత్తమునకు నాభిస్థానమున భానుమతి బ్రహ్మర్షి అధిపతిగా,

3. బుద్ధికి నేత్రస్థానము నందు జయదేవ బ్రహ్మర్షి అధిపతిగా,





4. మనస్సుకు కంఠస్థానము నందు జయత్కుమార బ్రహ్మర్షి అధిపతిగా,

5. జ్ఞాతముకు భ్రూమధ్య స్థానమున వనజ బ్రహ్మర్షి అధిపతిగా,

ఈ అయిదుగురు ఆకాశభూతముచే ఏర్పడిన అంతఃకరణములకు అధిపతులుగా పాలించుచున్నారు.

72. భూతములైదింటికి అధిపతులీతత్వములందుగలరు చెబుతా వినుము

73. 1. సానగఋషియను మనుబ్రహ్మయగు "పరమేష్ఠి" భూభూతానికి అధిపతి.

2. సనాతనుడను మయ బ్రహ్మయగు "విష్ణువు" జలభూతానికి అధిపతి.

3. అభవనుడను త్వష్ఠ బ్రహ్మయగు "బ్రహ్మ" అగ్ని భూతానికి అధిపతి.

74. 4. ప్రత్నసుడను శిల్పి బ్రహ్మయగు "యింద్రుడు" వాయుభూతానికి అధిపతి.
5. సుపర్నసుడను విశ్వజ్ఞబ్రహ్మయగు "సూర్యుడు" ఆకాశ భూతానికి అధిపతి.

తుమ్మెద రెక్కల వంటి వెంట్రుకలు గల వనితా పంచభూతములకు అధిపతులు వీరే.

75. వినుము స్థూలంబును పంచీకరణము చెవులకు విందుగావించెదను. ఈ శరీరమునందు ఆకాశమురెండై ఒకటి నిజస్థానమందుండి ఆశయై మిగిలినది నాల్గుభాగాలై 1. లజ్జ, 2. భయం, 3. సిగ్గు, 4. మోహము. అని నాల్గు భాగాలై అలాగే శరీరమందలి వాయువు 2. భాగాలై 1 నిజస్థానమందుండి పరుగిడడం, రెండవది 4 భాగాలై 1.నడుచుటకు, 2.ఉండుటకు, 3. ముడుచుట, 4. నిలుచుట, అలానే అగ్ని రెండు భాగాలై 1. శరీరమందుండి ఆకలియై, రెండవది 4 భాగాలై 1. నిద్ర, 2. దప్పిక, 3. మైధునము, 4. సోమరితనము. దానివలే జలం రెండై 1. శరీరమందుండి అస్తికలందు మూలుగై, మిగిలినది 4 భాగాలై 1. మూత్రం, 2. చెమట, 3. రక్తం, 4.శుక్లమై అలాగే భూమి రెండు భాగాలై 1. శరీరమందలి అస్తికలై, రెండవది 4 భాగాలై 1. మాంసము, 2. చర్మము, 3. నరములు, 4. రోమములు. ఈ లాగు మానవ శరీరమయ్యెను. యిదితత్వజ్ఞానులు కనుగొను శరీరపంచీ కరణము. యిందేమియూ అనుమానింపక తత్వ అనుభవము పొందుము. యిదియే ఆత్మ నివశించు ప్రదేశము.

76. యిదిగాక భూతగుణావరణ పంచీకరణంబు చెప్పెదను వినుము.

77. 1. చావు, 2.కారణము, 3. స్మరణ, 4. ఉదహరణము, 5. నిష్కర్షణము, 6.కరుణ, 7.ఉపలక్షణము, 8.ఉత్ప్రేక్షణము, 9.ఉపఘ్నము, 10. ఉపద్రవణము.

78. ఈపది యును ఆకాశభూతగుణంబులు -యిందుకు అధిదేవతలు చెప్పెదను వినుము.

79. 1.మృతికి =భాస్వతమనువు, 2. కారణము= మధుఋషి,3.స్మరణ= చిత్ర వసువు, 4. ఉదహారణ = యక్షఋషి, 5.నిష్కర్షణము = లోకసంయమమనువు, 6. కరుణ = దార్మిణీ, ప్రజాపతి, 7. ఉప లక్షణము = విధాతృమనువు, 8. ఉత్ప్రేక్షణము= ద్విజధర్మమనువు, 9. ఉపఘ్నము=వర్ధక ప్రజాపతి, 10.ఉపద్రవణము= భావబోధనుడు, వీరు ఆకాశభూత గుణంబుల బ్రహ్మర్షులు.

80. ఈ పదుగురు ఆకాశ గుణంబులు పాలించుచుందురని ఎరుంగుము. మరియూ వాయుభూతగుణంబుల వివరింతును వినుము.

81. 1. ఘనాన, 2. మననము, 3. కుదురున, 4. కల్పనములు, 5. వారణము, 6. జ్వలనము, 7. తాడనము, 8. వాణిజ్యము, 9. కీర్తియు, 10. ఆమోహము, ఈ 10 వాయుభూతగుణంబులు వారి జాక్షి. యిందుకు అధి దేవతలను చెప్పెదవినుము

82. 1. ఘనాన = భూబలమనువు, 2. మననము = సువర్ధకమనువు, 3. కుదురున = లోకవేత్తా, 4. కల్పనములు = సమంతఋషి. 5.వారణము = శ్వేతాంగ ఋషి, 6. జ్వలనము = దేవలఋషి, 7. తాడనము = వినయఋషి, 8. వాణిజ్యము = బ్రహ్మదీక్ష పతి, 9. కీర్తియు = హరిధర్ముడు, 10. ఆమోహము = వామదేవుడు. వీరు వాయు భూతగుణంబులబ్రహ్మర్షులు

83. ఈ పదుగురు వాయుతత్వమును పాలించుచుందురని ఎరుంగుము. మరియు అగ్ని భూతగుణంబులు వివరింతును వినుము.

84. 1. నఖములు, 2. జిహ్వాగ్రము, 3. నాశికాగ్రము, 4. యోగము, 5. విద్యా, 6. నిదర్శనము, 7.యోగభావము, 8.ఆజ్ఞాచక్రాగ్రము. 9.భీకరము, 10. బ్రహ్మ రంధ్రము. ఈ గుణంబులు అగ్నిగుణంబులు యిందుకు నధి దేవతలు.

85. 1. నఖములు = తాంమ్రహృద్ మనువు, 2. జిహ్వాగ్రము = కపాల ఋషి, 3. నాశికాగ్రము = అతి ధాతృమనువు, 4. యోగము = పద్మదక్షు ఋషి, 5. విద్యా = వితక్షక మనువు, 6. నిదర్శనము = గిరి ధర్మ ఋషి, 7. యోగభావము = వసుధర్ముడు, 8. ఆజ్ఞాచక్రాగ్రము= వసుప్రియుడు, 9. భీకరము = వజ్రపాణి ప్రభువు,10. బ్రహ్మ రంధ్రము = వజ్రధర ప్రభువు.వీరు అగ్నిభూత గుణంబుల బ్రహ్మర్షులు.

86. ఈ పదుగురు అగ్నితత్వంబును పాలించుచుందురని ఎరుంగుము (మరియూ జలభూత గుణంబులు చెప్పెదను వినుము.)

87. 1. స్వస్థత, 2. శుభగతం, 3. విస్తారము, 4. స్థంభనము, 5. ఆరోహణము, 6. గుంభనము, 7. సూక్ష్మము, 8.సూనృతము, 9. సుకృతము, 10.గంభీరము : యిందుకు అధిదేవతలు.





88. 1. స్వస్థత = చిత్రకమనువు, 2. శుభగతం = సహస్రబాహువు, 3. విస్తారము = దేశిక మనువు, 4. స్థంభనము = వాస్తుక మనువు, 5. ఆరోహణము = ఇంద్రసేన మనువు, 6. గుంభనము=లోకవేత్తమనువు, 7. సూక్ష్మము = శ్రీముఖ ప్రజాపతి, 8. సూనృతము=సువర్ధకముని, 9.సుకృతము= యజ్ఞకర్త ఋషి,10.గంభీరము= కుశధర్మఋషి. వీరు జలభూత గుణంబుల బ్రహ్మర్షులు.

89. ఈ పదుగురు జల తత్వములను పాలించుచుందురని ఎరుంగుము. మరియూ భూభూత గుణంబులు తెల్పెదను వినుము.

90. 1. అన్యశోధన, 2. పాలనము, 3.అద్భుతము, 4.ఉపకరణము, 5.గుటక, 6. గ్రస్థము, 7.ఉపన్యాసము, 8.బేధనము, 9. సంతుష్ఠి,10.బోధా.యివి భూభూతగుణంబులు.

91. అది దేవతలు. 1.అన్యశోధన = మణిభద్రప్రజాపతి, 2. పాలనము = సువ్రత మనువు, 3. అద్భుతము = వేదవర్ధకమనువు, 4. ఉపకరణము = యజ్ఞముని, 5. గుటక = అర్వంతమనువు.

92. 6. గ్రస్థము = అర్చితమనువు, 7. ఉపన్యాసము = పరార్చిత మనువు, 8. బేధనము = కర్థమ ప్రజాపతి, 9. సంతుష్ఠి = కాంతిధర్మ ఋషి, 10. బోధా = సుదర్శన ఋషి. వీరుభూభూత గుణంబులకు అధిదేవతలగు బ్రహ్మర్షులు వీరు భూతత్వములను పాలించుచుందురని ఎరుంగుము. యిలా పంపకమై శరీర భాగములందు భద్రంగా పాలించుచున్నారు.

93. ఆధారాధి చక్రనిర్ణయములు : **వివరణ** ఈ చక్రములు ఏడు దేహమందుండును వినుము చెప్పెదను. (వీనులవిందుగా) వినసొంపుగా వినుము

1. ఆధారము 2.స్వాధిష్టానము 3. మణిపూరకము 4.అనాహతము 5.విశుద్ధము 6.ఆజ్ఞాచక్రములు వీటిపైన సహస్రారచక్రముంటుంది. ఆధార చక్రానికి 4 అక్షరాలు; స్వాధిష్టానచక్రానికి 6 అక్షరాలు, మణిపూరక చక్రానికి 10 అక్షరాలు. అనాహతచక్రానికి 12 అక్షరాలు విశుద్ధచక్రానికి 16 అక్షరాలు, ఆజ్ఞాచక్రానికి 2 అక్షరాలు, సహస్రారచక్రానికి వెయ్యి దళములుంటాయి దేవీ.

94. 1. ఆధారం, 2. స్వాధిష్ఠాన, 3. మణిపూరక, 4. అనాహత, 5. విశుద్ధ, 6. ఆజ్ఞా, 7. సహస్రారం. ఈ ఏడు చక్రములయందుండు, వారి వారి స్వవాహన, స్వశక్తి, స్వపరివార, సహాయుధ, వారివారి ఆసనములతో గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, జీవ, గురు, పరమాత్మలను మహాదేవతలు, ఆవర్ణమంత్రానుష్ఠాన విధియుక్తంబుగా గ్రంధులనత్తి కొందరు, కమలంబులకలసి కొందరు, ప్రాణోపానంబుల కలసి, శ్వాస, ఉశ్వాశలందు ఐక్యమై దేహమందు జీవుడు ఉండు వరకూ ఆయా స్థానములందుండి కదలక, సుఖ,

దుఃఖ, రాగ, ద్వేష, భయములనను భవించు చుండును, దేహానికి. నీడ రూపంబగు, విషయ, భ్రాంతులను, వదిలించు కోలేక, మాయలోపడి కోర్కెలను మహాపాశములచే బంధింప బడి, అందుండి వాటి అనుభవములు, సంపదను, ఆధికృతను పొందు చున్న శరీరానికి, యంత్రార్చనచేత, తత్వ అనుభవము చేత, మహా జ్ఞానమును సుగుణ వంతుడగు గురువు ఉపదేశము చేత మోక్షమును పొందగలరు. అది ఎట్లాగంటే వినుము.

95. **1. ఆధారచక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో నాలుగు అక్షరములు వ, శ, ష, స. అనునవి మూలధారము నుండి పలుకుచున్నవి. ఈ అక్షరములు పలుకుచున్నప్పుడు ఆధార చక్రమునందు కదలిక కలుగు తుంది. ఈ చక్రమునకు అధిపతి గణపతి.

**2. స్వాధిష్ఠాన చక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో ఆరు అక్షరములు బ, భ, మ, య, ర, ల. అనునవి స్వాధిష్ఠాన చక్రము నుండి పలుకుచున్నవి. ఈ అక్షరములు పలుకుచున్నప్పుడు స్వాధిష్ఠాన చక్రమునందు కదలిక కలుగుతుంది. ఈ చక్రమునకు అధిపతి బ్రహ్మ.

**3. మణిపూరక చక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో పది అక్షరములు డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, అనునవి మణిపూరక చక్రము నుండి పలుకుచున్నవి. ఈ అక్షరములు పలుకుచున్నప్పుడు మణిపూరక చక్రమునందు కదలిక కలుగుతుంది. ఈ చక్రమునకు అధిపతి విష్ణుమూర్తి.

**4. అనాహత చక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో 12 అక్షరములు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, అను 12 అక్షరములు అనాహత చక్రమునుండి పలుకబడుచున్నవి. ఈ అక్షరములు పలుకు చున్నప్పుడు అనాహత చక్రమునందు కదలిక కలుగుతుంది. ఈ చక్రమునకు అధిపతి రుద్రుడు.

**5. విశుద్ధ చక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో 16 అక్షరములు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ,ౠ, ఌ ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః అను 16 అక్షరములు విశుద్ధ చక్రమునందు పలుక బడుచున్నవి. ఈ అక్షరములు పలుకునప్పుడు విశుద్ధ చక్రము నందు కదలిక కలుగుతుంది. ఈ చక్రమునకు అధిపతి జీవుడు.

**6. ఆజ్ఞా చక్రము :** వర్ణమాల యందు ఉన్న 56 అక్షరములలో 2 అక్షరాలు హం, క్షం, అనునవి ఆజ్ఞా చక్రము నందు పలుకబడుచున్నవి, ఈ అక్షరములు పలుకునప్పుడు ఆజ్ఞా చక్రమునందు కదలిక కలుగుతుంది. ఈ చక్రమునకు అధిపతి ఈశ్వరుడు.

**7. సహస్రార చక్రము :** సహస్రారమునందు వేయి దళములతో పరమాత్మయైన సద్గురుమూర్తి ప్రకాశించుచున్నాడు.





7 చక్రములు ఆ స్థానములయందున్న గ్రంధులనుండి ఆయా గ్రంధులకు సంభంధము గలిగియున్న అవయవములకు రక్త ప్రసారమును, ప్రాణ వాయువును, తేజస్సును **శ్వాస ద్వారా** కలిగించి ఆ అవయవములను అనారోగ్యమునకు గురి కాకుండా చేస్తున్నవి.

96. ఆధారంలో గణపతి, స్వాధిష్ఠానమందు బ్రహ్మయు మణిపూరక మందు విష్ణువు , అనాహతమున విశ్వేశ్వరుడు, విశుద్ధమున జీవేశ్వరుడు అజ్ఞాచక్రమున సనారీ విశ్వేశ్వరులు, ఉందురు. సహస్రారమున సృష్టి కర్తయగు పరమాత్మ యుండును.

97. 1. ఆధారచక్రం 4 దళాల పై నాల్గు వ,శ,స,ష అక్షరములు. కుంకుమరంగుతో నిర్మలపాలకుడై మలద్వారంవద్ద నగ్ననారీ యుక్తుండై గణపతి యుండునది "ఆధార చక్రం". 2. బ,భ,మ,య,ర,ల యను అక్షరములు 6.దళములపై సింధూరపురంగుతో 1. మూత్రం, 2. యింద్రియం, 3. సంభోగం, 4. జీవి పుట్టుటకు ఈ నాల్గు పనులు జరుగుచోటున వారి వాహనములు, శక్తులు, ఆయుధములు, వారి పరివారములతో, వారి నిత్యకృత్యములతో సరస్వతీ యుక్తుడై త్వష్ట బ్రహ్మ గర్భములలో పిండములను తయారు జేసి జీవన ఫలంలిఖించుచూ, యిచ్ఛా శక్తితో కూడియుండునది "స్వాధిష్ఠాను చక్రం". 3. మరియు డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ యను పది అక్షరములు నీలి రంగుతో లక్ష్మీ యుక్తంగా విష్ణువు వారివారి వాహనములు వారి శక్తి, ఆయుధములు పరివారములతో, వారి నిత్యానుష్ఠానంబులతో అథోముఖంబు గానుండునది, "మణి పూరకము", యిందు జ్ఞానశక్తి సూక్ష్మ దేహమునంటి యుండును. 4. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట,ఠ, యను ఈ 12 అక్షరములు తెలుపురంగుతో ఓం నమః శివాయతో, పార్వతీదేవి, వారివారి వాహనములు ఆయుధములు వారి శక్తి, పరివారము లతో, నిత్యనుష్ఠాన యుక్తంబుగా, విశ్వేశ్వరులుందురు, దీనిని అనాహతచక్రమందురు. యిందు క్రియాశక్తి అధి దేవతగా యుండి, స్థూల, సూక్ష్మ అవయవములకు ఆధారమై యుండును. 5. మరియూ అ నుండి అః వరకూ గల పదహారు అక్షరములు, హంసతో కలసి, వారి వారి సవాహనములు ఆయుధములు, వారి శక్తి పరి వారములతో, నిత్యాను ష్ఠానములతో వర్ధక ప్రత్యసులతో (వర్ధకుడు, దేవేంద్రుడు) కలసి జీవుడుండునది "విశుద్ధ చక్రము". యింకా 6. హం, క్షం, బనురెండు బీజాక్షరములు గలిగి విద్యుత్ మెరుపులతో అజపయను మహామంత్రముతో అష్టమండలంబులతో, వారివారి వాహన, శక్తులు, ఆయుధములు పరివారములతో, నిత్యానుష్ఠానయుక్తంబుగా మహాకారణశక్తితో కలసి గురునామంబుతో సనారీ విశ్వేశ్వరులందుండుదురు. అదియే మహాకారణస్థానంబని శమాదిషట్కసంపత్తిగల మహాయోగజ్ఞానులు ఉపనిషత్‌ల వాక్యాధారముగా నిర్ణయింతురు. దీనిని "ఆజ్ఞాచక్రం"బని తత్వశోధకులు అందురు. 7.మరియూ ఐదు

దిక్కులందుగల రంగులతో అయిత్వేత్వ క్రియ కారులతో వేయిరేకుల మధ్య అణువువలే విరాట్ విశ్వకర్మ, పరాశక్తి, కారణశక్తి, చిచ్ఛక్తితో అమృతాంశుడు, వర్షఋతువులో వర్షించునప్పటి మేఘములవలే సకాలమందు ఎల్లపుడూ క్రింది దేవతలకు అమృతమును కురిపించును. దీనినే "సహస్రారకమల"మందురు, యిందు పరమాత్మ నివాసమై యుండును. షట్చక్రములందలి దేవతలకు ఆహారముగా నాడులద్వారా ఆధారము వరకు అమృతము నిచ్చును, విష్ణు పరముగా శరీరమందలి, 7 ధాతువులకు వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లము, అను ఏడింటికి వాయువుల ద్వారా చేర్చును. ఆపైన, "కర్ణిక, బ్రహ్మరంధ్రము" లను రెండు చక్రములు గలవు. వినుము.

98. కర్ణికచక్రం సహస్రారానికి చక్రగర్భ కప్పుపైన గలదు అందులో అనేక మాయాకారములున్నాయి. అవి ఆత్మశక్తిచే ధ్వనులు పుట్టిస్తాయి. ఆయాకర్మలను అనుభవింపచేయుటకు

99. బ్రహ్మరంధ్రం చిట్లి కాలం తీరిన జ్ఞానులకు పువ్వువిచ్చుకుని అందంగా కనబడు నట్లు, ప్రణవశక్తి సహాయంతో వారి సర్వకర్మలు కాల్చివేసివిరాట్ స్వరూపంలో కలిపి వేయును. (సృష్టికర్తయందు జీవుని కలిపివేయును) ఎలాగంటే మహాజ్యోతి నుండి అణురూపంగా బయల్పడిన చిన్న అగ్నిరేణువు మళ్ళీ ఆ మహా జ్యోతిలో కలిసినట్లుగా.

### పార్వతీ దేవి ప్రశ్న

100. ఆధారము నుండి సహస్రారం వరకూ గల చక్రము లందలి దేవతలకు హంసతో కలసి, ఉశ్వాశనిశ్వాల ద్వారా ఎంతెంత సంఖ్యగల జపారాధన తర్పణలు, ఏవరుసగా జరుగుచున్నవో తెలుపమని పార్వతీదేవి కోరగా.

### ఈశ్వర ఉవాచ

101. వినుము దేవీ గణపతికి ఆరువందల అజపజపముతో తృప్తిచెందును, బ్రహ్మకు ఆరు వేలును, విష్ణువుకు 6 వేలును, శివునకు 6 వేలు అర్పణలు నిత్యం జరుగును.

102. జీవునకు, గురువునకు, పరబ్రహ్మమగు విరాట్‌నకు వీరొక్కక్కరికి వేయి జపము జరుగును.

103. ఈ విధముగా సూర్యోదయమునుండి మరుసటి సూర్యోదయమునకు, 21,600 జపములు 7 చక్రములందలి దైవములకు హంసజపముతో అర్చనచేసి అర్పించవలయును. నీ మేళనంబుగా **వివరణ?** వర్గరహితంబు చేయుచూ మద వినాశనంబునొందించి ఆకలి, దప్పిక, నిద్ర మోహము, మైధునము, దుఃఖం, ఈ ఆరుయూర్ములువిడిచి, ధనేషణ, ధారేషణ, పుత్రేషణ వీటియందు విరక్తిచెంది, ధర్మ,





అర్ధ కామ, మోక్షంబులను సంకల్పముజేసి, రజ, స్సత్వతమోగుణంబులను విడిచి గుణరహితుడై, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక ఆదితేయంబులు మిధ్యయని తలంచి, భక్తితత్వజ్ఞాన వైరాగ్యంబులతో సద్గురువులగు సనారీ విశ్వేశ్వరుల పాదపద్మములందు మనసునిలిపి, రేచక, పూరకకుంభకముల యందు నివాసమై యున్న పంచవాయువులనుకనుంగొని, ఆజ్ఞా చక్రమందుగురి నిల్పి చలనము లేని, లోచూపుతో, శ్వాసను నిలుపు పద్ధతిని సాధన చేయుచూ, సంధ్యావందనం, నిత్యానుష్ఠానములు, న్యాసము, ధ్యానము, జపము, తపములతో నిన్నునూ, నన్ను అర్చించువారికి, నీవూ నేనూ ఒక్కటేయని కనుగొను వారలకు గాక, యితరులగు, వేరేపద్ధతుల నాచరించు వారలునీలో, నాలో ఎలా కలవగలరు. అలాంటివారికి తత్వము ఎలా సిద్ధిస్తుంది. వారు యిహలోకభ్రాంతిచే, సద్గురుని చేరు మార్గమాలో చించక, గత జన్మ ఫలాన్ని అనుభవించుచూ, శరీరాన్ని విడిచి, చీకటి లోకాలకు చేరుదురు. అని చెప్పగా, పార్వతీదేవి విశ్వేశ్వరునితో యిలా అంటున్నది.

104. ఎ) నాథా స్థూలదేహాన్ని గురించి వివరంగా విన్నాను సాధారణ పంచ భూతముల నుండి ముక్తికి మూలమగు సూక్ష్మదేహాన్ని పొందుమార్గాన్ని చెప్పండి.

104. బి) నాథా స్థూల శరీరాన్ని గురించివిన్నాను, పంచభూతసాధనచే కలుగు ముక్తిని బోధింపుము, భూమిపై సూక్ష్మ శరీరము వచ్చు విధానము తెలుపుము.

105. వినుమో పార్వతీ సూక్ష్మదేహమునే వీవరింతు ప్రత్యక్షంగా ఈ శరీరంలో 17 తత్వములు, ఎలాగంటే జ్ఞానేంద్రియములు 5 , కర్మేంద్రియములు 5 ప్రాణాలు 5 , మనసు బుద్ధితో కలిసిన 17 తత్వములు గల సూక్ష్మ దేహాన్ని నేను నిత్యం చూస్తుంటాను, ఈ రహస్యం నీకు చెప్తానువినుము.

106. ఈ సూక్ష్మ దేహమందు హిరణ్యగర్భుడగు బ్రహ్మదేవుడు అభిమానిగా నుండును, సూక్ష్మదేహాదిపతియైన తైజస్సుడుకంఠమందు సాత్వికముగా నుండును. అంతరాత్మచేత స్వేచ్ఛాభోగములను పొందును. ఓంకారనాదముచే, తనువు నిద్రనొందును. నిశ్చయభావము గల్గిన ఒక్కదానవే నీవు భార్యామణి.

107. వినుము సానగ, సనాతన, అహభున, ప్రత్నస, సుపర్ణసులను పంచబ్రహ్మలు ఈ దేహమందు సూక్ష్మావయములనంటుకొని కావలిగా ఉన్నారు. వారి వలననే శరీరమేర్పడినది. వీళ్ళే ఈ అనంతసృష్టికి మొదటి నుండి ప్రపంచంలోని అన్ని జన్మలకు తండ్రులు.

108. **పార్వతి ప్రశ్న :** నాధాకారణ దేహము గురించి వినవలెనని కోరికగా వున్నది. సూక్ష్మదేహము యొక్క కోరికతీరినది సంపూర్ణ కరుణ దృష్టిగల దేవా. ఆ విషయాలు సర్వమూ తెలుపుము.

109. **విశ్వేశ్వర ఉవాచ :** ఆనందము పొందుదారియిదే సుమా। ఆలోచన, మాట, నడవడి గురించి చెప్పటానికి అద్భుతంగా వుంటుంది. చెవులు విని, హృదయం గ్రహించబడును (అంతులేని జ్ఞానశక్తిని,) ప్రాజ్ఞులగు మహా జ్ఞానులనివాసస్థానమది దీనినే విరాట్ స్థానము అంటారు బ్రహ్మజ్ఞానులు. వారు శక్తి స్వరూపుణివగు నీ మాయావలలో చిక్కరుగా.

110. దీనిని విరాట్ అనుకొని అతనే పరవిశ్వబ్రహ్మయని చూడుము. ఎలాగంటే నీ కళ్ళతో లోచూపుతో శరీరాన్ని మరచి చూడుము. చేపల వంటి కనులుగల పార్వతీ.

111. తమోగుణముచే, సుషుప్తి అవస్థలో జీవుడు, పరమ ఆప్తుడగు ఆ విరాట్ విశ్వబ్రహ్మము నందుకలసి, అనగా ఆత్మను పరమాత్మలో కలిపి సుఖముగా నిద్రించునది కారణదేహము.

112. ఈ శరీరము లింగముగా నేనైతిని, దేవి నీవు పానువట్టము. నీ, నా శరీరములు కలసి శివలింగమై, మిక్కిలి ప్రసిద్ధినొంది, నరులు, దేవతలు, రాక్షసులు, చాలా లోకములలోని ప్రజలు శివపూజలు చేయుదురు.

113. శివలింగము పంచబ్రహ్మల యొక్క అంశములు, ఆ శివలింగానికి గల భాగములు ఎలాగంటే ఐదు భాగాలుగా పంచారు. పీఠాన్ని లింగం గుండ్రముగా ఉన్న దానికి.

114. ఆ లింగమునకు చుట్టూ నాల్గు కోణములు పీఠము చేసి మధ్య భాగమందు ఊర్ధ్వముఖంగా లింగాన్ని ఉంచారు.

115. ఆ స్థలములందు నివాసముచేయుసానగ, సనాతన,అభవన, ప్రత్న, సువర్ణులను పంచబ్రహ్మలు లింగాన్ని అర్చించువారికి వరములనిచ్చుచూ పాలించుచున్నారు.

116. శివలింగానికి పీఠమునీవయ్యావు పార్వతీ, నలుగురు బ్రహ్మలు పీఠం నలుమూలలందుండి. నన్ను బలపరిచారు, నేను విశ్వజ్ఞ మూర్తినై, విశ్వానికి మూలమైన వాడిగా ఆ పీఠముపై భాగమున ఉన్నాను. బ్రహ్మ ఆ పీఠానికి భూభాగమయ్యాడు. ఇలా అయింది శివలింగాకారము.

117. యిదేలింగము, పానుమట్టము మనమిద్దరమూ కలిసి లింగాకారంగా యున్నాము. మనల్ని పూజించిన భక్తజనులకు శుభములు జరుగును, ఆలోచనా తరంగములు పుట్టి పరమాత్మ యందు మనస్సులయమై, ఇహలోక సుఖములందు విముఖులై 14 భువనంబులు జయించినవారై మాయను జయించినవారగుదురు.

118. యిలాంటి భావాలు గల శరీరాన్ని అన్నము పోషిస్తుంది. అది లేకపోతేశరీరం నీరసించిపోవును, ప్రాణములున్నంతవరకే ఈ భూమిపై తిరుగగలరు.





119. వినుము అన్నరసంప్రాణము దానిచేత మనసు విజ్ఞానం కలుగును, దాని వలన ఆనందమయకోశము కలుగును.

120. ఈ పంచకోశములకు అధికారులు ఎలా ఉంటారో చెబుతాను వినుము.

121. 1) జీవుడు అన్నమయమగు దేహముతో కలసి అహంకారాన్ని పొందెను. 2) వ్యానవాయువుతో కూడి జీవుడు మనస్సయ్యెను, 3) పంచప్రాణాలును కర్మేంద్రియాలగు నోరు, చేతులు, పాదాలు, గుదం, మర్మావయవములతో కలసిన మనస్సు. 4) అట్టి మనస్సు జ్ఞానేంద్రియములగు, చెవులు, కన్నులు, ముక్కు, నాలుక, చర్మములతో కూడినదే, విజ్ఞానమయకోశం, 5) వీటితో కూడినదేబుద్ధి. ఆనందమయమనగా। జీవుడు సుషుమ్నలో కలియు సమయమునందు ఆత్మతోకూడినది చిత్తము, ఈ పంచ కోశములలో ఆనందమయమే ముఖ్యమయినదని తెలియుము. ఈ ప్రపంచమున పుట్టిన జీవరాసులన్నియూ అన్నమయమనియూ, "సంయాసంయములు" అన్నమయులు కారనియూ, జీవుడు+అన్నమయము = అహంకారము, ప్రాణమయను +వ్యాన వాయువు = మనస్సు, విజ్ఞాన మయుము + జ్ఞానేంద్రియములు = బుద్ధి, మనోమయం + కర్మేంద్రియములు = మనస్సు, ఆనందమయము+జ్ఞాతృత్వము = చిత్తము యివే శరీరమందలి అంతఃకరణాలు.

**-ః పంచకోశముల వివరం ః-**

| | | |
|---|---|---|
| 1. | సప్తధాతువులతో శరీరమందు అన్నరసంతో గూడి జీవుడైనదే | అన్నమయకోశం |
| 2. | పంచప్రాణాలు కర్మేంద్రియాలతో కూడినందున | ప్రాణమయకోశం |
| 3. | పంచప్రాణాలను కర్మేంద్రియాలనువేరుచేయగా | మనోమయకోశం |
| 4. | మనస్సు జ్ఞానేంద్రియాలతో కూడుకొనగా | విజ్ఞానమయకోశం |
| 5. | జీవుడు సుషుమ్నయందు అవిద్యలో లీనమైనదే | ఆనందమయకోశం |

122. **పార్వతీప్రశ్న :** ఈ శరీరంలో ఏమేమి ఎంత ఉన్నవో? ఏమేమి చేస్తుంటాయి, పాదాల నుండి తల వరకూ ఏదేవతలు పాలించుచున్నారో, ప్రణవనాదం ఎక్కడపుడుతున్నదో. ఆఖరికి అనేకములగు జననములు, ఎలాపుడు తున్నారు. ఏమి అనుభవిస్తున్నారు. నాకు తెలుపుము నాధా.

123. **ఈశ్వరు ఉవాచ :** వినుము అన్నము రక్తమై, అది ఎక్కువై యింద్రియమైరతి సల్పిన స్త్రీ భాగం ఎక్కువై అమ్మాయిగను, పురుషభాగం ఎక్కువైతే పురుషుడుగను, రెండూ సమానమైన నపుంసకుడుగను యిలా తప్పక పుట్టుదురు పార్వతీ.

124. **పార్వతీప్రశ్న :** యిలా శరీరములు కలిసినపుడు స్కలించిన యింద్రియములతో శరీరం ఎలాగయిందో ఆడ, మగ వారి యందు గల వస్తువుల సంఖ్య ఎంతయో, యిందలి రహస్యము లేమిటో అన్ని వివరంగా తెలియంజేయండి నాధా!

125. **ఈశ్వరు ఉవాచ :** యింద్రియము శరీరమగును అందుకఫము, రేపిత్తము, రక్తమగును వాతం, శ్లేష్మం, పుసీ, గులిమి, యామమారీతిగా వుమ్మి, రేతస్సు, మలము, మూత్రముల ద్వారములు నరములు అలాగే మాంసము, బొమికలు, యిటు చూడు ఎముక లందలి మూలుగు, వెంట్రుకలు, లెక్కలేనన్ని పేగులు.

126. పార్వతీ వినుము; రేతస్సుతో తయారయిన శరీరమందు 72 పెద్ద ఎముకలు, 72 వేల నరములు 33 మూరల పెద్ద పేగు జానెడు ఆహారపు పొట్ట (పుస్తకం లోనిది చెప్పాలి.)

127. వీటన్నిటిచే పుట్టిన దేహము, అన్నము వలన పుట్టి మళ్ళీ దానితోనే నశించి పోవును. ముక్తిని పొందుటకు సరియైనదారి యోగమార్గమే ప్రకృతి పురుషులను కన్నది. విరాట్ స్వరూపుడను నేనే. (విశ్వేశ్వర ఉవాచ)

128. వినుము ఈ శరీరము జీవంతో నుండి, జీవికి వేరగు భార్యా, ధనం, శరీర సంబంధమగు పిల్లల సుఖజీవనముకై భ్రాంతితో శరీర సంబంధ కార్యములు మోహము చేత చేస్తూ, జనులు భూమిపైకాలం గడుపుతారు శరీరమే శాశ్వతమనుకొనుచూ, బ్రహ్మపదాన్ని చేరరు సుమా అట్టిజనులు.

129. పుట్టినవానికి, పరలోకము పూర్తిగా ఎరింగిన పుణ్యమూర్తికి, చచ్చినవానికి, సత్వ, రజ, తమోగుణములు గెల్చినవానికి, ఏ పరిస్థితులలోనూ యిహలోక బంధములలో తగులు కొనరు. కామ, క్రోధ, లోభ, మధ, మోహ, మాత్సర్యము లలో జిక్కి జంతువుల వలే ప్రవర్తించువారి గురించి ఏమి చెప్పను?

130. **వచనం యధాతధం** (పదమూడు విధముల మానవుల స్వభావములు)

131. **1. "రాగము" :** అందమగు స్త్రీలు, సువాసనలు శరీరానికి సుఖాన్నిస్తాయని చూచిన వెంటనే గొప్పవాడు, శివపూజాదురంధరుడగు రావణబ్రహ్మ కోరుకుంటాడు. అమితమైన కోర్కెలతో.

132. **2. "ద్వేషము" :** ఎదుటవారి విద్యా బలాన్ని స్త్రీల యవ్వనమునకు అందమునకు, ధనమునకు, అలంకారములు చూచి ఓర్వలేక యితరులతో చెప్పుకోలేక ఉడుకుబోతు తనంతో పగబడతాడు హిరణ్యుడనురాజు.

133. **3. "కామము" :** కోర్కెలకు నరకాసురుడు సాక్షి ధనము, ధాన్యము, వస్త్రములతో కలసి రజోగుణముతో ఉంటాడారాజు, నాతో స్నేహం చేస్తే సర్వం నేనేయిస్తానంటాడు.

134. **4. "క్రోధము" :** తన సంగతి తెలిసిన నరుని చూచి, మనసులో అనేక ఆలోచనలతో తొందర పడుతున్నా. ఏమనడానికి నోరురాక ఆత్మలో దిగులు చెందుచూ,





తగని పనులను చూచిన వెంటనే చెడ్డదైన దొంగబుద్ధి పుట్టికోపము వచ్చును బకాసురుడను ప్రభువునకు చూస్తుండుసతీ.

135. **5. "లోభము" :** నేను సంపాదించిన ధనమును ఎవరైనా అడిగితే, "ఆగుము" ఛీ నీకివ్వనుపో అనును దుర్యోధనుడులోభ బుద్ధిచే.

136. **6. "మోహము" :** తన దగ్గరే ప్రేమ గల వస్తువులన్నీ ఉన్నా తన మేలుకోరు వారికి కూడా యివ్వకుండా దాచుటలో మొదటి రాజు దశరధుడు.

137. **7. "మదము" :** యోగ్యాయోగ్యతలు చూడకధనముతనకున్నదని పశువువలే ప్రవర్తించి, మంచి చెడులుగుర్తింపక మదముచే అజ్ఞానివలే కార్తవీర్యుడున్నాడు.

138. **8. "మాత్సర్యం" :** మూర్ఖత్వం తొందరపాటు భావంతో తిరుగుచూ తనకంటే ఎక్కువ ఎక్కడున్నదని అనడం, ద్వేషస్వభావం దీనికి చెందినవారు దంత వక్త్రులు, శిశుపాలుడు.

139. **9. "ఈర్ష్య" :** జరిగిపోయిన విషయాల్ని తలచుకొనుచు మంచిని సాధింపలేక బుద్ధి లేనివాడై ఎల్లప్పుడు ఓర్వలేని తనంతో ఉండువాడు అరుణాక్షుడు.

140. **10. "అసూయ" :** వినుము "అసూయ" తన చెవులతో ఎదుట వారి గొప్పలు విని, అదితనకు లేదని తనలో తానే సదా తలచుకుంటూ అసూయచెందుటే పౌండ్రిక వసుదేవుల పని.

141. **11. "దంబము" :** తన విద్యాబలాన్ని తనమదిలో తలుచుకుంటూ ఆత్మస్తుతి చేసుకునేది"దంబ"మంటారు. తన గొప్పలు తానేచెప్పు కుంటాడు అంబరీషుడు.

142. **12. "గొప్పలు" :** వినుము గొప్పలు తనకు తానే బయలు పరచితనకంటే ఈ భూమిపై ఎక్కువగువారెవ్వరని అన్యాయంబుగా పల్కువాడు అంబరీషుడు.

143. 13. "దర్పము" : నాకు గలరాజసంబేలోకంలో అందరికీ కలదని నాతో సమమగు రాజసము లోకంలో ఎవ్వరికి లేదని లోపల మురియుచూ మాట్లాడకుండా "ఠీవి"ని ప్రదర్శించు వాడు, శతకంఠరాము నిజంగా అతనే గొప్పవాడగును.

144. **14. "అహంకారము" :** తాను చేయుపని గొప్పదని తలంచి ప్రయత్నించి అదిసాధ్యం కాక పోతే చిరాకుపడినరులపై "హూంకరించు" మనస్సు గలవాడు మధుకైటభులు.

145. పార్వతీ ఈపదమూడు తత్వాలను బ్రహ్మజ్ఞానులు వదిలివేయాలి.

146. **పార్వతీ ప్రశ్న :** "జ్ఞానం" అజ్ఞానములలో గలమానసిక స్థితి దేహతత్వ పరిశీలనచే శుద్ధ జ్ఞానం కలుగుతుంది గదా అది ఎలా సాధ్యపడుతుందో తెలియజేయండి నాధా!

147. **ఈశ్వర ఉవాచ :** శబ్దం మొదలగు సర్వరూపసంబంధములైన చెవులు, చర్మము, నాలుక, ముక్కు కన్నులు జ్ఞానేంద్రియములు వీటిని గురించి తెలియాలంటే జ్ఞాన + తత్వముచే శోధించాలి, అలాంటి అంతఃకరణానుభవములగు మనసు, బుద్ధి, చిత్తం అహంకారములచే, జీవి బాగుగా తెలుసుకొనును. జీవుని తెలుసుకొనేది జీవసాక్షి యగును. యిన్నిటినీ గుర్తించేది "పరబ్రహ్మయనే ఎరుక" అదేతాను. తనకుమించిన వేరేతత్వమేమున్నది. యిటుల గుర్తు తెలియును ఒక్కొక్క దేహమందలి తత్వములు తెలుసుకొనుటకు యివి నీకు చెప్పాను. ఒకతత్వంతెలిస్తే, యింకొకటి తెలుస్తుంది యిలా వరుసగా అన్ని తత్వములు గుర్తించ వచ్చునుదేవీ.

148. యింకా తెలిసిన వస్తువు, తెలియని వస్తువులకు గల స్వభావ విజ్ఞానంబులు చెబుతావిను.

149. శరీరము యొక్క స్థితి యింద్రియాలకు తెలుసుకానీ శరీరానిదికాదు, యింద్రియముల ద్వారా తెలుసుకున్నవి అంతఃకరణాలగు మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము కానీ యివి యింద్రియములు కావని తెలుసుకో పుణ్యసాధ్వీ.

150. **గ్రంథంలోని విషయాలు యధాతథం.**

151. **గ్రంథంలోని విషయాలు యధాతథం.**

152. వినుము జ్ఞానేంద్రియములగు చెవులు, చర్మము, ముక్కు నాలుక, కన్నులు, లేక ఏ విషయములు తెలియవు. అంతఃకరణములగు, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములు లేక యింద్రియములు కనబడవు. గొప్పయైన జీవుడు లేకపోతే, అంతఃకరణములు లేవు.

153. జీవికి సాక్షియగు పరమాత్మ లేకుండా జీవం ఉండదు. ఈ మర్మం తెలుసుకో భామినీ సతీమణీ.

154. పార్వతీ వీటి యొక్క అన్ని విషయాలు చెబుతాను నీ ఆత్మ సాక్షిగా చూడుము.

155. పేరు, ఆకారం, పనులతోకూడినదీ.నాటకరంగం వంటిదీ ప్రపంచము, దేహమందలి ఇంద్రియములగు, చెవి, చర్మము, ముక్కు, నాలుక, కన్నులు వీటికి కరణములగు మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారములు తోడ్డై జీవిని విషయవాంఛలలో పెట్టును, శరీరధారి ఎల్లప్పుడూ విషయ వాంఛలతో యుండును. వీటిని గుర్తెరిగినవాడు విజ్ఞాన విషయములను సాధన చేస్తాడు. విజ్ఞానము పొందుటకు, బ్రహ్మన్ని తెలుసుకొనుటకు పరిపూర్ణ చైతన్యవంతుడు కావాలి. అలా లేకుంటే బ్రహ్మజ్ఞానం బోధపడదు, ఈ జ్ఞానం అంతటా నిండి పరిశుద్ధంగా ఉంటుంది. ఎలాగంటే వెలుగు వచ్చినపుడు చీకటి తొలగిపోయినట్లుగా, తెలుసుకొనుము తత్వవిధానము "మాని నీ





మణీ" సంయమీశ్వరుని మనోరత్నమా, చాలా మంచి గుణములు గల భక్తులను ఆదరించి రక్షించుదానా.

156. యిహలోక భ్రాంతులచే కలుగు దుఃఖములను మాపుకొనులక్షణములు ఎలా ఉంటాయో చెబుతాను విను పార్వతీ.

157. శరీరాన్ని విడిచిన దుఃఖంనశించిపోతుంది, కొన్ని యోగ క్రియలచే దుఃఖాన్ని జయించడం అలవడుతుంది, అలా ఉంటే ఏ పరిస్థితులలోనూ ప్రేమ, పగ దరిచేరవు, అభిమానం లేకపోతే ప్రేమ, పగలుండవు. మానాభిమానములు లేకుంటే యివేమీ ఉండవు. దీనమైనది అవివేకము, గొప్ప అభిమానము, జ్ఞానాన్ని పొందితే అజ్ఞానము పోవును. జ్ఞానము ఆత్మ కలియిక అజ్ఞానాన్ని చంపును. చూడు యిహలోకభ్రాంతులు, "వీటిని చూడరు. లెక్కించరు జ్ఞానముగలవారు."

158. ఆత్మజ్ఞాననిర్ణయంబులకై దేహము దేహములో గల దానిని చెబుతాను వినుము.

159. మట్టికుండవలెయున్న శరీరంలో నిండానీరు ఉండి పరిశుద్ధతలేని పాత్రలో మురికియున్నట్లు, ఎన్ని నీతివాక్యములు చెబుతున్నను విద్యాశూన్యులు గ్రహించలేరు భూమిపైనజనులు.

160. నీటిపై ఎలా ఆకారములుండునో అట్లే దేహంలో జీవుడు కూడా కలసి యున్నాడు, శరీరంలో ఆకాశకాంతితో సాక్షిగా జీవుడున్నాడు. తాను సాధకుడైతే చూడగలడు.

161. పార్వతీ నాల్గురకముల సాధనలక్షణములు చెబుతాను వినుము.

162. 1. శాశ్వతఅశాశ్వత వస్తువులను తెలుసుకొనుట, 2. యిహలోకమందలి భోగములందువైరాగ్యము చెందుట. 3. అంతరింద్రియనిగ్రహము, 4. చేయు కర్మలను జ్ఞానంతో క్రమముగా విడిచిపెట్టుట, శీతలం, ఉష్ణము, సుఖదుఃఖములందు సమబుద్ధి గలిగియుండుట. గురుబోధ, పరమాత్మ, వేదశాస్త్రములందు, విశ్వాసముగలిగి యుండుట, సద్గురు ఉపదేశములగు మహా వాక్యము లను శాస్త్రములందుజూసి మనస్సు తృప్తి పొందుట ఈ 4. మోక్షముపొందుటకు చేయుపనులు యివియే సాధన చతుష్టయములు.

163. వినుము నేనే "బ్రహ్మన్నని" యోగసాధనతో శరీర స్పృహ లేకుండా బ్రహ్మన్ని తెలుసుకున్నవారు. ఏది సత్యమో ఏది అసత్యమో ఏది నిత్యమగు వస్తువో ఏది అనిత్యమగు వస్తువో తెలుసుకుందురు పార్వతీ.

164. ఈ లోకంలో మంచి ఫలితాన్నిచ్చు మహాగొప్ప దగు బ్రహ్మంలో కలియుటకు, భువిపై "యింద్ర పదవివలదని మహాతత్వోపాసన మానకచేయుటయేతత్వసిద్ధికి మార్గము.

165. శమము, దమము, తపము, క్రమము, తితీక్ష, సమాధానము అనునవి నిర్మలమగు శ్రద్ధలు 6.

166. 1) "శమమునకు" మనో నిగ్రహము, 2) "దమనమనగా" జ్ఞానేంద్రియాలగు, చెవులు, చర్మము, నాలుక, ముక్కులు, యివి. వీటియొక్క ఆయాపనులు వదిలి ఏకోర్కెలు లేకయున్న వాడుతనతో తానుండును పత్నీ.

167. 3) మోక్షమును పొందుటకు ఏమి చేయవలయునో తెలుసుకొని, పాపపు పనులన్నియూ మాని వేసియున్నవాడు. దేవునికి సంతోషము కలుగ జేయును. అతనే విద్వాంసుడు అలా చేసేనరుని "తపము" నాలాంటిదే.

168. 4) మరియూ పార్వతీ, ఈ తపము చేయుమహనీయులకు మనస్సు ఆత్మ యందు కలియుకాలాన్ని "ఉపరతి"యందురు. ఆసమయమున పొందు అనుభూతియే "ముక్తికాంత", యిలా చేయలేక ఈ రహస్యము తెలియక మూఢ జనులు మోక్షాపేక్షులగు సువాసినీ, యోగినీలను ముక్తికాంతలుగా భావించి, వావివరుసలు తప్పి, క్షుణికమగు మోహావేశములతో లజ్జాభయములు లేక కామమదోన్మత్తులై శరీరతాపముచే నిముషసమయం మాత్రం సంభోగించి, బ్రహ్మతేజస్సగు ఆత్మేంద్రియ నిగ్రహంబు చెడి, తాను చేసిన ప్రమాణాన్ని తప్పి, దంపతీ హత్య, శిశు హత్య, గర్భహత్య, బ్రహ్మహత్యాది మహాపాపముల బడి, ఫలితంగా యింద్రియపానము, ఉమ్మితినుట, మూత్రపానము, క్రిమిభోజనము, మొదలగునవి చేయును, రౌరవము, మహారౌరవము, పందిముఖమును, మహా నరకంబులు మొదలగునవి వెంటనే అన్నియూ లేక కొన్నియూ, మరణించిన పిదప యమలోకమున అన్నియూ అనుభవించు చుందురు. యివన్నీ స్త్రీ సంపర్కముచే కలుగును.

169. 5) చలివేడులను, సుఖదుఃఖములను సమానంగా చూచువారు, విభూతి రుద్రాక్షలే మహాభోగముగా భావించి గొప్ప బ్రహ్మానుభూతిని పొందుదురు. అట్టివారు "తీక్షణంగా" మనసులగ్నం చేసి దివ్యమగు మహా ఆనందాన్ని అనుభవించెదరు.

170. 6) వినుము "సమాధానమంటే", చెవులకు విందుగా, వేద శాస్త్రములు, పురాణముల విషయములు గురువుగారు చెప్పినవి శ్రద్ధగావింటూ, మననం చేసు కుంటూ దైవాన్ని అప్పుడప్పుడు స్మరించుట.

171. గురువుగారు చెప్పిన మహావాక్యములను పదేపదే తలంచుచూ తదేక నిష్ఠాగరిష్ఠత్వంబుతో, యితర విషయములను వదిలిపెట్టి స్థిరమగు మనస్సుతో నుండుటే





**"శ్రద్ధయందురు".** ఈ లక్షణములు బ్రహ్మజ్ఞానులకు చాలా అవసరము, ఆచరించ వలసినవని తెలియుము.

172. మరియూ పంచభూతముల వలన కలుగు సాంఖ్యాలక్షణములు తెల్పెదను వినుము.

173. పార్వతీ ఆకాశశూన్యమందు + భూమికలిస్తే = మాటలు, వాయు కదలికలో + భూమి కలిస్తే = చేతులున్నూ, అగ్నివెలుగునందు+భూమి కలిస్తే = పాదము, నీటిసారములో+భూమి కలియగా = స్త్రీ పురుషుల మర్మస్థానము, ఆకాశ శూన్యమందు+జలసారము కలియగా= శబ్దము, వాయు చలనములో +జలరసాంశము కలసిన = స్పర్శయు, అగ్ని తేజాంశములో+జలరసాంశము గలసిన = రూపము, భూకఠినాంశలో + జలరసాంశము కలసిన=ముక్కు ఆకాశశూన్య మందు+అగ్నికాంతి కలసిన= చెవులు, వాయుచలనాంశలో+ అగ్నితేజాంశము కలసిన = నోరు, జలసారాంశంబులో +అగ్ని తేజాంశము కలసిన=నాలుక, భూకఠినాంశంబులో +అగ్ని తేజాంశము కలసిన= వాసన, ఆకాశబయలాంశంబులో+వాయుచలనాంశము కలసిన=సమానవాయువు, అగ్ని తేజాంశంబులో+వాయుచలనాంశంబు కలసిన =ఉదానవాయువు, జలరసాంశంబులో+వాయుచలనాంశ కలసిన=అపానవాయువు. భూ కఠినాంశంబులో+వాయుచలనాంశంబు కలసిన = ప్రాణము, జలర సాంశంబులో +భూకఠినాంశ కలసిన = అహంకారము, అగ్ని తేజాంశంబులో +జలరసాంశంబు కలసిన=చిత్తం, వాయు చలనాంశంబులో+అగ్ని తేజాంశంబు కలసిన = బుద్ధి, ఆకాశబయలాంశంబులో +వాయు చలనాంశంబు కలసిన = మనస్సు, భూమినీటిలో, నీరు నిప్పులో, నిప్పుగాలిలో, గాలి ఆకాశములో, ఆకాశము కళలో, కళ బిందువులో, బిందువునాదములో, నాదము నీ శక్తిలో, శక్తినాలో, నేను పరమాత్మలో, పరమాత్మ నా హృదయంలో కలసియుండును. మరియూ నా హృదయము, సత్వ, రజ, తమోగుణముల కధికారులగు, బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులు, సూర్యుడు, చంద్రుడు, అగ్నియు, నక్షత్రగ్రహరాశి మహామండలములు, నీటిలో ఉండునవి, భూమిపై నుండునవి, ఆకాశమార్గమున సంచరించు అన్ని జీవరాసులు, జంతు జాలములకు స్వర్గము, నరకమను గొప్పసుఖములకు నిలయమైయుండును. అది ఎట్లాగంటే.

174. దేహము పరబ్రహ్మరూపమగు బ్రహ్మ పట్టణం, పాతాళం పాదము, పరబ్రహ్మమే శిరము, కోటయే చర్మము, రోమములు దేవతలు, ఈసురులు శరీరం చుట్టూ భటులవలే యుందురు, శరీరానికి ద్వారాలు 9. షట్ చక్ర(సంచారులు)ములు, పండితులకు విద్వాంసులకు ముఖ్యమైన నోరు, విషయేంద్రియాలగు నోరు, చేతులు, పాదాలు, గుదం, మర్మావయము వీటి ద్వారా జరుగు కార్యక్రమాలు ఎవరికి తగు దేహధర్మాలతో

అవినడుస్తుంటాయి. చూడడానికి స్త్రీ పురుషులు అందంగా ఉంటారు. నిన్ను తెలుసుకొని నీలో కలసిన వారికి గాఢమగు విజ్ఞానాన్నిచ్చు ముక్తి కాంతవు నీవు, దేవీ తత్వ సాధకులకు నిలయమైనది ఓంకారనాదం, పుట్టించి, పోషించి నాలోకలుపుకు నేది ఈ భూమిపైనా పని.

175. సప్తధాతువులు శరీరమందలి నెత్తురు, చీము, జలము, భూస్త్రానమగు మర్మావయములతో అనుభవించు భోగము ఆనందము, దశవిధనాదములు నాతోనే కలసి ఉంటాయి అనేకరకములుగా. (నేననగా బ్రహ్మము) అహం బ్రహ్మోస్మి

176. **పార్వతీప్రశ్న :** ఈ విధంగా ప్రపంచమేదేహమై, దేహమేప్రపంచంబైయున్న ఈ మొత్తానికి అధికారులెవరై ఉంటారని, చేతులు జోడించి వినయ విధేయతలతో పార్వతీదేవి అడుగగా, విశ్వేశ్వరుడింట్లనెయె.

177. **ఈశ్వర ఉవాచ :** సర్వరూపములగు మానవ, పశు, పక్ష్యాదులకు, ప్రాణప్రధాత త్వష్ట బ్రహ్మదేవుడు. సర్వప్రపంచములలో ఆకారములు చేయు శిల్పిబ్రహ్మ దేవేంద్రుడు. అలాగైన సర్వజీవములను పోషించునది విష్ణువు, సర్వకాల సర్వవస్థ లందు కాపుండునది విశ్వకర్మ భగవానుడు, అలాగు యిహలోక, పరలోకములను పాలించునది విరాట్ విశ్వకర్మ భగవానుడొక్కడే.

178. చాలా రూపములను చేస్తాడా ప్రభువు సర్వాధికారి. స్వయంభువు, అన్నిటా తానుండిఎచటా ఎవరికీ కనుపించక, స్పర్శకదలికలతో సృష్టి యంతటా గాలివలే, మహా ఆకారుడై ఈ విశ్వాన్ని పాలించు సృష్టికర్తసామాన్యుండటే పార్వతీ, ఈ లోకంలో జీవులను రక్షించి పోషించిలయించు భగవానుడు. పంచబ్రహ్మలమగు మాకు మా దేవుడు మా జనకుడు విశ్వకర్మభగవాన్.

179. ఈ చరాచరజగత్తు సర్వమూ ఆవిశ్వకర్మయే, ఆయన్నితలచినంత మాత్రముననే సర్వకార్యములు ఫలించును, నేనెప్పుడూ ఆవిరాట్‌నే సేవిస్తాను. మమ్ముకాపాడుము విశ్వకర్మ అనేక కల్పాలను నడిపించుదైవమా.

**(విశ్వేశ్వరుడు చేసిన విశ్వ బ్రహ్మాస్తవం)**

180. నీయాజ్ఞతో గదా లోకములు ఏర్పడినవి, మహాగొప్పవాడివై ప్రకాశించెదవు. ఏమాయాతంత్రములు నిన్ను చేరవు. మాయకు అతీతుడవై చేయవలసిన పనులన్నియూ నీనీడచేసాధ్యమయ్యాయి, ప్రతీ యుగమందూ నీవు ఉంటావు, అసలు కాలస్వరూపానివీ నీవే బ్రహ్మమా.

181. జగములనెడి సర్వలోకాలు సృష్టిచేసావు నీసామర్థ్యమగు బుద్ధిచే జంతు జాలాన్ని సృష్టించావు, ఆదిమధ్యాంతరహితమగు అనంతములైన పనులన్నియూ మంచి నేర్పుతో





చేసావు. నీలో సగభాగము మేమందరము జగమంతాకలసి కూడా లేము, శాశ్వతమగు మహాసంపదలతో నీవున్నావా? మహాకాశాన్ని నిర్మించిన గొప్ప ఆకారంతో నున్న ఓ విశ్వేశ్వరా.

182. ప్రకాశించు ఆకారములన్నిటిలో నీ దైవత్వము ఉంచితే, ఆవేదాంతులు సంయమీశ్వరులకు గూడా, ఆత్మను ఆజ్ఞాచక్రమందుగల లక్ష్యమునందు నిల్పితివా? నీ ఆకృతిన్ నాకుచూపవా? శిలగాలేవు, దరిచేరితే తీసుకోలేవు, ఎలాంటి మాక్షేమాన్ని కోరి అక్కడున్నావో మరి.

183. నీయొక్క బరువు ఎంతో, పరిమాణమెంతో, మరియూ అంతా కలసి తూకంబెంతౌనో, జగత్‌లో నీకు గలగౌరవమెంతో, అలాగు కొలత ప్రకారం (ఆమానము) బరువు ఎంతయిందో, దేనికీ తెలియరావు. ఆకాశమువలే గంభీరుడవు, నీ శరీరము ఎలాఉన్నదో, మేము ధ్యానం చేయుటకు దాచుకొంటివ హహా! అనేక కల్పాలు ఈ మిధ్యాలోకాన్ని నడపడానికా ?

184. నీకు కళ్ళు ఎన్నో, నోరులెన్నో, నీకు గల భుజములు, చేతులు, నీకు గల పొట్టలెన్ని, రొమ్ములెన్ని, నీకు చెవులెన్ని, కంఠములెన్ని, బొడ్డులెన్ని, మర్మావయవములెన్ని, పిరుదులు, తొడలు, పిక్కలు, పాదములు ఎన్నియున్నవోగదా.

185. నీవు నిల్చునేచోటు, కూర్చునే చోటు, పని చేయుటకు నిర్ణయించిన చోటేది. నీవుతిరుగుటకు, పరుండుటకు స్తలాలుఎక్కడో? నీచమత్కార రూపకల్పనలు ఎక్కడ చేస్తావో, నీదెలాంటి మహిమయో, మాయయో, బలమో? ఉదాహరణగా చెప్పుటకేమీ కానరాదు. ఓ అంతులేని అనంతమూర్తీ మావశమా నిన్నుస్తుతించుట, అహో అద్భుతంబిది.

186. నీకు బాల్యమో, యవ్వనమో, వృద్ధాప్యమున్నదో, లేకపోతే రాజులా ఉన్నావో, రక్షకుడిగా ఉన్నావో, వీరునివలే పరాక్రమముతో కొట్టుటకు ఉంటివో, లేక వృక్షమువలె కూర్చుండి తపము చేయుటయే వ్రతముగానుంటివో ఒక్కవీసమైనా చెప్పటానికి ఆలోచించటానికి ఏమీ తెలియకుండా ఉన్నావు. పంచభూతమయమగు మానవశరీరంలో ఏదైనా లోపమున్నదా విశ్వేశ్వరా ! నినుతెలియలేకున్నాము ప్రభూ।

**: అనంతుడుమొదలగునవ నాగులను :**

187. దేవతలు, అనంతుడూ మొదలగునాగులను, మరియూ అష్ఠదిగ్గజములను, రాక్షసవీరులను, విష్ణువు, బ్రహ్మ, ఈశ్వరులు, సిద్ధులు, మునీంద్రులు, సాధ్యులు, సాధకులు, నరులు, మృగములు, పక్షులు, యక్షులను, సర్ప జాతులను దేవతలైన అష్ఠదిక్పాలకులను, అనేక నగరములు, పుణ్య వంతులగు వారిని వీరందరిని చేసిన బ్రహ్మదేవరా. విశ్వకర్మభగవాన్ !

188. **పార్వతీదేవి విశ్వకర్మను చేయు ప్రార్థన:** నీ ఆదీ, అంతమూ తెలియదు, శరీరమిదియని ఊహించలేము, వేయి విధములుగా ఆలోచించినా అర్థం కావడం లేదు, మా అన్నా విశ్వకర్మమమ్ములనుకాపాడుము.

189. అన్నాయని, అమ్మాయని ఈనాలుకతో ఎన్నో మాటలనవచ్చును, అన్నాయని ప్రార్థిస్తున్నారావేమన్నా, ఓ విశ్వకర్మమమ్ముల కావగరావే.

190. మేము చేసే పనులు నీపూజలే, అవి లోకములన్నీ నిండివున్నాయి. శాశ్వతము, అశాశ్వతము, తెలుసుకొనుటకు మేమెంత వారము, మాకు గల కొంచెము జ్ఞానముతో! **విశ్వకర్మా** మముబ్రోవగదే.

191. దీనులను రక్షించువాడా, ముందుగా మమ్మల్ని కరుణతో ఉద్ధరించి సర్వకాలమూ మాలోని సహస్రారకమలమందుండి మాకు అభివృద్ధినిచ్చి కాపాడుము **విశ్వకర్మా.**

192. వేయి విధములుగా నిను ప్రాధేయపడుతూ పిలిచినాము. తరగని ప్రేమతో మమ్మల్ని మాయలో ఉంచకు మా తండ్రీ విశ్వకర్మమముబ్రోవగరాదే.

193. లోకములను సృష్టించిన భగవంతుడా, సర్వదేవతలను పాలించు దేవాదిదేవా. లెక్కలేనన్ని యుగములు నడిపించిన పురుషుడు వగు విశ్వకర్మా మముబ్రోవగరావే.

194. కదిలేవి, కదలలేని ఆకారములను ఎల్లపుడూ నీ సంకల్పముతో చేస్తూ, భోగములకు అవకాశం కల్పించిన దైవమా, మమ్మల్ని మరచిపోయావేమి, విశ్వకర్మమము బ్రోవగరావా.

195. ఈ భూమిపైన మమ్మల్ని నరులుగా సృజించి, లోకంలో గల అన్నిరూపాల్ని మా కంటికి పశువులుగా ఉంచావు. మమ్మల్ని పాలించు విశ్వకర్మా మము బ్రోవగదే.

196. పాపకార్యములందు మనసు పోనియ్యక, కొంచెం కూడా కోపం ఈ శరీరానికి రాకుండా చెయ్యి, ఆపదలనుండి కాపాడు, తొలిదైవమగు విశ్వబ్రహ్మమా, నీవు మాకు రక్షకుడవై యుండు. మా ప్రార్థనలు వినుముదేవాదిదేవా!

197. ఈ విధముగా అంతర్వీధియను సాధకులు హృదయాంతరంగమందు, తపోనిష్ఠులై దేవాది దేవుండగు విరాట్ విశ్వబ్రహ్మమును ధ్యానించి తన ఆత్మను పరమాత్మయందైక్యము చేసి ప్రార్థించగా. ఆ మహాదేవుండు అపరిమితా నందముతో భక్తవాత్సల్యంబునయింత అంతయని చెప్పలేనంతమహా వెలుంగై సాక్షాత్కరింప, ఆసాధనాదంపతులు **ఆమహా తేజస్సును చూడమానవ నేత్రంబులు** భరించలేక అర్ధనిమీలితనేత్రులై శరీరస్పృహలేక శ్వాసను బంధించి, వాయువును శరీరంబున నిలిపి, మనసు, బుద్ధి, చిత్తమును ఒకటిగా జేసి, జ్ఞానేంద్రియములగు చెవులు, చర్మము,





కన్నులు, నాలుక, ముక్కు, కర్మేంద్రియములగు నోరు, కాళ్ళు, చేతులు, గుదము, మర్మావయములను అదుపుజేసి, వర్గంబులగు 25 తత్వములను శరీరము నుండి తొలిగించి, ధనేషణ, ధారేషణ, పుత్రేషణయను ఈ షణత్రయంబులను ఆపివేసి, మనస్సు నందలి ఆలోచనలను నిలిపి, ఆకలి, దప్పిక, నిద్ర, మైధునం, శోకము, మోహము, అనుయూర్ములను ఆపి, ఆత్మ యింద్రియమును వీణాదండంవలే నున్న మేరువపై భాగమున ఉంచి, ఖగోళము కన్నాపైగల శింశుమారంబను మానవ శరీరమందలి కంఠానికి దవడలమధ్యనున్నవి శుద్ధచక్రాన్ని అడ్డంగా త్రిప్పి, ఉలవల వలే నున్నట్టి సహస్రార చక్రం అటూయిటూ ఊగుచుండగా, స్వర్గమనే మాణిపూరక చక్రాన్ని తిరగవేసి. భూలోకమనే ఆధారచక్రాన్ని మూసి, దృవలోకమనే ముక్కుపైభాగమునపంచ భూతములను నిలిపి, అరుంధతియనే నాలుకను యధాస్థానమందుంచి, రధంబులను రెండుకళ్ళ దుష్టిని ఏకంచేసి, ప్రాణాదిపంచవాయువులనుకలిపి, భేరీ, ఢంకా, మృదంగములు లయ బద్ధంగా ధ్వనివినిపిస్తుండగా, పనస, రుంజమ్రోతలు ఆకాశాన్నంటు చున్నట్లుగా పెరుగుచుండగా బొడ్డుదగ్గరగల మూడు నాడులు స్థూల, సూక్ష్మ, కారణ దేహములకు మూతవేసి బిగుతుగా కట్టి, శరీరము వణకగా దానిని శాంతింపజేసి, అతివేడిని చల్లదనంతో దేహానికి శూలరాకుండా జాగ్రత్తపడి తలబాధకు, తలపైభాగాన్ని అదిమిపట్టి, శరీరమందలి సప్తధాతువులగు, మూత్రము, చెమట, యింద్రియము, శ్లేష్మము, పాలు, శోణితము, కన్నీరు, యివన్నీ బయటకు వస్తుండగా దేహమందలి సప్తచక్రాలు వణకంగా, శబ్ధాలమ్రోతతో దశదిశలు దద్ధరిల్లంగా, ఆలోచనలు గల్గించు మేధస్సు గల శిరస్సుగిరగిరా తిరుగంగా, యిడా పింగళనాడులు వాటిస్తానాలు తప్పగా, ఆజ్ఞేయమనే భృకిటి యందు మహాప్రకాశంతో జ్యోతి వెలుగుచుండగా, మనసు, బుద్ధి, చిత్తము, అహంకార మనెడి అంతరింద్రియములు శరీరానికి శక్తినిస్తుండగా, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి అరిషడ్వర్గంబులు పొగలు,సెగలు కాగా, సాధనచతుష్టయంబులగు 1 నిత్యా నిత్య వివేకము 2. యిహాముత్తరార్ధ ఫలము, 3. శమాదిషట్కసంపత్తి, 4. ముముక్షత్వములు తూర్పు, దక్షిణ, పడమర, ఉత్తరదిశలు కాగా, బ్రహ్మసాధనములుగా శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానములను ఆరు గుణములు కలిగి, సామవేదప్రకారముగా పాలకొయ్యయనే విశ్వబ్రహ్మకు సాధకులమనస్సు అనే అశ్వమును కట్టి "యజ్ఞకర్తయను", రక్త జీవుడు ఆత్మయనే హృదయాగ్నిని ప్రజ్వలింపజేసి, తెంపుయనే కత్తిచేతబట్టి, తనకు గల మాయనుత్రెంచి, కర్మయనే నేతితో అగ్నికి ఆహుతులిచ్చి, అందుండి బయల్వడు జ్వాలలేవిరాట్ యని ఆత్మలో ఆనందపడుచూ, ఆకలియనే శరీరాంగములకు, ప్రాణ వాయువుల చేత జీవిని సంతుష్టుని చేయుచు, భార్యాసహితంగా పద్మాసనంలో నుండి,

వారినాభిక్రింద గుడ్డువలేనున్న మాంసపు పొరను హోమములో ఆహుతి చేయుటకు, స్రుక్కుస్రువంబుల చేత బట్టి, వేద ప్రకారముగా తదేక దీక్షతో పరమాప్తుడగు విశ్వబ్రహ్మకు ఆహుతుల్నిస్తూ, తాజేయు గొప్ప యజ్ఞమున విరాట్ పురుషుని స్తుతించగా, సృష్టికర్త బ్రహ్మానందముచెంది, అశరీరవాణిగా ప్రళయ కాలమందలి ఉరుములు వంటి శబ్దముతో, ఆ విరాట్ విశ్వ బ్రహ్మయిట్లనియె.

**"పార్వతీవిశ్వేశ్వరులను విరాట్ విశ్వ బ్రహ్మ ఆశీర్వదించుట".**

198. కుడి ఎడమ రెండు వైపులలో పుత్రుడు భార్యతో, హృదయంలో పద్మాసనాసీను డగు పరబ్రహ్మము, మొలచుట్టూ శిష్యులు, శ్వాసలందు భక్తులు, కనులనిండాముక్తినిచ్చు గురుడు ఏడు చక్రస్తానాల్లో వీరందరూ ఆసక్తిగా ఉంటూ విజయము ప్రతిభవైభవములతో వర్ధిల్లుచూ, మంచి జ్ఞానముతో మనస్సునిల్పి, నేనే బ్రహ్మమనుయిహలోక భ్రాంతినివిడిచి, మనస్సులో పరలోక భ్రాంతినిస్థిరంగా ఉంచి, తమ వశమందలి యిహలోక బంధములలో చిక్కుకొనరు నాలో చేరాలనుకునే సాధకులు, శరీరమూ మనస్సు సర్వమూ నావిగా తలంచువారు.

199. పాదములు, శిన్నములు, చేతులు, పాలభాగము, నవరగంత, ముక్కులు, తలలును బ్రహ్మాండమంతా (సృష్టిమొత్తం) నిండి ఏమాత్రమూ కాళీ లేకుండా యిహలోకనిత్యకృత్యములు. పరలోక సాధనములు చేస్తుంటారు శరీరమున్నంత వరకూ.

200. ముక్కు, చెవులు, కళ్ళు, నాలాగ మాటలు, నాలుక, ముక్కులే ఏ సాధన చేయుటకైనా, విసుగు చెందక ఒక దానిని మరొకటి విడవకుండా ఉంటాయి.

201. మూడు తలలు నాడులు గల విశ్వనాధా, భక్తుల దైవమూర్తివి వరమడుగు మిపుడు సమస్త శిరులను పొంది స్థిరమగుతత్వ జ్ఞాన స్వరూపుడవై నిండియుండు

202. యిలాగు అనంతమగు ప్రకాశంతో (మహాకాంతితో) అసత్యమగు కోర్కెల ప్రపంచంలో చిక్కుపడక స్థిరంగా యోగమందుండుమని విరాట్ విశ్వబ్రహ్మ పార్వతీ విశ్వేశ్వరులను ఆశీర్వదించెను.

## విశ్వకర్మస్తవము

203. మొదట అణువుగాకన్పించి, అంతలోనే అంతులేనిదై ప్రపంచం అంతా నిండి, యింకాపైకిలేచి (నక్షత్ర) ధృవమండలాన్ని ఆక్రమించి ఆ మొత్తాన్ని నీలో నింపుకొని, అధ్భుతముగా కనులకుకనుపించుచూ ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగించుచుంటివి. అహోమొత్తందైవములందరూనీలోనే గల ఆదిదైవమా, విశ్వమంతా నిండి విశ్వాన్ని సృజించిన వాడా, చేతితో ఏ పనీ చేయని విశ్వబ్రహ్మావో?





204. నీ పాదములు ఎక్కడ ఉంచావో, పాదాలపై భాగము ఎక్కడ ఉన్నవో, ఆ పైన పిక్కలు, మోకాళ్ళు, తొడలు, ఆ మీద మొలప్రదేశము, రొమ్ముదానిపై కంఠము, నోరు ఆ మీద బుగ్గలు, ముక్కు, నుదురు ఎక్కడ ఉన్నాయో నీ శరీరమెంతో చూడలేముగదా.

205. చూచుటకు ఈ కనులకు కనబడవు,ఎప్పటినుండో యున్న అందరికీ ఆధారమైన ఆది పురుషుడవు, నిన్ను నా లోచూపుతో చూచితిని, అన్నా శ్రీ విశ్వకర్మ ఈ సర్వసర్వంసహా సృష్టికి ఆధారమైనదేవానమస్తే.

206. దీనులను రక్షించు సర్వాంతర్యామివి. దివ్యమైన రూపము గలవాడా. సృష్టి అంతటికీ ప్రభువా. కంటికి కనుపించని దివ్యతేజస్సు గలవాడా, విశ్వాన్ని భరించి, విశ్వనిర్మాణానికి కారకుడవై విశ్వాన్ని సృజించినవాడా పరలోకాన్ని సృజించి కాపాడే విశ్వకర్మా.

207. జ్యోతివలే వెలిగి దారిచూపువాడా, భూమిపై గల 84 లక్షల జీవరాసులన్నిటినీ పోషించు పుణ్యమూర్తి, రాతిలోనున్న కప్పకు సైతము ఆహారాన్నిచ్చి పోషించినట్లుగా, మాకు మోక్షానికి దారిమ్ము శరణుశరణు.

208. అనియిలా విరాట్ విశ్వబ్రహ్మాన్ని దంపతీసమేతముగా చేయుచున్న ప్రార్ధనలకు, దేవాదిదేవుడు ఆనందించి మీరు కోరినట్లేయగు గాకయని పార్వతీ విశ్వేశ్వరుల హృదయ పద్మములందు గల వేదకపై స్థిర నివాసమునకై సింహాసనాధీశుండయ్యెను.

209. ముఖముఒకటి, యిడాపింగళ సుషుమ్నానాడులు మూడు, పంచ వాయువులుగలనాడులతో కలసి 8 నాడులయి 10, 25 వందలకు పైగా యిలా లెక్కకురానన్ని నాడులు చూపుకు అంతుచిక్కక ఆది అంతములు తెలియుట లేదు ఈనాడులు.

210. యిలాగు చూపుకు లెక్కకు అంతు చిక్కక ఐదుముడులతో, సప్త కమలాలు (7 చక్రములు) దేహమందు ఒకొక్కస్థానానికి ఒక్కొక్కరు ఆధిపత్యంవహించి, వారివారి పనులు నిర్వహించు చుందురు. యిదంతా విరాట్ పురుషుడగు విశ్వకర్మ మహిమతో.

211. నాధా 1,2,3. వరుసగా 8 తలలు చూస్తున్నాను యివి ఏమి చేస్తుంటాయో చెప్పండి నాకు, విశ్వనాధా వివరముగా కనులకు చూపుము.

212. సుషుమ్నానాడి ఒకటి బ్రహ్మజ్ఞానంతో యిహలోకసంబంధమగు విజ్ఞానమందలి జ్ఞానాన్ని పరిశీలిస్తుంది. దానికి యిరువైపులాగల యిడా పింగళనాడులు యిహలోక పరలోక విషయాలు తెలియక చలి, వేడిమి మాత్రమే తెలుసు కొనుచూ శరీరధాతువులకు లోనైకేవలం జీవికి మాత్రమే సంబంధం కలిగి ఉంటాయి. పంచవాయువులు సర్వస్వతంత్రములతో బ్రహ్మాదులకైనా చిక్క కుండా దేవతలకు దొరకక తమ కార్యములు

అవి జరుపుతుంటాయి. వీటిని చూచిన వారు, వాటిపనులను చూచిన వారు గానీ పార్వతీనీకు తప్పయేలోకములో ఎవ్వరికీ సాధ్యపడదు. ఈ ఎనిమిదిలో రెండు నాడులలోని వాయువులు గుదస్థానము నుండి శరీరమంతా సంచారముచేస్తూ తిరిగి గుదస్థానము చేరి శరీరాన్ని వదలకుండా శరీరంలోనే ఉంటాయి. ఒకటి ప్రాణవాయువు పుట్టుట, పెరుగుట, గిట్టుటకు అధికారము గలిగి జీవకార్యములు చేయుచుండును. మిగిలిన రెండునూ గుదస్తానమునుండి, బొడ్డుదగ్గర - భూలోకం, పొట్ట - భువర్లోకం, హృదయం- సువర్లోకం, రొమ్ము- మహర్లోకం, కంఠమందు- జనర్లోకం, కనుబొమలమధ్యన - తపోలోకం, శిరస్సు బ్రహ్మలోకాలు తిరిగి మరల గుదస్థానము చేరి శరీరాన్ని వదలక కలసి ఉంటాయి. ఒకటి పుట్టుట, పెరుగుట, గిట్టుటకు అధికారము గలిగి సృష్టియే ఎక్కువగా తలచి చేస్తుంది. యింకా రెండుపైన చెప్పిన ఏడు లోకాలు స్వేచ్ఛగా తిరుగుచూ చేతనైన, చేతకాని పనులు చేయుచూ అన్నీ పుట్టుట, పెరుగుట, గిట్టుటకు తమ సొంత పనులుగా తలంచి చేయుచూ ఒక్కొక్కప్పుడు అధోలోకములగు అతలం-అరికాళ్ళు, వితలం-మీ గోళ్ళు, సుతలం-చీలమండలు, తలాతలం-మోకాళ్ళు మహాతలం-తొడలు, రసాతలం - కటి ప్రదేశం, పాతాళం-గుదస్తానము, ఈ ఏడులోకాలు స్వేచ్ఛగా తిరుగుచూ, ఎక్కువ తక్కువలు తెలియజేయుచుండు, మరి రెండులో ఒకటి నిదానమగునడకతో ఎలాంటి పనులు చేయక ఎక్కడా తిరగక దాని చోటులో ఉండును. యివి అన్నీ కుమ్మరిచక్రమువలే ఏమాత్రమూ కాళీ లేకుండా ఈ శరీరమంతా నిండియున్నవి. మరియూ దేహ మందు లెక్కలేనన్ని నరములు, అనేకములగు అవయవములు, ఎముకలు కీళ్ళు అవి చేయు పనులు నిర్విరామంగా చేస్తుంటాయి. రోగములు పోగొట్టుటకు ఒకటి, యిహలోకకార్యములకు ఒకటి, బ్రహ్మ రూపముగా సర్వచక్రములందలి దేవతలకు ఆహారము నిచ్చునది యింకొకటి ఈ మూడును ముఖ్యమైనవిగా, అలంకారముగా రెండు మొత్తం ఐదు వాయువులు శరీర సంబంధములై ఆయాసమయములలో తిరుగుతూ వాటి పనులచే శరీరానికి ఫలితముల నిస్తుంటాయి. పార్వతీ వీటన్నింటినీ కంటితో చూడుము.

213. శరీరమందు సప్త చక్రాలు గలవు, ఆ చక్రములందునివాసమైయున్న అధిపతులు వారి స్వశక్తులతో, సపరివార సమేతంగా ఆయాస్థానాల్లో నివాసమున్నారు. నేను ఆజ్ఞా చక్రంలోయున్నాను. మోక్షంపొందు ఆదికారణమగు సాధన మందగించితే జ్ఞానాన్ని గ్రహించ లేరు పార్వతీయివన్నీ చూడు నీవు.

214. గాలి, నీరు, నిప్పు, ఆకాశము, భూమి ఈ పంచభూతములు ఏమార్పులు లేకుండా సృష్టికర్తనిర్ణయించిన హద్దులలో నియమ ప్రకారం ఉంటూ, శరీరాన్ని దాటకుండా అన్ని అవయవములందు శరీరమంతా ఉన్నాయి.





215. మరియూ, ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన, నాగ, కూర్మ, కృకుర, దేవదత్త, ధనంజయ, అనుదశవిధవాయువులు, సూర్య, చంద్ర, అగ్నియను మూడు మండలములు, నక్షత్రములు, గ్రహములు, స్వర్గలోకము, నరకలోకములు, గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, జీవ, గురు, పరమాత్ముడు మొదలగు మహాదేవతలు, వారికి గలసప్తచక్రాలు అందులో వారి పరి వారములు, వారివారి కార్యములతో సర్వకాలములు శరీరాన్ని ఆశ్రయించి ఉంటారు. కావున యివన్నీ నీకు చూపిస్తానని పరమేశ్వరుడు శరీరాన్ని పెంచి విశ్వరూపుడైయివన్నియూ పార్వతికి చూపించెను.

216. అట్టి సమయమున శరీరము పెరిగి అందులో పార్వతి శరీరము 'బంతిలా" కలసిపోయెను. రావిపండులోని విత్తు వలే బ్రహ్మసృష్టికిలోనైనట్లు.

217. **పార్వతీఉవాచ :** నీతనువు నిరాకారమై చాలా రకాలుగా రాత్రిపగలు అన్ని వేళలా కనబడు తున్నది. వాతతత్వముచే మలమూత్రములు బంధించిన లక్షణములు గలవారికి ఏమాత్రమూ కనబడదు. ఎట్టి ప్రయోజనము లేదువారికి.

218. నిన్నుచూడడం సామాన్యులకు సాధ్యపడదు. మహనీయులకే సాధ్యము. అట్టివారు గొప్ప మర్యాదమన్ననలకు పాత్రులగుదురు. కన్నుల పండుగగా చూస్తారు నన్నుకూడా, నరులు, దేవతలు.

219. శరీరానికి ముఖ్యమైనవి యిడా, పింగళ, సుషుమ్మ, ఐదు ప్రాణాది వాయునాడులుకలసి ఎనిమిదినాడులు కనబడుతున్నాయి. అలాంటి శరీరానికి ఏడు చక్రములై యుండగా, పేరు పొందిన ఎనిమిదినాడులలో చెప్పదగినవి రెండని పుణ్యజనులందరి అభిప్రాయము। 1.సుషుమ్ననాడి 2. ప్రాణవాయునాడి, శరీరమంతా సంచరించునాడిని నేను చూచానునాధా.

220. ఐదు ముఖములు గలవాడివి. బ్రహ్మవి, ఘోరపాపములు సైతము హరించెదవు, నినుస్మరించుకాలములో యిహలోక బ్రాంతులు ఎక్కడకు పోతాయో? కొంచెం కూడా తెలియుటలేదు. నీకలయిక ప్రాప్తించితే దివ్యజ్యోతిని దర్శించుతాము గదా మహాచాతుర్యము గల విశ్వేశ్వరా.

221. పాదాలు, మర్మావయవములు, హస్తాలు, నుదురు, ముక్కు, బుగ్గలు గల శరీరము నందు, కుడి ఎడమ భాగాలు, బొడ్డు, తొడలు, ఉశ్వాస నిశ్వాసలతో, వెన్ను భాగములు గల్గిన శరీరమందు నీవు నీ స్వస్తానమగు భృకిటిలో ఉన్నావు నాధా.

222. ఎడమభుజము మీదుగా కుడి వైపుమొల ప్రదేశము వరకూ గల జందెము ధరించి, తలపై శిరోజములకు, రెండు మణికట్టులందు, మర్మస్థాన మందును, ఈ ఐదు ప్రదేశములందునూ, జందెము, ముడి, మణికట్టు లందు మాలలు మర్మస్థానమునకు

గోచీ బంధించి, ఆధార స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ ఐదు చక్రములను శోధించి సాధించిన చరిత్రపురుషా.

223. ఆరుచక్రములు ఉన్నాయి వాటిలో రెండు క్రింది ముఖంగా ఉండి, ఆధారచక్రం గుదస్థానం నుండిపై చక్రములకు మార్గమయింది. పై చక్రాలలో గలవారికి యిదేదారి రెండు కంటి చూపులను భృకిటికి నేర్పుగా ఏకంచేసి భృకుటిని చూస్తూ కలపగా వెలుగు చిన్న చుక్కలా మొదలై చూడగా చూడగా పెద్దజ్యోతినాట్యము చేస్తున్నటులయి, మనసునకు ఆనందం కల్గును.

224. కంటిపుసి, చెవిగులిమి, నోట ఉమ్మి మర్మస్థానము నుండి మూత్రము, వీర్యము, గుదస్థానము నుండి మలము విసర్జించునాడులు గలవు. అవి ఏమాత్రము తగ్గకుండా యింకా లెక్కలేనన్ని నాడులయ్యాయి. చూపునిలకడతో చూడగా యివన్నీ నీలో కనబడుతున్నాయి నాథా.

225. ఆరుకమలాలు, (షట్ చక్రాలు) అనేక శరీర శిరోజ రంధ్రములు, అనేక నాడులు నీలో వ్యాపించుచు, అనేక తల శిరోజముల ఆదియందుగల మొదళ్ళును, ఒక కంఠశంఖము, యాభైరెండుపెద్ద ఎముకలు, ఒక మేఢ్రము, రెండు అండములు, రెండు మూత్రనరములు వాటి వాటి పనులు చేయుచుసాంప్రదాయముగా యున్నవి. అవన్నియూ నాకనులతో చూస్తున్నానునాధా.

226. **పార్వతీదేవి** ఆత్మకూ అనాత్మకూ గల తేడాను బోధించమని అనేక విధములుగా ఆత్మేసుని స్తుతింపుచూ ఆత్మయొక్క వివరములు చెప్పమని పూజించుచూ పతిని అడిగింది.

227. **ఈశ్వర ఉవాచ :** వినుము ఆత్మకు యింద్రియములు, మనస్సు, విజ్ఞానము, చిత్తము అహంకారము, తనువేర్పడుటకు కావలసిన తత్వములు, ఆత్మానాత్మలు, చిత్తములు కలిగి ఉంటాయి. ఇవన్నీ జడమై పరమాత్మను చేరలేవు ఈ శరీరము పుట్టిన వెంటనే ఈ పరిస్థితి కలుగును.

228. దేవీదేహము ఆత్మకుతోడై లోకాచారప్రకారమునడుచును, ఆత్మకు ఏ భావము ఎప్పుడూ అంటదు. ఆలోచింపగా ఆత్మయే బ్రహ్మము సుమా.

229. రాబోవుకర్మలకు కారణమయిన, ధనేషణ, ధారేషణ, పుత్రేషణయను ఈ షణత్రయములు చేకలుగుఫలితములు ఆత్మకు అంటవు. భోగములనను భవించవలెనను తొందరలో ప్రకృతి సిద్ధమయిన భోగములననుభవించుచూ, అనురాగములు పొందుచూ, దేవతత్వము పొందుటకు కోర్కెగల్గి గర్వంతో ప్రవర్తిస్తూ, యోగసాధనలు ఆవేశముతో చేయు సమయమున యివన్నీ నీ మాయా ప్రభావముచే జరుగుతున్నవని ఊహించుము సతీ.





230. నేనే గొప్పవాడినని కొంచెం కూడా జ్ఞానం లేకుండా, గానుగ ఎద్దులకు కళ్ళకు గంతలు గట్టగా తాను తిరగవలసిన దారి తప్పమరేదీ కనపడని మాదిరిగా, గుడ్డిగా శరీరాన్ని అలంకరించుకుని, మిత్రులతో కలిసి వేషభాషలతో తిరుగుమానవులు యంత్రము వంటి జీవియేగా నీ, ఆత్మ విచక్షణగల జీవికాదు సుమా.

231. వైకృతము ఆత్మనుపొందదు, వికృతము యింద్రియవర్గవిషయాదులచే ఈ ప్రకృతిలో చిక్కిన ఆత్మతాచేయునవి మంచిపనులని భ్రాంతింపబడును. నీటి పాత్రలో ఆకాశము చిక్కినట్లుగా.

232. సత్యస్వరూపుమగు ఆత్మయొక్క అంశమే దేహమందున్న జీవుడు (జీవము) దానిచే దేహము నందలి తత్వాలు కలిగాయి. తత్వమూలరహస్యము తత్వమే, ఎలాగంటే పాలునీరు కలసి ఒకటైనట్లుగా.

233. లోకభ్రాంతులలోదగలని జీవుడు శాంతియు గల అక్షరపరబ్రహ్మ సాధకుడగును సుమా! తీవ్రమగు కిరణములుగల సూర్యుని, కాంతా చూచుట సాధ్యమా? అసాధ్యముగదా!

234. మరియూ ఆత్మ ఎలాంటిదంటే తుర్యాతీతయవస్థయందు జీవికి గానీ, దేహసంబంధమగు యింద్రియాదివర్గములకు గానీ, ఎలాంటి సంబంధము లేక శరీరస్పృహయుండదు. ఆ సమయమున జీవుడు పరమాత్మతో కలసి జాగ్రతావస్థతో యుండును. అపుడు జీవిఏదైనా ఒక కార్యాన్ని సంకల్పించి చేయడం, అనుభవించడం, చేయుచుండునని తెలియుము.

235. యివన్నీ ఆ పరమాత్మకు కంటిచూపులు, "చూడుకనబడతాయి". ఆస్థితిలో (జాగ్రతావస్థ) శరీరసౌఖ్యములు చేకూరును. అలాగాక తుర్యావస్థ, సుషుప్తి, స్వప్నావస్థలలో ఆ అనుభూతిని జీవిపొందలేడు.

236. **పార్వతీ ప్రశ్న :** ఆత్మ అనాత్మల యొక్క పరిస్థితిని ఆత్మకు తెలియజేసినావు ఆనందించేనునాధా, ఆత్మకు కలిగే అవస్థలు, ఆత్మకు గల బేధములెన్ని విధములుగా నుంటాయో తెలుపుమునాధా.

237. **ఈశ్వర ఉవాచ :** జీవినిగ్రహముగా నిలిచియున్న జాగ్రత్త, స్వప్న, సుషుప్తులు వశమౌతాయి. ఉరకలెత్తు యింద్రియాలను నిగ్రహముతో జీవినిల్పునదియే జాగ్రము.

238. యిట్టి జాగ్రతావస్థలో చెవులతో విన్నది, కన్నులతో చూచినది, ముక్కుతో వాసన గ్రహించినది. నిద్రలో గాంచునదియే స్వప్నము. ఈ స్వప్నములో శరీరము ఏ మాత్రము కదలక గురకతో సుఖంగా నిద్రించునది సుషుప్తి యవస్థయందురు. యిదిగాక గురకలేక మహాసుఖముగా నిద్రించునదియే తుర్యావస్థ అనవచ్చు. ఈ స్థితిలో

శరీరస్పృహలేక శవమువలే నుండి ఎలాంటి తరుగు ఒరుగు లేనట్టి (పరలోకమందు కలసి) పరబ్రహ్మమందు కలసి ఆనందమయంబుగా నుండునదియే తుర్యాతీతమనం బడును.

## ఈ అయిదింటికి పంచీకరణ చెబుతాను వినుము.

1. జాగ్రము : జాగ్రములో జాగ్రము ఇలాగే జాగ్రములో స్వప్నము, జాగ్రములో సుషుప్తి, జాగ్రములో తుర్యము, జాగ్రములో తుర్యాతీతములను నివిజాగ్రతావస్థ సంబంధములై యుండును. ఈ ఐదు అవస్తలను జాగ్రమందుమరుపులేక తెలివిగలిగినది.
2. మరియు స్వప్నం, స్వప్నంలో స్వప్నం, స్వప్నంలో సుషుప్తి, స్వప్నంలో తుర్యము, స్వప్నంలో తుర్యాతీతము, స్వప్నంలో జాగ్రము, మరియు.
3. సుషుప్తి : సుషుప్తిలో సుషుప్తి, సుషుప్తిలో తుర్యము, సుషుప్తిలో తుర్యాతీతము, సుషుప్తిలో జాగ్రము, సుషుప్తిలో స్వప్నము, మరియు.
4. తుర్యము, తుర్యములో తుర్యము, తుర్యములో తుర్యాతీతము, తుర్యములో జాగ్రము, తుర్యములో స్వప్నము మరియు
5. తుర్యాతీతము : తుర్యాతీతములో తుర్యాతీతము. తుర్యాతీతములో జాగ్రము, తుర్యాతీతములో స్వప్నము, తుర్యాతీతములో సుషుప్తి. తుర్యాతీతములో తుర్యములగును. యిటుల అవస్థపంచీకరణంబను పంచవింశతి 25 అవస్థలు గలవు. వీటికి జీవుడు భ్రూమధ్యస్థుడైన కాలంబున జాగ్రతావస్థ కలుగును. కంఠగతుండైన స్వప్నావస్థ, గలుగును, తాలువగతంబైన, సుషుప్తి యవస్థగలుగును. హృద్గతంబైన తుర్యావస్థ గలుగును. నాభిగతంబై ఆధారంబును జూచుచుండిన తుర్యాతీతయ వస్థయనంబడును. అట్టి సమయమున బ్రహ్మమునందుజీవుడు కలసి ఆనందమయంబు నొందుచుండు. జీవునకు ఆనందమయము నొసగునట్టి ఆ పరమాత్మకు యివన్నీయూ ఎరుకగానే యుండునని ఎరుంగుము. ఈ చెప్పిన స్థానములందు జీవుడుండక ఆధారమును దాటిన మృతుడగును. పైన చెప్పిన పంచావస్థల ప్రకారము జీవుడు పైకినడిచి భూమధ్యస్థుడయ్యే వరకూ నడుస్తూ పంచకప్రకారము ఆయాఅవస్థలు నొందునని ఎరుంగుము. వీటి అధిపతులను వినుము ఓ పార్వతీ యీరహస్యమునీకు నేను వివరముగా చెప్పితిని. మనస్సుతో గ్రహించి, వీనులవిందుగా మహాఆత్మజ్ఞాన చింతామణీ వినుము. వీటికి అధిపతులు

పంచీకరణమునందు పంచభూతములతో ఏర్పడిన జాగ్రతావస్థకు అధిపతులు

1. జాగ్రతావస్థకు సాంత్వ బ్రహ్మర్షి అధిపతిగా
2. జాగ్రములో స్వప్నముకు తక్షు బ్రహ్మర్షి అధిపతిగా





3. జాగ్రములో సుషుప్తికి మేధమతీ బ్రహ్మర్షి అధిపతిగా
4. జాగ్రములో తుర్యముకు విశ్వభద్ర బ్రహ్మర్షి అధిపతిగా
5. జాగ్రములో తుర్యాతీతము కు అర్చిత బ్రహ్మర్షి అధిపతిగా.

పంచీకరణము నందు పంచ భూతాలతో ఏర్పడిన స్వప్నావస్థలకు అధిపతులు.

1. స్వప్నావస్థకు ప్రబోధక బ్రహ్మర్షి అధిపతిగా
2. స్వప్నములో సుషుప్తికి శాంతిమత బ్రహ్మర్షి అధిపతిగా
3. స్వప్నములో తుర్యముకు విశ్వమయ బ్రహ్మర్షి అధిపతిగా
4. స్వప్నములో తుర్యాతీతముకు విశ్వభద్ర బ్రహ్మర్షి అధిపతిగా
5. స్వప్నములో జాగ్రముకు పరార్చిత బ్రహ్మర్షి అధిపతిగా

పంచీకరణము నందు పంచ భూతాలతో ఏర్పడిన సుషుప్తి అవస్థలకు అధిపతులు.

1. సుషుప్తి అవస్థకు వసులోచన బ్రహ్మర్షి అధిపతిగా
2. సుషుప్తిలో తుర్యముకు సుశ్వాంత బ్రహ్మర్షి అధిపతిగా.
3. సుషుప్తిలో తుర్యాతీతము కు మహామేదమయ బ్రహ్మర్షి అధిపతిగా.
4. సుషుప్తిలో జాగ్రముకు వేదభద్ర బ్రహ్మర్షి అధిపతిగా
5. సుషుప్తిలో స్వప్నముకు కర్దమ బ్రహ్మర్షి అధిపతిగా

పంచీకరణము నందు పంచ భూతాలతో ఏర్పడిన తుర్యావస్థకు అధిపతులు.

1. తుర్యముకు చిత్రధర్మ బ్రహ్మర్షి అధిపతిగా.
2. తుర్యములో తుర్యాతీతముకు సుతక్షబ్రహ్మర్షి అధిపతిగా.
3. తుర్యములో జాగ్రముకు జాతరూప బ్రహ్మర్షి అధిపతిగా.
4. తుర్యములో స్వప్నముకు మునిసువృత బ్రహ్మర్షి అధిపతిగా.
5. తుర్యములో సుషుప్తికి స్వాంత బ్రహ్మర్షి అధిపతిగా.

పంచీకరణము నందు పంచ భూతాలతో ఏర్పడిన తుర్యాతీత అవస్థకు అధిపతులు

1. తుర్యాతీతముకు పరిషంగ బ్రహ్మర్షి అధిపతిగా.
2. తుర్యాతీతములో జాగ్రముకు రైవతమను బ్రహ్మర్షి అధిపతిగా.
3. తుర్యాతీతములో స్వప్నముకు బోధాయన బ్రహ్మర్షి అధిపతిగా.
4. తుర్యాతీతములో సుషుప్తికి వ్యంజిక బ్రహ్మర్షి అధిపతిగా.
5. తుర్యాతీతములో తుర్యముకు దేవసేన బ్రహ్మర్షి అధిపతులుగా పాలించుచున్నారు.

239. ఈ అవస్థలన్నియూ ఎలా కల్గినవో చూడుము. పుట్టడం చావడం గల వారికి తామసగుణములు కలుగుతాయి. యివి మానవులను పట్టుకుని వదలకుండా పాపాలు చేయిస్తుంటాయి. ఎలాగంటే పెనుబాము కూడా అతిచిన్న చీమలచే చంపబడినట్లుగా. యిలాంటి జీవనాన్ని కోరుకోదు జ్ఞానము గలవాడు ఈ ప్రపంచములో.

240. యిహలోకసంబంధకార్యములు మోక్షానికి పనికిరావు. యివి జీవించ దానికి మాత్రమే పనికివస్తాయి. పట్టుదలగలిగి బోధగురునితో రక్షాబంధంబు ధరించి ఉపదేశం తీసుకొనక పోతే రాబోదు ఎవ్వరికీ మోక్షము.

241. యిదీగాక పంచభూతాలకు అధిపతులుగలరు చెబుతాను వినుము.

242. 1. సుతపుడు, 2. ప్రభోదకుడు, 3. వసులోచనమను, 4. చిత్రధర్ముడు, 5. ఋషిసంగుమనువులు ఆకాశాధిపతులు. తక్షు, శాంత, సుశాంతా, సుచక్షుష, రైవతమనువులు ఈ ఐదుగురు జలాధిపతులు.

243. మేధమతి, విశ్వమయ, మహామేధ, జాతరూపుడు, బోధాయనమనువులు ఈ ఐదుగురు అగ్ని అధిపతులు. విశ్వభద్ర, సుభద్ర, వేదభద్ర, వ్యంజిక, సుముద్రిత మనువులు ఈఐదుగురు జలాధిపతులు, అర్చిత, పరార్చిత, కర్ధము, సాంత్వమయ, దేవశేనులు, భూతత్వాధిపతులు

245. జలతత్వపంచకముచే జాగ్రతావస్థయు, భూతత్వపంచకముచే స్వప్నంబు కలుగును. అగ్నితత్వపంచకముచే సుషుప్తి యవస్థయు, వాయుతత్వ పంచకముచే తుర్యావస్థయు, ఆకాశతత్వపంచకముచే తుర్యాతీతఅవస్థయు కలుగును.

246. యీలాగు అవస్థలపంచీకరణములై పంచభూతములతో నాయా అధిదేవతలను పంపకముచేయుటచే, నాయా అవస్థలు గలుగుటయు. తదనుకూల ఫలితముల బొందుటయు స్పష్టముగా నీకు చెప్పితిని, దేవీ యిందలి భావములు శ్రవణగోచరీ ఆనందముగా వినుచూ తిలకింపుము.

247. **పార్వతి ప్రశ్న :** నాధాహంస యొక్క రహస్యాన్ని చెప్పండి శరీరమందలి ఏ స్థానంలో ఏ తత్వం గలదో, మానవులు సులభంగా ఎలాంటి సాధన చేసి ఏ శరీరబాధలు లేకుండా బ్రహ్మపధాన్ని ఎలాపొందాలో చెప్పండి.

248. **ఈశ్వర ఉవాచ :** ముక్కు రంధ్రములలో గల నాడులందు ఐదు భూతములు నడుస్తుంటాయి, ఆ విధానం చెబుతానువినుు. ముక్కుపైన జలము, ముక్కు క్రింద అగ్ని, ముక్కు ప్రక్కల వాయువు నడుస్తాయి. ముక్కురంధ్రాల నిండుగా నడుచునది భూమి, ముక్కునంటకుండా నడుచునది ఆకాశతత్వము యిలాశ్వాసలు నడుస్తాయి చూడుముదేవీ.





249. శబ్దముతో వచ్చు గాలి ఆకాశతత్వము. ముక్కులో ఎడమ ప్రక్కగా నడిచేది వాయుతత్వము. ముక్కు కుడిప్రక్కన అగ్ని తత్వము. ముక్కుపైభాగమున జలతత్వము ముక్కునిండా నడుచునది భూతత్వమందురు.

250. భూ, జలతత్వాలు శుభాన్నిస్తాయి, అగ్నితత్వము అధికారులతో కలహం చేయించును. వాయుతత్వము మరణమునకే, ఏ అనుమానము లేదు. ఆకాశతత్వానికి?

251. యిదియే హంసరహస్యము, దీనిని మనసునందుంచుకుని ఎన్నడూ మరువకుము. యివన్నీ ముక్కు శ్వాస వలన కలుగు ఫలితములు. యోగాభ్యాసానికి ముక్కును ముద్దిని మూస్తే హంస (శ్వాస) నిలబడుతుంది.

252. పార్వతీ ఈ యోగ సిద్ధి యందు అణిమాదులను, పొందుట మనసునందలి కోర్కెలు తీరుట, తానే శివుడగుట, బ్రహ్మానందమనుభవించుట మొదలగు మహాసిద్ధులు కలుగునని తెలియుము.

253. **పార్వతి ప్రశ్న :** ఆగామి, సంచిత, ప్రారబ్ధములగు కర్మలు ఎలా వస్తాయి, వాటిని ఎలా పరిశుద్ధము చేయవచ్చును. ఈ ప్రపంచంలో వీటి ధర్మాలు తెలియజేయండి, యిందలి రహస్యాలు వినాలని కోరిక కల్గినది. మాయకు అతీతుడవగునాధా!

254. **ఈశ్వర ఉవాచ :** జీవి చాలా జన్మలందు చేసిన కర్మ ఫలితములగు సుఖదుః ఖాదులనను భవించుటకై మళ్ళీ భువిపై జన్మించి, ఈ కర్మలను తొలగించుకోలేక, మాయలోబడి మళ్ళీ జన్మకు వచ్చి కలిమాయచే మళ్ళీ ఆ పనులు చేయుచూ ఆయా కర్మల ఫలితాన్ని అనుభవిస్తారు. బ్రహ్మ మొదలగు దేవతలే గాక పరమేశ్వరుడయినా కర్మఫలితమనుభవించక తప్పదు. భూమిపై చేయు యీ పనులన్నియూ సుఖము, దుః ఖము ఒకటిగా తలంచి వీటినినాశనంచేయాలని ఆత్మనిశ్చయుడై, మంచి పనులు చెడ్డపనులు రెంటినీ చేయకుండుటచే గతకర్మలన్నియూ తగలబడిపోవును. ఎట్లాగంటే కాలిన బట్టలో ఏమీ మిగలనట్లుగా.

255. సత్వరజో, తమోగుణములు, శరీరభోగములు, పుత్రేషణయు, జ్ఞాన మార్గములు గావు. వీటిని వీడుటయే సత్వము, అనగా జ్ఞానమునకు యోగసాధన మూలముగావున అన్ని భ్రాంతులను వీడిన తత్వబోధసాధన ఫలిస్తుంది సుమా.

256. పార్వతీ అనేక జన్మంబుల నుండి సంపాదించి కర్మలను వదిలించుకోలేక, వాటి ఫలితంబుగా అనేకకోట్ల జన్మలెత్తుచూ పూర్వజన్మల ఫలితములను భవించుచూ, బహుజన్మంబులజిక్కు వడునదియే ఆగామియందురు. దీనిని విడువక కలసియుండునదే సంచితమందురు. తాను చేసుకున్న కర్మతానను భవించునది ప్రారబ్ధమందురు. కావున ఈ మూడు జీవి అనుభవించుటే త్రివిధకర్మలందురు. యివి ఎట్లా నశిస్తాయంటే?

తామరాకుకునీరంటనట్లుగా ఈ జనప్రపంచము నందుండి ఉండనట్లు జీవించు మహనీయులైన, హంసావధూత, సంయమ, యోగీశ్వరులకు సేవలు చేయుచూ అన్నవస్త్రములొసంగి రక్షించువారికి ఆ మహానుభావులు చేయు పుణ్యములు వీరలకు ప్రాప్తించి, పాపములు తొలగికర్మ విముక్తులగుదురు. అట్టి వారిని దూషించి తిరస్కరించువారికి ఆ మహనీయులకు గల దోషములు వీరలకు సంక్రమించి, వీరికి ముందుగలపాపములు కోటిరెట్లధికమై. ఆ కర్మలనను భవించుచుందురు. అట్టి దూషకుడగు దీనుడు మహానరకములనుభవించు చుందును. మరియు పార్వతీనిన్ను నన్నును సేవించిన హంసావధూత, సంయమయోగీశ్వరులైన వారికి ఎట్టిపుణ్యపాపములు చెందక నిర్మలులైనాయందు ఐక్యంబునొందియనేకమన్వంతరములుండి సుఖభోగా నందము గల బ్రహ్మము నొందెదరు. నాయందు శాశ్వతముగ నుండునట్టి వారలకు కర్మ రహితంబై, అన్ని కర్మలు కాల్చబడి భస్మంబుకాగలదనగా **ఆ పార్వతి యిట్లనియే.**

257. నాథా హంసలు శరీరమందు తిరుగుదారి. వాటి రూపము, దానివలన కలుగు ఫలితములు యిప్పుడు చెప్పండి, దేహమందలి తత్వాలను ఎలా శోధించాలో ఎలా కనిపెట్టాలో చెప్పండి.

258. **ఈశ్వర ఉవాచ :** కంసాలి చేతితో వాడే కత్తిర ఆకారము హంస స్వరూపము కాళ్ళు, కీళ్ళు, మూతి కలిగి ఉంటాయి. క్రిందికాలు మొదలుకొని పై ముక్కు చివర వరకు లోనా బయట 12 అంగుళాల పొడవున, ముక్కు కుడి ఎడమ రంధ్రాల ద్వారా తిరుగును యిలా తీసుకున్న 12 అంగుళాల శ్వాసలో 4 అంగుళాలు బయటకు వదిలి 8 అంగుళాలుమాత్రమే లోపలకు తీసుకుంటుంది. యిలా రేయింబవళ్ళు తక్కువ ఎక్కువలతో తిరుగుచూ, శరీరమందలి తత్వములతో కలసి ఒక్కోసమయంలో ఒక్కోరకములు ఉశ్వాస, నిశ్వాసలు, జరుగుతూ, కాలాన్ని గడుపుతూ "దేహికి" ఆయుః ప్రమాణము ఊపిరిని తీసుకుని విడుచు లెక్కల ప్రకారం ఉంటుంది.

259. 24 నిముషములకొకసారి "జీవి" శరీరమందలి 1.తత్వము సంచరించి మరల రెండు కనుల మధ్య ముక్కుపై భాగమున గల భ్రూమధ్యన మారి, మరల వేరుతత్వము చేరును.ఆ ప్రకారం జీవుడు తానుచేయగల బ్రహ్మవిద్యను ప్రకృతి మాయలో పడిచేయక, విరాట్ స్వరూపాన్ని చూడలేక ప్రపంచములో శరీరమే శాశ్వతమని భావించుతారు. యిది మహాఅద్భుతముసుమా.

260. సాధకుడు భ్రూమధ్య భాగమున అనేకరకములుగా ప్రయత్నించగా, "దేవీ నీవు సహకరించితే" శక్తి దేహానికివస్తేలోదృష్టి నిలబడుతుంది. అప్పుడు కాశీ పురమునందు (భ్రూమధ్య) మహాకాశాన్ని చూపట్టిన వేళాకోళముకాదు. ఈ చతుర్థశ భువనములలో వేదాంతవిద్య సులువుకాదు సతీ. నీ సహాయం లేకపోతే సిద్ధించదు.





261. ఈ పక్షులు (హంస) ఐదు రకములు. వీటి రూపములు చాలా రకాలుగా యున్నా, ఆ రూపాన్ని పైన చూపించునొకటి చాలా రకములుగా ? కంటి దృష్టి నిలిపిన ఆ సుందరదృశ్యం సూటిగా కన్పడును.

262. శ్వాసనిలగట్టి నరుడు ఏ బాధాలేక తత్వపంచకాన్ని మనసునదలచిన, ఆత్మ చేయు బోధ అనుభవాన్ని తాను పొందుతాడు. ఈ జ్ఞానాన్ని పొందటానికి కంటి చూపుకన్నా వేరే దారి లేదు.

263. ఈ హంస ఎవరికీ దొరకదు, చూపునిలబెట్టలేకపోయినా, కన్ను చెదిరినా కావలసిన తత్వమపుడేలేకుండా పోతుంది. చూపుచూచేది దేహంలోపలనే.

264. మరియూ ఈ హంస ఏ నరునకు దొరుకుతుందో. అట్టి మహనీయుని చరిత్రము లోకంబులకు చిత్రముగాదోచును. ఎలాగంటే వైకృత, ప్రాకృత, సకీలకమనే ప్రాణాయామంబులచేత, ఓడ్యాణ, జాలంధర, మూలబంధములనే ఆసనములతో, ప్రాణ, అపాన, వ్యాన ఉదాన సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయంబుల నెడు పదివాయువులను స్వాధీనంచేసుకుని, దేహి తను జీవింపదలచినంత కాలము. యముని ఆజ్ఞమేరకు వచ్చెడి భీషణ, రోషణాకారములతో భయంకరములగు యమభటులు చేయు వాదోప వాదములను లెక్కింపక, రెండవ ఈశ్వరుని వలే చలింపక యుండినవానికి అనేక మహత్వంబులు సిద్ధించును. అవిఏమనగా, "అణిమాదులు" అణిమ = అణురూపముగానుండుట. మహిమ = మహత్తులు కలిగియుండుట, గరిమ = గొప్పబరువుగా నుండుట. లఘిమ = దూదివలే తేలికగా యుండుట. ప్రాప్తి = కావలసిన వస్తువులను పొందుట. ప్రకామ్యము = కోరినదిచ్చుట. ఈశత్వము = సమస్తమునకు తానే అధికారియగుట. వశిత్వము = సమస్త భూతజాలమును వశపరచుకొనుట. దేవత్వము=ఆకాశసంచారము.యితరుల భావములు శరీర ధర్మములు తెలియబడుట , అన్నమాట జరుగుట, ఆశ్చర్యము గొల్పు శక్తి (కాంతి) జరిగినది జరగనున్నది చూచుట. గాలిని భుజించుట గొప్ప బలము, యింద్రియ నిగ్రహము, యింకా అనేక మహత్వంబులు సిద్ధించును.

265. **పార్వతి ప్రశ్న :** కష్టములకు కారణమైన కార్యములగు, అష్టబంధములేవి? వాటి విషయాలన్నీ వివరంగా చెప్పినాకు కళ్ళకు కట్టినట్లుగా చూపుమునాధా.

266. **ఈశ్వర ఉవాచ :** 1.వివాహమగుట, 2.భార్యామాటలు వినుట,3. కుటుంబాన్ని పోషించుట, 4. కోరికలు కల్గుట, 5. స్త్రీ సంపర్కము చేయుట, 6. ధనాపేక్షకల్గుట, 7. సంతానము కల్గుట, 8. ధర్మఫలంబునందుట; వాటి వివరాలు చెబుతాను వినుము దేవి.

267. అడవిలో స్వేచ్ఛగా తిరుగు జంతువులు వలలో చిక్కినట్లుగా అమ్మాయితో వివాహం వద్దు వద్దు, కోతిని పట్టుకుని సాముగరిడీలు నేర్పినట్లు భార్యమాటలు విని ఆచరించవద్దు, చాకలి వాకిట కొయ్యకు తాడుతో కట్టిన గాడిదలాగా కుటుంబ బాధ్యతలు అన్నిటికీ అడ్డమౌతాయి. ప్రమిదలోని దీపాన్ని చూచిన కీటకములు ఆహారమని భ్రమించి ఆహుతియైనటుల, శరీర వ్యామోహములను వదిలివెయ్యి. బురదలో పంది పడి చల్లదనముకై దొర్లినటుల స్త్రీలకలయిక వలదని వదలిపెట్టు. ధనమాశగోరి మాయలు తంత్రాలు చేయుట మేకల మందల వెంట పరుగిడునట్లగును కావున వీటిని మాను. పశువులకాపుకాయు వానివలే పనిబాని తిరుగుట ధనేషణ, ధారేషణ, పుత్రేషణలను వదులు వదులు. బొంత భుజానవేసుకుని సంతలో వ్యాపారిలాధర్మకార్యములు చేయవద్దు. నిష్కామకర్మను ఆచరించాలి. కావున ఈ బంధములలో చిక్కవద్దు.

268. వద్దు వద్దు ఈ బంధముల్ వీటిలో ఒక దానిని కోరితే దానికింకొటితోడై చేరును, యివన్నీ పాపకర్మలు జీవిని పాడుచేయును. వీటిని వదిలి జ్ఞాన మార్గంబులో నుండుట సుజ్ఞానులకు మేలు.

269. సర్వకాల సర్వావస్థలందు ఆత్మను పరమాత్మతో కలిపి ఆనందించు సాధుమూర్తి అడవి, పర్వతం, ధననిధులదరినిగానీ, స్మశానమందుగానీ, పట్టణమందైనా, చిన్నపల్లె యందున్నా, అన్నిటా సమభావంతో ఉంటాడు. అలా జీవిస్తాడు.

270. **పార్వతీ ప్రశ్న :** పంచమహాభూతముల అంశలతో బుట్టికర్మలు చేయుట వలన, ఆ పంచమహాభూతములను తెలుసుకొనుటఎలా? ఏఏ ఆకారములతో ఉంటాయో ఎలాగో గదా.

271. **ఈశ్వర ఉవాచ :** జీవి చేత చాలా భాషలను ఆర్భాటంగా పలికిస్తుంది, ఆకాశతత్వము ద్వారా గానీ ఆత్మ కనుపించదు. శబ్దము స్పర్శ కలిగిస్తాయి గానీ, వాయువు ఆత్మను చేరలేదు. చాలా రకముల శబ్దములు, స్పర్శ, రూపాలు ఉంటాయి గానీ, అగ్నిఆత్మను అంటలేదు. యితర శబ్దాలు, రూపాలు, స్పర్శలు, రుచులున్నాయిగానీ జలమందు ఆత్మ లేదు. రుజువుగా చూస్తే శబ్దం, స్పర్శ, రూపము, రసము, గంధము, ఈ ఐదు గుణాలు భూమికి కలిగియున్నాయి, కానీ భూమి ఆత్మ కాదు, అన్నీ మాయలే. ఐదుభూతాలు మారిపోవు.

272. యింతే కాకుండా ఈ పంచభూతాలకు ధర్మము, కర్మమని రెండు విధములుగా నున్నవి. వాటి వివరాలు చెబుతాను వినుము దేవీ.

273. భూమికి స్నేహించుట, ధరించుటయు. జలముకు చెప్పుట, పదును చేయుటయు. అగ్నికి, కాల్చుట ఉడికించుటయు. వాయువుకు చలించుట, చేర్చుటయు.





ఆకాశమునకు కాళీగాయుండుట, అవకాశ మిచ్చుట యును. యివి పంచభూతముల ధర్మము కర్మలును, యివిగాక వీటిరంగులు ఎలా ఉంటాయో చెబుతాను. వినుము.

274. బూడిదరంగు భూమికి, తెల్లనిమణులు కదిలినట్లుగా నీటికి, లేత ఎరుపు రంగు అగ్నికి, గాలికి పొగ రంగు, ఆకాశానికి నీలి రంగు ఉంటాయి.

275. మరియు ఈ ఐదు భూతములకు అధ్యాసలుంటాయి. అవి చెబుతాను పార్వతీ మనసున శ్రద్ధ గల్గి కంటితో చూచి ఆనందించి, చెవులతో వినుచూ ఆత్మానుభవము పొంది గమనించుము.

276. భక్తిచే కాశీ, తిరుపతి, శ్రీశైలం వంటి పుణ్యక్షేత్రములు తిరుగుచూ కష్టమనుకోకుండా సాష్టాంగదండ ప్రణామములాచరించుట. సముద్రము నదులలో అనేక విధములుగా, దానాలు తంత్రాలతో స్నానం చేయుట, ఉపవాసములు చేసి దేహాన్ని బాధించి, కాల్చిన కాడలు కాయలు తినుట, ఆయాసము చేత దేహము బాధనొందినపుడు, చల్లని గాలి దగిలి స్థిమిత పడుట, పెద్దపెద్ద ఆర్భాటం గల గోపురములు ఆకాశాన్నంటినట్లుండుట చూచి అందలి దైవానుగ్రహం పొందాలి అనేడి యిలాంటి గుణాలుకోర్కెలు జ్ఞానులకు లేవు. వీటన్నింటినీ మానుము మానుము.

277. భక్తిచే సాష్టాంగపడి కోరిమ్రొక్కువారు, చెట్లకు దండాలు పెట్టువారు, తీర్థ యాత్రలు చేయువారు, చేతులుపైకెత్తి దండాలు పెట్టువారు, పుణ్య భూములను చూచు టకు వెళ్ళువారు, యజ్ఞముచేయుట, చేయించుట, గ్రంధాలు చదువుట చదివించుట, దానమిచ్చుట పుచ్చుకొనుట, వీటిని ఆచరించువారు. గొప్పవగు వ్రతములు చేయువారు, దానమిస్తున్నామని బ్రాహ్మణులకు దాన ధర్మాలు చేయుచుధారబోసిన వారు, సత్రము, చెఱువు, కావ్యము, (నిక్షిప్తపరచుట) నిధానము, ఆలయము, వనము, భూదేవస్థాపనము అనెడి సప్తసంతానములను సలుపువారు. ఆరుమతాలు 1. శైవము, 2. వైష్ణము, 3. శాక్తేయము, 4. గాణపత్యము, 5. సౌరము, 6. కాపాలిక మతములు మంచివని వీటిని ఆచరించువారు అనేక భాషా విద్యలనునేర్చినవారు. తంబుర వాయిస్తూ అరుస్తూ గెంతువారు. వీరందరు జ్ఞాన వీరులు కారు. అజ్ఞాన నరులు.

278. **పార్వతి ప్రశ్న :** మాయా రూపములు ఎలా ఉంటాయో। మాయను జయించుమార్గములేవో ఆ ఉపాయములు చెప్పండి. యిపుడు, నాఆత్మ సంతోషించు నట్లుగా యిక్కడే యిప్పుడే చెప్పండి నాధా.

279. **ఈశ్వర ఉవాచ :** తను సంబంధబంధములలోచిక్కి త్వక్కు, చక్షువు, శ్లోత్రము, జిహ్వ, ఘ్రాణము, ఈజ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు ఉపస్థలను కర్మేంద్రియములు, మనస్సుతో గూడి. 11 యింద్రియములుగాక, రేతస్సు అను

యింద్రియములు సృష్టికర్తనుండి వరముగా పొంది కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యంలతో కూడుకొని, సత్వ, రజ, తమో, గుణములతో బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్యవస్థలతో, ఆకలి దప్పిక, శోకం, మోహం, జనన, మరణాలతో నున్న భూమి మీద నుండు జనులు తాపత్రయపడతారు. యివన్నీ మాయలు సుమా! నీవిలాంటివి నమ్మవద్దు. వీటన్నింటినీ మానుయిదినమ్ము.

280. మడీ, మైలని శరీరాన్ని బట్టల్నీ త్వరగా తడిపితే ఆత్మశుద్ధియగునా, త్వరత్వరగా ధ్యానంచేసి, రసవాదవిద్యలుతెలిసినా, వాక్సిద్ధి పొందనిదే సిద్ధించునా, సంపదలు పొగొట్టుకొని, గోచీపెట్టుకుని, కమండలం పట్టి, చేతితో జపమాల ఒక ఘడియకూడా విడువక త్రిప్పుచున్నా, అంతమాత్రం చేత అజ్ఞానాన్ని జయించారా నరులు.

281. గడ్డాలు, జడలు పెంచుకుని పశువువలే కర్రచేబూని, త్వరత్వరగా దేశ సంచారముచే కడుపు మాడ్చుకుని, మట్టి ముద్దవలే తిరిగినను మాయ అతనిని తొలగి పోదు సుమా.

282. శివుని అర్చించినా, విష్ణుని పూజించినా, సిద్ధుడుకాలేడెప్పుడు, "ఎక్కడా గూడా" అనేక వేషాలు వేసినా, వేదాలకు అర్ధాలు చెప్పినా, సరస్వతీ దేవికరుణించి కవి అయినా, వాగ్దేవితో సమానమయిన భావనలు కలిగిన వాడయినా, అనేక విధములయిన ఉపాయములెన్ని చేసినా మహాగొప్ప విద్యగలవాడైనా సరే.

283. యోగానికి మూలమయిన జపములు అతిగా చేసినా, భోగానికి మూలమగు సంసారభుక్తి, రక్తులొందినా మోహరహితులై రోషంతో అడవిలో తిరిగినా, "వదిలిపెట్టదు మాయ"తత్వం దర్శనముకాని ఏయోగికైనా సరే.

284. **పార్వతీ ప్రశ్న :** మాయయొక్క రూపాన్ని త్వరగా నాకు తెలియజేయండి. నా ఆత్మ సంతోషించునట్లుగా, "నా ఆత్మలోగలనాథా" నరులకు భయాన్ని తొలగించుస్వామీ.

285. **ఈశ్వర ఉవాచ :** శరీరాన్ని బాధించి, తత్వసాధనను మరిపించి, ఏవోపనులలో జీవుని ఉంచే మాయాశక్తిని కనుగొనిచూడు "దీనిని" యిహ బంధములలో చిక్కినవారు జయించలేరు.

286. నిర్మలమైన చోట చీకటిలో తాడును పాముగా భ్రమించినటుల మాయ సత్‌పురుషులను గూడా తర్జన భర్జనలలో పడవేస్తుంది. ఆశ్చర్యంగా! ఈ మాయ జీవాత్మను పరమాత్మతో అనుసంధానం కానీకుండా దూరంగా ఉంచుతుంది. ఎలాగంటే, కొరివి పట్టిన వారిదాపుకు ఎలుగుబంటు చేరనట్లుగా.

287. ఓ పార్వతీ జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, రేతస్సు, కలసి 11 యింద్రియములు. యింధనమనే చమురుకు అగ్ని ముట్టించినట్లు, పరంబను





మహాజ్యోతిని "లోచూపుతో" వెలిగించున్నట్టి వినోదజ్ఞానానికి, అడవి మార్గంబున కొరివి చేత బట్టిన దాని వెలుగు ఎంత వరకూ వ్యాపించునో ఆ హద్దుదాటి యెలుగు మృగము రాజాలక అడవిలోకి పోవుచందంబున, "ఆ మాయ" జ్ఞానుల దరిచేరలేక ఆనరకంలోబడి తిరుగుచుండునని సుగుణమణీ ఎరుంగుము. "మాయ, జ్ఞాని దరిచేరలేదు.

288. మాయలోను జిక్కుపడి, ఆత్మ నరకమనే మాయను అనుభవిస్తూ ఆ శరీరములు చిక్కి భయపడుచూ, చాలా గాయములతో మిక్కిలి బాధనొందిస్తూ వేలకువేల సంవత్సరములు విడువక యమభటులు మహాబాధలు పెట్టెదరు మానవులను.

289. **పార్వతీ ప్రశ్న :** మరియూ గురువులు ఈ మాయలో తగుల్కొనకుండా ఎలా ఉంటారు. పరమానందాన్ని ఎలా పొందుతారు.నీ కరుణవారికి ఎలా కలుగుతుంది. భూమిపై తిరిగే నరులు శిష్యులై గురుధ్యానాలు ఎలా చేస్తారు. ఈ రహస్యాన్ని గురువరా చెప్పండి.

290. **ఈశ్వర ఉవాచ :** గురువుల చరిత్ర వినాలి. వరకాంతా చెవులకు విందు గొల్పుచూ పరిపక్వ మనసుతో గురిచూచిన నరులు పరబ్రహ్మతో కలియుదురు.

291. ఒక చోట యోగసాధన, ఒక చోటభోగమను భవించుట, ఒక చోట అనురాగాన్ని పొందుచుండు, ఒక దగ్గరత్యాగము (విడుపు) ఒక చోటమంత్రోచ్ఛారణ, ఒక చోట ధ్యానం చేస్తూ ఒదిగియుండు, ఒకచోట కోరిన వస్తువును పొందుచూ, ఒక చోటయోగసమాధి యందుండు. ఒక చోట జనసమూహముతో కలిసియుండు, ఒకచోట భక్తి బోధన, ఒకచోట జ్ఞానబోధన, ఒక చోట గ్రంధాన్ని చెప్పుచుండు, ఒకచోటను భువిపై ఊరకుండు. ఒకచోట బ్రహ్మన్ని తలుస్తూ ఉండు, ఒక్కచోటను యిహలోక సంబంధాలను ప్రక్కన పెట్టి పైనవన్నీ కలిపి ఒకచోట నుండు. యిలాంటి స్తానాల్లో గురువులుందురు పత్నీ.

292. ఒకచోట జ్ఞాని నవ్వుతూ ఆదరింపబడును, ఒకచోట ఆడుతూ పిల్లలనాదరించు, ఒకచోట పాడుచూ బ్రహ్మని చూస్తూవుండు, తిట్టును, దీవించును, దీనులను ఆదరించును.

293. మరియూ తామరాకునకు నీరు అంటనట్లు, పేడపురుగు ఎట్టిమలినము లందైనా ప్రవేశించి బయటకు వస్తే దానికి ఎలాంటి బురద అంటనట్లు, గొంతుకు నెయ్యి అంటనట్లు, అన్నిటా ఉండి అన్నీ చేయుచూ, అంటీఅంటనట్లుంటూ, దేహానికి ఎలాటి బంధనలు తగలకుండా, ఒంటరియై, కంటికిరెప్ప వలే ఉంటూ, బలేకొంటి వానివలే పరలోకమే స్ధిరమని తదేకలక్ష్యసాధనలు చేయువాడు. బ్రహ్మసాక్షాత్కారమును ధరిస్తూ ఆత్మను పరమాత్మతో కలిపి ఉంటాడు. దేవీనీకు పరమ "మహో పదేశంబు"

చేసితిని గ్రహించుము.

294. గురుసేవలు చేసేనరులకు కావలసిన వినయ విధేయత, దాని యొక్క న్యాయము, పరమార్ధము చెబుతాను. ఏనుగు సింహము ఎట్టి పరిస్థితులలో కాదు. కలలో కూడా కాదు.

295. ఎ) **సద్గురు సేవలు చేయని వాడుగురువుకాడని ఎరుంగుము**

బి) శుశ్రూషలు (సేవలు) పొందని వాడుగురువు కాదని ఎరుంగుము. విశ్వబ్రాహ్మణ బృందములు సేవింపుచూ సిద్ధులతో బ్రహ్మరధం పట్టి ఊరేగింపబడనివాడు ఈలోకంలో పూజించుటకు ఎలా అర్హుడగును?

296. తుమ్మెద పురుగు భావములతో గురు శిష్యుల సంధానంబుగా నున్నట్టి వారలకు బ్రహ్మజ్ఞానం అతిసులువుగా సిద్ధించును. అది ఎట్లో పార్వతీ వినుము.

297. తుమ్మెద గడ్డిమీద తిరుగు పురుగులను తెచ్చి, మట్టితో చక్కగా గూటిని ఏర్పాటు చేసి ఆ పురుగును కుట్టి గూటిలో వేసి మట్టితో ద్వారాన్ని మూసివేసి, కమ్మగాభంకారములు ఝుమ్మని నాదం చేస్తూ ఆ గూటి చుట్టూ తిరుగుచుండును. ఆ గూటిలోని పురుగు తుమ్మెదమళ్ళీ ఎక్కడకుడుతుందో నన్నబాధతో సదాదాన్నే తలచుకుంటూ తాను తుమ్మెద రూపుదాల్చి గూటిలో నుండి బయటకు వస్తుంది. దీని భావం ఏమిటంటే గురువుగారు శిష్యుని బాధించి భయపెట్టి తనంత వాడిని చేయుట.

298. మరియూ ఆగురుశిష్యులకు మర్కటకిశోరన్యాయమనిన్నీ, మార్జాలకిశోరన్యాయ మనిన్నీ ఈ రెండు విధములుగలసి, మూడు విధంబులైయుందును "ఎలాగంటే".

299. పుత్రవాత్సల్యంతో ప్రేమగా విద్యనేర్పు గురువు "ఎలాగంటే" పిల్లి పిల్లలను పెట్టి సంతోషముతో పాలిచ్చి పిల్లలకు వీలైన చోటు వెతికి మంచి చోటుకుదిరిన తర్వాత, పిల్లలను తన నోటగరచుకొని పోయి పిల్లలను చాలా జాగ్రత్తగా వదిలి పాలిస్తూ, పెంచుతూతన విద్యలన్నీ మొత్తం చెప్పి పిల్లలకు ఎలాంటి ఆపదారాకుండా పై కాపుకాచి తిరుగుతూగమనిస్తూ, తనంత అయిన తర్వాత పిల్లలను వీడిపోతుంది. అలాగే గురువుగారి సంరక్షణలో శిష్యునికి ఎలాంటి ఆపదారాకుండా చూస్తూ తన విద్యలన్నీ నేర్పి శిష్యుని తనంత జేసి అప్పు తీర్చిన సంసారి హాయిగా తిరుగునటుల శిష్యుని వదలివేసి బ్రహ్మమువలే స్వేచ్ఛగా తిరుగుతాడు గురువుగారు.

300. కోతిపిల్లలను కని దగ్గరకు చేర్చుకోదు, రాత్రి అయినా అర్ధరాత్రి అయినా పిల్లతల్లిని పట్టుకోవడమే కాని, తల్లి ఎప్పుడూ పిల్లని పట్టుకోదు. పిల్లకి ఏమైనా భయపడదు. అడవిలో తిరుగుతూ, పెద్దరాళ్ళను దాటుచూ, చెట్లెక్కి, ఈ కొమ్మ నుండి ఆ కొమ్మకు, ఈ చెట్టు నుండి ఆ చెట్టుకు దూకుతూ తన విద్యను ప్రదర్శిస్తుంది. పిల్ల





మంచిచూడదు. మాటాడదు. దాని పిచ్చి ఏమిటో గాని పిల్లని ఎపుడూపిలవదు. పిల్లపట్టుతప్పితే దాన్ని పట్టుకోదు. పిల్ల ఏమయిందోనని తిరిగి చూడదు. దయతలచదు దాని సౌఖ్యము, దాని భద్రత చూచుకుంటుంది. యిలాంటి గురువుల దగ్గరకు శిష్యులు చేరరాదు.

301. మరియూ జ్ఞానమార్గంబులు చెప్పుదును. మంచి జ్ఞాన ప్రకాశముతో వెలుగొందు అంతఃకరణముతో వినోదముగా శ్రవణానందముగా వినుము.

302. జ్ఞానము రెండు విధాలుగా ఉంటుంది. 1. చీమ మొదలుగా 2 పక్షిజాతిగా యివి చెబుతా విను. తనంతట తాను తెలుసుకోవాలి తత్వరహస్యాన్ని తత్వసాధకులు.

303. చీమతానున్న రంధ్రం నుండి ఏ వస్తువు ఎక్కడ వుందో, అదేమిటో తెలుసుకుని దాని దగ్గరకు ఎలా వెళ్ళిదాన్ని పొందాలో గ్రహించి ఆపదార్ధాన్నిఅనుభవిస్తుంది. అలాగే సాధకుడు తత్వరహస్యాన్ని, అది ఉండు చోటు తెలుసుకొని అక్కడకు చేరే మార్గాన్ని గ్రహించి అచటకు చేరి తత్వానుభూతిని పొందటం. యిదే చీమతత్వం.

304. విహంగతత్వం. పక్షితన గూటిలో కుదురుగా ఉండి చెట్టు కొమ్మల చివరనుండు పండును చూచి ఎగురుతూ అక్కడకు వెళ్ళి ముక్కుతో కరిచిపట్టి, తిరిగి తనగూటికి చేరడానికి అనుభవం కావాలి.

305. లేకపోతే ఆ వచ్చు సమయంలో ఫలము క్రిందకు జారి భూమి పాలవుతుంది. యిలాటి సంఘటనలున్నాయి. అనుభవంతో నిదానంగా జ్ఞానాన్ని సంపాదించాలి. లేకపోతే శ్రమంతా వ్యర్థమవుతుంది. తొందరపాటు జ్ఞానసముపార్జనను నమ్మరాదు. చీమనడవడికలు గలవారికి జ్ఞానము సిద్ధిస్తుంది.

306. వేషభాషలతో జ్ఞానివలేకన్పించు మాయా గురువు లెక్కువై లోకంలో పనికిమాలిన బోధనలు చేయుచుందురు. "కేవలం వారు జీవించటానికే" అట్టివారు మాయను జయించలేక, బ్రహ్మాన్ని తెలుసుకోలేక, జీవాత్మను పరమాత్మతో చేర్చలేక, ప్రారబ్ధ కర్మలననుభవించు చుందురు. బ్రహ్మ జ్ఞానాసక్తులు వీరిని గుర్తించి మసులుకోవాలి అట్టి వారిదరిచేరరాదు.

307. స్థిరత్వం లేనిఖాడు, యితరులను నిందించువాడు, లేనిది ఉన్నట్లు చెప్పువాడు, తాను చేయుతప్పుడు పనులను దాచువాడు, చెప్పరాని చేయరాని పనులన్నీ చేస్తూ గొప్ప నీతులు చెప్పువాడు, మహనీయుల చెంత కాదు గదా వారి నీడను కూడా ఉండలేడు, మహనీయుల చరిత్రలు చాలా అద్భుతంగా ఉంటాయి సుమా.

308. మరియూ ఓ పార్వతీ పరమాత్మ అనుభూతులు పొందే మహాజ్ఞానవీరుల నడవడికలు చెబతాను విను.

309. మనసు యిహలోక సంబంద విషయముల పైకి పోనీయక, పరమాత్మ యందు మనసులగ్నం చేయునరులకు **నేను,** "మాయా భావము" ఆ శరీరాన్ని తాకకుండా దారిని తప్పించి, మడి, మైలు అనుదోషాలు లేకుండా చేస్తాను.

310. ఉత్తుత్తి మాయాకార్యాలు జనంమెప్పుకై జ్ఞానులు చేయరు. ఎక్కడిబడితే అక్కడకు ఊరికే తిరగరు, మనసును కేంద్రీకరించి పంచభూతములను కలుపుతూ, పరమాత్మలో ఆత్మనుకలుపు పనులుచక్కగాచేసి, బ్రహ్మంబులోకలసి, "పరిపూర్ణుడై"నాయందే ఉంటాడు.

311. యిదియేగాక యితరులకు చెందిన అడ్డంకులు కలిగించే విషయాలు నీకు చెబుతావిను,

312. ఆడదానిని పెండ్లాడి మొగుడై శరీరాన్ని అదుపులో నుంచినవాడు మనిషి, మీసంగల వాడైతే శక్తిని ఉపాసించి శక్తివంతుడౌతాడు, నోరు ఉండి పనికిమాలిన మాటలు మాట్లాడకుండా అతివాదము చేయకుండా మౌనిగా ఉండిన సాధన సిద్ధిస్తుంది. అలాంటివాడు జీవించి ఉన్నప్పుడు యిహలోకసౌఖ్యాలు, మరణించిన పరలోక సౌఖ్యాలు అనుభవిస్తాడు.

313. పాదములు గలవాడు పాపకర్మలను పాతాళానికి అదుముతాడు. చేతులుండిన అష్టదిక్కులు చేర్చుతాడు. చెవులుంటే దూరప్రాంతమందలి ధ్వనులను, మాటలను వింటాడు. కన్నులుంటే దేహమందలి అన్ని మండలాలు చూస్తాడు. దేహమున్నంతవరకు భూమి దేవతాలోకంబే, అంటే శరీరమందలి దేవతలను చూస్తుంటాడు. నాలుక ఉంటే దైవనామములను ఉచ్చరిస్తూ అమృతాన్ని త్రాగిన ఆనందాన్ని పొందుతాడు. ముక్కుపై భాగమగు భృకిటియేగంగా, యమున, సరస్వతీ నదులు దేవతలు కలియు ప్రదేశము, అతడు పొట్టలో జగమంతా ఉన్నదని పాటిస్తాడు. భూమియందు మహాత్వాకాంక్షల యందు ఆశపడక చంద్రుడు, సూర్యుడు అగ్నులతో యున్నట్టి భూమిలో సూర్యచంద్రాగ్ను లున్నంత వరకూ స్థిరంగా నుంటాడు. (తనచరిత్రనిలుస్తుంది).

314. బురదలోకి వెళ్ళినా మట్టి కుమ్మరి పురుగుకు అంటదు. అద్దమందలి రూపము ఎన్ని చిలిపిచేష్టలు చేసినా నిలబడదు. నోటికి నెయ్యి అంటదు. వెల్లుల్లి చేతికి అంటదు. ఎంతమనసును బాధించు మాటైనా శరీరాన్ని బాధించలేదు. ఆకాశఖేచరీముద్ర నిచ్చెనగా వేయగల గొప్ప మగాడు (భూమిపై ఉండుట అరుదు)

315. మంత్రములు సిద్ధిపొందినవారు, మాయను, జంతువులకు గల విషములను శరీరానికి తగలకుండా తప్పుకుంటాడు. అలాగే శరీరానికి వచ్చే విఘ్నాలను దోషాలను తప్పించుకుంటాడు. జ్ఞానం గలవాడు.

316. సూర్యునకు ఎలాటిమలినాలు అంటవు, మరణంతో శరీరానికి గల అన్ని భ్రాంతులు పోయినట్లు ఏదైనా అవసరమైన పని చేస్తున్నా, భార్యతో సంభోగిస్తున్నా, జ్ఞానసముపార్జనకు ఎలాంటి భంగము రాదు.





317. వినుము. ఆవిశ్వబ్రహ్మము శరీరమాయలకు దొరకదు, తత్వశోధనతో చూడగా కంటికి కన్పించును. నిత్యము అలా చేయుటయే ఆత్మబోధయగును పత్నీ.

318. **పార్వతి ప్రశ్న :** ఈ లోకంలో ఏలోపాలు లేకుండా నమస్కారములు చేయుట ఎలాగో గదా, ఆవివరాలు తెలియజేయుము నాకు. నాధా చీమ మొదలు బ్రహ్మ వరకు జంతువులు నరులుగల ఈ భూమిపైన ఎలానమస్కారం చేయాలి.

319. **ఈశ్వర ఉవాచ :** వందన వరుసక్రమము సూర్యునకు, అగ్నికి, గురువునకు, భూమిమీదగల యోగి, ఉదాసి, పరమహంసలు, భోగులు, అవధూతలు, కవికిని, రారాజులకు, అవతారములెత్తువారికి వరుసగా సాష్టాంగ నమస్కారములు చేయాలి.

320. గజం దూరంలో నుండగా చూచి వారిముందుకు ఎదురుగా వెళ్ళి సాష్టాంగపడి, ఎడమచేతిపై కుడిచేయి వేసి పాలభాగం భూమికి తగిలేటట్లు ఆనించి నమస్కరించాలి.

321. వారు వెళ్ళునపుడు నిల్చుని వారు కనపడు వరకూ చూచి, అపుడు కూర్చొన వచ్చును. యిందాక చెప్పిన వారిలో ఎవరు ఎదురుపడినా యిలా నమస్కరించాలి.

322. గురువువాని శిష్యుడు వీరిరువురు అవును కాదనుచర్చలు చేయరాదు. శిష్యుడు గురునివద్ద కూర్చొని. విషయాన్ని పూర్తిగానేర్చి వారి ఎదురుగ కూర్చొని పాదసేవచేయ వలెను.

323. యిలా కాకుండా ప్రవర్తిస్తే పాపం అంటుతుంది. దానిని వదలించుకోవడం చాలకష్టమైపోతుంది. తీపిరసములు పళ్ళు అతనిశక్తి కొలది తీసుకువెళ్ళి యిచ్చి పెద్దలకు నమస్కరిస్తే దృష్టిదోషాలు అన్నీపోతాయి. మంచి ఫలితములు కల్గుతాయి.

324. యిలా చేసి పాదాలు ముట్టని వారికి నరకము పట్టి వదలకుండా ఉంటుంది. దానిని వదిలించుకొనడం చాలా కష్టం, వారిని కన్నతండ్రి అయిన సరే ఆ దోషము తగిలితే పోదు "అది ఎలాగంటే" యిది కాలకూట విషసమానం.

325. మరియూ అవధూత, వుదాసీ, పరమహంసలను చూచి, 14 లోకములలో బ్రహ్మాదులు మొదలు మానవుల వరకు ఎవ్వరైనా సరే, నేను చెప్పినట్లు సాష్టాంగదండ ప్రణామములాచరించని వారు. తరింపరాని భరింపలేని మహానరకములను బడుదురు, అదిగాక, వారు ఎదురైనపుడు కావాలని ప్రక్కకు పోయే, భూపాలకులుగాని, షట్కర్మలనాచరించువారుగానీ, వ్యాపారస్తులు గానీ, వ్యవసాయదారులుగానీ, ధనవంతులు, లెక్కలను వేయువారు గానుగునాడించువారు, పొగడ్తలు చెప్పువారు. దేవతలను పూజించువారును ఎవ్వరైనా ఎంత గొప్పవారైనా సరే, ముందు చెప్పినట్లు సేవలు చేయని వారలకు గల ఐశ్వర్యం, సత్కర్మసంపద, దేహబలం, విజ్ఞానం క్రమక్రమంగా తరిగిపోవునని ఎరుంగుము.

326. పాంచాలీ పురుషోత్తమా ! ఆలోచింపగా పరబ్రహ్మనీవేగదా, ఐదుతలలు గలవాడివి. పార్వతీ దేవి భర్తవు, నీలో ఉండినిను పూజింపు వారికి స్వర్గసౌఖ్యాలు ప్రసాదిస్తావుగదా. అగ్నిదేవుడు సర్వాన్ని దహించినటుల వారి సర్వ కర్మలను త్రెంచి మోక్షమిస్తావు గదా! కీర్తిగల " ఓదేవా" మము కాపాడుము.

327. పార్వతీ దేవియింకాయిలా అంటుంది. నేను నీ శరీర సగభాగాన్ని ఆక్రమించినది నీయాజ్ఞచే గదా. నేను నీ సగభాగంలో ప్రవేశించుటచే గదా నీ అర్ధాంగి నయ్యాను. నేనా సగమాక్రమించు క్రమము పిడుగుపాటువలే గదా. నేనాసగమా క్రమించుట వలనే, "నీవేనేనయ్యాను" ఈ సృష్టిఅంతటికీ కూడాను.

328. పరలోకము చేరుటకు చేయుమంచి పనులను గమనించువాడా. పార్వతీదేవి హృదయమును దొంగిలించిన వాడా, మంచిగుణములందు ఉన్నతుడా, సాధువు లందరిలో గొప్పవాడా, యిహలోక పరలోక ఫలములనిచ్చువాడా, ఎవరికీ కనుపించని వాడా. శత్రువులను అణుచువాడా, అందరికంటే పెద్దవాడా నమస్తే, దేవతలందరిలో పెద్ద వాడా నమస్తే. నమస్తే. అని పార్వతీ దేవి చెబుతున్నది.

329. యిది శోభాయుక్తమైన సకల విద్యలూ నేర్చి కవిత్వంతో వెలుగొందుచూ సరసకవితయు, విశేషమగు అనంతవిద్యలూ నేర్చి, మంచి గుణవంతులలో రత్నంవలే శిరస్సున ధరించు కిరీటమువలే, అష్టాదివర్ణస్తులు పూజించు పద్ధతులు 25 తత్వముల యొక్క విషయములు సనారీవిశ్వేశ్వర సంవాదంబు నందు విశ్వేశ్వరులకు పార్వతీ చేయు ప్రార్ధన, వశిష్ఠాశ్రమ వర్ణన పార్వతీ విశ్వేశ్వరులను వశిష్టుడు పొగిడి ప్రార్ధించుటయు, విశ్వేశ్వరుల అవతార ప్రాముఖ్యత విశ్వేశ్వరులు పార్వతీ దేవికి తత్వోపదేశంబు చేయుట పార్వతీ చేయు ప్రశ్నలు విశ్వకర్మ నుండి పరంపర లుగా సృష్టిప్రకారము పిండోత్పత్తి క్రమము దేహమందలి 25 తత్వముల పంపకము, పంచభూతములకు పంచబ్రహ్మలకు సంబంధము దేహమందలి 25 తత్వములకు అధికారులు, పంచభూతముల పాలకులు భూతగుణములు పంచభూతములలో కలిసిన అధిదేవతల నిర్ణయము ఆధారం మొదలగు సహస్రారం వరకూ గల చక్రములందలి దేవతలు ప్రతిదినం వారికి జరుగు జప సంఖ్య సమయములు, సూక్ష్మ, కారణ అంగలక్షణములు 13 వర్గముల నిర్ణయములు, శివలింగస్వరూపము, ఐదు కోశముల వివరము, శరీరమందలి సర్వ అవయవముల వివరములు, లక్షణములు జ్ఞానాన్ని అజ్ఞానాన్ని తెలుసుకొనుట, తెలిసీతెలియని వస్తుబేధము, వాటి విషయవిశేషములు, భ్రాంతిని తొలగించుకొనుట, దేహిదేహ లక్షణములు నాలుగు రకముల సాధనా పద్ధతులు,





భూతసంఖ్యలయము, విశ్వరూపనిదర్శనము, దేహానికి గల అధికారుల వివరము, విరాట్ పురుషుని ప్రార్ధన, విశ్వకర్మను పార్వతి ప్రార్థించుట, పార్వతీ పరమేశ్వరులను విరాట్ విశ్వబ్రహ్మ ఆశీర్వదించుట పార్వతీ పరమేశ్వరులు విశ్వబ్రహ్మను స్తుతించుట, విశ్వేశ్వరుని అనేక రూపములు, ఆత్మాఅనాత్మలను తెలుసుకొనుట, శరీరఅవస్థలు, వాటిపంచీ కరణము, శ్వాసనడక, తత్వములనడక, తత్వముల ప్రశ్న, కర్మల ఫలితము, హంసరూపము. దాని నడకచే కల్గు ఫలితములు జీవికి గల బంధములు పంచభూతములగుణములు, రూపములు, లక్షణములు, వాటి ధర్మములు, వాటి రంగులు, భక్తుల చర్యలు, మాయను గుర్తించుట, దాని రూపము గురువులనడవడిక గురు శిష్యుల ప్రవర్తనలు, జ్ఞాని లక్షణము వేష జ్ఞాని లక్షణము, జ్ఞానుల ప్రవర్తన. యితర అడ్డంకుల వివరము, నమస్కార విధానము ఈ 58 విషయముల వివరములతో వృక్షములులతలతో అల్లుకొని పెద్దపెద్ద ఆకులతో అలంకారంగా నుండి, సువాసనలు పరిసర ప్రాంతములకు ప్రసరించుతూ నాగకేసరము పొగడ, పొన్న చెట్లనుండి దూరముగా వ్యాప్తించెడు పరిమళములు ప్రియసందర్శనాదుల చే ప్రకాశించుచూ, పూల దండల చుట్టూ వలే యున్న, స్థూలంబను బ్రహ్మగ్రంధిని శుద్ధి చేయగలట్టి సనారీసంవాదంబను వేదాంతప్రబంధంబున **ప్రధమాశ్వాసము సంపూర్ణము.**



విశ్వకర్మ భగవాన్ మరియు గాయత్రీమాత

# ద్వితీయా శ్వాసము

1. **పార్వతీప్రశ్న :** కీర్తిని ప్రసాదించి భక్తులను పుత్రులవలె చూచెడి గొప్ప సిద్ధాంతముగల ఓ విశ్వేశ్వరా ! నీ కలయిక గల యింద్రియ నిగ్రహులు నీ లాగే ఎల్లప్పుడూ ఉంటారు. వారియందు ఎలాంటి దోషములు లేకుండానే చేస్తావు, ఓ దేవా నీవు (వీసమైనా) కొంచెమైనా బాధ నొందవుగదా ! విశ్వేశ నన్ను రక్షించి కాపాడుము.

2. యోగములు అన్నీ చెప్పుము, యివిఎన్ని రకములో వాటి అర్ధము పూర్తిగా తెలియునట్లు, ఎలాంటి ఉపదేశములు పొంది వాటిని సాధింపవచ్చునో ఆ పద్ధతులు తెల్పుము.

**-: ఈశ్వరవాచ :-**

3. తలరంధ్రముపై అరిచేతి నుంచి, ముక్కుపై భాగమున దృష్టి నుంచి, మోచేతి నుండి మణికట్టు వరకు గల మధ్య భాగమును చూడగా చూడగా, చేతినితల పైనుంచినపుడుకనుపించిన దానిని బట్టి ఫలితాలు అనుభవిస్తాడు నరుడు. చేయి మొత్తము కనుపించిన రోగి, తక్కువగా కన్పిస్తే ఆయువృద్ధి, ఆయుష్షు ఎక్కువ ఉంటుంది, అసలు కన్పించకపోతే 6 నెలలో యమలోకం చూడటానికి వెళతాడు మానవుడు. అతనికి ఆయువు తగ్గుట, ఆయువుండి జీవించుట, రోగం పెరుగుటగానీ, ఆరోగ్యంగా ఉండుట గానీ తర్వాత ఎలా ఉండేది ఉదాహరణలతో యిక చెబుతాను. అది ఎలాగో చూడుము.

4. ముక్కుమూలంపై చూపుడు వేలుంచి, మీనాక్షీ చూడగా, ఆ వేలు దోసాకారముగా కన్పడితే ఆయువు పెరుగును, అలా ఉపాసనా ప్రియులు చూడగా చూడగా రెండు భాగాలై పొడవుగా ఉంటే ఏ మాత్రం ఆయువు తగ్గదు. ఒకటిగా కన్పిస్తే ఆయువు తగ్గును.

5. ముక్కుపై నున్న చూపుడు వేలు తగ్గి కనబడితే ఎక్కువగా ఆరు నెలలలోపునే చనిపోవును, చూపుడు వేలు అసలు కన్పడకపోతే నిస్సందేహంగా నెలలోనే మరణించును.

6. భ్రూమధ్యాన్ని కుడిచేతి చూపుడుౖవేలు, మధ్యవ్రేళ్ళతో ఎడమకన్నుతో కుడికన్నునూ బ్రొటనవ్రేలుతో, ఈ వేళ్ళ మొదళ్ళతో రెండు కళ్ళూ మూసి నిపుణత్వంతో రెండు చూపులను ఏకంచేసి కదలకుండా చూడగా, పరలోకం కనబడుతుంది ఈ ఉపవాసనాదీక్షకులగు భూమిపై జనులకు సాధనయే ముఖ్యము, సాధన తప్పక ఫలించును.





7. భ్రూమధ్యన చూపుడు వేలుంచి బొటన వేలు మధ్యవేలు పైభాగములతో, కనులు మూసి ఆజ్ఞాచక్ర పైభాగమున దృష్టి నిలిపి, నడుము నిటారుగా నుంచి పరమాత్మ యందు మనసు లగ్నంచేసి, తదేక ధ్యానంతో చూచుచుండునదియే త్రిపుటి యందురు.

8. రెండు కళ్ళు మూసి చూపునేకము చేసి భ్రూమధ్యన చూడగా సూర్యుడు, చంద్రుడు, అగ్నియూ, అనేక రూపములుగా కనబడుతుంటాయి, దహరాకాశమనే భ్రూమధ్యన బ్రహ్మ లీలలు అనేక రకములుగా చూడవచ్చును.

9. రెండు కళ్ళూ రెండు ముక్కురంధ్రాల్ని రెండు చేతుల చూపుడు మధ్య వేళ్ళతో పట్టుకుని శరీరాన్ని నిటారుగా ఉంచి, ఊపిరిబిగబెట్టి, శరీరాన్ని నిగిడించి, తత్వశోధనలో మనసు నిల్పి మాయను తెగనరికి శరీరమందలి రహస్యములను సాధనతోచూచి, భ్రమలుతెంచి సాధనచేస్తున్న మూడుమండలములు (120) రోజులకు మాయతొలగి వానికి గణపతి సిద్ధి కలుగును. వెలుగు దేహంలో కన్పించి బాగా పెరిగి మెరుపుతీగవలే చంద్రునివలె కన్పిస్తుంది.

10. నెమిలి వాహనమైన షన్ముఖుని ముద్ర చూడుము. ముక్కు కళ్ళు చెవులు, నోరు ఈ యింద్రియములను, చేతివేళ్ళతో చక్కగాపట్టి (కింద పై పళ్ళ వరుస తప్పకుండా ఉంచి, రెండు పెదవులు (గ్రహించునట్లుగా) చక్కగా ఊపిరిబిగించి, విశ్వబ్రహ్మ యందు విశ్వాసముంచి ఈ యోగము చేయవలయును.

11. ఈ షన్ముఖిముద్రయందు పద్మాసనం వేసుకుని, మోక్షంబుపై (పరలోక సంబంధమగు) ఆశగలిగి శరీరాన్ని మరిచి, వీణాదండంవలె శరీరాన్ని నిలిపి, సహస్రారకమలము నుండి వచ్చు విశేషమగు ధ్వనులకు ఆనందమొందుచూ, అనేక రకముల కాంతులు గల సూర్య, చంద్ర, అగ్ని మండలములు మూడునూ వెలుగొందు చుండగా, వాటి మధ్యన మెరుపుతీగవలె ఏడు రంగులతో యింద్రధనుస్సు మెరుపు కాంతులతో లెక్కలేనన్ని తెల్ల తామరపూవులతో, పుష్పమాలలవలె, ఎర్రతామర మాలలవలె, అనేక రకములగు పుష్పగుత్తులవలె, అనేకమగు అందములతో మనసున మిక్కిలి ఆనందము కలిగి అందు బ్రహ్మము కన్పించును. దీనినే షన్ముఖిముద్రయందురు. దీనిని జ్ఞానులు ఎక్కువగా అభ్యసించుచుందురు. దీనిని 12 సంవత్సరములు వరుసగా అనుష్టించి, అభ్యాసము చేయువారలు భూమి యొక్క యదార్ధ స్థితిని సులువుగా గ్రహించగలరు.

12. వినుముసాంఖ్య యోగం ఎలాగంటే, గొప్పదైన యంత్రాన్ని తంత్రంతో (శరీర ప్రాణాలతో) క్రమం తప్పకుండా మనస్సును దానియందు లగ్నం చేసి దైవాన్ని శరీరంలో కలుపుటకు చేయునదియే సాంఖ్యయోగమందురు.

13. పార్వతీ దీని విధానం చెబుతాను వినుము.

14. మంత్రమందున్న బీజాలను ముఖ్యమైనవిగా చేసి, శ్వాసను పూరించి,ఆ సమయానికి రెండింతలు గాలిని నిలిపి విడువవలయును. శ్వాసను నిల్పునదే కుంభకము అందురు.

15. ఆ స్థంభనలో మంత్రమందలి బీజాలను జపించాలి. అయితే ఆ జపం చేయుగురుస్థానం తెలుసుకోవాలి, పీల్చిన గాలిని పొట్టలో కదలకుండా ఉంచాలి. జగన్మాతను ఆత్మలోనుంచి అర్చన చేయాలి. అపుడు వచ్చు ఆకాశధ్వనులను శ్రవణానందముగా వినవలెను.

16. పార్వతీ ఈ సాధనకు గాంధారి నాడిని కనుగొని దానిలో వాయువును ఆపాలి దానిచే శరీరానికి శక్తి వృద్ధియగును. యింకా శరీరారోగ్యం కొరకు స్నానం చేసి 1.మడిగా, శరీరం సహకరించే 2. ముద్రలో కూర్చుని, 3.జపమాల చేతబట్టి 4. మనస్సు నిశ్చలంగా ఉంచి 5.మంత్రాన్ని జపించాలి. ఈమకారపంచకం జనసంచారం లేనిచోటున నివాసముండి రాత్రింబవళ్ళు ఈ యోగాన్ని 12 సంవత్సరముల వరకూ సాధించాలి. దీని వలన వచ్చు సిద్ధులెవ్వియనిన, మూడు నెలలకు వాయు స్వాధీనం, సంవత్సరానికి దేహారోగ్యము, 2 సంవత్సరములకు జనవశీకరణ, 3 సంవత్సరములకు సర్వదోషాలు పోవుట, 4 సంవత్సరములకు వాయు స్వాధీనం, 5 సంవత్సరములకు శరీరపీడలన్నియూ హరించుట, 6 సంవత్సరమునకు నేత్రాలకు ఆరోగ్యము, 7వ సంవత్సరమునకు పరుల విద్యలు హరించు శక్తి, 8వ సంవత్సరమునకు దివ్య దేహమును, 9వ సంవత్సరమునకు అనేక మంది దేవతలతో గల మహాసిద్ధ సమూహదర్శనము, 10 సంవత్సరములో తిరుగులేని వాక్కును, 11 సంవత్సరములో కోరిన కోర్కెలు సిద్ధించుటయు, 12వ సంవత్సరములో తానే దేవుడగుట. యిలా సాధిస్తే ఈ 12 విధములగు సిద్ధులు వస్తాయి. రాజయోగులకు ఈ సాంఖ్యంబు తప్పనిసరిగా కావాలి, ఈ సాంఖ్యయోగాన్ని సాధించేవారికి పంచపర్వములు అనగా రవిసంక్రమణ దినం, అమావాస్య, పూర్ణిమ, కృష్ణాష్టమి, కృష్ణ చతుర్ధి ఈ 5 రోజులలో పత్ని ఋతు సమయములు తప్పించి, మిగతా రోజులలో గర్భహింసను తొలగించుటకై వంశాభివృద్ధి కొరకు పై చెప్పిన కాలములందు తప్ప, తక్కిన రోజులలో పిండోత్పత్తికై భార్యాకూటంబు చేయుచూ, తక్కిన సర్వకాలము లందు ఆత్మను, యింద్రియములను నిగ్రహించుట అవసరమని తెలియుము.

17. అంతర్లక్ష్యం, బాహ్యాలక్ష్యం, మధ్యలక్ష్యములు బోధగురుని ద్వారా తెలుసుకుని, ముఖ్యమగు ప్రాణవాయువులను కలిపి శరీరాన్ని నిటారుగా ఉంచి, రెండు కళ్ళు మూలలందు దృష్టినిలిపి చంచలము లేకుండా చూస్తూ ఉశ్వాస నిశ్వాసలను ఆపి,





శరీరాన్ని మరచిన చెవులందు దివ్యనాదము వినబడు చుండగా, గందరగోళములతో గలఈ లోక సంబంధమగు విషయములు దేనికి ? గొణిగే మంత్రం ఒక్కటి యితర విషయములు నీకెందుకు?

18. ఈ విధమగు తారకయోగాన్ని భూమిపై సాధనము చేయు నరులకు ఆ పని సుఖముగా ఉండును. ఈ సాధనలో చిత్రమగు కాంతులు మేఘముల చివర కన్పించే, చంద్రకాంతులు చూడగలరు.

19. మరియూ ఈ తారకం సాధనమున సూర్యుడు, చంద్రుడు, అగ్నికాంతులు, నక్షత్రములు, గ్రహములు, నక్షత్ర మండలములు, మొదలగునవి అన్నీ కనబడు చుండునని ఎరుంగుము. దీని వలన

20. మనస్సు చలించని యోగియై యింద్రియములకు ఏ మాత్రమూ చలింపడు, మనసును బ్రహ్మములో నిలుపుటకు దీక్షచే యింద్రియములనణచి యితర విషయములు ఏమీలేకుండా, మనసు ఖాళీగా ఉంచి, ఏ ఆలోచనలు లేకుండా, ధనార్జన యందు ఆసక్తి భార్యాయందు ప్రేమ, పుత్రులందు అనురాగములు లేకుండా, ప్రస్తుతము తాననుభవించిననియు రాబోవు అన్ని భోగములును తెగనరికి పాతిపెట్టును. శరీర సౌఖ్యములనక్కడే అణచివేసి, చిత్తశుద్ధికి భంగం కలిగించు అన్ని పనులు పారద్రోలి ముక్కు మొదలున గల దహరాకాశమును చూచుచూ, పట్టు విడవక బ్రహ్మాన్ని వదలక, బ్రహ్మాన్ని పదిలంగా పట్టుకుంటాడు సాధకుడు.

21. యిలాంటి అమనస్కయోగమందు సిద్ధుడైనవానికి, అణిమాదులు అవలీలగా సిద్ధించును. యింక ఎలాంటి వాటినీ ఆశింపక మనసులో మాయకు చోటివ్వక, సుషుమ్నానాళమందున్న ప్రాణవాయువుతో సహా అన్ని వాయువులను కట్టగట్టి 1.కనులు మూసి 2.కొద్దిగా కనులు తెరిచి, 3. సంపూర్ణముగా కళ్ళు తెరిచి ఇలాంటి దృష్టులతో రాత్రింబవళ్ళు బ్రహ్మలీలను గమనించుచూ సుఖమగు యోగనిద్రాసక్తుండై, పితరుల కొరకు అహోరాత్రులు నిద్రమానినమాందాత కుమారుడు ముచికుందునివలె, అంపశయ్యపై భీష్మాచార్యునివలె, అనంతునిపై నారాయణుడు శయనించినట్లుగా, తాను జీవించదలచినన్నాళ్ళు చాలా కాలం వరకూ మృత్యుంజయుండై జీవించి సర్వప్రపంచాన్ని చూస్తుండునని తెలియుము.

22. సాంఖ్య, తారక, అమనస్క యోగ సాధనలు చేయుచూ, రాజయోగియై భువిపై జీవించి, భూలోక సుఖములతో మరణించిన తరువాత దేవలోకమందలి రాజ భోగములను పొందుచూ బ్రహ్మాన్ని పొందును. అలాంటి భూమిపైన నరుడు ఎక్కడ ఉన్నా వాడు నావాడే సుమా ! ఎలాంటి చోటులో ఉన్నా సరే.

23. యివే కాకుండా అష్టాంగయోగములున్నాయి, వాటి 8 లక్షణాలు చెబుతాను విను. 1. యమము, 2.నియమము, 3.ఆసనము, 4.ప్రాణాయామము, 5. ప్రత్యాహారము, 6.ధారణము, 7.ధ్యానము,, 8. సమాధులననువి. వీటిని అష్టాంగ యోగములు అంటారు. వాటి లక్షణలములు చెబుతాను విను.

24. 1.ధారణ = వేషము, 2.చారణ = భాష, 3.వారణ = అనుకరణము, యిలాంటి ఆకర్షణలతో ఉన్న గురువుల దగ్గరకు చేరితే, ప్రతీదానికి ఎప్పుడూ ధనంతెమ్మని శిష్యుని పీడించువాడే ఊర గురువు, వీళ్ళు షట్చక్రములు పేర్లు యిడా, పింగళ, సుషుమ్నానాడుల పేర్లను తెలుసుకుని, రేచక, పూరక, కుంభకములు గురించి చెబుతూ, వాటి సాధారణ ఆచరణ ఏ మాత్రం తెలియక, అన్నీ తానెరుంగుదునని అబద్ధములు చెబుతూ, ప్రజలను మోసగించి జీవించువారే ఊరగురువులు యిట్టి వారి వద్దకు పోరాదు.

25. కారాణాచార్యుని కనుగొని వారి పాదసేవలు చేయుట మంచిది. వారి వద్ద సకల విద్యలను తెలుసుకొనవచ్చును. ఏదైనా ఫలితములిచ్చు సమర్థులు వారే అతడే దైవసమానమగు గురువని భావించవచ్చును.

26. అలాంటి గురువుగారి సేవచేస్తూ తన మనసుకోరిన విద్యలన్నియూ, త్వరగా నేర్చుకుని తత్వసిద్ధులై విరాట్ పురుషుని జ్ఞాన నేత్రముతో చూచెదరు. అలాంటి వారికి ఎలాంటి భోగములు కావలయునన్నా ప్రకృతిలో పరిపూర్ణముగా లభిస్థాయి. అన్ని యోగములు భవిష్యత్‌ను తెలిసిన పూజనీయుడు, పుణ్యాత్ముడు, ప్రవీణుడతడే.

27. తక్కిన గురువుల వలన విద్యలు పట్టుబడవు. కీలుబొమ్మతలపైన కొండవంటి బరువగు ధనం పెడితే బొమ్మ మోయగలదా ? మనిషి ఆకారమేగాని మనిషి కాదు గదా ? గురువుల రూపేకాని గురువులుకారు, వారి గుణాలు వీరికి లేవు యిలాంటి వారికి ముమ్ముందు ఎలాంటి గతులుపడతాయో వాటినెన్నడూ తలంచరు వేషగురువులు.

28. **యమము** యిలాంటి కుచ్ఛితులు చెడు ఆలోచనలు, దుష్ట ప్రవర్తనలు గల గురువుల దరిచేరుటయే యమమందురు (యమ బాధలు పెట్టుదురు).

29. స్నానం చేద్దామని ఉదయాన్నే చన్నీళ్ళలో మునిగినంతమాత్రాన అదేం గొప్ప కాదు. మేము మడి కట్టుకున్నామని, తడిబట్టలను పిండికట్టుకున్నంత మాత్రాన శరీరమందలి మాయ వదిలిపోదు. మేము ఆచారవంతులమని, అక్కడ అంటు ఉన్నది, యిక్కడ అంటు ఉన్నదనుకొంటూ ఎక్కడెక్కడో గంతులు వేసి వెళ్ళినా, శరీర తత్వాన్ని సోదించలేరు. దైవాన్ని అర్చించిన ధీరుడుగా కనిపించినా, అతని తత్వమందలి రహస్యము దైవానికి తెలుస్తుంది. యివన్నీ నియమాలు కావు. ఈ పద్ధతులు నిష్టకాదు. మయిలు,





మడికాదు, యివన్నీ ఆర్భాటమే కులము గొప్పతనమేమీ కాదు, శరీరమందలి తత్వాన్ని శరీరపు లక్షణాలు తెలిపేది. "గురుమూర్తి" ఆయన ఆత్మకు యిది స్పష్టంగా తెలుస్తుంది. మరియూ

30. **నియమము** దేహమందలి 25 తత్వములు పంచీకరణము తెలియజేయు మంచివాడైన గొప్ప మహాగురువు దేహమందలి తత్వాలు వివరంగా చెప్పి చూపించి, శిష్యుని ఎటూ పోకుండా ఉంచుతాడు. నియమమంటే యిదే, భూమిపై సద్గురువులకు గల పద్ధతి యిదియే.

31. మంచి గుణములు బోధించు గురుస్థానము విడువక, గురువునకు సకల సపర్యలు చేయుచుండుటయే **నియమము.** మరియు ఆసనాన్ని గురించి చెబుతాను వినుము.

32. **ఆసనము** ఆసనములన్నీ తెలుసుకుని వాటినన్నింటినీ కొన్ని రోజులు అభ్యసించి, శరీరమును తేలికపరచి, తర్వాత వాటిని వదిలిపెట్టి శరీరానికి సుఖంగా ఉండే ఆసనమొకటి ఎంచుకుని భద్రంగా ఉంచుకుని సాధనం చేస్తూంటాడు తత్వసిద్ధికోసం మంచి శిష్యుడు.

33. పార్వతీ ఈ ఆసనాలన్నీ దొమ్మరులు చేసే విద్యలలోని ఒక భాగమని తెలుసుకో. యివి అన్నీ సాధకునికి అక్కరలేదు కాబట్టి వీటన్నింటినీ వదిలి వేయవలయును. నిత్యము ఎక్కడ తపస్సు చేయుటకు నిశ్చయించుకుందురో, ఆ గొప్పచోటును విడువక తత్వసాధన చేయునదియే **ఆసనమనంబడును.** పార్వతీ ప్రాణాయామ పద్ధతులు చెప్పెదను వినుము.

34. **ప్రాణాయామము** నీ శరీరం సహకరించిన ఆసనమేదైనా ఒకటి నిర్ణయించు కుని శ్వాసను పూరించి తత్వస్వాధీనమునకు ఏమాత్రము శ్వాసను విడువక, నిత్యము ఉపాసన చేయుటయే **ప్రాణాయామ**మందురు.

35. శరీరమందలి 24 తత్వములను సాధనచే తెలుసుకొనుటకు తనలో గల యింద్రియ గుణములచే మనస్సును చలింపనీయక నిలుపుచూ యుండునది. ప్రాణాలను నిలబెట్టి చేయు గొప్ప తపమదియే.

36. పార్వతీశరీరమందలి యింద్రియాలనే జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల సమస్త తత్వ గుణంబులును కదలనీయక, ఆత్మేంద్రియ నిగ్రహముతో మనస్సు నిలిపి ప్రాణాది వాయువులను దశవిధసాధనచే నిరంతరం శరీరమందు నిలుపునదే **ప్రాణాయామ మందురు.** ఈ యోగమునకు గొప్ప యోగులు కుంభకమందురు. యింక ప్రత్యాహారము చెబుతాను వినుము.

37. **ప్రత్యాహారము** అన్నము తినుట మాని ఆకులు తినుటచే అవి మేకల ఆహారం గదా ? దీని వలనఏమీ ఉపయోగం లేదు. కాయలు పళ్ళు తింటూ అడవిలో తిరగటం వలన పక్షులకు ఆహారంగదాపళ్ళు? దీని వలన కూడా ఎలాంటి ఫలితమూ లేదు. గాలి తింటూ శరీరాన్ని నీరసింపజేసుకోవడమే గాని ఏమి ప్రయోజనము? గాలి పాముల ఆహారం గదా ! బురద మట్టి తినే కప్ప బాంద్రు బాంద్రు మంటుంది. చెప్పుకోవడానికి అది ఏమీ గొప్ప విషయం కాదు. గంజాయి కల్లు తప్పతాగి నరులు కుప్పిగంతులు వేస్తే జ్ఞానము వాటితో రాదు. తనకు యిష్టమగు పదార్ధం యింటిలో ఉంటే ఆకలి వేసే సమయానికి అది ఆహారమవుతుంది.

38. రెండు పూటలాయిష్టమగు ఆహారాన్ని బ్రహ్మార్పణ చేసి తగుమాత్రము మళ్ళీ మళ్ళీ అడగకుండా తినే నరునిది **ప్రత్యాహారమందురు.** యిది యదార్ధము.

39. మరియు పార్వతీ జీవహింస చేయకుండా పాలుగానీ, విత్తనం లేని పళ్ళనుగానీ మొలకరాని కాడలుగానీ, దుంపలుగానీ, లేక యితరులకు పనికిరాక వదిలి వేసిన పదార్ధములుగానీ, యాచించి భుజించునదే **ప్రత్యాహారమందురు.** యింక ధ్యాన యోగం చెబుతాను వినుము.

40. **1) ధ్యానము:** దైవము సాధకుని ఇంద్రియ విషయములను అనురాగపరచు వాడుకాడు, చెడ్డ గుణాలను దండించు పరమపావన మూర్తి. చేతిలో అద్దంపెట్టుకుని ముఖాన్ని సరిచేసుకొనునటుల, పాప కర్మలను తెగనరుకును.

2) ధ్యానయోగమభ్యసించు మంచినిష్ట గలయోగి ఇంద్రియ వ్యాపారములకు అనురక్తుడుగాక ఇంద్రియసంబంధమగు దుష్టలక్షణములను, తెగనరుకును ధ్యానసిద్ధికొరకు.

41. శరీరము చేసిన పనులు ఆత్మకు అంటవు. మనస్సునందలి ఆలోచనలతో భ్రాంతులు కలుగును. అగ్నికి గల వేడియే భూమికి ఆధారము. అగ్ని తన తాపాన్ని తాను చూడలేదు, సూర్యకిరణములుచే నరుల మనసు రంజిల్లును గానీ స్వయంగా తనకు లేదని ఆత్మకు తెలుసు, ఎలాగంటే చీకటిలో అద్దము కానరానట్లు, యిలా శరీరగుణములు కొద్దిగానైనా ఆత్మకు చేరకనే ఆత్మకు చేరెననుకొని మనస్సు భ్రాంతి పొందును. ప్రకృతిలో తెలివితక్కువ పనులు చేయువాని ప్రవర్తనలివి. తత్వవిద్యను పాసించువానికి ధ్యానమంటే యిది కాదని తెలుసు.

42. మరియూ ధ్యానయోగానికి దేవాదిదేవుడగు విరాట్ విశ్వబ్రహ్మాయే సమస్తంబని మనస్సున నిశ్చయించుకొని, ఎలాంటి అనుమానములు లేని మనస్సుతో బయలు గురూపదేశం, ప్రకారం త్రిలక్ష్యసాధనములచే దృష్టి నిలగట్టి శరీర స్పృహ లేకుండా





మౌనముగా నుండుటయే ధ్యానమందురు. మరియూ ధారణయోగము చెబుతాను వినము.

43. **ధారణము:** శరీరానికి గల గుణములన్నీ మరచి తత్వసాధనయందు మనసు లీనమై, ఎక్కువ తక్కువలను ఆలోచింపక, గాలి, అగ్ని కలసిన వేడిగాలివలె ఎన్నో రోజులు తత్వసాధనలో ఉంటాడు మంచి తత్వసాధకుడు దర్పము లేనివాని పనివలె, అడవిలోనున్నా, ఊరులో ఉన్నా ఒకే రీతిలో ఉంటాడు.

44. యోగసాధనకు శరీరస్పృహలేకుండా తీవ్రమగు పనులచే, ప్రపంచసృష్టిలో గల స్వతసిద్ధమగు గుణములలో చిక్కుబడక ఎండినకట్టెవలె నుండువాడు అంటే ఏ కదలికలు లేక ఉండువారిని **ధారణుడంటారు.** పార్వతీ సమాధి లక్షణములు చెబుతా విను.

45. పంచభూతములగు గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశము వీటి యొక్క గుణములు శరీరంలో దేనికవి పంచివేసి, ఏ భూతమొక్క అంశాన్ని దానికేయిచ్చి సంపూర్ణంగా ఏ కోరికలు లేనివాడు **సమాధి** యోగములోనున్నవాడు. యింకా

46. **ఈ సమాధియోగం ఎలాగంటేను వినుము.**

47. అన్ని దిక్కులకు (చెవులు) వినికిడినిచ్చిన బుద్ధిమంతుడు, భూమికి శరీరాన్నర్పించిన జ్ఞానముగలవాడు, గాలికి ప్రాణములనిచ్చిన గొప్పవాడు. అగ్నికి చూపులిచ్చిన అతనెగురుడు.

48. నీళ్ళు ఆవిరియై ఆకాశమును చేరినట్లుగా, శరీర సహస్రారచక్రమందలి పరమాత్మ యందు ఆత్మకలుపగా తానే విశ్వబ్రహ్మమై యుండును, అలాంటి మహనీయులకు ఏలోకమందైనా ఏదీ అసాధ్యం కాదు. అన్నీ అతనికి సాధ్యమే దీనినే సమాధి యోగమంటారు. అలాంటి యోగ సిద్ధునకు సమస్త సిద్ధులు కలిగియుండుటయే గాక, కలయు, కలగాంచకపోవుటయు, మరణము చావు, చావు లేకుండుట, బాధలు, ఘోరమైన బాధలు, జననము, మరణములు యివేమి లేకుండునని ఎరుంగుము. అలాంటి వానికి నేను పదే పదే నమస్కారాది సేవలు చేయుచుందునని ఎరుంగుము. అలాంటి స్థితి గలవారు నా యందు కలసి సర్వకాలంబులు చాల విధములగు ఆనందములు పొందుచూ, ఎలాంటి కోరికలు, ద్వేషములు ఎట్టి భయములు లేకుండా శాశ్వతంబుగ, అనేక మన్వంతరములు చూచుచుందురు. అష్టాంగ యోగ ఫలితములు లోకులకు తెలియుటకు, నీకు చెప్పితిని, యివి కాకుండా భూచరీముద్రయోగాన్ని గురించి చెబుతాను వినుము.

49. పద్మాసనం వేసుకుని వాయువును బంధించి కూర్చుని, మద్యమ లక్ష్యముచే దృష్టిని విడవకుండా శరీరాన్ని స్థిరంగా నిటారుగా వుంచి జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ పనులందు మనసు పోనీయకుండా, ఉశ్వాసనిశ్వాసలు బంధించి, ఆత్మను తలంచుతూ ప్రారబ్ధకర్మలన్నింటినీ వదిలించుకుని, బ్రహ్మమే నిత్య సత్యమని నిశ్చయించి త్వరలో నశించు ఈప్రాపంచక విషయములందు చిక్కు కొనక, మిధ్యాజగములో మిత్రులతో ఎలాంటి బేధ భావములు లేకుండా, యిహ లోక విద్యలందు ఆసక్తి లేకుండా మాయను గెలిచే ఉపాయాన్ని విడువకుండా ఆత్మను పరమాత్మలో చేర్చునట్టి పనిని చేబూని దేహాన్ని మరచి, ఆత్మను స్వాధీనం చేసుకుని, ఒక ఆసనంలో కూర్చుండి బ్రహ్మవిద్యను అభ్యసించును.

50. సుగుణములుగలట్టి జాతి రత్నమా, భూలోకంలో ఈ ముద్రాభ్యాసులకు తర్వగా బ్రహ్మపదము సిద్ధి కాగలదు. ఈ అభ్యాసములో నుండి, ఏ పనిలో ఉన్నా, ఏ పరిస్థితులలో ఉన్నా ఎలాంటి ఆటంకాలు రావని తెలుసుకో, ఈ ముద్రకు రాధాయంత్రంబని, ధ్యానముద్రయని సంయమయోగీశ్వరులందురు.

51. **పార్వతీ ప్రశ్న :** ధ్యానము చేసే ఆసనములగురించి విన్నాను, ఈ మిధ్యా లోకంలో గల చాలా రకములు బాధలు పోగొట్టి ఆత్మదర్శనంగావించు బ్రహ్మ విద్యా విషయములు, తెలియపరచే ధ్యానముద్ర గురించి విన్నాను. మంత్రలయహట రాజయోగములను గురించి ప్రాణనాధా వివరంగా తెలియ జేయండి.

52. **ఈశ్వరఉవాచ :** ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము మూడుపూటలు క్రమం తప్పకుండా సంధ్యావందనాది పనులుచేయుచూ మంచి బుద్ధితోగురువు చెప్పిన విషయములతో శక్తిని ఆరాధించువారలకు యోగము సిద్ధించును.

53. సనారీ విశ్వేశ్వర సంవాదమందలి, మాలామంత్రం, పంజరం, హృదయాత్మ, మంత్రములను,అంగన్యాసకరన్యాసములతో కవచము, దిగ్బంధనము, సంజీవన, చైతన్య, జాతాశౌచ, మృతాశౌచ మంత్రములను ధ్యానించువారికి నెలలో దర్శనమిస్తాను.

**సనారీ ఉవాచ : ఏ మంత్రాన్నైనా నెలరోజులు క్రమంగా ధ్యానిస్తే ఫలిస్తుంది.**

54. పరవిద్యాభక్షణయు, గురుపూజయు, తర్పణలతో, వీటన్నింటితో చేసి హోమము చేసి జాతివర్ణబేధం లేకుండా సర్వమానవులకు అన్న సంతర్పణ చేసిన వారికి, జీవించి నంతకాలం భూలోకసౌఖ్యములు, ఆ తర్వాత పరలోకములో అనేక విధములగు సుఖములను అనుభవించెదరు.

55. యిటుల భార్యాసమేతులై, నిన్ను, నన్ను అనగా పార్వతీపరమేశ్వరులమగు మనలను యంత్రమును 16 విధములగు ఉపచారములతో మడి, మైలని ఆలోచింపక





కుల ఆచారములతో కాకుండా ఆత్మజ్ఞానంతో, విభూతి, రుద్రాక్ష, స్పటికతులసీమాలలను ధరించి, శ్రీ గంధం, కుంకుమల నద్దిన పుష్పాలు, బిల్వదళములు, ఉసిరిక, ఎర్ర తామరలు, తెల్లకలువలు, మందారము, పారి జాతము మొదలగు సమస్త పుష్పములతో, ధూప, దీప, నైవేద్యములు, నీరాజనహారతు లిచ్చి ఆత్మ ప్రదక్షణలతో పూజించువారికిగాక యితరులకు ఈ గొప్పదగు మంత్రయోగము ఎలా సిద్ధించునని, పార్వతీదేవితో విశ్వేశ్వరుండిట్లనియె.

56. దేహమందలి వాయువును పూర్తిగా వదిలి, తర్వాత పూర్తిగా పీల్చి ఉదరమందు నిలిపి, ముక్కు చివర దృష్టి నిలిపి, మంత్రమందలి బీజములను అక్షరమునకు ఒక లక్ష చొప్పున జపము చేసిన వారికి మంత్రసిద్ధి యగును. జపము వాయు స్థంభనలో చేయాలి.

57. జ్ఞానంగల వారందరూ కలిసి మనము గల చోటుకు చేరి, తిను పదార్థములు, తాగు పానీయములతో, కడుపు నిండా తృప్తిగా భుజించి సంతృప్తులగువారికి, నీవు నేను ఏకమైన ఆస్థానమందు వారి వారి సర్వకోర్కెలను సిద్ధింపజేసెదము.

58. మన ఆస్థానములో స్త్రీ సంపర్కము చేయకూడదు. యిది బ్రహ్మ విద్యగదా మనము వారిని గమనించి అర్హత గల వారికి మాత్రమే సిద్ధులనివ్వాలి, యిలా కాకపోతే అచటగల వారందరికీ సిద్ధులను యిచ్చే వారిమే పత్నీ!

59. పార్వతీ'నీ', నా మనస్సులను తృప్తిపరచిన రాక్షసులు, దేవతలు, ఉరగులు, గరుడ, గంధర్వ, యక్షులు, మానవులు, హింసాదులను విడనాడినవారు, సంయములు, సన్యాసాశ్రమము చక్కగా పాటించువారు, యతీంద్రులు, మృగములు, పక్షికులంబులు, ఇహలోకపరలోక భోగములందిరి యిందునీకు తెలియని రహస్యములేమున్నవి పత్నీ, లయ, యోగము చెబుతాను వినుము.

60. **లయయోగము :**ఎలాంటి ఆసనములో కూర్చున్నా శరీరాన్ని నిగిడించి బ్రహ్మాన్ని చూడటానికే, మాయలోపడకుండా ఉంటే శరీరంలో గల వాయువుల చేత గ్రంథుల చలనముచే ఆత్మపరమాత్మయందులయమగును.

61. యోగాభ్యాసికి శరీరమందలి రోగాలుపోతాయి. మాయ అతని దగ్గరకు రాదు, జరుగుతున్నది జరుగబోవునది యోగాభ్యాసికి తెలుస్తుంది. దేహము సిద్ధి బొందునని చెబుతున్నాను. త్యాగబుద్ధితో ఈ యోగము చేసి సిద్ధించుకొనుము.

62. **హటయోగము :** పార్వతీ కష్టమైన హటయోగాన్ని చెబుతాను, ఉశ్వాస, నిశ్వాసలు చూపులను కలిపి ప్రణవనాదాన్ని వినుచూ మానసిక విరామాన్ని పొందుచూ కోరికలు నీ హృదయములో నుంచుకొమ్ము దేవీ యిలా సాధించాలి.

63. **ముక్తాసనము :** సాధకుడు స్థిరంగా ముక్తాసనంలో కూర్చుని మనసున విరక్తి భావముతో హటయోగ సాధనము చేయాలి. మంచి నేర్పరితనముతో నాభిదగ్గర నాడులను క్రమంగా త్రిప్పుతూ సాధన చేయాలి. సాధకుడు మితాహారము భుజిస్తూ సాధనచేస్తే నాడులందలి మలినాలు తొలగించి శరీరానికి ఆరోగ్యాన్నిస్తుంది.

64. ఆసనాన్ని మెత్తగా ఎత్తుగా ఉండేటట్లు కూర్చోటానికి ఏర్పాటు చేసుకుని, ఎటూ తిరగకుండా స్థిరంగా ఉంటూ యోగాన్ని సాధించాలి. పులుపు, వేడిచేసే పదార్ధములు కడుపునిండా తినకుండా, ఎక్కువపుష్టినిచ్చు పదార్ధములు వదిలి పెట్టి, తనకు ఎక్కువ బలముండియూ ఎదుటి వాడు బలహీనుడగు నప్పుడు అతని పై ఆధిక్యత ప్రదర్శింపకుండుట, స్త్రీని గురించిన ఆలోచనలను మానుము, వీటన్నిటికన్నా ముఖ్యమయిన ప్రకృతిమాయను విడువుము ముందు దాన్ని జయింపుము. నీవు యోగముచేయు ప్రదేశము నందు ఎలాంటి భయములకు బెదరక హాయిగా యోగమభ్య సింపుము,యిలా చేయు హటయోగాభ్యాసులకు దేహమందుబాధలు, శరీరము వేడెక్కి వణుకుట జ్వర బాధలు కల్గును, అపుడు శాంతులు ఎలా చేయాలంటే, వాయువును బంధించి శరీర సర్వావయవములలోనికి పంపించాలి. యిదంతా దేహారోగ్యము కొరకు మాత్రమే.

65. కాలి మొదటి భాగాన్ని మూలధారము దగ్గరగా ఉంచి, అంగాన్ని అరికాలి సందులో నుంచి అణిచిపెట్టి, యోగదండాన్ని సంకలో పెట్టుకుని గట్టిగా పట్టుకున్నదే "ముక్తాసనము" యోగులకు.

66. యిలా కూర్చుని యుండేది "ముక్తాసనము".

67. శరీరావయవములన్నీ దగ్గరా పెట్టి శవంలాగా ఉండి, యోగఫలితాన్ని బొంది, చెవులలో దివ్యనాదాలు వింటూ రోజులు గడుపువాడే ధీరుడు.

68. ఆధార చక్రంలో ఉండే ప్రాణాన్ని గట్టిగా గాలి పీల్చినట్టుగా పీల్చి బంధించి, స్వాధిష్ఠాన చక్రముపై పెట్టి మణిపూరక చక్రములో త్రిప్పి ఆపైనగల దవడకు తగిలించి, కంఠమునందుచేర్చి యిడా పింగళ సుషుమ్న నాడులు కలియు చోటగు ఆజ్ఞా చక్రమందు నిలిపి కదలకుండా ఉంచగలిగిన నేర్పు గలిగి అందులో ముక్కంటియగు పరమేష్ఠిని సాక్షాత్కరించి, త్రికాలములందును రాత్రి పగలు సమయమిది అను భావము పక్కనపెట్టి వాటిని గమనించకుండా, కాలానికి అతీతుడై, భ్రూమధ్యన దృష్టి నుంచి ఆహారంగా పాలుద్రాగి శ్వాసలు అతి తక్కువగా తీసుకుంటూ యోగాన్ని చేయువారు మఠంలో ఈ హటయోగాన్ని సాధించుతారు.





69. ముందు చెప్పినట్లు దీనిని మంత్రయోగము-వలే తెలుసుకుని ఆచరించుతూ "మానవతీమణీ" ఎల్లప్పుడూ మానకుండా చేస్తూ లయమవ్వాలి, యిపుడు కుంభకము చెబుతాను. పుణ్యాసాధ్వీ యోగమందు వాయువును శరీరమందు నిల్పుటే కుంభకము.

70. ఈ విధముగా కుంభించినదే రాజయోగమందురు, మరియూ ఈహట యోగానికి ఓడ్యాణ, జాలంధర, మూలబంధములను మూడును తప్పకుండా కావలసి యుండును ఆ బంధములు మూడు ఎలాగంటేను.

71. సాధకుడు ఒక చోట కూర్చుని రెండు పాదాలను సమంగా ఆనించి చాచి, చీలమండలపైతలను పెట్టి, వీపు మీద రెండు చేతులు పెట్టి అలా కూర్చుని చేయుటయే యోగసాధన మందురు.

72. నా ఎడమ భాగమందు, నివాసముండి కౌగిలించుకుని ఆనందించుచున్న కామినీ ఇపుడు చెప్పునదియే జాలంధర బంధమందురు.

73. జాలంధర బంధానికి అంగుళం చాచి గట్టిగా అదిమిపట్టి గడ్డం ఆనేటట్లు వంగి రెండు చేతులు వెనుక భాగాన్నుంచి గాలి వదలక తీసుకోక నావవలె పడవలాగా నిశ్చలంగా ఉండి బొడ్డును వెనుకకులాగిపట్టి

74. యిలా ఉంటూ క్రమక్రమముగా సాధించునదే యోడ్యాణ బంధము.

75. గుండెకు గడ్డాన్ని ఆనించి, శరీర భాగములన్నీ కలిసేటట్లుగా శరీరాన్ని వంచి నిండుగా శరీరం లోపల వాయువు నిల్పుతూ ఉండేది మూలబంధ యోగముపత్నీ.

76. ఈ మూలబంధ యోగాన్ని సాధించేవారలకు, వాతము, పైత్యము, కఫము, యివేకాక యింకా అనేక రోగములుపోతాయి. వాయువు శరీరంలో శ్రమలేకుండా నిలుస్తాయి. యిదిగాక శరీరంలో శుద్ధి ఈ యోగానికి కావలయును. దానికి అంగుళంన్నరు వెడల్పు, గజం పొడవు గల మెత్తని సున్నితమగు గుడ్డను ప్రతిరోజూ మ్రింగుతూ, 24 నిముషముల వరకూ ఉంచి నిదానంగా తీస్తూ పూర్తిగా మింగాక మాసానికొకసారి యిలా కొన్ని సార్లు చేస్తుంటే హృదయమందలి కఫముపోయి శరీరం పరిశుద్ధమై గ్రంధులు కూడా శుద్ధియగును. యిది సాధకుడు పరిశీలించును. ఈ సాధకులకు మొదటి మూడు మాసముల చివరిలో శరీరము వేడెక్కి, అతి వేడి కల్గును, వీరలకు విభూతి భస్మధారణచే దేహము చల్లబరచు ఉపచర్యలు చేసి శాంతింప జేయవలయును, 1. సంవత్సరానికి హృదయగ్రంధియందు ప్రమాదము కల్గించునాడీ స్థానములు వాయువులచే పొంగి శూలగా కన్పడును. దీనికి (నీళ్ళుతాగించి కక్కించుట) వాంతులుచేయించి శాంతింపచేయవలయును. 2వ సంవత్సరములో తలనొప్పి వణుకు వ్యాధులు కల్గును. వీటికి శాంతులు చెబుతాను. తలనొప్పికి పర్వతధ్యానంబును (దేహము

చల్లబడుతున్నట్లు మంచుపర్వతమును నూహించుట) వణుకు రోగంబునకు గోవుపేడతో చేసినవిభూతి ధారణము చేయించి ఈ రోగములు తగ్గించు కొనవలయును. శూల వ్యాధిని భరించలేక కొందరు మృతులగుదురు. ఈ హటయోగికి 4 రకముల ఉపయోగములు కలవు. 1.వైకృతము, 2.ప్రాకృతము, 3.సకీలకము, 4.ప్రాణా యామము, అను ఈ 4 యోగంబులు గలవు. 1.వైకృతమునకు మంత్రం లేకుండా ముందు చెప్పిన మంత్ర యోగమందు స్వేఛ్ఛాప్రకారముగా లక్ష్యసాధనలచే సాధించునదే మంత్ర యోగము, 2.లయ యోగానికి గ్రంధి శోధనలు లేక లక్ష్యసాధనలచే వాయువులు నడిపించుతూ క్రమముగా స్థంభించి నదే ప్రాకృతమనబడును, 2. సకీలకంబుకు 82 ఆసనములలో కొన్నిటి నభ్యసింపుతూ యితరసాధనలు మానియుండునదే సకీలక మనబడును, 4.ప్రాణాయామమునకు స్వస్థానమందు వాయువులను ఆపి శ్వాసలు నడపకుండా బలాత్కారముగా నిలుపు నదియే ప్రాణాయామ మందురు. మరియూ 84 ఆసనంబులలో ముఖ్యమైనవి కొన్ని చెబుతాను వినుము.

77. 1.మత్యాసనము, 2.కూర్మాసనము, 3.గరుడాసనము 4.మయూరాసనము, 5.ప్రేతాసనము, 6.పద్మఆసనము, 7.కేసరిఆసనము, 8.ముక్తాసనము, 9.కఫాలాసనము, 10.వజ్రాసనము, 11.గోముఖాసనము, 12.సుఖాసనము, 13.సిద్ధాసనము, 14. కుక్కుటాసనము, 15. ధనురాసనము, 16.వీరాసనము, 17. ఉత్తాన కూర్మాసనము.

78. పార్వతీ ఈ17డింటిలో అతి ముఖ్యమైనవి చెబుతాను అవి ఏవంటే 1.పద్మాసనము 2.గోముఖాసనము, 3.సింహాసనము, 4.వీరాసనము, 5.ప్రేతాసనము లను ఈ ఐదు మంచివియై శరీరానికి సుఖముగా నుండునని ఎరుంగుము.

79. కూర్చుండి కాళ్ళు నిలువుగా చాచి, ఎడమ పాదాన్ని కుడి తొడపై ఆనించి, కుడి పాదాన్ని ఎడమతొడపై ఆనించి, తలను శరీరాన్ని వంచకుండా నిటారుగా ఉంచి, రెండు చేతులను చక్కగా చాపి, రెండు మోకాళ్ళకు ఆనించి కూర్చున్న అదే పద్మాసనం.

80. ఎడమ కాలి మడిమ కుడివైపు ముఖముగను, కుడికాలి మడిమ ఎడమవైపు ముఖముగాత్రిప్పి. మొలభాగము క్రింద మోకాలి మీద మోకాలి నుంచి బిగించి, భూమికి తగలకుండా శరీరాన్ని నిటారుగా ఉంచి, భ్రూమధ్యాన్ని చూచూనదే గోముఖాసనము

81. సాధకుడు పాదముల మీద గుదస్థానము ఉండునట్లు కూర్చొని కుడి ఎడమల రెండు చేతులను తొడలపై చాచిఉంచి, ఏ మాత్రం వంగకుండా కూర్చొనినోరు తెరిచి, భూమధ్య గల పరంజ్యోతిని చూస్తుండుటయే సింహాసనం.

82. ఎడమ తొడపై కుడి పాదము పెట్టి ఠీవిగా కూర్చుని, కాళ్ళను విడపర్చి పీఠమేసిన మంచి హుందాగా ఉండి కూర్చునేందుకు చాలా వీలుగా ఉన్నదే వీరాసనము.





83. శరీర అవయవములన్నీ భూమికి సమంగా తగిలేటట్లు చక్కగా చాచి, ముఖం ఆకాశం వైపు పెట్టి వెల్లికిలా పడుకున్నదే ప్రేతాసనమగును.

84. పార్వతీ ఈ ఐదు ఆసనములలో శరీరానికి సుఖంగా ఉండి యోగాభ్యాసానికి వీలుగా నుండినది గోముఖాసనమని తెలియుము మరియూ నీ హటయోగమునకు ద్వాదశ సిద్ధులు వచ్చును అవి ఏమిటంటే.

85. ఒక సంవత్సరంలో లోకాలన్నీ వశమగును. రెండవ సంవత్సరంలో శరీర సుఖము విద్వత్తు వస్తాయి. మూడవ సంవత్సరంలో శత్రువర్గము విషజీవ నాశనము కల్గును. నాల్గవ సంవత్సరంలో భూమికి తేలికయగును, (సాధకుడు భూమిపై కాలు తగలకుండా నడుచుట) ఐదవ సంవత్సరంలో యితర శరీరము లందు ప్రవేశించుట, యితరుల మనోభావములు గ్రహించుట, ఆరవ సంవత్సరంలో దివ్యదృష్టి దూరప్రాంతములలోని వ్యక్తులను చూచూట. ఏడవ సంవత్సరంలో అనేక చిత్రములు చేయుట, అతిచలిని, అతివేడిని భరించుట. ఎనిమిదవ సంవత్సరంలో భూమి అన్ని దిక్కులూ తిరుగుట తొమ్మిదవ సంవత్సరంలో దేవతా బృందములు సాధకునికి నమస్కరిస్తారు. పదవ సంవత్సరములో వాక్సిద్ధివచ్చును. పదునొకండో సంవత్సరంలో అన్ని భూతములు వశమౌతాయి. పంద్రెండో సంవత్సరంలో తానే మారు శివుడౌను పార్వతీ. ఈ యోగాన్ని సిద్ధులుపొందగోరు వారు చేస్తుంటారు.

86. ఈ వరుస సాధనలతో సిద్ధులు సాధించవలయును. యివిగాక రాజ యోగమును గురించి వివరంగా చెబుతాను వినుము.

87. పద్మాసనం వేసుకొని తొడలపై చేతులు పెట్టి శరీరాన్ని నిటారుగా ఉంచి పై చూపుతో ముక్కుపై భాగాన్ని రెండు కంటి చూపులను ఏకంచేసి, చూస్తూ ఉండేది మహారాజయోగమవుతుంది అవుతుంది.

88. వినుము ఈ రాజయోగము యింతవరకూ చెప్పిన అన్ని యోగముల కన్నా చాలా కష్టంగా ఉంటుంది. మంచిగురువు చేత ఉపదేశం పొందితే చాలా సులువుగా యోగ సిద్ది లభిస్తుంది దీనియందు ఆదిలో తీవ్రవేదన కల్గును. సాధనచే శరీరంబు సిద్ధించుటకు అదృశ్యమగుటకు, వరుస తప్పక సాధనలు చేయువారికి యింతకాలమనే లెక్కలేకుండా 6 గంటలు మొదలుకొని 12 సంవత్సరములలోగా యోగసాధనా పట్టుదలను బట్టి ఈ మధ్యకాలంలో సిద్ధించుచున్న యిలాంటి సాధనలు తెలుసుకొనుట, ఉపదేశం చేయుట కష్టమని తెలుసుకో మరియూ శాంభవీ ముద్ర ఎలాగంటే వినుము.

89. తారకయోగ పద్ధతిలో కళ్ళతో చూచే పద్ధతులు తెలుసుకుని భక్తిచే అర్ధనిమీలితా దృష్టితో నిశ్చలంగా అలా చూడగానే కాంతామణీ చిత్రవిచిత్రములు కనుపించును

భీతినొందక ధైర్యంగా చూడగా, అనుమానంబులు లేక ఆత్మ విపరీతమైన ఆనందంచే నిర్మలత్వమును పొందును. యిది చాలా సుఖమగు అనుకూలమగు దారిగదా దీనిచే ఆరోగ్యం కూడా వస్తుంది శాంభవీ.

90. పార్వతీ ఈ శాంభవీ ముద్రా సాధనా కాలములో అనేక నిదర్శనములతో కన్నుల పండువుగా బ్రహ్మంబు కన్పించును. మరియూ ఉత్తరశాంభవీముద్ర లక్షణములు చెబుతాను వినుము.

91. ఈ ముద్రలో సంపూర్ణ లక్ష్యముతో జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను చలింపనీయక జీవి ఆనందాన్ని పొందుచూ శ్వాసలు తక్కువగా నడిపించుచూ యోగము చేస్తూ మహానందం కల్గించు అందమగు బ్రహ్మాన్ని చూస్తూ యుండే ఉత్తర శాంభవీముద్ర సాధకునకు సుఖమైన దారియిది. ప్రశాంతముగా చేయు సూక్ష్మమార్గమిదియే.

92. ఈ ఉత్తరశాంభవీ ముద్రయోగములో పరలోకం కానరాక జ్యోతితో సర్వం నిండిన ఆకారము కనబడును. అదియే విరాట్ బ్రహ్మనిజరూపమని తెలుసుకో, యిపుడు అంతఃఖేచరీ యోగం గురించి చెబుతాను వినుము.

93. ఈ యోగానికి మనసును చెదరనీయక లోపల స్థిరంగా ఉంచి, శరీరాన్ని కదల్చకుండా తనివితీర కనులతో, లోచూపుతో అంతరంగాన్ని చూచునదే అంతః ఖేచరీ యోగము.

94. ఈ ఖేచరీ యోగమునందు లక్ష్యాన్ని గ్రహించి చూచువాడే జగద్గురువు, సర్వలోకాలకు గురుడు, అతనితో నేను కలసి ఉంటాను. నీవు నా ఎడమ భాగమునందున్నా, అడవులలోగాని, పట్టణాలలోగాని తిరుగుతున్నా సరే ఎలాంటి పరిస్థితులలోనున్నా గానీ సాధకునితో ఉంటానునేను.

95. ఈ ఖేచరీ సాధనలో పరమాత్మ మేఘముల వరుసవలే, మెరుపు తీగవలే, సూర్య, చంద్ర, అగ్ని మండలముల వలే పున్నమి చంద్రునిలాగ నక్షత్రములవలే కనబడునదే అంతఃఖేచరీయందురు. మరియూ ఈ యోగమందు దిక్కులు తోచని స్థితి కలుగును. మరియూ కోర్కెలు తీరుట, సంపూర్ణ ఆరోగ్యం, అధికాయుష్షు, యింద్రియముల స్థిరత్వం కలుగజేయును. యింకా బాహ్యఖేచరీ యోగాన్ని చెబుతాను వినుము.

96. ఈ యోగానికి నాలుక క్రింద నరాన్ని రోజురోజుకీ కొంచెంకొంచెంగా వరుసగా కొన్ని రోజులు కోసి, దాని వాటం గమనించి నాలుకను గొంతులోనికి త్రిప్పితే, మానవులు చాలా కాలం జీవిస్తారు యింతే దీని సాధనము.





97. పార్వతీ ఈ బాహ్యఖేచరీ యోగము రాక్షసులకే గానీ యితరులగు దేవతలు, మానవులు, సంయమీశ్వరులకు ఈ సాధనము మంచిదికాదని వదిలేసారు. యింకా అచల సాధనయోగాన్ని గురించి చెబుతాను వినుము.

98. అచలమనే యోగ సాధనను చక్కగా బోధిస్తాను వినుము దాని రూపము చక్షురింద్రియగోచరము. దీని సాధనలో శరీరాన్ని కదలకుండా దేహానికి గల సర్వ గుణములు, కంటి చూపు నోటి మాటలు కదలికలేక స్థిరంగా ఉంచుటే.

99. శ్వాసను స్థంభించి శరీరములోపల వాయువులను కలిపి మనస్సును స్థిరంగా ఉంచి, యిహలోక విషయములందు విరక్తి చెంది, చూపు నిలగట్టి చూడగాను. యిదియే అచల యోగ సాధనమౌను దేవీ! బాణముల వంటి కనులు గలదానా.

100. పార్వతీ అమిత ఆనందమయమైన అంతఃకరణములతో కదలికలేకుండా చెవులతో శ్రద్ధగా వినుచూ, రెండు చూపులను ఏకం చేసి చూస్తూ ఆలకింపుము. ఈ అచల సమాధి యోగమందు పరమాత్ముని గురుతులు లేకుండా, యిహలోక ఆకారములు కనబడును. దీనిలోని ఆకారములు పేరులు, పనితో గలట్టి వస్తుజాలంబులు పరమాత్మకాదనునది యదార్థమని భావించువాడు, ఆకాశ మార్గమున తిరుగుచుండును. అట్టివానికి ఏలోకములోనైనా ఏ వస్తువు అడ్డమైనా దానిని చూడక యిదంతా వట్టిదని భావించి, ఎట్టి అడ్డంకులు లేక స్వయంగా వెలుగొందు సూర్యునివలే ప్రకాశిస్తుంటాడు. అలాంటి వానికి నేను నమస్కరిస్తుంటానని తెలుసుకో, అతనే నేను నేను అతనని, అతనిలోనే నేనుందునని ఎరుంగుము. లెక్కించలేనన్ని సుగుణమలు గలిగి మనస్సున సంపూర్ణ జ్ఞానం గల చింతామణీ. లేడి కన్నుల వంటి కన్నులు గలదానా, నా ఎడమ భాగమందున్న సతీ, ఈ యోగాన్ని నీ ఆత్మతో చూడుము.

101. యిన్ని విధములైన యోగములను సాధించుటకు, ఆత్మానుభవముతో కల్గిన దృష్టాంతరములు సాక్ష్యములు కావలయును, జీవికి ముందు జన్మల సాధనా సంపదయే మూలముపత్నీ.

102. నాలుగు వేదాలు, పద్దెనిమిది పురాణాలు, నీతి శాస్త్రములు, లెక్కలేనన్ని ఉపనిషత్తులు చదివి ప్రతీ దానికి ఒకపదానికి పదిరకాల అర్థాలు చెప్పగలిగినా, తర్కవితర్క మీ మాంసశాస్త్రములు వాదించ గలిగినా, అతను గొప్ప విద్యావేత్తయని ఆత్మ కనబడదు. యజ్ఞం చేయుట, చేయించుట, వేదములు చదువుట చదివించుట, దానంబుయిచ్చుట, పుచ్చుకొనుటయను ఈ ఆరుపనులను చేసినవాడని, ఆశ్చర్యపడి ఆత్మకనబడదు. పంచాక్షరీ, షడాక్షరీ, అష్టాక్షరీ, ద్వాదశాక్షరీ మొదలైన మంత్రాలు చదువుతూ జపమాలతో జపం చేసినా యిహలోకంలో పూజింపదగినవాడని ఆత్మ ఎదురుపడదు. యింద్రజాల

విద్యతో ఉన్నవిలేనట్లు, లేనివి ఉన్నట్లు చూపించగల విద్యలెన్ని నేర్చినవానికీ తొందరపడి ఆత్మయనునది శరీరం కంటే వేరైనది శాశ్వతమగునది కనులకు కనుపించదు. ప్రకృతిలో మాయలు చేయకల్గిన ఈ వేషబాషలు శరీరానికి గలదుర్గుణములైన ఉపాయములను శరీరం నుంచి బయటకు పంపగలవా ? చూడగా యివి బ్రహ్మ విద్యలు కావు బ్రాంతులు కల్గించునవి మాత్రమే.

103. గడ్డాలు, మీసాలు పెంచిసర్వాన్నీ జయించాననుకొని యింద్రియ విషయములను ఆపలేక మౌన వ్రతం చేసినా, గొప్ప ఆభరణములు ధరించి, విలాసముగా తిరిగినా, అందగాడైనా కురూపియైనా, కాషాయ వస్త్రములు ధరించి వేషాలు వేసినట్లున్నా, వేద ధర్మాలను వదిలి పొట్టను పోషించు కొనుటకు లింగాలు కట్టుకున్న జంగాలు అయినా, తదేకధ్యానంలో ఉండటానికి బంగు అనే నిషా పానీయాన్ని తాగేపామరులకు, తాంత్రికులగు యిట్టి వారందరికీ జన్మరాహిత్యము ఎలాగవుతుంది. ఆలోచించగా యివి భ్రమతో చేయు జ్ఞానం లేని పనులు, వెర్రివాళ్ళు చేసే పనులు అనుకుంటాము మనము, ఈ తెలివి తక్కువ పనులన్నీ ఆత్మను పరమాత్మలో చేర్చి జన్మరాహిత్యము పొందేవి కావు సుమా !

104. అమితమైన ఆహారాన్ని భుజించి శరీరాన్నీ పొట్టను పెంచినా, నాకు చాలా మంది సంపదగల గొప్ప చుట్టాలున్నారని మిడిసిపడినా ఆఖరికి శరీరము కట్టెలతో కాల్చబడి, భూస్థాపితం చేయబడి మట్టిపాలవుతుంది. పల్లకీలు ఎక్కి చందనగంధాలను ధరించి పయనించినా, ఆఖరికి జీవంపోయి దుర్వాసన పుట్టవలసిందే, "పాపము ఎందుకు" శరీర స్వభావమది మొలకి నూలు తాడు కట్టినా, వెండితాడు చుట్టినా, ప్రభువు వేషం వేసినా పకీరు అయినా ఎద్దునెక్కి తిరిగినా, మొద్దలాగా ఉన్నవాడైనా మంచి అందగాడైనా కురూపియైనా మూర్ఖత్వముచే పనికిరాని యిహలోకపు వేషములు, తెలివితక్కువ పనులు, యివి గొప్ప కార్యములుకావు వీటితో ఆత్మసాక్షాత్కారాన్ని పొందలేరు, యివి శరీరాన్ని నిలబెట్టగలవా? ఆత్మ శరీరానిదేనా ? పుట్టే ఆత్మను అంటే మళ్ళీ మళ్ళీ జన్మించగల ఆత్మను కనిపెట్టి చూడలేని ఈ మర్మములెందుకు ?

105. గుణం లేకుండా మంచికులంలో పుట్టినా, ధనం కోసం చేసే మాయ తపమెందుకు ? గొప్పదగు రాజసము పాడైపోయే శరీరాన్ని నిలబెట్టగలవా ? అడవిలో నివాసముండు అలవాటెందుకు? క్రోధాన్ని వదలకుండా మోహావేశాలను చంపుకోని ఈ తనువులెందుకు? కలలో చూచిన వైభవములు తనకురావు. శరీరగుణాలు చూడగా పరమాత్మయగునా ? కాదుగదా ! సూర్యుని కాంతికి మిరుగుడు పురుగు సమానమగునా, యివన్నీ నాశనమగు శరీరములుగా నీ శాశ్వతమగు ఆత్మలుకావు. మంచి జ్ఞాని లక్షణములుకావుయివి.





106. **పార్వతీ ప్రశ్న :** శరీర గుణములు విడిచిపెట్టుట ఎలాగు నా మనవి విని వాటి విధానములు చెప్పండి స్వామీ. బ్రహ్మదేవునికైనా ఈ గుణములు వదలవు గదా? ఎక్కడికి పోయినా కూడా. మునిశ్రేష్ఠుల హృదయములందు ఉండు మహాను భావా తను గుణధర్మములు చెప్పమని కోరుతున్నాను.

107. **ఈశ్వర ఉవాచ :** పురుషులను మాయలో మోహంలో పెట్టి భ్రాంతులు కలిగించే, మదించిన ఏనుగులవలే నడుచు స్త్రీల ఆకారములు ఎన్నో మనసు నందుంచు కొని ప్రేమ కలుగు మాటలు, చేతలనుగాంచి వారి దరిచేరి ఆ ముగ్ధ మోహన సౌందర్యాలను చూడకుండా ఉండలేక, చూస్తూ ఆత్మయింద్రియ నిగ్రహములను మరచి కామాతురత కలుగుటయే శరీరలక్షణం సుమా ! బ్రహ్మకైనా కాంతావ్యామోహాన్ని ఆపుటగానీ, తృంచివేయుటగానీ అసాధ్యము, యిదేమి వంటిమీద గుడ్డకాదుగా తీసిపారేయడానికి దీన్ని తృంచడానికి కావలసిన పద్ధతులు విను దేవీ. శరీరానికి ఎలాంటి కోరికలు ఎప్పుడూ ఉండ కూడదు. హంసను స్వాధీన పరచుకుని విడువకుండా సదా సాధనచేయు రాజయోగమే దీనికి ఉత్తమము.

108. భార్యా వినుము. యింద్రియ కార్యములను ఆపాలంటే, తనమనసులో వాటి ఆలోచనలు రాకుండా ఆపాలి, అలాంటివాడు రత్నములలో దివ్యరత్నం వంటి వాడు, రాజులకు రాజగు రారాజు సుమా.

109. మనసే సర్వ ప్రపంచములు, మనసే యోగములకు మూలము, మనసే మాయ లో పడవేయునది, మనసే బ్రహ్మన్ని చూపునది, మనసే నరకములు పాలు చేయునది, వీటన్నింటికీ మనసే కారణము.

110. మనసుస్థిరంగా లేకపోతే చాలా రకములయిన మాయలలో చిక్కుతాడు మానవుడు, అవి ఎప్పుడూ వదిలిపెట్టవు. తపస్సు చేస్తూ అడవిలో ఉన్నా సకల భోగములతో పట్టణంలో ఉన్నా ఏ దిక్కు లేకుండా అడవిపాలయినా, రాజ్యాన్ని పాలిస్తూ గొప్ప పనులు చేస్తున్నా, శరీరం మరచి తపస్సులోనున్నా, ఎలాంటి ముని పనులు చేస్తున్నా కొండగుహలో కాపురముండినా వీటన్నిటికీ మనసే కారణము.

111. మనసును స్వాధీన పరచుకున్న వారు ఎక్కడ ఉన్నా శరీరాన్ని వారిదిగా భావించక ఉంటారు. వారి దగ్గరకు మాయలు చేరవు సుమా! ఎలాగంటే సూర్యకాంతితో చీకటి పోయినట్లుగా సరియైన సత్యమగు సర్వ విషయాలు వారి ఆత్మకు తెలియును. "అది ఎలాగంటే"

112. సూర్యకాంతికి చుక్కలు, చంద్రుడు, దీపములు, క్షణంలో కాంతిని కోల్పోయి ఎక్కడ దాగి ఉంటాయో? ఏ మూలకు పోతాయో చూద్దామంటే కంటికి కనబడవు.

113. పార్వతీ మనసును జయించి గాలిని మనస్సునందు నిలిపి పాలు, నీరు కలిసినట్లుగా పరమాత్మయందు జీవాత్మను ఐక్యం చేసి, యోగాన్ని చేయువారు, సిద్ధులైవారు కోరుకున్నంత కాలము ఆత్మపరమాత్మ సంధానముతో పొందిన ఆనందముతో జీవించి, కుమ్మరిపురుగు మట్టిలో తిరిగినా దాని శరీరానికి మట్టి నంటించుకోని విధముగా జ్ఞానులు మనసు నందలి భ్రాంతులతో చిక్కుకొనక తెల్లని గాజు బుడ్డిలోని దీపమువలే స్వచ్ఛంగా చలింపకయుందురని తెలుసుకొనుము.

114. జ్ఞానోదయమయిన మానవులకు తమకు గల పాపకర్మలన్నియూ దగ్ధమగును సుమా. ఎలాగంటే చిల్లగింజ విత్తనము మురికి నీటిలో వేస్తే నీరు పరిశుభ్రమగునటుల.

115. మహ తేజస్సుతో వెలుగొందు జ్ఞానముగల నరులు ఎక్కడ ఉన్నా అగ్నివలే పరిశుద్ధులై, అతను అన్ని కులములను మతములను అన్ని వస్తువులను తక్కువగా భావించక తనతో సమానంగా యిష్టముగా చూచును.

116. మరియూ గాలి, భాస్కరుల నడకలో మంచి, చెడ్డ, శుద్ధము, అశుద్ధము అను భావం లేకుండా అన్నిటా సమంగా వెలుగునూ, గాలినీ అందింతురు. అలాగే జ్ఞానులు మంచి, చెడూ, పేదా, గొప్ప, భవంతి, పూరిపాక అనేవి లేకుండా అందరినీ సమానంగా చూస్తారు.

117. దూషింపరాదు ఏ ప్రదేశాన్నైనా! అంతా అందమగు విరాట్ విశ్వకర్మచే ఆవరించిన ప్రాంతమే, యింతకుముందు యిపుడు, యిక ముందు ఉంటుందాయన మహిమ, వీటిని నరులు ఆత్మలో ఊహించరేమిటి ?

118. ఓంకార స్వరూపుడగు విశ్వకర్మతో నిండినదే క్రిములు, కీటకములు, మృగములు, పక్షులు, కొండలు, కోనలు, చెట్లు కదులునట్టి కదలలేనట్టి సమస్త ఆకారములు, సర్వ ప్రపంచములు, లెక్కలేనట్టి కోటాను కోట్ల బ్రహ్మాండంబులు, ఆ మహాదేవుని సంకల్పమాత్రముచే సృష్టింపబడి కార్య కలాపములు, వ్యవహారికములు, జీవించు పద్ధతులు, తిరస్కరించు పద్ధతులతో నున్న ఈ సృష్టియావత్తూ ఆ విరాట్ రూపుని సంగమము లేక ఆకాంతిని చూడలేనివారు దీనజనులు. దేవాది దేవునకు తగలకుండా తెలియకుండా, అసాధ్యమైన అనంతంబైన ఆ మహాదేవుని గుర్తించలేని వారు పాపులు ఆ మహాప్రకాశాన్ని చూచువారు బ్రహ్మ, విష్ణు, రుద్ర,యింద్ర సూర్యులు, దేవతలు, ప్రమధులు, రాక్షసులు, సంయములు, అవధూతలు, ఉదాసీలు, పరమ హంసలు, యోగులు వీరు తప్ప తక్కిన సమస్త జనులు ఆ కాంతిని చూడలేరు బ్రహ్మదేవుని మనుమడు సూర్యునికుమారుడగు వైవస్వత మనువు యను "యముని" పేరు గలవాని భటులు, తర్జనభర్జనలతో మహాఉగ్రస్వరూపులై, భీషణ రోషణములతో యమపాశములతో





ఎక్కువ శస్త్రములు చేతులతో పట్టుకుని వదలక, కనికరించక సమస్త శరీరములకు తగిలించి వారి వారి కర్మల నాలోచించి యముని ఆజ్ఞప్రకారముగా ప్రాణాలు తీసుకుని ఐదువందల యోజనముల దూరంబులోనున్న యమలోకంలో శిక్షించుటకు 3 గంటలలో ప్రాణాలు తీసుకుపోయే యమదూతలను చూచెదరు గాన, ఈ రహస్యము నీకు చెప్పాను. అలాగాక ఆ మహాదేవుడగు విరాట్ విశ్వబ్రహ్మ స్థానాన్ని తెలుసుకున్న మహనీయులకు యముని బాధలు ఏమీ చేయలేక స్వర్గం, నరకం అనునది లేక విరాట్ స్వరూపమునందు ఐక్యమగుదురని ఎరుంగుము.

119. ఆ యముని దండనలకు, శిక్షలకు, ఆశ్రమలను తట్టుకోలేక అన్ని మతముల వారు ఈ కర్మను జయించు ఉపాయములు చేయుచుండిరి. న్యాయమార్గాన్ని అజ్ఞానం చేత తెలుసుకోలేక నరులు నరకములపాలగుచున్నారు.

120. **పార్వతీ ప్రశ్న :** స్వామీ ఓంకారములో ఏమేమి ఉన్నాయో ఓంకారం ఎలా గయ్యిందో చెప్పి తర్వాత నరకంలో గల బాధలు ఎన్ని రకములో, ఏమి చేస్తే అవి సంభవిస్తాయో వివరంగా చెప్పండి.

121. **ఈశ్వర ఉవాచ:** మొదలు విశ్వబ్రహ్మము, కుదురు, కళ, నాదమ, బిందువు కలసిపుట్టినదే ఉమా ఓంకారరూపము పరమపావనమూర్తి విశ్వకర్మరూపమదేసుమా

122. మొదట 'అ'కారము ఉద్భవించినది దాని పాలకుడు విష్ణువు తర్వాత 'ఉ'కారము పుట్టింది దానికి లక్ష్మీదేవి అధిదేవత, 'మ'కారము ఆఖరిలో ఏర్పడింది 'అ' కారము 'మ'కారము రెండింటికి మధ్య 'ఉ'కారమున్నది ఈ రెండింటికి తేడా కలదు. 'అ'కారము లేక ఈ 'ఉ' కార 'మ'కారములరెంటినికలుపగా ఆ రెంటికి తప్పకవాదము కల్గును. పై విధంగా ప్రణవమగు ఓంకారము ఏర్పడినది.

123. ఈ ఓంకారము ఐదు రకములుగా భాగింపబడియున్నది. ఎలాగంటే ఆధారముగా క్రింద కన్నువలె నుండి, దానిమీద దండవలే వంగిన ఆకారము, దాని మధ్యన సర్పశిరస్సు వంటి ఆకారము దానిపై అర్ధచంద్రాకారము ఆపై గుండ్రని ఆకారములు కలసి ఓంకారమైనది. ఈవిరాడ్రూపము యొక్క తేజస్సు సర్వ జీవులందు, జంతువులందు జీవముగా దండలోని పువ్వులను దారముతో చేర్చినట్లుగా అన్ని జీవరాసులందు సంపూర్ణంగాయున్నది. అదే విరాట్ విశ్వబ్రహ్మ శక్తిచేత పంచభూతములు ఏర్పడ్డాయని తెలుసుకో దేవీ.

124. 1. తారక రూపము ఆకాశంబనియు, 2.దండరూపము వాయువనియు, 3. అగ్నికుండలాకృతియనియూ, 4. జలం అర్ధచంద్ర రూపమనియూ, 5.భూమి బిందు రూపమనియు యిలా ఓంకారమునకు పంచమహాభూతములు ఐదు అవయవములుగా

జ్యోతిరూపముగా గల విరాట్ విశ్వబ్రహ్మ శక్తి చేత ప్రపంచం పుట్టుటకు తల్లి రూపముగా యుండిపుట్టుట, పెరుగుట, మరణంబులకు ఓంకారము ప్రధానవస్తువుగా నుండునని తెలుసుకొమ్ము యింకా 21 నరకములను గూర్చి చెబుతాను వినుము వాటి పేర్లు ఫలితములు.

125. 1.వైతరిణి : మరణించిన నరుని రూపాన్ని యమదూతలు పట్టుకుని ఈడ్చు కొంటూ తీసుకుపోతూ వారి నేరాలు చెప్పి మండుచున్న అగ్నిగుండములో మాడ్చుతూ, మొదలంటా కాల్చుతూ వారిని యముని వద్దకు తీసుకువెళ్ళి ప్రేతరూపములోని జనులు ఏయేపాపాలు చేసారో తెలియజేస్తారు. ఈ వైతరణి అనే శిక్షలో.

126. 2. అయోమయంలో: గొప్ప విద్యను అందాన్ని కళ్ళతో చూడలేక, తన మిత్రులతో కలిసి తిరుగుతూ వారి నాశనమునకు ఖచ్చితమైన ఉపాయములను పన్నిన వానిని అయోయమంలో పడదోస్తారు. ఆ ప్రేత రూపము ఏదారి కానలేక చాలా కాలం అయోమయంలో పడి ఉంటుంది.

127. 3. అంధకూపం : మోసానికి సిద్ధపడిన వారి వద్ద ఆ పనికి తగినట్లు లంచాలు తీసుకునే వారి పాపాలను బట్టి ఏ దారి తెలియరాని చీకటి గోతిలో పడదోస్తారు.

128. 4. రౌరవంబు : తినకూడని పదార్థములు గొప్పవారికి తినడానికిచ్చిన వాని శరీరాన్ని రౌరవంలో పడేస్తారు ఆ పాపాన్ని అనుభవించుటకు, తామరరేకుల వంటి కన్నులు గలదానా పాపాన్ని వదిలించుకొనుటసాధ్యమా ?

129. 5. మహారౌరవము : కన్యలను ధనం కోసం అమ్మి గొప్పవారలమని కడుపుకు తిని కాలం గడిపేవారిని ఏమీ విచారించకుండా, చాలా అన్యాయము చేసాడని యముడు అతనిని మహారౌరవమను నరకములో పడవేయును.

130. 6.తప్తార్ణవర్ణం : నోములు నోచి ఆ దేవతలకు ఉద్వాసం చెప్పని వనితలు తప్తార్ణవమను నరకమును పొందుదురు. పురుషులకు కూడా ఈ నరకమే పూర్తిగా సంభవిస్తుంది దీనిని వదిలించుకొనుటకు మానవులకు సాధ్యపడదు.

131. 7. వజ్రకూటకము : నడిచే దారిలో ముళ్ళు వేసి నడవకుండా చేయు నరులకు వజ్రకూటకమనే ముళ్ళు గల నరకంలో ఆ పాపాత్ములను యమభటులు పడవేయుదురు.

132. 8. గొప్ప రోగములతో బాధపడు వారి వద్ద ఎక్కువ ధనాన్ని ఆశించి మందులు దాచిన వైద్యుని (స్వైన్ ఫ్లూ) యమభటులు శూకర ముఖమను నరకములో పందినోట్లో వీలుగా పెట్టి వదలకుండా ఉంచుతారు. (దానితో కొరికించుతూ)





133. 9.దండశోకము : పరకాంతల పొందుకై తిరిగిన వారిని క్రూరంగా బట్టి ఎటూ తప్పుకునే వీలు లేకుండా దండశోకమనే నరకంలో పడదోస్తారు.

134. **10. అసిపత్రంబు :** యజ్ఞము చేసిన వాని భార్యతో క్రీడించిన పరపురుషుడు గానీ, పరకాంతలు మోహంతో పరపురుషులతో రతిసల్పిన స్త్రీలనుగానీ, క్రూరమయిన అసిపత్రమను అడవిలో పడవేస్తారు.

135. మరియూ పార్వతీ యజ్ఞములు చేయువారు. యజ్ఞకర్తయగు వర్ధక ప్రజాపతి సమక్షంలో కాకుండా విడిగా పశువధ చేయుటచే వారు యమకింకరులతో యినుప ఆయుధములతో దెబ్బలు తిని విపరీతమగు బాధలననుభవించెదరు.

136. **11. ఉదుంబరంబు :** అబద్ధసాక్ష్యము చెప్పి యితరులను బాధించిన వారికి శిక్షించుటకు ఉదుంబరంబనే శిక్షవేయుదురు.

137. **12. తప్తతైలంబు :** తద్దిపూజ చేసినట్టి స్త్రీలు ఆసమయంలో దైవానికి ఉద్వాసన చెప్పనట్టి వనితలకు గుండె మీద పొయ్యి పెట్టి మూకుడులో నూనె పోసి వండు తుంటారు. చాలా కాలం వరకు.

138. **13. ఉత్పాతంబు :** తప్పుడు పనులు చేసేవాడు ఊరిజనాలకు గొప్ప మాటలుచెప్పి భయంకరమగు పాపకార్యములు యంత్రతంత్రములతో చేసి నిలకడలేని చెడ్డ పనులన్నీ నీతిలేని ప్రభుత్వ సంబంధ పనులు చేసి యితరులను తేలికగా చూచేవాడు క్రిందపైనా చూస్తుంటాడు. అలాంటి వాళ్ళను త్వరగా ఉత్పాతంబనే నరకంలో పడవేస్తారు.

139. **14. పక్షపాతంబు :** వినుము పక్షపాత నరకంబు ఎవరికి వేస్తారంటే దేవీ.ధర్మం తప్పి లంచాలు తీసుకున్న వారిని పెద్ద ముళ్ళుగల యినుపబోనులో పెట్టి ప్రతిరోజు చాలాకాలం గిరగిరా త్రిప్పుతారు.

140. **15.రేతోపానము :** సంగమకాలమందు అమ్మాయిల నోటిలో లింగాన్ని పెట్టి సరసములాడుచూ ఆడవారి యోనులు ముద్దాడు తెలివితక్కువ వానిని రేతఃపానమందు పడవేయుదురు.

141. **16. లాలాభక్ష్యము :** ఎనిమిది రకముల మంత్ర ప్రయోగములైన 1.వశ్యము (వశపరచుకొనుట), 2.మారణము (చంపుట), 3.స్థంభనము (కదలకుండా చేయుట), 4. సమ్మోహనము (తమపై మోహము కల్గించుకొనుట) 5.ఉచ్ఛాటనము (ఒకచోట నిలువకుండా చేయుట), 6.ఆకర్షణము (తన వైపునకు లాగుట), 7.భీషణము (భయపెట్టుట), 8. బేధములు (యిరువునకు అభిప్రాయ బేధములు కల్గించుట) యిలాంటి విద్యలను యిష్టముగా పొంది, విష్ణుసాయుజ్యము పొందు మార్గములని

వీటిని ప్రదర్శించి జనాన్ని అనేక రకములయిన బాధల పాలు చేసి వీటితో జీవించువానికి యమభటులు రేతుపానమను నరకమున శిక్ష వేతురు.

142. యివేకాకుండా రౌరవము, మహారౌరవనరకంబులందు యిలాంటి పాపాత్ములు అంతములేకుండా చాలాకాలము ఆ బాధలననుభవించు చుందురుని ఎరుంగుము.

143. 17. జీవించడం కోసం రోషముతో ఎలుకలను చంపేమందు ఎలుకల బెజ్జాలలో పెట్టిన దోషికి కుంభీపాతమను దుఃఖమును కలుగును.

144. 18. తన వరుసలో కూర్చున్నవారికి మంచి ఆహారాన్ని పెట్టి, విడిగా అన్నం పెట్టమని అడిగిన వారికి వీరు తినేది కాకుండా వేరే పదార్థములుతెచ్చి పెట్టిన వారికి, యమదూతలు క్రిమిభోజనం తినిపింతురు.

145. 19. యతీశ్వరులు కోరినప్పుడు అన్నం పెట్టని ధనికులుగానీ, ఏపనులు చేయువారుగాని చేయనివారుగానీ, వారి యందు భక్తి లేకుండా చూచీ చూడ నట్లు తప్పుకునేవారిని, అయఃపిండమనే నరకముపాలుచేస్తారు.

146. 20. జ్ఞానముగల వారిని దూషించే అజ్ఞానులకు, యితరుల జీవనోపాధి చెడగొట్టే వారికి, పెళ్ళిచెడగొట్టే పాతకునకు మహాంధకారమను నరకమున బడదోయుదురు.

147. 21. తనకు విలువగు వస్తువులెన్ని ఉన్నా, ఎలాంటి దానములు చేయనట్టి మనుజులకు, యమభటులు విషభోజనం పెట్టి సన్మానింతురను భయము యమలోకంలో దేహికి కల్గినా, వదలక దీనినే తినుమనుచు పడవేయుదురు నరకములో చాలా కాలం వరకూ.

148. ఈ 21 నరకములుపొందు జనులు నీలోనూ నాలోనూ ఉండి కూడా మనలను చేరలేక సామాన్యమానవ యిహలోక భోగ విషయములందు చిక్కుకుని దక్షిణ దిక్కున గల యమలోకము చేరెదరు. "ఎలాగంటే" వాతము, పిత్తము, శ్లేష్మము, కఫము, యింద్రియము, మూత్రము, మలము, శోణితము, పుమ్మి, గులిమి, చీముడు, పుసి, చెమట, రక్తము, చమురు, భీతి, శూల, కురుపు, ఆకలి, ఆయాసము, విచారము అను 21 కలవు. వీటితో నరకముపొందెదరు. యివిగాక స్వర్గమను వేరొకటి కలదు చెబుతాను వినుము.

149. స్వర్గమనేది ఒకటి ఉన్నది. మానవతను కోల్పోక పొందకూడని దానిని వదిలేసి, మంచిదారులు విడువక, అరిషడ్వర్గంబులలో చిక్కక ఉన్నవారు తమలో శక్తినాదాన్ని ప్రతీక్షణం అనుభవిస్తుంటారు. అదియే స్వర్గము పార్వతీ.





150. **పార్వతీ ప్రశ్న :** స్వామి జీవన్ముక్తి మార్గములు పొందుటకు ఏమేమి ఉపాయములు గలవు వాటిని ఎలా సాధించాలి. ఆ మీద యింకేమికలవో నామీద కరుణతో దయతో నాకు చెప్పండి.

151. **ఈశ్వర ఉవాచ :** ఆకాశమంతా ఖాళీ ప్రదేశముగాయున్నట్లుగా, గాలిలో పొగయున్నట్లు, అగ్నిలో కాంతి కలసియున్నట్లు, నీటిలో 9 రుచులున్నట్లు భూమి లోపల రంగులు కలసియున్నట్లు, ఖాళీ ప్రదేశంలో అంతా విశాలంగా యున్నట్లు, అన్ని దిక్కులకు వ్యాపించిన గొప్ప సృష్టి రహస్యము ఏమంటే, మానవ శరీరానికి గల గుణములను తత్వాన్ని ఈ ఆలోచనలు మరచి, శరీర స్పృహ లేకుండా పరమాత్మయందు ఆత్మను జేర్చి స్వయంప్రకాశుడై ప్రాణంతో నున్న వాడేముక్తికి అర్హుడు.

152. యిలాగు ఎండిన కట్టెవలె స్థిరముగా నున్నవానికి జీవన్ముక్తి లభించును. అట్టివానికి కలలు వచ్చుట. కలలురాకుండుట, చావు, చావులేకుండుటయు జాగ్రతాది మొదలగు అవస్థలుగానీ, బాల్యాదిచతుర్విధావస్థలుగానీ, యింకా గొప్ప అవస్థలేగానీ, చలి, వేడి, సుఖము దుఃఖము, యిలాంటివి ఏవీ ఆ మహానీయుల దరిచేరవు. వీటన్నింటినీవారుసమంగా చూచెదరని ఎరుంగుము.

153. **పార్వతీప్రశ్న :** నాథా మీ యోగసాధనా పద్ధతి నాకు చెబితే అందరూ చేసుకుంటారు. మాలోగల దోషాలు తొందరగా విడిపోయి అవి మానుండి పారిపోయే విధానం చెప్పండి.

154. **ఈశ్వర ఉవాచ :** కామము మొదలుగా గల 12 వర్గాలను కాలుక్రింద తొక్కి ఉంచాను. చంద్రసూర్య అగ్ని చూపులతో ఉండి. సకల దోషాలకు మూల మయిన ధనేషణ, దారేషణ, పుత్రేషణలు అను మూడింటి బంధాలను త్రెంచి గోచిలో పెట్టి బంధించాను. ముత్యాలహారములతో సరిగల అష్టభోగాలైన, మృష్టాన్నం, వస్త్రం, గంధం, పుష్పం, పాన్పు, తాంబూలం, స్త్రీసౌఖ్యం, వినోదములను ప్రక్కకు బెట్టి ఉన్న దానితో నిగ్గుతేలి విశ్వబ్రహ్మను చేరి ఉన్నాను. పైనగల ఒక్క ఆకాశాన్నేగాక అన్ని దిక్కులలో గల ఆకాశాన్నంటి ఒంటరిగానే నుండి అందరిలోనూ ఉండి, భూమ్యాకాశములను అంటి పెట్టుకుని ఉండి అవధూతనైయున్నాను. ఆత్మపత్నీ.

155. విత్తనములలో మొలకయున్నట్లుగా, జ్ఞానమనే భూమిలో స్థిరంగా ఉండి, చూపును నిలకట్టడం అనే విత్తనాన్ని వేసి బ్రహ్మమును ఏ ఆలోచనలు లేకుండా సాధన చేసిన, చెట్టు పుట్టి పెరిగినట్లుగా యోగాభివృద్ధి చెందును యిలాంటిది నా యోగము ఈ రహస్యాన్ని తెలుసుకోదేవీ.

156. నేను చేసే యోగముతో పోల్చదగిన యోగము చూద్దామంటే ఏ లోకంలోనూ లేదు. ఈయోగములోగల భోగాన్ని మానవులు పొందితే మాయలు, మంత్రాలు, తంత్రాలూ వారి దగ్గరకు రాలేవు.

157. మాయను జయించినవారికి శరీరము చాలా కాలము స్థిరముగా ఉంటుంది. అన్ని సమయముల అన్ని కాలాలు అతనివే, వేయిరకాలుగా నైనా యోగసాధన చేసి ఈ యోగాన్ని సిద్ధించుకొనుము.

158. **పార్వతీప్రశ్న :** మీలాగా సర్వాన్ని వదిలి యోగము చేయుట స్త్రీని చిన్నబుచ్చినట్లు గాదా ? ఆ భావములు విడమర్చి చెప్పండి ఆ పద్ధతులన్నింటినీ వివరించండి.

159. **ఈశ్వర ఉవాచ :** మణులు, రత్నాలతో పొదిగిన బంగారు ఆభరణములు నీవి, విభూతిధారణతో దిగంబరుడను నేను, చాలా రకములుగా చేసిన పచ్చ కర్పూరం, కుంకుమ, శ్రీ గంధం, అగరువత్తులు మొదలగు సుగంధ ద్రవ్యాలు నీకు, విరబోసిన జడలు నావి, బ్రహ్మనిర్మితమై ఐదు రంగులతో వర్థిల్లు సువర్ణ సింహాసనము నీ ఆసనము, ఈ జగమే నా ఆసనము, సూర్యోదయ సమయాన మందారమాలతో పూజనీకు, మాలనాకు, తులసీ, మారేడు అక్షతల తోటి, ఈ పూజా ద్రవ్యాలన్నింటితో మనలని పూజింపగా యివన్నీ నా చేతి వరకూ గంగవలే పొంగుతాయి. మనలను పూజించువారు ఆకాశం కంటే ఎత్తయిన వారు, అట్టి మహనీయులయందు కలసి నిండుగా ఉంటాము మనము దేవీ.

160. అనేక రకములయిన పండ్లతో తయారయి ఆరురుచులు గల రసములు, ఐదు రకముల ప్రసాదములు పెట్టి ఆరోహణ అవరోహణ క్రమముగా అర్చనలు, పూజలు చేయగా, ప్రసాదపాత్రయందలి ఆ పదార్ధములు హోమానికి ఆహారమగును. సాధకుడు మహాగురుస్థానమగు సహస్రార చక్రంలో ఆత్మను చేర్చితే అచట తర్పణలు ఆహుతులు ఎవరితో సంబంధం లేకుండా జరుగుతాయి. కుల ప్రాధాన్యతగా, అంటరానివారని బేధం లేకుండా, భక్తబృందము లందరూ ఆనందంపొందుతుంటారు. యివన్నీ నీకు, నాలో సగభాగ మయ్యావుగదా! అన్నిటిలో నాలాగుంటావు నీవు నా భార్యవైనందు చేత పార్వతీ నా సగభాగం ఒడిలో పట్టుకుని ఉన్నావు గదా.

161. యిన్నీ ఉండి కూడా మనసును ఎటూ పోనీయక కోరికలు పుట్టినచోటునే కట్టివేసియుండు వారు యింటిలో, పడకలో, వస్త్రాధారణలో, వస్తు అలంకరణలో స్త్రీతో యున్నా, పుష్పము, గంధము, తాంబూలములతో ఎలాంటి భోగములో ఉన్నా సరే గుణము కుదిరిన వారికి ఏమీ తక్కువ ఉండదు. (స్థిర చిత్తులకు)

162. **పార్వతీ ప్రశ్న :** కాలము కలసి వచ్చిన వారికి కలిగే ఉపాయము మోక్ష యోగములకు గల రహస్యమేమిటో దాని గురించి వివరంగా చెప్పండి ఈ లోకమందలి





మానవులు పరిశుద్ధులగుటకు గల విధానములు త్వరగా చెప్పుము, సిద్ధులకు నాయకుడా, జాగేలనాహృదయకమలమందు స్థిరంగాయున్న విశ్వానికి నాధుడవగు మహాప్రభో.

163. **ఈశ్వర ఉవాచ :** మొదటి ఆధారచక్రంలో ఉన్న ప్రాణాన్ని పట్టిలేపి, పైనగల పీఠముపై పెట్టి మణిపూరక చక్రదారిలో తెచ్చి, స్వాధిష్ఠానచక్ర పైభాగమునగల సూక్ష్మదేహమునందుంచి, మహాప్రకాశంతో తాలువమార్గంలో నిల్చుని, సహస్రారం చేర్చి అవయవాలన్నీ నిలబెట్టి, కన్నూకన్నూ కలిపి సహస్రారాన్ని చేర్చి కర్ణికమూర్ధ్నియూ దాటి బ్రహ్మరంధ్రాన్ని పగులకొట్టి దాటి బ్రహ్మంలో కలియుదురు. వీరు యిలా ఆధారం నుండి ప్రాణాన్ని బ్రహ్మ రంధ్రాన్ని దాటించిన వారు విరాట్ స్వరూపంలో ఐక్యమయ్యెదరు. మగువలలో మణిలాంటిదానా, సంయముని మనఃసంచారిణీ.

164. యిట్టివారు పూర్వజన్మలుదాటి మళ్ళీ జన్మకు రాబోరు, ఏమంచిని కోరుకోరు, ఎలాంటి విద్యలను ఆశించరు, ఏ కోర్కెలు లేక మహేశ్వరునిలో చేరి ఆ భావానందము నొందెదరు. అక్కడ నీమాయా మహిమలు చెల్లవు, వాళ్ళు బ్రహ్మాన్ని చేరుతారు. ఈ స్థితిని పాపాత్ములు పొందలేరు.

165. **పార్వతీ ప్రశ్న :** ఛాయా పురుషుని యోగము ఎలా చేయాలో తెలియజేయండి, సాధకుల ఆయుష్షులు ఎలా ఉంటాయో, ఆ ఆనవాళ్ళు చెప్పండి, ధీరుడవగు విశ్వానికి నాధుడా, విశ్వనాధా..

166. **ఈశ్వర ఉవాచ :** 8 అడుగుల దూరంలో గల నీడ ఎదుట నిల్చి నీడలోని కంఠాన్ని గంట చూచి, ఆ తర్వాత ఆకాశాన్ని చూడగా, అక్కడ నీ శరీరంలో అవయవాలన్ని కనబడితే కుటుంబ సమేతంగా క్షేమంగా ఉంటావు. ఏ అవయవమైనా చెడినట్లుంటే ఆ ఫలితాలు వినుము. కడుపులో బెజ్జం ఉంటే సంతానానికి, కుడిభుజ మందు లోటుంటే తోడబుట్టిన మగవారికి, ఎడమ భుజమందలి లోటు తోడబుట్టిన అక్కచెల్లెళ్ళకు, కంఠమందలి బెజ్జం తన శరీరానికి, ఫాలభాగమందలి బెజ్జం భార్యకు, యిలా కీడులు కల్గును. ఆరుమాసాలలో ఈ దోషాలుగలవారు యమపురికి పోతారు. తన ఆకారం సరిగా కనబడక చీకటిగా ఉండే తండ్రి త్వరలో పోతాడు, అన్నీ అవయవాలు సరిగా లేకపోతే తల్లి మరణిస్తుంది.

167. పార్వతీ ఈ ఛాయపురుష రూపాన్ని నిత్యనుష్టానసారంగా 12 సంవత్సరాలు చేస్తే సాధకుడు భూత భవిష్యత్ వర్తమానాలు, ప్రపంచ పరిస్థితులు మొదలగు విషయాలన్నీతెలియపర్చగలవాడు అవును యిది జనులనాకర్షించుటకే గానీ మోక్షానికి పనికిరాదని ఎరుంగుము.

168. వినుము నరులకు "సూర్యనాడి" : ముక్కుకు కుడివైపున గలది రెండు నెలలు విడువకుండా ఆడితే, తప్పకుండా ఆరునెలలు దాటిన తర్వాత యమలోకానికి పోతాడు. అవనిలో నెలా పదిహేను రోజులు "చంద్రనాడి" ముక్కుకు ఎడమవైపు గలది ఆడితే, సంవత్సరంలో మృతుడగును. తప్పదు పార్వతీ.

169. పదిహేనురోజులు పింగళియనే సూర్యనాడి నడిస్తే, ఎంట్లాంటి రక్షణ లేక మృతి చెందును. వెంటనే నాడి ఆగిపోతే తగ్గని రోగమానరునకు వచ్చును.

170. పదిరోజులు చంద్రనాడి వదలక నడిచిన మూడు నెలలలో మృతిచెందుతాడు. మూడు నెలలు చంద్రనాడి నడిచిన నరుడు ఏడాదిలో దేహము చాలిస్తాడు. సంవత్సరాదిరోజున చంద్రనాడి నడవకపోతే చాలా ప్రమాదములు కల్గుతాయి. మహా అద్భుతముగా అష్టమి తిధినాడు ఆ వారనాడి నడవకపోతే చాలా బాధలు పడి ఆఖరికి మరణిస్తాడు. విదియనాడు ఆవారము నాడి నడవకుంటే. ధన నష్టము కల్గును. తదియనాడు చంద్రనాడి లేకుంటే మహాభయము కల్గును. చవితితిథిన ఆరోజు నాడి నడవకుంటే బంధువులతో జనులతో విరోధములతో గొప్ప బాధలు కల్గును.

171. పంచమినాడు ఆనాటి నాడిలేకుంటే చెడ్డ పనులతో ప్రభుత్వ పరమగు విరోధము కల్గి ధననష్టము కల్గును దేవీ వినుము.

172. షష్ఠితిధినివార నాడి లేకపోతే చాలా యిబ్బందులు వచ్చును. సప్తమి తిధిని ఆరోజు నాడి నడవకపోతే యితర గ్రామాలు పట్టి తిరుగుతాడు యిడా పింగళినాడుల ఫలితములివి. యివన్నీ సంవత్సరాది నుండి అష్టమి తిధి వరకూ చెప్పినవి వీటిని జాగ్రత్తగా గమనించాలి.

173. ఆది, మంగళ, గురు, శనివారములు పింగళి యనుసూర్యనాడి ఆడాలి. సోమ, బుధ, శుక్రవారములు యిడయనుచంద్రనాడి ఆడాలి. ఏ వారానికి చెప్పిన నాడి ఆరోజు నడవకపోతే ఆనాడు కార్యవిఘ్నములు ధననష్టం, విరోధములు కల్గుతాయి. ఈ నాడులు ఉదయం సూర్యోదయం నుండి గంటసేపైనా ఉండాలి. తర్వాత మారినా బాధలేదు.

174. నరుడు నీళ్ళయందు సూర్యబింబాన్ని చూడగా పూర్తిగా కనిపిస్తే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. తూర్పు మొదలు నాల్గుదిక్కులు పూర్తిగా కనబడకపోతే ఆరు నెలలు, మూడునెలలు, లేదా రెండు నెలలలోగా మరణిస్తాడు. సూర్యబింబము బెజ్జాలతో కనబడితే పదిరోజులలో మృతి చెందును. పొగరూపంగా సూర్యబింబము కనిపిస్తే ఐదవదినము చూడదు ఈలోపే మరణిస్తాడు. ధృవుడనే ముక్కుచివర కన్పడకపోయినా, అలాగే అరుంధతియను నాలుక ముక్కుకు ఆనకున్నా, చంద్రబింబము నాల్గుపలకలుగా నడుస్తున్నా ఆరునెలలో మరణిస్తాడు.





175. ఎప్పుడూ వినబడు శబ్దాలు అలా కాకుండా వేరుగా వినిపిస్తే మానవులకు ఎలాంటి శుభమూ కలుగదు. ఆ శబ్ధము ఎక్కువ తక్కువలుగా వినవస్తే భామామణీ ఆశరీరానికి చెరుపు సుమా।

176. కాలాన్ని గురించి తెలుసుకునే రహస్యాలు యిలా యింకా చాలా ఉన్నాయి. యింత వరకూ చెప్పినవి చాలును, యివి మంచి ప్రవర్తనలతో నేర్చుకుంటే చాలా శుభములు కల్గిస్తాయి మానవులకు మంచి ఫలితములిస్తాయి.

177. **పార్వతీ ప్రశ్న :** వినండి ఆచార్యోత్తమా। మానవులలో వినయము, విద్య ఎక్కువ తక్కువలుగా ఉన్నాయి. కొత్త పద్ధతులతో ఆశ్రమ రూపాలు దాని యందు పనులను, భార్యా పిల్లలు తరతమ బేధములు ఎక్కువగా ఉంటాయి, దాని వలన మనుష్యులలో ఎక్కువ వారెవరో వినాలని కోర్కెగాయున్నది. నా వినమ్రతనాలించి చెవులకింపుగా విశ్వేశాబోధింపుమునాకు.

178. **ఈశ్వర ఉవాచ :** పతివ్రతల అగ్రశ్రేణిలో ఉత్తమురాలా ! పత్నీ వినుము. మానవులు సృష్టి ఆరంభకాలంలో గొప్పవారు, పిదప క్రమక్రమంగా జనసమూహములు ఎక్కువై కుటుంబ పోషణకై అనేకములైన పనులు చేయుచూ, ధర్మవ్రతాన్ని ఆచరించుతూ, వృత్తులకు అనుకూలంగా కులాలు ఏర్పడ్డాయి. తర్వాత వృత్తి సంబంధ విద్యలందు పరిపూర్ణులయ్యారు. ఈ క్రమము వినుము.

179. పార్వతీ బ్రహ్మదేవునికుమార్తెయగు సంజ్ఞాదేవికి సూర్యునకు పుట్టినవాడగు వైవస్వత మనువు సంతతి వారు మానవులు, వీరిలో పంచములు, రజకులు, శూద్రులు, వైశ్యులు, రాజులు, బ్రాహ్మణులు, తార్కికులు, శాస్త్రజ్ఞులు, నిగమాదులు, భాష్యకులు, కవులు, కర్మఠులు, బ్రహ్మచర్యులు, గృహస్థులు, వానప్రస్తులు, సన్యాసులు, వర్ధకులు, త్వష్ఠప్రజాపతులు, మయాదులు, సానగులు, విశ్వజ్ఞులు, వుదాశీలు, పరమహంసలు, అవధూతలు, పాంచాలీ పతివ్రతలు ఈ క్రమంగా ఒకరికంటే ఒకరు అధికులు వీరందరిలో పాంచాలీ పతివ్రతలగు మనము, మనమేవారని ఎరుంగుము. ఎట్టి మంత్రానుష్టానము లు గానీ, యోగాభ్యాసంబులు చేయుచుండిననూ, లేకున్ననూ ఈ సమస్తంబునకు భూమిపై ఉన్నవారి వలన ఈ క్రమంగా నమస్కారాది సపర్యలు పొందుటకు అర్హులని, వేద, పురాణ ఉపనిషత్ యితిహాసంబులు వ్యాఖ్యానము చేయుచున్నవి. పైనచెప్పిన వారల కులములు ఎక్కువ తక్కువనెంచుటలేదు. పతివ్రతా దంపతులు పంచమ జాతులలో జన్మించినవారైననూ, వారి దాంపత్యమునకు నేను సదా నమస్కరించుచుందునని ఎరుంగుము దేవీ.

180. వీటన్నింటికీ మాయ ఎక్కువని గ్రహించి మాయను తొలగించి చూడుము. బాగా గమనిస్తే లోపల బయట అన్నిటా మాయ ఎక్కువగా ఉన్నది సతీ, ఈ మాయకు

ఎక్కువ ఆదరణ కల్గిదానిపై భ్రాంతిని పుట్టించు (నాదము) ధ్వని ప్రభావముచే భ్రాంతులు ఎక్కువగును దీనికన్నింటికీ సృష్టికర్తయు పరలోకాధిపతియగు విశ్వబ్రహ్మయే మూలము.

181. విశ్వబ్రహ్మ కరుణించిన ఈ భువిపై మాయలునరుల దరిచేరలేవు. ఎక్కడికి పోతాయో? శరీరం సుఖపడుతుంది. కొంత ఉపాయంతో మానవులు యోగ సేవలు చేస్తే బ్రహ్మంలో కలిసే అవకాశముంది. (యోగసాధనతో)

182. ఓంకారానికి, శక్తికి నాయకుడైన మూలవిరాట్‌ని శివుడు, బ్రహ్మ, విష్ణులు పరిచారకుల వలే చాలా రకములుగా స్తుతిస్తారు. పుట్టుకలేని విరాట్ విశ్వకర్మ పొందుకు వేదముల పద్ధతితో ఆచరిస్తారు.

183. యింతకు ముందు ఎక్కడ పుట్టారో తెలియదు, యిప్పుడు తన ముఖము కనులకు ఆనందముగా కనబడదు ఎవరికినీ, భూమ్యాకాశాలు ఏకమైనా తనముఖము తానుచూడగా వశమా ? గురుతులు, సూదిమొనపట్టినంత సందు ఎడం చేయకపోతే, అంటే లోచూపుతో చూస్తేనేగాని తనరూపంతనకు కనబడదు.

184. అట్లు సాధకుడు ఆనందం పొందుచుండును. ఆ యోగములో విరాట్‌ని చూస్తుండగా సృష్టికర్త అణువునుండి బ్రహ్మాండమంత బాగా పెరిగిపోయెను, విశ్వబ్రహ్మన్ని శాంతాత్మతో చూస్తుండగా, ఎలాగంటే మర్రివిత్తనం నుండి మహావృక్షమైనట్లుగా, పూలవంటి కన్నులు గలదానా నీవు కూడా అలా యోగ దృష్టిచే ధ్యానిస్తే నీవశమౌతాడు ఆ విరాట్ స్వరూపుడు.

186. అతనితో, పరలోకానితో, పోల్చదగినది ఏదీలేదు. ఆయనకు సాటి ఎక్కడా లేదు. శాశ్వతుడతనొక్కడే చక్కగానమ్ముము, చాలా గొప్పతత్వము అది. యింతకు మించి ఏమీ లేదు లేదు లేదు.

187. పార్వతీ మహాతత్వమే ఆ విరాట్ విశ్వబ్రహ్మము, సర్వప్రపంచ రూపముతానై పుట్టుటగానీ పెరుగుటగానీ చావులేక విశ్వమనుపేరుతో సృష్టి అంతటా నిండియుండెను. ఆ విశ్వము రెండుభాగాలై ఒకటి సృష్టి సమయంలో విజ్ఞాన రూపమై కర్మయనే పేరు పొందెను, మిగిలిన సగము అంతా ఖాళీగాయుండి యిహలోక సంబంధము లేవీ లేకుండా కర్మయనుపేరును నాశనం చేసి, బ్రహ్మమను పేరును పొందెను. అవి విశ్వమనియు, విశ్వకర్మయనియు, విశ్వబ్రహ్మమనియూ మూడు పేరులతో యుండెనని గ్రహించుము.

188. **పార్వతీ ప్రశ్న :** నాధాపరమహంసలు విద్య ఎలాంటి పరంపరమో తెల్పుము, వారి సాధనలు చక్కగా వింటాను. నా అనుమానాలు తీరేటట్లు చెప్పండి, సింహాద్రి విశ్వనాధామహర్షీ





189. **ఈశ్వర ఉవాచ :** పరమహంసలు సాధించే బ్రహ్మవిద్య ఎలాగంటే, పైన తిరుగు గుడ్లగూబ అనే పక్షిని బట్టి 21 రోజులు దానిని పూజించి, ఆ తర్వాత చంపి భూమిలో పాతిపెట్టి శరీరం నశించిన తర్వాత దాని బొమికలన్నీ దాచియుంచి,

190. దానిని ధూమపతియని మానవులలో మంత్రవిద్యలనభ్యసించువారు చెబుతుంటారు. అది సామాన్యమైనవిద్యకాదు సర్వకార్యములు నెరవేర్చును.

191. ఈ యక్షిణీపనులు ఎనిమిది రకాలు గారడీ విద్యలన్నీ చేస్తాయి. ఆకాశ గమనము చాలా రూపములు, కుత్రిమ రూపాలు పొందవచ్చును. (తానుగాక యితరుల వలే) చాలా విచిత్రంగా చేస్తాయి.

192. ఈ మాయలు బ్రహ్మజ్ఞానులకెందుకు యివన్నీ యిహలోక తాంత్రికవిద్యలు, వీటి యందు ఆలోచనలు మాని శాశ్వతమగు పరలోకము గురించి ఎప్పుడూ మరువక తలంచుము. భామామణీ విశ్వబ్రహ్మలో చేరిపొమ్మా.

193. పార్వతీ ఈ పక్షిని గుడ్లగూబయందురు. రాత్రులందు దుశ్శకునములు పలుకుచూ కలుషాత్ములగు మానవులందరినీ భయపెట్టుచూ తిరుగుచుండును.

194. దీని ఉపాసనా పద్ధతులు తెలియక, మంత్రతంత్రాలతో ఉపాశించి నరులు ప్రమాదములు పొందుచున్నారు. సరియైన పద్ధతులతో ఉపాశించిన అన్ని మహిమలు వస్తాయి.

195. పార్వతీ ఆ విధానము నాకు తెలిసియూ ఆసాధన మంచిది కాదని యిపుడు నీకు ఉపదేశించుట నాకు యిష్టము లేదని ఎరుంగుము.

196. దొమ్మరులు విద్యలను అభ్యసించి అవి ప్రదర్శించుటకు కర్రలపై తాడుకట్టి వాసాంగెడలు పుచ్చుకుని విద్యలు చూపునటుల, శరీరానికి ఏ బాధా లేకుండా తత్వగురుతుల ప్రకారం సాధన భద్రంగా చెయ్యవచ్చును.

197. విష్ణుభక్తిగల వీరుడు, కృత్రిమకాలితో నెత్తిమీద కుదురు పెట్టుకుని దానిపై ఏడుకుండలు పెట్టుకుని, చిడతలు చేతబట్టి కుండలు పడిపోకుండా ఎలా ఆడుతున్నాడో చూడు దేవీ.

198. నిత్య జీవన సంబంధమగు అన్ని పనులు చేసుకుంటూ, చూపునిలగట్టి చూడగలిగి నంత సేపు చూచు సాధకుని, ఆ గుర్తులు ఆ మాటలన్నీ ఉండియూ కాపాడుతాడు తన శరీరంలో గల విశ్వబ్రహ్మ.

199. రాళ్ళను కరిగిస్తే యినుమవుతుంది. ఎన్ని పాళ్ళు వెయ్యాలో తెలిసి పరశువేస్తే పాదరసంభస్మమౌతుంది. కరుగుతున్న రాగిలో ఆభస్మం కొద్దిగా వేస్తే రాగి మేలిమి బంగారమవుతుంది. యిది రాగి, పరశు, కలయిక చేతనే సుమా.

200. పాదరసంలో నాగము వేసిన వెంటనే కలిసి ఏకమైపోవును "ఎలాగంటే" కారణ శరీరం అంతరంగాన్ని కనులతో చూసిన వెంటనే, కారణ శరీరం అంతరంగంలో కలిసిపోయినటుల.

201. అనేకరకములైన జంతువుల పాలు ఎక్కడ నుంచి తెచ్చినవైనా కలిపితే ఏకమైపోతాయి. అనేక నదీ నదములలోని నీరు తెచ్చి కలుపగా నీరేయగును గదా ? అట్లే శరీరమందలి తత్వాలను కలిపితే ఏకతత్వమవుతుంది.

202. భూమిపైగల కదలనివి, కదలిక గల జీవాలు ఎలాంటి స్పృహ లేనటువంటివి యివన్నీ పుట్టుక ఒకేలాగా, యవ్వన సంపర్కముల చేతనే కల్గుతున్నాయి. నిశితంగా పరిశీలిస్తే యివన్నీబ్రహ్మతో కలిసినవే సమస్త జీవరాసులు, చేతన, అచేతనమైనవి కూడాను పత్నీ.

203. పరిపక్వానికి వచ్చిన వస్తువులలోని పరిపక్వ తేడాలు లేకుండా ఉన్నటులే పక్వానికి వచ్చిన మనసు ఆనందముతో వెలుగును, బ్రహ్మాన్ని మంచి జ్ఞానంతో చూడాలి దేవీ. అంటే మనసు పరిపక్వం చెందాలి.

204. భువిపై మంచి గాత్రంతో స్వర, రాగ తాళయుక్తంగా చేయు ఈ ధ్వనులన్ని ఆలోచించి చూస్తే నిండైన ఓంకార నాదమయింది. పరతత్వానుభూతి పొందిన వారు ప్రణవనాదం వింటూ బ్రహ్మంలో కలియుదురు.

205. కైలాసమనే రుద్రగ్రంధియను అనాహతచక్రంలో, శివడు పార్వతితో కలిసి శైలావృతమను హృదయాన్ని ఆక్రమించి ప్రమధగణములు భృంగితో హృదయ మధ్యన గల ఖాళీ యందున్నటుల, బ్రహ్మజ్ఞానులు హృదయమందలి బయలులో ఆత్మదృష్టిచే చూచి ఈ యదార్ధాన్ని గ్రహించగలరు.

206. వైకుంఠమనే విష్ణుగ్రంధియను మణిపూరక చక్రమందును మనోనేత్రంతో చూడగలిగితే విష్ణువులక్ష్మితో విలాసంగా, గరుడులను గూడి గరుత్మంతునితో నివాసముండి, ఒక రకమగు మత్తుతో అన్ని మర్మములు చేయును. మాయా మహిమచే పామరులకు ధనంపై ఆశగల్గించగల సామర్ధ్యం గలవారై ఆస్థానములో ప్రకాశిస్తున్నారు.

207. మంచిపనులు గల సత్యలోకమను స్వాధిష్ఠానుచక్రమందు బ్రహ్మసరస్వతినిగూడి తన నిర్వహణ ధర్మమగు విద్యకు అధిపతియై విద్వాంసియై బ్రహ్మయు తన అధీనములో గల గ్రంధికమల మందు వాణిని పిలుచుచూ, పలుకుచూ ఎలాంటి పగలు విరోధములు లేని ఆ నిర్మల ప్రదేశాన్ని చూడు పార్వతీ.

208. యిలాగ సత్యలోక, వైకుంఠ, కైలాసములనే మూడు లోకాలు, సత్వ, రజో, తమోగుణములతో మల, మూత్ర, యింద్రియములతో గూడి, ఒక దానికొకటి మెట్లవలే





దారిగల్గి రావి వృక్షములతో కూడిన వాసనతో బ్రహ్మగ్రంథి యుండును, తులసీ వనములు చుట్టూ ఉండి కీర్తితో కూడి విష్ణుగ్రంధి యుండును. మారేడు వృక్షములు, తీగలాగా ప్రాకిన లతలతో కూడి మంచి సువాసనలతో రుద్రగ్రంధియుండును. యిలాగు ఆజ్ఞేయ సహస్రార చక్రములందు గురుదేవులగు, విశ్వనాధులు, విరాట్ విశ్వబ్రహ్మలకు ఆ స్థానాలుగా యుండును. ఈ రహస్యాన్ని నీకు చెప్పితిని వినుముదేవీ.

209. ఈ చెప్పినవన్నీ శోధించాలి. యిందులో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానవాయువులు గుదస్థానం నుండి సహస్రారం వరకూ వ్యాపించి యుండును. గ్రంధత్రయమును శోధనము చేయువారు ప్రాణ, అపానవాయువులను కలిపిన జ్ఞానచక్షువుచే చూడనగును.

210. ప్రాణవాయువు ఆధార చక్రములోనున్నది గాలి పీల్చురంధ్రములలో నివాసమై యున్న ప్రాణాన్ని వాటము తెలుసుకుని జీవుడనే ప్రాణిని, పరమహంసను కలిపి ఒకటి చేసి, అనగా ఆత్మపరమాత్మలను ఒకటి చేసి శ్వాసనిల్పిన జ్ఞానం కలుగుతుంది.

211. యిలాగు మూడు గ్రంధులను శోధించు మహనీయులు దేహతత్వాలను గ్రహించి చెప్పగల సిద్ధులని ఎరుంగుము.

212. **పార్వతీ ప్రశ్న :** లింగములు ఎన్ని రకములు అందులో గల ఏభాగాలు ఏ అర్చనలకు అలవాటు పడియున్నవి. ఈ సంగతులు నాకు అర్ధమయ్యేటట్లు చెప్పునాధా! "దొంగలుకదా" లింగ పూజ తెలిసిన జ్ఞానులు ఆ మర్మాలు ఎవరికీ చెప్పరు.

213. **ఈశ్వర ఉవాచ :** పార్వతీ లింగములు ఎనిమిది రకములుగా నిర్ణయించారు. చెబుతానువినుము. 1.సిర్థము, 2.చరము, 3.శైవము, 4.సమాశైవము, 5.నిష్కళము, 6.సకలము, 7.ముఖము, 8.సమాధియని 8 రకముల లింగములు ఆకార మార్పులతో ఆయా అర్చనల నొందుచుండును. వాటిని గురించి చెబుతాను వినుము.

214. నాలుగు పలకల పీఠముతో స్థాపించబడినది 1. స్థావర లింగము (స్థిరము), 2.కుదిరికతో గుండ్రని పీఠములో గల లింగమేజంగమలింగం (చరము), 3. చదరము గుండ్రముగాక ఆరు కోణములు పీఠము గల లింగమే శైవలింగము (శైవము), 4. విదితమున ఎనిమిది కోణములు పీఠముగల లింగము సమాశయన లింగము (సమాశైవము)

215. వినుము యోగులు ఆత్మతో నిర్ణయించి విశాలముగా కాంతులతో నుండునది అనుమానములేని నిష్కళలింగము (నిష్కళము), 6. శరీరమువలే అనేక రకములు బేధముగా ఉండునదే (సకలము) 7. కనులు, ముక్కు, నోరు, చెవులుతోనున్నది ముఖలింగము.

216. 8. ఏమీలేకుండా గుండ్రముగా నుండి ముందు చెప్పిన పీఠములపైన నున్నలింగ మందు ఆకాశం వంటి గంభీరతతో యున్న మహాజనులు, యోగసిద్ధులు, ఈ మహాలింగరూపమున ముక్తిని పొందుదురు. తగలబెట్టుటెందులకు ? సమాధిచేసిన అడవిలో ఉన్నవారుగానీ, యింటిలోని వారుగానీ ముక్తులగుదురు.

217. వీరందరూ సిద్ధి బొందగల పద్ధతులు. ఇప్పుడు చెప్పిన ఆకారాలు రాతితో, బంగారం, వెండి,రాగి,యిత్తడి, పాదరసం, చెక్కతో, నవరత్నాలతో దేనితోనైనా, స్పటికం, గుల్భము, సౌధజంబులు వీటిలో దేనితోనైనా పనితనంగా శిల్పిసంతతి వారితో చేయించిసేవించిన మనోలయమయి సమాధి సిద్ధి నొందుదురు సుమా!

218. ఈ ఎనిమిది రకముల లింగములలో 1. స్థావర లింగము దేవాలయమున, 2.శరలింగము శరీరమున, 3.శయన లింగము స్వాముల పీఠములందును, 4.సమాశయలింగము బ్రహ్మచర్య వ్రతము చేయు జ్ఞానుల శిరస్సున, 5. నిష్కళ లింగము ఉదాశీ, పరమహంస, అవధూతల హృదయములందును. 6. సకల లింగము పూజామందిరములందును, 7.ముఖ లింగము శరీర మందున సిద్ధస్థానమందున, 8. సమాధిలింగం మృతునకు స్మశాన మందును(మోక్షము పొందిన మహనీయుల దేహంబున)

219. నరులు యిహలోక సంబంధ కోర్కెలచే ఆయా పూజా పద్ధతులచే అర్చనలు చేయుదురు. 1. మరియూ ఆలయంబున దీక్షా విధాన పూజయును. 2. మణి బంధనమున ధరించి ధ్యానా విధానమగు అంతర్లక్ష్యము, బహిర్లక్ష్యము, మధ్య మలక్ష్యములచే ధ్యానించుట,3. పీఠమున పూజా విధానములు చేయుట, 4.శిరంబున యోగసాధనలు చేయుట 5. హృదయంబున ప్రాణాయామము చేయుట,6. మందిరములో భజన స్తోత్రములచే ప్రాధేయపడుట, 7. క్షేత్రంబున సిద్ధి పొందిన ప్రదేశములలో తనువునర్పించి ధ్యానించుటయు,8. సమాధిన మోక్షప్రాప్తికి పూజలు ఈ ఎనిమిది పద్ధతులతో, శివార్చనలు శైవులు, వైష్ణవులు, శక్తి ఆరాధకులు, గణపతిని పూజించువారు, బౌద్ధ మతస్థులు, కాపాలికులు, 6 మతముల వారును ద్వైతం, అద్వైతం, విశిష్ఠా ద్వైతమను మూడు పద్ధతులతో విరాట్ విశ్వకర్మచే నిర్మితమైన విగ్రహములను యంత్ర మంత్ర, తంత్రములతో ఏడుకోట్ల మహాకల్పకములందునూ, యాగయుక్తంబుగా వేదశాస్త్రముల ప్రకారము ధ్యానములు చేయగా ధర్మ, అర్ధ, కామ, మోక్షంబులు సిద్ధించుచుండునని పార్వతీ ఎరుంగుము.

219. యివన్నియూ విశ్వబ్రహ్మ పూర్వమున (పురాతనమందు) మునులు, జనులు, యవ్వన, కౌమార, వార్ధక్యములందున్నవారికి, నాగులు, నరులు, రాక్షసులు, కిన్నెరులు





మొదలగువారు చేయు సాధనలకు తగిన ఫలితములు విరాట్ విశ్వకర్మ భగవానుడు మర్మములతో యిచ్చెను.

220. యిటుల విశ్వకర్మ సూక్ష్మజీవియయిన చీమ మొదలు బ్రహ్మపర్యంతము తన తేజస్సును పంచి, తన నిజరూపాన్ని ఎవరికీ తెలియనీయక, అనేక తత్వములు గల విశ్వమంతా తానై సృష్టిలోనున్న అన్ని మండలాలు నిండియున్న ఆ విరాట్ విశ్వబ్రహ్మను మనసున స్థిరపరచి లో చూపుతోనే గ్రహించిన చాలునని ఎరుంగుము.

**నవవిధస్థానమాద్యంత గుహ్యపంచాక్షరీ పరమశివస్థవమత్తే భషష్టకం**

221. ఒక మూలగల కొండగుహలలో తపస్సనే పనితో ఆడుకుంటూ ఆది నుండి కలియుగాంతము వరకూ జరుగబోవు భవిష్యత్తును వీక్షించుతూ స్త్రీతో కూడిన శివాంశగల మునీశ్వరా శ్రేష్ఠ మయిన జ్ఞానముగల నందీ మొదలుగా గల మీపరివారములు, సంయములు, ఏకళంకములేని యోగులు, వేదాధ్యయన సమూహముతో అధ్యక్షస్థానాన్ని అలంకరించిన జనకా.

222. నరులు, అనేక రంగుల పూలుఏకమాలలో చేర్చి కట్టినటుల, అనేక కులముల వారు, మతస్తులు, పీఠస్తులు, అనేక జాతుల పరిపాలకులు, ఈ భువిపై అనేక విధములయిన అర్చనలు, పూజలు, ధ్యానములు, నైపుణ్యముతో చేయు క్రీడను ప్రియ సందర్శనాదులుచేనున్నట్టి ప్రదేశమున, రెండు రూపములతో (అర్ధనారీశ్వరునిగా) సాక్షాత్కరించు నీ వైభవము, శక్తితో కూడి ప్రదర్శించిన మీ మహిమ, మీ కలయికచే కల్గిన ధ్వనిచే ఆనందమగు ధర్మచింతన ఎలా ఉంటుందో, తెలుసుకుని ఊహించగలమా ? మాకు అది సాధ్యమా ?

223. గొప్ప మగతనము శక్తి పౌరుషమూ గల్గి ఒక మూల ఉండి, రాజులచే సన్మానించబడియుంటివో ? శత్రువులను చంపుటకు పర్వతపైభాగమున ఉంటివో? భవిష్యత్తును ఆలోచించుటకు కొండ గుహలోనివశించుచుంటివో? లేక యోగులకు వశమైవారి హృదయమందుంటివో? నీ నిజస్థితి ఏమిటో ? బ్రహ్మతేజస్సుతో తపమాచరించు విశ్వేశ్వరా.

224. కొండ శిఖరముపై నుండి దిగి బయటకు వచ్చి ఋషులకు క్షేమాలను చేకూర్చు చుంటివో? భూమిని పరిపాలించుటకు నిజమగు సృష్టికర్తకు ఆధారంగా నిల్చితివో? ఎక్కువగా సృష్టికార్యము చేయుటకు భార్యతో కూడిన ఆసనముపైనున్నావో, విష్ణువుచే చక్కగా ఉత్పన్నమైన షట్కర్మలందు,1. యజ్ఞము చేయుట, చేయించుట, 3.వేదములు చదువుట, చదివించుట, 5.దానము యిచ్చుట, పుచ్చుకొనుట ఈ ఆరు పనులందు మనసును స్వాధీనపరచుకుని ఉన్నావో?

225. శరీరమందున్న నవరంధ్రాలను విడిచిపెట్టకుండా అనుకూలంగా ఉన్నావో? పరలోకాధీసుడయిన విశ్వబ్రహ్మ కటాక్షము ఎక్కువగా పొందినవాడివై, అమితసామర్థ్యము గలిగి ఉత్సాహముతో గొప్పగా పెరుగుచుంటివేమోగద?(స్వామివారు ఈ మూడు పాదాలే వ్రాసారు.) సరిగా భూతములందు నిల్చితివినిన్ సాధించి ప్రార్థించెదన్ అని కొండపల్లి పెదసంగయ్య వ్రాసారు.) (దీనిని నేను) సరిగా భూతములందు నిల్చితివి నీవు సర్వార్థసద్వర్థయా అంటున్నాను.

226. 84 లక్షలకు పైగానున్నట్టి అనేక రూపములలో గల జంతు జాలములు ద్వాదశ రాసులలో పుట్టినవి. మంచి మనస్సుతో తిరుగుచూ శృంగార కార్యములతో, ఎక్కువ తక్కువ అను అనుమానము ఏ మాత్రమూ లేకుండా ఏ జీవరాశిలో ఏ రూపంతో, ఏ పనికోసమున్నావో? పార్వతీపతియగు పరమేశ్వరా, మమ్ములను సురక్షితంగా కాపాడు దేవా ! **ఈ ఆరు పద్యాలలో 9 చోట్ల రహస్యంగా పంచాక్షరియున్నదని స్వామి వారు ఆదిలో వ్రాసారు దాన్ని మేము గమనించాము.**

227. యిలా ప్రపంచమంతా ఏకము చేసుకుని ఈ సృష్టి అంతా నిండి ఉండియూ, ఈశాన్య స్థానమందు కైలాసమందు, శ్రీశైలము హిమాలయము మొదలగు పర్వత గుహలయందును, ఋషులు చేయు తపస్సులందు, యోగీశ్వరుల హృదయమందు, భూమిని పాలించువారి కర్తవ్యమందును స్త్రీపురుషుల కలయిక నందును, 32 శిల్పములందును, సృష్టి అంతానిండియుండి, ఏకత్వం వహించి ఒక పర్వత గుహమూలలో తపస్సు చేసుకుంటూ, భవిష్యత్ కాలాన్ని ఊహిస్తున్న బ్రహ్మాండాకారుడై పార్వతితో కలసియున్న ఆ విశ్వేశ్వరుడు, జగతిని పాలించు చక్రవర్తియగు, జగత్‌లో ఏకైక జగద్గురు సార్వభౌములు, భక్తులను సంరక్షిస్తూ, కరుణాకటాక్ష వీక్షణలతో మమ్ములను కాపాడుగాక.

228. 1. పదాలకు అర్థము, 2. వేదాంత అర్థము, 3.రసవాద అర్థము గల యివి మూడు అర్థములతోనున్న ముఖ్యమైన ఈ ఆరుపద్యాలను రెండు పూటలా చదువుతూ, పూజలు ఎలా చేసినా సరే, వారికి క్షేమము, సౌఖ్యము భుక్తి, ముక్తి మోక్షము, సంపూర్తిగా కలుగుతుంది. **సూచన : యిది కాకుండా 229 పద్యానికి 230 వచనము నకు అర్థం.**

230 సూర్యునిచే చీకటియు, గొడ్డలిచే వనమును, గరుడునిచే సర్పము, వజ్రాయుధముచే పర్వతము,

మంత్రముచే యమభయము, వేడిచే చలి, ఓడచే సముద్రము, వైద్యునిచే రోగము, శివునిచే గరళము, ఎర్రలచే వజ్రములు, ఎలాగు నశిస్తాయో, అలాగే లోదృష్టిచే విశ్వబ్రహ్మాన్ని (ఆ వెలుగును) చూచిన వారికి సమస్తదోషములు నశించి సర్వలోకాలను జయించిన వారగుదురు.





## రసవాదము

231. ఎ) యిక్కడనుండి రసవాదము స్వామివారు చెప్పారు. దాని గురించి కాకుండా పదాలకు అర్థాలు మాత్రమే గ్రహించండి. జాతి, నీతి, ఎంచనిదియూ మరియూ ప్రపంచ మందు పేరుగల్గిన విద్యయు, గొప్ప సుఖములు నిచ్చునది యగురసవాదము బ్రహ్మకు నరులకు సంతోషాన్ని కలిగించు లక్ష్మీ కటాక్షము, శాంతముగా ఉన్న ఉత్తములగు వారికి మాత్రమే లభిస్తాయి.

231. బి) **పార్వతీ ప్రశ్న :** జాతియందు, నీతియందు, మరియు ప్రఖ్యాతియందు, విద్య యందు, మరియు ఘనమైన భోగములు కలిగించుటయందు, మరియు ప్రాణుల సామర్థ్యము కొరకు, గొప్పతనమునుచేకూర్చి ప్రీతి నొసగు శిరిమాతను అనుకూలింప చేయు కారణదేహమును శాంతగుణమున సాధింపచేయువాడా!

232. ఎ) ఆసక్తి లేదు బ్రహ్మజ్ఞానులకు, ధనంకోసం ఆశపడి పరుగు లిడరు, భూమిపైగల సాంప్రదాయముల ప్రకారం నడుచుకుంటారు. ముక్తికి యిష్టపడుచు భుక్తిని ఎలా జరుపుకుంటారో,

232. బి) బ్రహ్మజ్ఞానులు ముక్తికి ప్రియమైన మనస్సుకలవారై సత్‌బుద్ధిచేత సంచరిస్తూ ఉంటారు. వారు అన్యాయముగా ధనార్జన చేయరుగదా మరివారి భుక్తిమార్గమేదో తెలియజేయుమునాధా.

233. **విశ్వేశ్వర ఉవాచ :** దేవీదేహమందు మేరువనే వెన్నెముకయందలి షుషుమ్న యందు సువర్ణ పర్వతమున్నది. దానిని పట్టవలెను. దానిని వశపరచుకొను ఆయుధములైన అస్త్రశస్త్రములు సాధించి, వాటిద్వారా మేరువునందుగల కైలాసమును రుద్రగ్రంధిని (కారణదేహాన్ని) స్వాధీనము చేసుకోవలెను. ఆతరువాత బాహ్యమందు విరాగియై దేహమునందలి ఇడానాడితో శ్వాసను లోనికి పీల్చి ఏమాత్రం లోపము లేకుండా కైలాసస్థానమందు కుంభించి, బ్రహ్మను భోగించి, ఫాలభాగమునగల బట్ట బయలందు జాగరూకుడైనిలచి కలత చెందక దేహభ్రాంతులు విడిచి, తదేక నిష్ఠతో మంత్రము ఉపాశించినచో నీవే బ్రహ్మము అవుతావు(అహం బ్రహ్మాస్మి)

234. కొండలందు పుట్టిన కానుగ రసము ఎండబెట్టక వండవలెను తర్వాత ఆపాకమును చిన్నకుండయందు ఊరబెట్టవలెను.

235. రాజ ఉశిరి మొక్క విధివిధానమును తెలుసుకుని యోగసిద్ధికలిగిన సాధకుని కొరకు పాదరసము బాగానూరి వంటచేయ క్రమమెరిగి వండిన దానిని అనుభవించ వచ్చును.

236. సీతావేరు తీసుకు వచ్చిరసము తీసి పాదరసము వేరురసము సమపాళ్లలో కలిపి రోజూ సురకాయించిన రసమందలి చపలత్వముపోయి అగ్నికి ఎగరక నిలుచును.

237. వినుము ఆవిధముగా నిలిచిన రసమును చిత్రమూలముచే అనుమానములేక యోగముసిద్ధించి హేమించును దానిని జ్ఞానులు చక్కగా అనుభవిస్తున్నారు.

238. మూడుపలకల నల్లేరు రసము పాలుతో వాదయోగము సిద్ధించును. దేవీ ఈ యోగము సిద్ధించినవారిజీవితము ఆనందమయం. ఈభూమిని అంతా వారికిధనమే.

239. పెద్ద యేలిక చెవితో రసమునుపిండి పాదరసమును ముద్దచేస్తే ముద్దచేసిన వారికి భుక్తి,ముక్తి కలుగును. వీటికోసంధనవంతులను వెతుకుటెందులకు? ఈసిద్ధిని పొందినవాడురాజులకురాజు రారాజుసుమా!

240. మరియుకొక్కుపాషాణము పొగపోకుండా కట్టిన సమస్త సిరులు సమకూరును. యిట్టి యోగమును సాధించవలెనన్నకోరిక సంసారులకు కూడదు. మనోవాంఛలకు లోబడిన అజ్ఞానులైన వారికి యిది సిద్ధించదు.జ్ఞానులకు మాత్రమే సిద్ధించును.

241. మహత్తులు వశమగుటకు శంఖ పాషాణముతో రాగిని సున్నముచేసి అడవిలోని మహాయోగులు మహాభోగములు అనుభవించుచున్నారు. దాని మహాత్తును అనుభవించి తెలుసుకోవలెను. మాటలకు అంతుచిక్కదు.

242. సిద్ధులకు ఉపాధికొరకు ఉపయోగపడు మూలికలు అద్దములో చూచినట్లు ఆత్మకు సంతృప్తినిచ్చు విధముగా తెలియచేయుము. సిద్ధులకు గురువువగు ఓ స్వామి మిమ్ములను సేవించుటకుంటానని పార్వతీదేవి భర్తను అడుగుచున్నది.

243. వినుమో పార్వతీ! సుగంధకందయనగా ఏమిటో చెబుతాను, చెవులారావినుము. ఆశ్చర్యపోతావు. దేహమునకు తత్వములు సిద్ధింపచేయుటకు, సిద్ధించిపోషింప చేయుటకు ఉపయోగపడునవి మూలికలు, లోహముల యొక్క సున్నము, మరియు రోగములు హరించుటకు ఉపయోగపడునవి భస్మములు చేసిన మూలికలు, లోహములు ఇది నిజంసుమా!

244. అలాగే "అహినేత్రికందను" తెలుసుకో, మరియూరుదంతికంద కూడా మంచిదే, "క్రోడకంద" కూడా ఇలాంటి గుణములనేయిచ్చును. "తైలకందను" కూడా భువియందు భక్తులు మరచిపోరు.

245. వినుమో పార్వతీ యిప్పుడు చెప్పిన 5 మూలికలను సిద్ధపంచకములంటారు. సిద్ధులు పోషణకు నిర్ధేశించి మూలికలని ఎరుంగుము, లోకులకు ఈ రహస్యం చెప్పలేదు. మరియూ ఈ సిద్ధపంచకములతో ఎనిమిది లోహములు, అరువది ఆరుపాషాణములు పాదరసము అన్నీ భస్మములగును, అంతేకాక సమస్త వ్యాధులను అవలీలగా పోగొట్టును.





ఎలాగంటే అగ్నిలోవేసిన సమస్త వస్తువులూ భస్మమైనట్లుగా! రసములు, లోహములు, పాషాణములు గురుభస్మములై, లోహాదులను సంపూర్ణముగా రంగులు భేదించి మనో హరముగా చేయగలవని తెలియుము యిప్పుడు చెప్పిన 5 మూలికలలో ఏ ఒక్కటి అయినా ఈ చెప్పిన కార్యములన్నీచేయును.

రుదంతికందయనగా – పిట్టఅడుగు; అహినేత్రి కందయనగా – నాగాక్షి చెట్టు;

సుగంధ కందయనగా – కూతురు బుడము, మరియూ నూగుదోస

క్రోడకందయనగా – పందితివ్వ; తైలకందయనగా – ఎర్రపొన్నగంటియని తెలుసుకో;

246. చెన్నచెర్ల, ఊడుగ, పొన్న, తురుకవేప, పుత్ర జీవికారూపు, పందిపాల, ఎర్రచిరతల, తెలగ ఉక్కు, రాగుడీ చెట్లకాయలకు రసమువచ్చును. దానితో పాదరసం నిలబడును.

247. **పార్వతీ ప్రశ్న :** పంచాననులయిన విశ్వబ్రాహ్మణులకు గల నడకలు, ఎన్ని ఆశ్రమములున్నాయి. వాటి లక్షణాలు వినాలనుకుంటున్నాను వాటి వివరములు చెప్పమంటూ స్వామివారికి పాదసేవ చేస్తూ పార్వతీదేవి అడిగింది.

248. **ఈశ్వర ఉవాచ :** బాలురకు 8వ సంవత్సరంలో ఉపనయనము నిష్టతో చేసి, విద్యలనభ్యసించుటలోను చేసే పనులన్నింటా నిపుణుడై ఎందులోనూ పనికిమాలినవాడు గాక, శరీరమందలి కళ్ళు, ముక్కు, నోరు, చెవులు, కాళ్ళు, చేతులు, మలరంధ్రము, మూత్రరంధ్రము ఈ 8 అవయములను తన ఆధీనమునందుంచుకొని బ్రహ్మచర్యమును పాటించాలి.

249. మహనీయులు ఆమోదించిన యోగములు భూమిపై 12 సంవత్సరములు గురువు చెప్పినట్లుగా చేసి, మంత్రసిద్ధినొంది యోగముల మహిమను సంపాదించి 20 సంవత్సరంలో పెద్దల ఆజ్ఞచే వివాహం చేసుకోవాలి.

250. 8వ సంవత్సరంలో గురూపదేశం పొంది, సంధ్యా అనుష్ఠానములు చేయుచూ, మహామంత్రమును సిద్ధింపజేసుకుని, వేదశాస్త్ర ప్రమాణములు గల యోగములు చేయుచూ, తల్లిగర్భం నుండి బయటకు వచ్చినది మొదలు చేయు సర్వపనులతో 20 సంవత్సరములు గడిపి గురువు, పెద్దల ఆజ్ఞచే కల్యాణము చేసుకుని, ధర్మం తప్పకుండా సత్యం, జ్ఞానం, దయా, ధర్మము, శాంతి, క్షమాగుణము, దేహారోగ్యంబులచే అతిథి అభ్యాగతులను తన్నాశ్రయించి వారికి తనకున్నంతలో వారిని ఆదరించి సేవింపుచూ బ్రహ్మ విద్య నాచరించుతూ, వ్యభిచారం, దొంగతనం, జీవహింసలు చేయకుండా, తినదగిన వస్తువులు భుజింపుచూ, నాలుకతో నాకవలసిన వస్తువులు చప్పరిస్తూ, నోటితో పీల్చి తినదగు ఆహారాన్ని సేవింపుచూ, త్రాగదగు పానీయములను త్రాగుతూ, తీపి, పులుపు, చేదు, వగరు, ఘాటు, ఉప్పు రుచులను తినుచూ, కత్తిరితో జుట్టును

కత్తిరించకుండా, అమావాస్య, పూర్ణిమ, సూర్యసంక్రమణము, కృష్ణాష్టమి, కృష్ణచతుర్థి ఈ ఐదురోజులలో భార్య సంపర్కం మాని, యింద్రియాన్ని వ్యర్థంగా విడువక సహస్రారానికి చేర్చు దారులు వెదుకుచూ, తన కోరిక ప్రకారం కావలసినంత సంతానాన్ని పొంది పుత్రులకు అంతర్లక్ష్య, మధ్యలక్ష్య, బహిర్లక్ష్యములచే ఆచరించు గాయత్రీ మంత్ర బ్రహ్మోపదేశ మిచ్చి సంతానాన్ని గృహస్తులను జేసి, తాను గృహస్తాశ్రమాన్ని వదిలి భార్యతో కలిసి నివాసముండుటకు వీలైన వనమున ప్రవేశించి యోగులు సిద్ధిపొందిన పరిసర ప్రాంతములందుగానీ, కొండగుహల్లో గానీ, నదీతీరముందుగానీ పర్ణశాలను తయారుచేసుకుని నివాస ముంటూ అక్కడ మంచి సువాసన గల ఆకులు, పువ్వులు, పళ్ళచెట్లను, అల్లిక గల పొదలను పెంచుకుంటూ, అక్కడ స్థిరంగా ఉండుటకు నిశ్చయించు కుని పూర్వకాలం నుండి చేస్తున్న యోగంతో ఆనందం పొందుచూ సృష్టికర్తయగు విరాట్ విశ్వబ్రహ్మమునందు ఐక్యమగు యోగాన్ని సాధింపుచూ 12గానీ, 8గానీ, 3 సంవత్సరములుగానీ తీవ్ర సాధనలు చేస్తూ సన్యాసియై గతంలో తాను చేసిన పనులన్నియూ మరిచి, క్రమక్రమంగా శరీరాన్ని మరచి పరమహంసలు, ఉదాసీ, అవధూతలు చేయు పూర్ణసమాధిని సాధించుచూ రెండవ విరాట్ వలే తయారై యిహలోక సంబంధమగు అణిమాది సిద్ధులకు ఆశపడక, సత్యము సదా పల్కుచూ వాక్సిద్ధి పొంది స్థిరభావముతో ఉండవలయును. యిలాంటి వాన ప్రస్తాశ్రమ సంపన్నులు ఎక్కడ నుండో వచ్చి ఉండేవారు జీవించిటానికి, తినేవి ఆహారములు, గాలి నల్లగగ్గెర, కంద మూలములు, ఫలములు, పాలును, జీవములేని గింజలును, తియ్యని పదార్థములు, తేనే, భిక్షాన్నములును, పరమేశ్వరుడు ప్రసాదించినవిగా భావించి, తీసుకుని దొరికిన పదార్థములతో తృప్తి చెంది, అన్ని వేళలందు వాయుస్థంభన చేయుచూ, బ్రహ్మజ్ఞానియై బ్రహ్మాన్ని చూచి, తానే బ్రహ్మము కావలయునని, బ్రహ్మమందు ఐక్యము కావలయునని ఈవానప్రస్త ఆశ్రమములో చేయవలసిన పనులు బ్రహ్మక్షత్రియ, వైశ్య, శూద్ర పంచములు మొదలు సర్వ మానవులందరికీ తెలియుట కోసం నీకు చెబుతున్నాను దేవీ.

251. యిలాంటి వారితో సరియగువారు 14 లోకములలో ఎవ్వరూ లేరు. వీరితో సరియైనవారు ఏ లోకంలో చూద్దామన్నాలేరు.

252. మరియూ పార్వతీ జ్ఞానుల ఎక్కువలు చెప్పుదుము వినుము. గృహస్థుల కన్నా రాజయోగులెక్కువ, వీరి కంటేయెత్తులు ఎక్కువ, వీరికన్నా సన్యాసు లెక్కువ, వారికి హఠయోగులెక్కువ, వారికి పరమహంసలెక్కువ వారికి ఉదాశీలెక్కువ వారికి అవధూతలెక్కువ, వీరికన్నా అధికులు లేరని గ్రహించుము.





253. మరియూ క్రిములు, కీటకములు, మిడతలు, జంతువులు చేయు పూర్ణ సమాధి లక్షణములను చూపిస్తాను చూడు పార్వతీ.

254. జిల్లేడు చెట్టుపైన పురుగుచేయు సమాధినిచూచి మానవుడు తానూ యోగ సాధన చేయాలని నిశ్చయించుకుని జీవనార్థము, వాగ్వివాదమో, రసవాదమో, ఏదో ఒక ఉపాయముచే, చేతి పనులు చేసుకుంటూ ప్రపంచమున సత్యము అసత్యమగు వాటిని గుర్తించి, శరీరానికి గల చెడు గుణాలను విడిచిపెట్టి అక్రమ ధనానికి ఆశపడక జీవిస్తూ ప్రజల చేత మూఢుడనిపించుకొనువాడే జీవన్ముక్తుడు.

255. అదియునుగాక శరీరముగల సర్వమానవుల జంతువుల అన్ని అవయవముల నుండి నవరంధ్రముల ద్వారా మలినము వస్తూ ఉంటుంది. జంతువులకు ఆహారములు స్వర్గం, నరకం అను రెండు విధములుగా ఉంటుంది. అవి ఏవంటే రౌరవంబను నరకము అను కల రూపంబుగా తానే తన కడుపున పుట్టి ఆ నరకాన్ని అనుభవిస్తుంది. చీమ మొదలగునవి మంచంలో నివసించు నల్లులు రౌరవంబనే ఉమ్మి తిని నరకములను భవించుచూ, ఆయా ప్రదేశములందుగల శరీరమునందు సంభవమగును. యింద్రియమున రేతోపానమనే నరకంబుక్రిమికి కలుగును. ఈ శరీరమునందలి మలినములు తింటూ, ఆయా ప్రదేశాలలో తన నిజరూపముతో పుట్టుచుండును. యిటుల చెమటచే వెంట్రుకలందు పేలుగా తల మొదలగుకొన్ని ప్రదేశాలలో అక్కడ కలుగు నరకములను భవించుచుండును.మూత్రస్థానమగు నరకమున క్రిములు మూత్రాన్నితాగుచూ ఆస్థానమందే పుట్టుచుండును. ముక్కురంధ్రములందు రక్షా భోజయను నరకమున కీటకముగా ఆస్థాన మందలి మలినము తినుచూ ఆస్థానమందు పుట్టుచుండును. యిటుల కణితలు, కురుపులు, పుండ్లు సూక్ష్మక్రిములతో వచ్చు అనేక రోగములు, ఊహతో కల్గురోగముల వలన, యింకా అనేక విధములుగా వచ్చిన నరకములు ఈ శరీరం ఉన్నంతకాలము, మృతి చెందిన తర్వాత, అంతకు ముందు కాలములందును, జననీజనకుల గర్భమందు జీవించుటకు కావలసిన అన్నము నీరుకై గర్భమందుండి ఈ ప్రకారంగా అనేక జన్మలు కల్గుతుంటాయి. యివేకాక మధ్యలో వచ్చే జన్మకర్మల నరకములు జాగ్రత్, స్వప్నములలో అరిషడ్వర్గాది విషయభ్రాంతులలో చిక్కుకుని, మనసుతో, కళ్ళతో, చెవులతో ఆనందాన్ని పొంది, మంచి చెడులు గల శరీర వికారంబులు జీవిపొందు సమయములో శరీరంతో కొన్ని, స్వప్నంలో కొన్ని, బ్రహ్మకైనా లెక్కింపవీలుపడక సంభవించును, మనసు స్వాధీనములో లేక యిలాంటి పనులు చేయుచూ నరులు అనేకసార్లు పుట్టుచూ గిట్టుచుందురని ఈ విషయములు నీకు చెప్పాను.

256. జ్ఞానులు ఎలాంటి ప్రకృతి సిద్ధమగు బాధలు పడకుండా జాగ్రమున స్వప్నమున కూడా యోగధ్యానముతో ఆత్మను పరమాత్మయందు నిలుపుచూ అంతర్లక్ష్య, బహిర్లక్ష్యము, మధ్యలక్ష్యములను మూడు పద్ధతులుగా దృష్టిని నిల్పి ఏమాత్రం చెదర నీయక, నిలకడ తప్పక నీలో పరిశుద్ధుడై ఉంటాడు దేవీ.

257. యిలా యింటా బయట శరీరాన్ని మరిచి, మనస్సు నిర్మలంగా ఉంచి, పుట్టుక లందు విరక్తి భావంతో నుండి యితర మనోవాంఛా సంబంధమగు అవాంతరములలో చిక్కుకొనక, అంత్యమున పరమాత్మయందు ఐక్యమయ్యెదరని ఖచ్చితంగా తెలుసు కొనుము.

258. మరియూ పురుగులు, గడ్డి పురుగుల పద్ధతిగా ధ్యాన నిమగ్నులైన యోగులు, ధ్యానాన్ని వదలకుండా ఎల్లప్పుడూ సాధన చేస్తుంటారు. ఎలాగంటే జిల్లేడు చెట్టుపై పురుగులాగా శరీరాన్ని మరచి యోగమందుంటారు.

259. ఆ జిల్లేడు పురుగును గురువుగా తలంచి, శరీర సిద్ధమగు భ్రాంతులు యోగులకు పనికిరావనే నిజాన్నిసరిగా తెలుసుకున్న సిద్ధులకు అనుకూలమైనది పరలోకంలో గల విశ్వబ్రహ్మ పొందు( సాధనచే అది వారి సొంతమే సుమా)

260. యిలాగు ఈ బ్రహ్మాండములో గల సూక్ష్మక్రిమి మొదలు సృష్టి యావత్తూ కదులుతున్న, కదలలేని శాశ్వతంగా నున్నట్టి జీవులు సమస్తరూపములలో ఏమేమి ఎలా పుట్టుచున్నవో అవన్నియూ చూచి, తద్వారా ఉపదేశం పొందినట్లు గ్రహించుకొని జ్ఞానాన్ని సంపాదించాలి దేవీ

261. **పార్వతీ ప్రశ్న :** రుద్రాక్షలు ఎన్ని ముఖాలుంటాయి ఎలాంటి ఫలితములిస్తాయో సరిగా నాకు చెప్పండి, పరలోకమందు మనసు గల నాయకా వాటిని ఎవరు పాలిస్తున్నారు. వివరంగా చెప్పండి.

262. **ఈశ్వర ఉవాచ :** ఒక ముఖము విశ్వబ్రహ్మము, రెండు విష్ణువు, మూడు అగ్ని, నాలుగు బ్రహ్మ, ఐదుశివుడు, ఆరు కుమారస్వామి, ఏడు వాయువు, ఎనిమిది గణపతి, యిలాగు ఆముఖములు గల రుద్రాక్షలను వారు పాలించుచుందురు వారిప్రతి రూపమే ఆరు ద్రాక్షలు.

263. ఈ రుద్రాక్షలను యోగీశ్వరులు యిష్టమగు అవయములందు స్వేచ్ఛగా ధరింపవచ్చును. ఫలితములు వినుము.

264. తలను, నుదురు, కంఠము, హృదయము, భుజములు, మణిబంధములందు ధరింపవచ్చును. దండగా తయారుచేయునపుడు, రుద్రాక్ష ముఖానికి ముఖము, ముడ్డికి ముడ్డీ ఆనించి తయారుచేసుకుంటే సకలుశుభములు కలుగుతాయి. శాస్త్రంలో చెప్పిన సిద్ధులు వస్తాయి, ఏ రుద్రాక్షకు ఎవరు అధిపతులో వారే అధికారములనిత్తురు.





265. మరియూ ఇంద్ర, చంద్ర, నాగ, భద్ర, రుద్రాక్షలని యివి అయిదు రకములున్నాయి. యిందులో భద్రాక్షిశక్తివగు నీ రూపముగా యుండునని తెలియుము.

266. **పార్వతీ ప్రశ్న :** విభూతి ధరించువారికి ఏ విధంగా శక్తివశమయి కనబడును ? దాని వలన ఎలాంటి ఫలితాలున్నాయో వివరంగా చెప్పుము. ఆశువుగా కవిత్వం చెప్పగల వారికి నాయకుడా, సర్వలోకములందరివారుఆనందించుటకై విభూతిధారణ ఫలితాలను చెప్పండి.

267. **ఈశ్వర ఉవాచ** :దేవీయిది మానవుల కర్మలను తొలగిస్తుంది. శరీరాన్ని నిర్మలంగా ఉంచుతుంది. శరీర దోషాలను పూర్తిగా హరిస్తుంది, మంచి కులంగల రత్నాలు సంపాదించి బంగారంతో చేయించిన సువర్ణ రత్నాభరణములు ఎందుకు ? అంటే, ఎంతో విలువైన మణులు బంగారంతో చేయబడిన హారములకంటే విభూతిధారణే శ్రేష్ఠము.

268. ఈ విభూతి భూతాలను పారద్రోలుతుంది. బ్రహ్మరాక్షసులను సంహరిస్తుంది, విభూతిధారణే మహా అలంకారం, వాతాన్నిహరించి క్రిములను నాశనం చేసి, భయాన్ని పోగొట్టి జరుగుతున్న విషాదానికి కల్గుశోకాన్ని పోగొట్టుతుంది, చలి, వేడిని శరీరంలో సమంగా ఉంచుతుంది. దోషాలన్నిటినీ హరిస్తుంది. సిద్ధత్వాన్నిస్తుంది. యింద్రియ నిగ్రహాన్నిచ్చి, ఈశ్వరత్వాన్నిచ్చి సుఖాన్ని రోజురోజుకూ ఎక్కువ చేస్తుంది.

269. పార్వతీ దోసకాయకు చుట్టూ యినుప తీగలతో కట్టినా, పైచర్మాన్ని విడదీసినా, కాయపగిలినా లెక్కచేయక ఎలా పండుతుందో, అలాగే సర్వాన్ని త్యజించి తత్వాన్ని సాధించిన శరీరులు ధన్యులవుతారు. అనుమానము ఏ మాత్రమూ లేదు. వారు ఈశ్వరుడు, ఋషులు, ఆయా మహాయోగుల వలే ఉంటారు.

270. విభూతి స్నానమనగా శరీరమందలి అన్ని అవయవాలకు విభూతి ధరించి శాంభవీముద్రలో నన్ను తెలుసుకుంటే ఈ ప్రపంచంలో బ్రహ్మాన్ని చూస్తారు. అలాంటివారిని చేతులతో నమస్కరిస్తారు జనులందరూ, ఈ లోకంలో వారే భసితసిద్ధులు.

271. యిలాంటి వారే కదా చాలా పుణ్యాత్ములు, విష్ణువు, శక్తి, రుద్రుడు మొదలగు దైవస్వరూపులు వారే, కారణపురుషులు సృష్టిలో వారితో సమానమైన వారు ఏరీ ఈ ఏడు లోకములలో ?

272. గోధుమరంగు గల ఆవుపేడను కాల్చించి గుడ్డలో వేసి శుభ్రంగా రాల్చి వస్త్రకాయకం పట్టి శుద్ధముగా ఉన్న ఆ బూడిదను, అలాంటి ఆవుపాలు పోసి కలిపి పిడక చేసిపుటమేయగా దాని యందలి మలినమంతా పోయి దివ్యమైన భస్మం తయారవుతుంది పార్వతీ.

273. యిది కాకుండా బజారులలో అమ్మే విభూతిని మంచిదని పూసుకునే సంసారులకు వారికి గల దోషాలు పోకుండా గట్టిగా పట్టుకుని వదలవు ఎలాంటి ధ్యానముచేసే యోగికైనా సరే.

274. మరియూ పరిశుద్ధమయిన విభూతిని కళ్ళకు పెడితే మంచి చూపు వస్తుంది. మాడుపైన, నుదురు, కంఠం, తొడలు, భుజములు, హృదయం, వీపుకు, పిక్కలకు, పాదాలకు, చేతులకు, మణిబంధానికి వ్రాసుకుంటే సకల దోషాలుపోయి అంతా శుభంకరంగా ఉంటుంది. అదిగాక యిలా అన్నీ అవయవాలకు వ్రాసుకోవడమే విభూతి స్నానమందురు. అట్టి మహాయోగులకు చెప్పుటకు వీలుపడని మహా బ్రహ్మపదము అనగా బ్రహ్మములో లీనమగుట జరుగును.

275. మహా పవిత్రమైన పరమపావన మూర్తులు, ఉత్తమ బ్రాహ్మణులు, స్థిరంగా యోగము చేయుచు సిద్ధి పొందినవారును, సంయములగు, మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులు ఐదుగురు, వరుసగాయున్నదే ఋషివర్యులు, పెద్దలు, సానగాదులందరికి ఆమోద యోగ్యమయినది భూమిపైన శాశ్వతమైన తత్వము యిదే సుమా. అనగా బ్రహ్మములో కలియుటే.

276. <u>పార్వతీ ప్రశ్న</u>: ఈ విశ్వాన్ని చేసినదెవరు? బ్రహ్మనుండి వరుసగా జ్ఞానానికి మూలమెవ్వరు, ఓ విశ్వేశ్వరా మహాత్మ తెలియజెప్పుము.

277. **<u>ఈశ్వర ఉవాచ</u>** :ఈ విశ్వాన్నంతా నిర్మించి ఆయన విశ్వకర్మ అయ్యాడు. అన్నీ చేసి ఏ ఆలోచనలు లేనివాడై బ్రహ్మాండమంతా ప్రకాశిస్తాడు కనుపించునదంతా విశ్వబ్రహ్మ సృష్టి యే యిదంతా యిహలోక విద్యలు, పరలోక విద్యలు అన్నీ ఆయనవే.

278. అన్ని లోకములు, వాటిని పాలించువారు, ఆ లోకములలో నుండువారు, ఆయా లోకాలలో గల వృత్తులు (పనులు) చేయువారు అన్ని లోకాలను సృష్టించి వాటి పైగా నుండి అన్ని లోకాలలో మరుగున ఉన్నట్టి విశ్వబ్రహ్మలో కలియలేరుగదా లోక భ్రాంతులచే నరులు.

279. సంపద అనేది కలలాంటిది శాశ్వతమైనదికాదు, యిది ఉన్నవారికి అనేక రకములయిన బలాలుంటాయి. సంపదతో వచ్చిన చలి జ్వరములాంటి వ్యాధి కలిగిన ఈ దీనులు వాళ్ళకు గల ధన సంబంధమగు చిక్కులను గ్రహించి తప్పుకోలేరు.

280. దీనులను ఆదరించువానిగా బ్రహ్మన్ని తలచుము ఎవరెవరు చేసుకున్న కర్మఫలితాలను వారు అనుభవిస్తున్నారు. యిది తప్పదు అమ్మాయి యిది సత్యము నమ్ము యివి ఏ మాయలు కావు.





281. వనితా సర్వాన్ని తన సకల సంపదలను వదలివేసి, విశ్వబ్రహ్మన్ని ధ్యానించు వాడు ఏ దిక్కులేనివాడుకాడు, అతనే భగవంతుడవుతాడు భగవంతుడు అతను కలసి ఉంటారు అతనే బ్రహ్మము సుమా.

282. మరియూ ఓ పార్వతీ విశ్వ బ్రహ్మం అను, విశ్వకర్మఅను , జ్ఞాన విజ్ఞానములకు విశ్వమంతా నిండి తనే విశ్వమయిన విశ్వబ్రహ్మమే స్వర్గానికి ఆధారంబని ఎరుంగుము.

283. ఓ విశ్వబ్రహ్మ ఒకటి, మూడు, ఐదు, యిరవైఐదు, వంద, వెయ్యి తలలతో ప్రసన్నత నొందుతున్నావు నీకు కళ్ళు, నాలుకలు ఆ లెక్కన గల కంఠములు గలిగి ఎన్ని అయ్యాయో, అనంత సంఖ్యగా లెక్కపెట్టలేనన్ని ఎక్కువై కన్పిస్తున్నాయి. హృదయాలు, పొట్టలు, హారములతో అలంకారంగా ఉన్నాయి. జ్ఞానాన్ని విజ్ఞానాన్ని తెలియజేయు విద్యలున్నాయి. కర్మ,భక్తి,జ్ఞాన, ధర్మనిర్ణయము లందువిద్వాంసుడవు నిర్మలంగా ఉంటావు. అనేక రూపాలు ధరించగల సృష్టికర్తవు అవతారాలను కల్పించు వాడవు. బాలుడవో, యవ్వనుడవో, మంచి వయసునందున్నావో, నీ నిజస్వరూపము లోకంలో గల వారందరికీ తెలియకుండా ఉన్నావు గదా విశ్వబ్రహ్మ.

284. **పార్వతీ ప్రశ్న** : నా శరీరము మా శరీరములలో, లోకములో గల వారందరిలో ఉండి, యిలా అన్ని లోకాలలో ఉండి నా హృదయకమలము నందు కలిసిన విశ్వనాథా ఇహము, పరమనెడు రెండు లోకాలలో సంచరించువాడా.

285. మీకు ఉన్న తలలు చాలా బలముగలవి, నాకు ఒక కోరిక కలదు. హృదయాలు, పొట్టలు, చేతులు వీటితో మీరు ఏమేమి ముఖ్యమగు పనులు చేస్తారో, చెబితే వినాలని ఉంది ఆనందరూపముతోనున్న విశ్వనాథా విశ్వరూపా.

286. **ఈశ్వర ఉవాచ** : యిడ, పింగళ సుషుమ్న అను మూడు నాడులున్నాయి సిద్ధంగా, అవి చేసే పనులు చెబుతాను శ్రద్ధగా వినుము, సుషుమ్నకు రెండు వైపుల గల నాడులకు శరీరానికి సంబంధించిన జ్ఞానము లేదు మధ్యగలనాడికి అన్ని తెలుసు ప్రక్క రెండు నాడులు చలి వేడితో ఉంటాయి. రోగము, దెబ్బలు వాటికి తెలియవు, పట్టించుకోవు. కర్మ త్రయాలైన పుణ్యకార్యాలు, పాపకార్యాలు, మిశ్రమకార్యాలు వీటికి తెలియవు. జ్ఞాపకంగా ఉండవు అక్కడ ఏమీ చేయవు. ఆత్మకు ఆధారముగా అంటుకొని ఉన్నాయి. దేహానికి ఏమయినా అడగవు. అయ్యో పాపం అనవు. శరీర నిర్మాణంలో ముఖ్యమయిన ధాతువులతో కల్గిన రాజసగుణం కూడా వాటికి లేదు. తామరవంటి కన్నులు కలదానా గ్రహించుము.

287. వినుము యివికాక ఐదు వేరు వేరు నాడులున్నాయి. గొప్పగా తత్వపంపకం చేస్తూ ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులను ప్రసరిస్తుంటాయి. యివి

మామూలు కంటికి కానరావు ఆత్మను అంటీ అంటకుండా శరీరంలో కలిసి ఉంటాయి. మనోదృష్టితో గ్రహించాలి వీటిని దేవీ.

288. యిలా ఉన్న ఐదునాడులు, వాటి సఖ్యత చెడకుండా ఆత్మజ్ఞానము చేత ఉంటాయి. మాయలు, మర్మాలు, చిక్కులు "జీవిచేస్తే" యివేమీ వాటికి చెందవు సుమా.

289. యిందులో1. ఒకనాడి చెవులందు కలుగు నాదముచే ఆనందం పొందు తుంటుంది. ఆ శబ్దగుణములు నావియనుచు అన్ని సమయములందు తిరుగుచూ అన్ని శరీరకార్యములకు సహాయపడుచూ వివిధ రూపములు గల కన్నెయల మనో రూపు రేఖాదులను ఎంచుతుంది. 2. మరొకటి ఆహారము తింటూ రుచులు తేడాలు తెలుసుకునే నేర్పుగలదియు,3. యింకొకటి అన్ని వాసనలు తెలుసుకుంటుంది, యిలాగు ఐదు ఒకదానికొకటి కలిసి ఏకదారముతో గ్రుచ్చబడినట్లు స్నేహభావంతో ఉంటాయి ఎలాంటి ఆలోచనలు లేకుండగా.

290. 4వది అన్నిటికీ ఆజ్ఞలివ్వటానికి, 5వది ఆహారము తింటూ జీవించడానికి, ముందు చెప్పిన మూడింటిలో ముఖ్యమయిన నాడి తినుట, త్రాగుట, అమృతము, విషము మొదలగు ఫలితాలను మానవులకు ఆహారము సేవించు సమయమందు యిస్తుంది.

291. **పార్వతీ ఉవాచ** : ఈ కళ్ళతో కాకుండా అంతర్దృష్టితో చూడగా, స్త్రీవ్యామోహము లేకుండా, మూడవ కన్నుండి మీరు బ్రహ్మ అయ్యారునాథా

292. **ఈశ్వర ఉవాచ** :మామూలు కంటి చూపులన్నీ మానేసి, భ్రూమధ్యన గల అగ్ని చూపును తెలుసుకుని, శరీరాన్ని విశ్వబ్రహ్మకు అప్పగించి, ఆత్మను పరమాత్మలో కలిపి కాలాన్ని లెక్కించకుండా ప్రతీ నిముషం అలాగే ఉండిపోయాను దేవీ.

293. యిలా వేలకొలదినాడులు కలవు. వాటి వాటి ఉపయోగములు శరీర అవసరానికి తగినట్లుగా ఉంటాయి. మరియు హృదయములో వేడి, చలి, సుఖము, దుఃఖము, భయము, ఆనందమను ఆరు విధములైన హృదయములు అవి ఆయా సందర్భములను బట్టి ఆయా ఫలితములు పొందుచూ వాటికి అనుకూలమగు పనులు, అవస్థలు, నడకలు జరుగు తుంటాయి. మరియూ ఆరు విధములైన పొట్టలు ఆరు విధములగు రుచులను గ్రహించుటే గాక, లోపలరుచుల యొక్క తేడాలు శరీరము యొక్కతత్వాలు గ్రహించుచుండును, యింకా అనేకమయిన అనేక పనులుతో పేర్లు రూపాలు వేరుగా వేరుగా నుండి ఆయా పనులు చేయుచుండునని ఎరుంగుము.

294. **సృష్టిలోని సర్వ ప్రజలకు సనారీ ఉవాచ :** నేనే విరాట్ విశ్వబ్రహ్మాన్ని శిరస్సు నుండి ముందుగా పుట్టిన మయ వంశంలోని వాడినని అనుకొండి. నేను పంచాననులు అను విశ్వబ్రాహ్మణ కులాన్ని ఉద్ధరించటానికి పుట్టాను.





295. నేను విశ్వకర్మ రెండవ ముఖము నుండి ఉద్భవించిన వంశంలో గొప్పవాడి నయ్యాను. "మీరు", నేను దీనుడను "నన్ను" మీ హృదయంలో ఉంచుకొమ్మని నన్ను కోరి ఎల్లప్పుడూ మీరు ఆనందంతో ఉండండి.

296. పాలకొండలో సింహాద్రి వీరన్న గౌరీదేవి యందు జన్మించిన దివ్యమణిలాంటి వాడినై జయము బ్రహ్మజ్ఞానముగలట్టి నన్ను మనసులో నిల్పి పదేపదే చదవండి పరమపావనమయినట్టి నా చరిత్రను నేను వ్రాసిన **సనారీసంవాదాన్ని.**

297. ఈ సంవాదములో ఉదాహరణలతో చెప్పబడినదంతయూ ఐదు ముఖములు గలట్టి విశ్వకర్మ సంతతియైన మహనీయులచే. యింకా యిందులో తాంత్రికమంతా ఉన్నది. దీనిని ఆచరించినవారు అన్నిటిలో అగ్రస్థానంలో ఉంటారు.

298. చీకటియింటిలోను చెట్టునీడకు తెచ్చి పాదరసంపుటం పెట్టి ఆ చూర్ణాన్ని రాగి కరిగి అందులో పాళ్ళు ప్రకారం భస్మాన్ని వేస్తే మేలిమియే అగును అది జగత్తును ఏలిస్తుంది. యీ ధనమే జనులారా మీకు ఈ లోకంలో కాలం గడిపేది.

299. రవి, కుజ, గురు ఈ మూడు భస్మాలు తయారయితేనే, మేలయిన సువర్ణమవు తుంది. చూడుమూ భూమిపై యిదంతా ధనమే అవుతుందనే అవివేకమును వదిలి, ఆత్మను పరమాత్మలో కలుపుము, అంటే బంగారాన్ని తయారుచేసుకుని యిహలోక భోగాలనుభవించాలనే భ్రాంతితో అజ్ఞానంలో పడక, బ్రహ్మములో కలిసే ప్రయత్నాలు చేయుము పత్నీ అంటూ స్వామివారు మనకు చెబుతున్నారు.

**వివరణ :** రవి–కుజ–గురువు అనగా కాలసంబంధమైన రహస్యముగా తెలియబడు చున్నది. సుమేరు పర్వతమును సాధించుటకు కార్తీక, మార్గశిర, శ్రావణ మాసములను సూచించుచున్నట్లు తోచుచున్నది. కావున ఆయా కాలముల యందు సాధకుడు సువర్ణ పర్వతము సిద్ధింపచేసుకోవలెను.(రసవాదులు వీటిని లోహములంటారు)

300. యీ యోగాలన్నీ వ్రాసినా, చదివినా, యిష్టమగు మనోధనాన్ని పొందుతారు. వారికి ఎలాంటి కోరికలున్నా వెంటనే తీరుతాయి. ఏ ఉపాయము చేతనైనా పరిశుద్ధులగు తారు. ఈ యుగము, ఆ యుగమనుకోకుండా, ఆలోచించక, దీన్ని ఆచరించితే న్యాయ బుద్ధి గొప్పజ్ఞానము, క్షేమము యింకా అనేకమైన ఫలితాలనిస్తుంది.

301. మంత్రం సిద్ధించును, భూమిపైన మానవులు కోరిన యోగసిద్ధి పొందుటకు యిలపై యోగయాగములను ఉంచాను. క్రమముగా వీటిని ఆచరించి సంపూర్ణమైన భోగభాగ్యములనందగలరు.

302. పర్వతములందు సంచరించెడి పరమేశా, సర్వాంగములందు విభూతిని ఆభరణములుగా ధరించువాడా, వేదములందు నిండి యున్న విశేషమగు గొప్పతనము

కలవాడా, నిశ్చలమగు ఆత్మ గల అమరుల దైవమా, నగరాజతనయయైన పార్వతీదేవిని గురించి సదా ఆలోచించెడివాడా, శుభములొసంగు వాక్కులను సదాపల్కువాడా, కొండ గుహయను మానవ హృదయమే సంస్థానముగా కలవాడా, ముక్కుపై భాగము నగల ఆజ్ఞా చక్రమునందు నుండువాడా, మీకు శతసహస్రపాదాభివందనములు గురుదేవా.

303. శోభాయుక్తమై సమస్త విద్యలు నేర్చి కవిత్వంతో వెలగొందుచూ, సరసమగు కవితయు, విశేషమైన అనంత విద్యలు కలిగి మంచి గుణములు,చందోబద్ధ గణములందు మణులు కూర్చిన కిరీటమువలె నుండి, అనంతమైన దేవగణాలను అర్చించు పద్ధతులు, విద్యలు సాధించు విధానములు, తత్త్వపరిశోధనలతో గల సనారీ విశ్వేశ్వర సంవాదము నందు, చావును తెలియజేయు పద్ధతులు, అనేక యోగాభ్యాస వివరములు, గురువుల లక్షణాలు, ఆత్మ యొక్క మరుపు, యిహలోక సంబంధమగు శరీరానికి గల గుణములు వదిలించు కొను పద్ధతులు, జీవుడు ముక్తి పొందు పద్ధతులు జీవాత్మను పరమాత్మలో కలుపు పద్ధతులు బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంధుల ఏర్పాటు, ఎనిమిది విధముల లింగముల ఆకారములు దుష్టాంతరమును, అతి ముఖ్యమయిన పరమశివుని స్తుతించు ఆరు మత్తేభ పద్యాలు, రసవాద ప్రస్థావన, ఐదు రకముల సిద్ధులు ఉపాధి మూలికలు, మానవుల బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్య జీవన విధానములు జ్ఞానుల యొక్క వరస క్రమము, పురుగులు చేయు యోగసమాధి పద్ధతి, రుద్రాక్ష ముఖముల యొక్క ఫలితములు, విభూతి నిర్మాణ పద్ధతి, విశ్వేశ్వరుల వంశము మొదలైన 21 సంఖ్యలు గలిగి బాగా పెరిగిన ఆకులు, పువ్వులూ, కాయలు గల్గి ముళ్ళు గల తీగలతో అల్లుకున్నటువంటి దీ, మంచి పక్వానికి వచ్చిన వివిధ రుచులు గల పళ్ళు గలవియైనటువంటి, యిలాంటి పోలికలు గల విష్ణుగ్రంధి యందు సూక్షదేహమునంటి నటువంటి, సనారీ విశ్వేశ్వర సంవాదంబను వేదాంత ప్రబంధంనందు **ద్వితీయా శ్వాసము సంపూర్ణము.**







## సనారీ విశ్వేశ్వర సంవాదంబను

### ( మహా ప్రబంధము నుండి తృతీయాశ్వాసము ప్రారంభః )

**1 నుండి 6 వరకు స్థవశ్లోకాలు :-**

1. సిరిసంపదలు కీర్తి సుస్తిరంగా ఉండేటందుకు చేసే సిద్ధతంత్రప్రయత్నమును బోధించు గొప్పది. శాస్త్రజ్ఞానంలో నిపుణులైనవారు తెల్పిన పుణ్యముకల్గు అమోఘమగు శ్రేష్ఠమయినది. ద్వేషభావం లేనిది, దివిలోని ముని ప్రసాదించినవరము, యిది దీనులను రక్షించి పోషించునట్టివిధానము, బ్రహ్మజ్ఞానులందరిలో అధికులై సరస గుణమనస్సుగల గురుదేవా! మీకు ఎల్లకాలములందు నమఃస్సుమాంజలులు.

2. రక్షరక్షసనారీశ్వరా శరణు శరణు మునీశ్వరా నేను మీ యంత్రాన్ని మంత్రాలతో పూజిస్తున్నానుదేవా, నన్ను కాపాడులోకనాయకా.

3. పార్వతీదేవితో కూడిన దేవా, సదానేనుయంత్రాన్ని మంత్రాలతోపూజించు విధానముతో నాకు ఆరోగ్యాన్ని, దీర్ఘాయుష్యాన్ని, ఆనందాన్ని ఆత్మదర్శనాన్ని కల్గించు దేవా.

4. భూసంపదను, సర్వభోగములనిచ్చి భుక్తిముక్తులను ప్రసాదించి, సర్వవిద్యల నిచ్చి, విషాన్ని నాశనం చేసి అనేకమయిన శుభములను చేకూర్చి,

5. నేనెవరో తెల్పుజ్ఞానాన్ని, పరమాత్మనెరుంగు జ్ఞానాన్ని, సృష్టిరహస్యాలను ఈ పూజలతో తెలియజేసి, శరీరరోగాలను జ్వరాన్ని పోగొట్టి, విరోధి వర్గాలను నశింపజేయుము.

6. నేను పదే పదే సదా చేయు మీ పూజ, మానసధ్యానములతో యివన్నీ నాకు ప్రసాదించు సంయమీశ్వరా, నా మానవ ప్రయత్నంతో "నేను కోరని నా మనసు నందలి సర్వకోర్కెలను సిద్ధింపుము గురుదేవా.

**7 నుండి 10 వరకు అంగన్యాసకరన్యాసములు :-**

(చేతి వేళ్ళు, శరీర భాగములు తాకుతూ చేసే విధానము)

11. **ధ్యానం :-** మంచిగంధము, విభూతి, కుంకుమ, అలంకారముగా ధరించి, ఎడమభాగమున అమ్మవారితో కూడి, భక్తులకు అభయహస్తమునిస్తూ పీతాంబరములు పట్టువస్త్రాలు. ధరించి, నవరత్నములతో పొదగబడిన బంగారు సింహాసనముపై కూర్చుండి, ఆర్తులను సంరక్షించుమాటలతో అభయమొసంగు హస్తముతో, మంచి గుణములు గల భక్తులను పాలించు దేవా మీకు శతసహస్రపాదాభివందనములు.

12. **మూల మంత్రం = జపము చేసుకొనుట. (కనీసం108సార్లు)**

13. **పంచపూజలు = ప్రతీపూజలో చేయవలసినవి.**

14. **కవచః :-** దిక్కులే వస్త్రములుగా, స్థిరమైన నిశ్చలమగు ఆత్మగలిగి, మంచి రత్నములతో పొదగబడిన బంగారు సింహాసనమునధిష్టించి, సువర్ణాభరణములు. జాతిరత్నముల మాలలు శిరస్సునధరించి, శీఘ్రముగా కోర్కెలుతీర్చి పాలించువాడవు నీవు గురుదేవా.

15. "నమఃశివాయ" ఈ పంచాక్షరీ మంత్రోపాసన యోగవిద్యలలో చాలా గొప్పది. మానవులను కవచం వలే రక్షించికాపాడునది, అంతులేని యోగాన్ని సిద్ధింపజేసి ఆత్మసాక్షాత్కారము గావించి, విషాన్ని సైతము హరించి,

16. అనేకములగు ద్వేషములను తొలగించి, ఆయుర్వేద విద్యను వశం చేసి, రహస్యమగు బ్రహ్మజ్ఞానాన్నిచ్చి, మనసుకు ఆనందం కలిగించి సృష్టి రహస్యాలను సాక్షాత్కరింప చేస్తుంది. యివి ఈపూజా విధానములలో ఉన్నవి.

17. హ్రాం, హ్రీం, శ్రీం, "బీజాలను ఉచ్ఛరించి పాదములు పిక్కలు తాకి, "క్లీం"బీజాన్ని ఉచ్ఛరిస్తూ తొడలు, మొలముందుభాగాన్నితాకి, ఐం,క్లీం, సౌః బీజాలను ఉచ్ఛరించి పొట్టను మొలవెనుకభాగాన్నితాకి, "స్వాః"బీజాన్ని ఉచ్ఛరించి రొమ్మును స్తనాలను కంఠం క్రిందిభాగాన్ని తాకాలి.

18. "శ్రీం.శ్రీం.శ్రీం." బీజాలను ఉచ్ఛరించి కంఠాన్ని భుజాలను తాకి, "సౌఃసౌః " బీజాలను ఉచ్ఛరించి చేతుల పై భాగముల నుండి అరిచేతులను, చేతివేళ్ళను తాకాలి. హ్రీం - హ్రీం - బీజాలను ఉచ్ఛరించి,చెవులను, శిరస్సును తాకి, ఐం-ఐం-ఓం బీజాలను ఉచ్ఛరిస్తూ నోటిని, ముక్కును, కళ్ళను తాకాలి.

19. ఓం-హ్రీం-శ్రీం బీజాలను ఉచ్ఛరించి నుదురును, ముఖాన్ని తాకి, స్వాః - స్వాః బీజాలను ఉచ్ఛరించి ముఖందగ్గర నుండి పాదాల వరకూ చూపించి, శ్రీం-శ్రీం బీజాలను ఉచ్ఛరించి పాదాలనుండి ముఖం వరకూ చూపించి, ఓం-హ్రీం బీజాలను ఉచ్ఛరించి పార్వతీ దేవికి తన శరీర అవయవాలను చూపించినట్లుగా భావించాలి.

20. **వశిష్ఠ ఉవాచ :-** మందారపూలు, మారేడు, తులసీదళాలు, తామర పూలు, మంచిగంధం, కుంకుమ, పసుపు అక్షతలు, యింకా అనేకరకములగు పూలతో, పూజించితే ఆనందించు రూపము గల గురుదేవా.

21. ఆరోగ్యము, ఎక్కువ ఆయుర్ధాయాన్నిచ్చే "ఓం"కారనాదంతో గల ఆత్మ స్వరూపిణీ, జ్ఞానవిద్యను ప్రసాదించు దేహి, అర్ధిస్తున్నాను "హ్రీం" కారరూపిణీ విషాన్ని నాశనము చేయుమాతా.





22. పుట్టుటకు, పెరుగుటకు, మరణించుటకు నాయికవై "శ్రీం"బీజమందు ఉన్నట్టి "క్లీం" కామస్వరూపిణీం, మోహమును కల్గించుచూ ముల్లోకములను వశపరచు కున్నట్టి పార్వతీ.

23. రసవాద ప్రక్రియలు సాధించుటకు అనుజ్ఞనొసంగుదేవీ, అనేక పూజా విధానములు గల "సరస్వతీ" ధనం, ధాన్యం, ఏనుగులు, గుర్రములు, పులులు, గోవులు, దున్నలను పాలించుచూ.

24. సింహ వాహనము నధిరోహించి, శుభములనొసంగు క్రమంలో పరిశుద్ధ గుణముతో నుండి సత్వ, రజ, తమోగుణములు లేని నిర్గుణస్తితిలో నుండి భక్తుల దుర్గుణములను హరించి సర్వసంపదల నొసంగుదేవీ నాగృహ(దేహము)మందు నివసించుమాతా.

25. జ్వరములు, శరీరాన్ని బాధించురోగములు, శూలలను పోగొట్టి అనేక శత్రువుల రూపములను అణిచి శ్లేష్మ రోగములు నివారించు దేవీ.

26. కొడుకులు, మనుమలు, సకల పరివారములతో వృద్ధిపొందుటకు ఈ కవచ పారాయణయే అమోఘమైనది. సర్వదిక్కులను పరిశుద్ధమొనర్చునదీ మంత్రరాజము.

27. పాతాళ, పరలోకములను కాపాడునది, ఆకాశము, స్వర్గమర్త్య, పాతాళ ముల్లోకములను స్వాధీనపరచుదేవీ, స్వర్గలోకాన్ని పరలోకాన్ని, రాజ భోగములను ప్రసాదించునట్టిదీ మంత్రరాజము.

28. ఈ కవచాన్ని నిత్యపారాయణముచేయువారికి సర్వ విద్యలు స్వాధీనమై, అనేక శుభములు కల్గించుచూ, పాపాన్నినశింపజేసి పుణ్యమును ప్రసాదించునట్టి, పార్వతీ కవచము చాలా శ్రేష్ఠమయినది.

29. సకల భాగ్యములు ప్రసాదించు జ్ఞానమూర్తీ శరణు శరణు, నమస్కారము, పదేపదే (ఎల్లప్పుడూ) నాకు రక్షణకల్పించి కాపాడు పాహిపాహినమో నమః

ఈ కవచాన్ని సిద్ధింపచేసుకుంటే పుత్రపౌత్రాభివృద్ధి, సర్వరోగనివారణ, సర్వపాపములు హరించి పుణ్యములు, సకల విద్యలు పొందవచ్చును.

**దిగ్బంధన :**

30. భూత, ప్రేత, పిశాచములు, దిగ్బంధనయై రాక్షసగణముల ప్రమాదములను, వాతదోషములను, భయములను పోగొట్టి, విషక్రిములను హరించి, శ్లేష్మము, అతిసారములను పోగొట్టి, సర్పములు, గుడ్లగూబలతో సంభవించు భయంకరమగు వార్తలను హరించి, అనుమానములు. విషాన్ని నశింపజేసి, బ్రహ్మహత్య, శిశుహత్యాది పాపములు హరించి, పాపులగు నరులను పావనమొనర్చునట్టి మహిమగల మహా

మంత్రము, యిందలి బీజాక్షరములను దోషంలేకుండా ఉచ్చరించుటచే, అష్టదిక్కులు. భూమి, ఆకాశ మార్గముల నుండి భూత ప్రేత, పిశాచములను, దుష్టగ్రహములను దరిజేరకుండా చేసి ప్రయోగములు తొక్కిడి దోషముల నుండి మానవులను రక్షించి కాపాడుతుంది. **31 నుండి 42 వరకూ గల మంత్రముల ఫలితములు.**

31. ఓం-హ్రీం బీజాలను ఉచ్చరించి శక్తి స్వరూపుణిని విజృంభించమని క్లీం-క్లీం బీజాలను ఉచ్చరించి స్త్రీ దేవతయగు శక్తిని స్మరించి, సౌః బీజాన్నిఉచ్చరించి సంపదలు ఐశ్వర్యములతో నివసించుమాతా తూర్పు ద్వారాన్ని బంధించి, ఏ దుష్టశక్తులను నావద్దకు రానీయకుము.(అక్షతలను తూర్పు దిక్కున వేయ వలయును).

32. ఓం ధుము ధుము ఆమూయం అంటూ మూల ప్రదేశమగు అగ్నేయదిక్కు న శ్రీంబీజాన్ని ఉచ్చరిస్తున్నాను మాతా, ఆగ్నేయద్వారాన్ని బంధించి ఏ దుష్ట శక్తులను రానీయకుము (ఆగ్నేయ దిక్కున అక్షతలు వేయాలి)

33. ఓం - ధుము ధుము ర్యాం - క్లీం బీజాలను ఉచ్చరిస్తున్నాను దక్షణ ద్వారాన్ని బంధించి ఏ దుష్టశక్తులను రానీయకుము తల్లీ (దక్షిణాన అక్షితలు వేయాలి)

34. ఓం - హుం - హుం ఠ-ఠ-ఠ-ఠ-సౌః బీజాలను ఉచ్చరిస్తున్నానునైరుతి ద్వారాన్ని బంధించి నావద్దకు ఏ దుష్టశక్తులను రానీయకుముదేవీ. (నైరుతి దిక్కున అక్షితలు వేయాలి)

35. ఓం-స్వః-స్వః రద్రకాం-అంటూ బీజాలను ఉచ్చరిస్తున్నాను పశ్చిమ ద్వారాన్ని బంధించి నావద్దకు ఏ దుష్టశక్తులను రానీయకుముదేవీ.(పశ్చిమాన అక్షితలు వేయాలి)

36. ఓం-ఖేం-ఖేం - బీజాలను ఉచ్చరించి, సర్వశత్రువులు రాకుండా ఖాం-ఖాం బీజాలను ఉచ్చరిస్తున్నాను వాయువ్య ద్వారాన్ని బంధించి ఏదుష్టశక్తులను నాదరిచేర నీయకుము శక్తి స్వరూపిణీ. (వాయువ్య మూలలో అక్షతలు వేయాలి)

37. ఓం-హ్రీం-శ్రీం-ఐం-బీజాలను చెప్పుతూ దుష్టశక్తులు రాకుండుటకు ఉం - ఉం-బీజాలను స్మరిస్తున్నాను ఉత్తర ద్వారాన్ని బంధించుమాతా (ఉత్తరాన అక్షితలు వేయాలి)

38. ఓం-క్లీం-సౌః బీజాలను ఉచ్చరిస్తున్నాను సర్వ ఆయుధములతో నున్న మాతా, శం -శం బీజాలను స్మరిస్తున్నాను ఈశాన్య ద్వారం నుండి ఎలాంటి శక్తులను రానీయకుము.(ఈశాన్య దిక్కున అక్షితలు వేయాలి)

39. ఓం, గ్లోం, గ్లౌం - లం-లం బీజాలను ఉచ్చరిస్తున్నాను. పాతాళము నుండి సర్వశక్తులను రాకుండా స్థంభింపచేయుము.(భూమిపై అక్షతలు వేయాలి)





40. ఓం-హ్రీం-హ్రీం-బీజాలను ఉచ్చరిస్తున్నాను. సర్వశత్రువులు, సకల దుష్ట గ్రహముల నుండి నాకు ఎలాంటి భయము కల్గకుండా కాపాడుము.(తన శిరస్సుపై అక్షతలు వేసుకోవాలి)

41. ఓం శక్తి స్వరూపిణీ దుష్టశక్తులు, శత్రువుల సర్వప్రయత్నములు, భంగపరచివారి కాళ్ళు, చేతులు, మేదస్సు, ఆలోచనలు, మనస్సు వాక్కును, శరీరావయము లన్నింటినీ స్థంభింపజేసి ప్రతిమలవలేనుంచుము. (తన చుట్టూ అక్షతలు చల్లుకోవాలి)

42. ఓం-సర్వక్షుద్రశక్తుల ఉపద్రవములను భంగపరచి కాళికవలే వాటిని హరించి గరుత్మంతుడు సర్పములను తన్నుకుపోయినట్లుగా. వారిని స్థంభన గావించుము. దుష్ట శక్తులు కల్గించు భయాన్ని నివారించుట కొరకు మారణ బీజాలను ఉచ్చరిస్తూ భద్రకాళి దేవతను ఆహ్వానించుచున్నాను. 30 నుండి 42 వరకూ గల మంత్రాలను సిద్ధింప జేసుకుని ఈ ఫలితాలను పొందవచ్చును.

**మాలామన్త్ర :**

43. కలువపూలయందు యిష్టముగల పద్మినీ, పాపములను నశింపజేయు ఐదు శిరస్సులు గలవాని సతీమణీ, ఈ లోకమున వశపరచుకొను అంతులేని గుప్త నిధులను స్వాధీనపరచు కొనగల మాలికా మంత్రములను స్తుతించు చున్నాను.

44. మాలామంత్ర పారాయణ చేయు భక్తులను పాలించు పార్వతీ "ఐం" బీజాన్ని పల్కుటచే మహా ఆనందాన్నిచ్చి "హ్రీం" బీజాన్ని పల్కుటచే మహత్తులను ప్రదర్శించి

45. మహాలోకాన్ని సాక్షాత్కరింపజేసి, సర్వసాధుజనులకు ఆలోకాన్ని వశపరుస్తావు, " మేదో భోజీ " తీపి పదార్థాములు యిష్టంగాతిను జగదీశ్వరీ.

46. జగతిరూపంలోనున్న జగదీశ్వరీ, స్వశక్తి గల మహేశ్వరీ, సర్వసంపదలను ప్రేమతో అనుభవించుదానా, మహాభోగములను అనుభవించు భువనేశ్వరి.

47. మహాతేజస్సుతో బంగారు ఆభరణములు ధరించి, బంగారు సింహాసనాన్ని అధిష్టించి, మణిహారములు ధరించిన మహావీరనాయకీ, తియ్యని ఫలములు భుజించు దేవీ.

48. మంచి ఫలితములను ఆకర్షించు సుకుమారీ, దుష్టజనులను నశింప జేయుచూ సధర్మములను సంస్కరించు శక్తీ, మాలామంత్రప్రియురాలా కంటికి కానరానిమాతా.

49. మకారపంచక అస్థానములైన 1 మూల నిధులు, 2 మహాలోకం, 3. మహానందం, 4. మహావీరత్వం, 5.మహాయోగ్యములను సిద్ధింపజేయు ఈ మాలామంత్రాన్ని సిద్ధింపజేసుకుంటే మహాద్భుతములు జరుగుతాయి. అద్భుతమగు ఈ పార్వతీ మంత్రము అన్ని మంత్రములలోనూ ఉత్తమమైనది.

50. సర్వులను మోహింపజేసి, సర్వాన్ని వశపరచుకొను నాయకీ స్వాహా. (నీకు హవిస్సులు సమర్పిస్తున్నాను).

51. సర్వశుభములను చేకూర్చు శుద్ధతత్వముగల వారిలో ముఖ్యురాలా, ఆనంద లోకంలో నివసించుమాతా, ఆశ్చర్యంగా నాకు అమృతతత్వాన్ని ప్రసాదించుదేవీ.

52. సర్వవిద్యలు వశపర్చి, విషాన్నిహరించి, నాకుగల ద్వేషభావాలను నాశనం చేయుము, ఆరోగ్యాన్ని ఎక్కువ ఆయుష్షును, ఆనందాన్నీ, ఆత్మనిర్మలమును ప్రసాదించుము.

53. దుర్గాదేవీ నిన్ను నీ సపరివార సహితంగా నమస్కరిస్తూ అర్థిస్తూ యున్నాను, "అ- స-క- హ- ల హ్రీం" ఈ మాలా మంత్రాన్ని అర్చించువారికి మహా యోగ్యాన్ని పదవులు అధికారాన్ని ప్రసాదించేదేవి.

54. యంత్రమందు నెలకొనియున్న మాతా సాక్షాత్‌పరాన్ని జన్మరాహిత్యాన్ని ప్రసాదించుదేవీ, "యజ్ఞము" అర్చన, పూజలతోనిన్ను అర్చించుటయే మాజన్మ పావన మగుటకు ఉత్తమమార్గము.

55. శుభములునిచ్చి, వస్త్రభూషణాది ప్రయుక్తమగు కాంతినొసంగి, పరిశుద్ధమయిన హృదయాంతరములలో నివశించుచూ, భక్తుల అభీష్టములు తీర్చుదేవీ, రక్షరక్షనమోస్తుతే.
**సూచన :** సర్వవిద్యలువశమయి, సర్వవిషములను, సర్వద్వేషములను హరించి, సర్వులను సమ్మోహపరచి, సాధకునకు ఆరోగ్యాన్ని ఆనందాన్ని ఆయుష్యమునిచ్చి, మహా యోగాన్ని, మహాఅధికారాన్ని గొప్ప పదవులను జగన్మాత ప్రసాదించునది (43 నుండి 55 వరకు గల ఈ మాలామంత్రము సిద్ధిపొందినవారికి మాత్రమే.)

56. **పంజరం :-** క్రూరమగు ఉచ్చాటనా ప్రయోగములను (పాపములచే చిక్కుబడిన ఆత్మలను) ఈ పంజరాన్ని పఠించి నశింపజేయవచ్చును, మారక్షణకై శస్త్రఅస్త్రములు ప్రయోగించి శత్రువులను నాశనం చేసినట్లుగా, సర్వ ప్రయోగాలను నాశనం చేయు ఛండమూర్తీ నమోనమః.

57. పార్వతీమాతా పద్మములవంటి నీ కన్నులతో పాపాలను, అగ్నిదేవుడు అరణ్య ములను దహించినట్లుగా తగులబెట్టుము, కుటిలమగు హృదయములను ముక్కలు చేయు భయంకర రూపిణీనమోనమః.

58. మాయనుహరించు మహామాయీ, ఈ పంజరంపఠనము చాలా ఉత్తమమైనది. శివుని సన్నిధికి చేర్చునది, శత్రువులను నశింపచేయునది.

59. "హ్రీం" కారశక్తి రూపిణీ "క్లీం" కారము ఉచ్చరించుటచే మోహము చెందుచూ 64 విద్యలను ప్రసాదించు శాంకరీ సకలశుభములు ప్రసాదించుచూ.





60. ఎల్లప్పుడూ భక్తులను పాలించుతూ, రక్షించుచూ, శత్రువులను నశింప జేయుచూ, ఆరోగ్యము ప్రసాదించుదానవుమాతా.

61. ఉగ్రరూపివై భయంకరనాదములు చేయుచూ, విషరోగములు నివారించే ఈ పంజర పఠనం నిత్య పారాయణం శుభములు చేకూర్చును. ఈ పంజరపఠనముచే, విషరోగములు హరించి ఆరోగ్యాన్ని ప్రసాదించును. సకల భూతములను స్థంభింపజేసి, సర్వశత్రుత్వములు హరించును (56 నుండి 61 వరకూ గల పంజరము సిద్ధిపొందిన వారికి మాత్రమే.)

62. **సంజీవనః :** కళ్ళు, ముక్కు, మనసుకు ఆధారమగు గ్రంధుల కలయిక, ప్రాణమున్న ప్రదేశము, జీవించుటకు సర్వప్రాణములు వృద్ధి చెంది,

63. తేజస్సుగల శరీర రూపమును కీర్తి ప్రతిష్ఠలు నొసంగుమంత్రానికి అధిదేవతా నమస్కారము. విద్యా సంజీవనములు ఎల్లప్పుడూయిస్తూ అనేక విధములగు శుభముల కొరకు నేను చేయు

64. పూజా ప్రయత్నంలో నీ సాక్షాత్కారముతప్పక కలుగును ఈ పదములను ఎల్లప్పుడూ తలచుటచే సంజీవనమంత్రము సిద్ధించును.

65. మనసు నందలి న్యాయమగు మా సర్వ కోర్కెలు తప్పక ఫలించును. పరిశుద్ధ మగు మనస్సుతో ఆనందం, ఆరోగ్యం ఎక్కువ ఆయుర్ధాయము కలిగి మనసున గల కోర్కెలు తప్పక ఫలించును.

66. ఐం.హ్రీం.శ్రీం. శ్రీం, హ్రీం, ఐం బీజములను సదా ఉచ్చరించుటచే, తేజస్సు గల రూపము దివ్యమగు శరీరము, నిర్మలము, నిజసుందరము, ఆరోగ్యం, నిర్మలత్వం, అమృతం, ఆనందం, ఆత్మనిశ్చలత్వం లభించును.

67. భక్తులను ఆపదల నుండి రక్షించి కాపాడుదేవీ శరణు శరణు, పరాత్పరీ, విశ్వేశ్వరీ, విశ్వమంతానిండినదానా, వీరులను గన్న తల్లీనమోస్తుతే. (ఈ సంజీవన మంత్రోపాసనచే తేజస్సు గల రూపమును కీర్తిని, ఆరోగ్యాన్ని, అమిత ఆయుష్షునిచ్చి మనసున గల కోర్కెలు తీర్చుచూ మనస్సు నిర్మలంగాఉంచి, ఆనందాన్నిస్తుంది. (62 నుండి 67 వరకూ గల ఈ సంజీవ మంత్రాన్ని సిద్ధిపొందిన వారికి మాత్రమే)

68. **చైతన్యం :-** వసుదేవపురమున (సుమంగళీపురమున) మంచికులమునందు పుట్టి ఆకులమును ఉద్ధరించి పావనమొనర్చి శివ ఉపాసన కలయికగల రాజ్యలక్ష్మీ వశమగుటకు

69. అవర్గుసముదాయంతో విశుద్ధచక్రాన్ని ఎక్కుతూ హృదయాంతర మందున్న పాలకొండ నివాసినీం శక్తిరూపిణీం గకారముతో గల గురుమూర్తీ సకలసుగుణ సంపన్నా,

అజ్ఞానాంధకారముల నుండి జ్ఞానజ్యోతిని దర్శించు భ్రుకుటి స్థానమందున్న గురుని ప్రియురాలా.

70. త్రిగుణములను తెగనరికి, కదళీవనమందు నివశించుచూ, పాలు, పెరుగు, అమృతములు సేవించుచూ, ఫలములు తినుచూ, నివేదనము చేసిన పాత్రయందలి పదార్థములు భక్షించుచూ.

71. తపముచేయు ఆసనంపై నుండి మహాతేజస్సుతో, దేహమందలి చాలా చక్రములలో నివశించుచూ, శరీరానికి గల కదలికలు సులువుగా గ్రహించుచూ, దేవతలచే యోగసాధకులచే పూజింపబడుచూ.

72. కుడి ఎడమ కన్నుల ఏక దృష్టితో భ్రూమధ్యనసాక్షాత్కరించుచూ, భయాన్ని నశింపజేసి మనసుకు ధైర్యాన్నిచ్చి.

73. ఎల్ల సమయములందు చైతన్యవంతులను జేసి, యమభయాన్ని హరించి, శరీరానికి రక్తప్రసరణ చేసి లాలాజలాన్ని వృద్ధి పరుస్తూ. దేహికి (సాధుకునికి)

74. సకల విద్యలు ప్రసాదించి, గొప్ప విద్యావంతునిజేసి విజయములను చేకూర్చుచూ బ్రహ్మజ్ఞానం గలవారి యందు ప్రేమానురాగములతో నున్నట్టి పార్వతీదేవి, సకల రూపములతో ధం, ధం అను ధంకా శబ్దములతో ఆనందించు దానవని ప్రసిద్ధికెక్కిన దానవు నీవు మాతా

75. మానవుల శరీరాలకు శ్లేష్మ, వాత, పిత్తం మొదలగు తత్వములు కల్గించుచూ, శరీరములకు ఆయాతత్వాలను సమకూర్చుతూ, ధర్మప్రవర్తనులందు యిష్టపడు ఈశ్వరీ.

76. ధనరూపిణీ, ధనధాన్యములను వృద్ధి చేయుచైతన్య స్వరూపీ, నన్ను క్షమించి రక్షించు, సంపూర్ణ చైతన్యమూర్తీ.

77. దశవిధములనాదరూపీ, కంటితోచేయుయోగములో కన్పించుదానా! నాకు యోగఫలాన్ని ప్రసాదించు బ్రహ్మవేత్తానమోనమః.

78. విశ్వమంతా నిండినవిశ్వరూపీ, పరిశుద్ధ స్వరూపిణీ నాలోని, ఈ విశ్వాన్ని నాకు దర్శింపజేయుము రక్ష రక్ష మళ్ళీ మళ్ళీ రక్ష భక్తులను ఆర్తులను రక్షించుమాతా.

79. ఈ చైతన్యమంత్రాలను నిత్యం పారాయణం చేయు మమ్ములను, అనేక జన్మలందు మేము చేసిన పాపాలను పరిమార్చు విశ్వేశ్వరుని ప్రియురాలా.

80. పార్వతీమాతా మోక్షాన్నిచ్చి పుణ్యాన్ని ప్రసాదించి, భక్తి సాధనా పద్ధతులనిచ్చి, చైతన్యంతో మమ్ములను పాలించు జగన్మాతా, వీరులను గన్నతల్లీ నమోస్తుతే. (68 నుండి 80 వరకూ గల ఈ చైతన్య సాధనచే మానవులకు అనేక జన్మలనుండి





సంక్రమించిన పాపములు హరించి, పుణ్యాన్ని, మోక్షాన్నిచ్చి జీవించినంత వరకూ భుక్తి, ఆ పిదపముక్తి నొసంగునది. యమభయము సర్వమానవ భయములు హరించునది.)

81. **పాదం :-** రక్తవర్ణముగల రక్తపారాయణముతో నున్నట్టి నీ పాదములకు, ఎర్రని అక్షతలు, ఎర్రని పూలు, ఎర్రని గంధములతో అర్చించు తాము. మాతా.

82. బంగారం, మణులతో కూర్చిన మేలిముసుగులోనున్న నీకు, మహాజనులు ప్రదక్షణలు చేస్తూ సాష్టాంగదండప్రమాణములతో రాజులు, అగ్రగణ్యులు, సామాన్యులు, సర్వులూ స్తుతిస్తుంటారు అమ్మా.

83. చతురంగబలములు, బంధుమిత్రసపరివార సమేతముగా జయజయ ధ్వానములతో ఈ పాదమంత్రములు పారాయణచేసినవారికి, నీవు సకలముల నిత్తువు. జగన్మాతా.

84. పరలోకాధిపతి సతియగుపరబ్రహ్మమైన నీవు మాసర్వపాపములు హరించి, పరలోకమోక్షాన్ని ప్రసాదించుము ఓ దేవీరక్ష రక్ష నమోనమః.

85. అనేక విద్యలను ప్రసాదించు పార్వతీదేవీ, పతితులను పావనం జేసి సర్వవిషములను నాశనంజేసి, సర్వశత్రువుల భయాన్ని మాకు పోగొట్టి

86. క్రూరప్రయోగములగు, చేతబడులు, స్తంభనలు, ఉచ్చాటనలు ధ్వంసంచేసి, (కృత్రిమ రూపాలు), తన రూపంగాకుండా వేరే రూపంతో నున్న వారి రూపుమాపి, నిజరూపంతో నిలిపి విషప్రయోగాలనుహరించు విశ్వేశ్వరుని యిల్లాలివి.

87. భర్తను కౌగలించుకుని పరమేశ్వరుని దేహంలో సగభాగమైనట్టి పద్మముల వంటి చేతులుగల పతివ్రతా, యితరుల యొక్క యంత్రమంత్రతంత్రములను, వారి దుర్మార్గములను నాశనం చేయుము.

88. మమ్మల్ని రక్షించి కీర్తిని ప్రసాదించుము, మాకు మనోజయాన్ని ప్రసాదించి సకల సౌఖ్యములు, ఆరోగ్యాన్ని ప్రసాదించు పార్వతీ.

89. నీ పాదపద్మములను నిత్యం అర్చించు భక్తులకు విజయాన్నిచ్చి, రక్షించుటకు సర్వప్రపంచాన్ని సమ్మోహపరిచి సాధురక్షణచేయుట యివన్నీ చేస్తావు.

90. ఓం నమో విశ్వేశ్వరీ దేవి నీ పాదపద్మములను సదా పూజిస్తాను నాకు బ్రహ్మపదాన్నిచ్చి పరమాత్మలో చేర్చుమాతా రక్షరక్షనమోనమః

(81 నుండి 90 వరకూ గల ఈ పాదపూజామంత్రాలతో పూజించిన సర్వ విషయములు హరించి సర్వశత్రువులనుండి, సాధకునకు భయం లేకుండా జేసి, సకల

ప్రయోగములను హరించి, కృత్రిమరూపులను నశింపజేసి సాధకునికి మనసును స్వాధీనపరిచి సకల సౌఖ్యములను ఆరోగ్యమును ప్రసాదించును.)

91. **శిరః :** సమస్తమంత్రములతో యోగసాధనలు చేసి, పాపముల నుండి విముక్తియగుటయే లక్ష్యసాధనగా, పంచభూతముల యొక్క సువాసనలను పీల్చు ముక్కు మొదటి భాగమును, ఆ పంచభూతముల శ్రావ్యమగు నాదములను విను చెవులు, మంచి మనస్సుగలట్టి

92. శిరస్సు మంత్రములతో పార్వతీదేవిని స్తుతించు యోగులు, సంయములు, మానవులకు గల జన్మజన్మల నుండి సంక్రమించిన అనేక పాపములను హరించి, పావనమగు మహత్తుగల మంత్రాలను.

93. ఎల్లప్పుడు భక్తితో కీర్తించుటచే, జన్మాంతరమున బ్రహ్మలోకమును పొంది, పరబ్రహ్మలో జేరి మనసును ఆనందపరచునాదములతో ఆనందించు చుందురు.

94. ఓంకార బీజముతో కూడిన చాలా మంత్రముల పూజా ఫలితముయిది. అనంత మగుపుణ్యాన్ని లెక్కలేనన్ని అద్భుతములతో ఆత్మదర్శనం కలుగును.

95. విశ్వేశ్వరుని అర్థాంగీ, విశ్వమంతా నిండి వినోదించుచూ ఎలాంటి ప్రేమ పగలు లేని దానవు ఎలాంటి భ్రాంతులు లేని స్వచ్ఛమగు దానివి, విశ్వసృష్టికి ఆధారమైనదానవుజగజ్జననీ.

96. అన్నిటియందు యిష్టముతో అన్నిటానుండి భక్తాగ్రేశ్వరులను చక్కగా సంరక్షించుచూ యిహలోకంలో భక్తుల కోర్కెలు తీర్చుచూ, పరలోకాన్ని ప్రసాదించు భద్రరూపిణీ నమోనమః. (91 నుండి 96 వరకూగల ఈ శిరఃపూజచే మానవులకు జన్మజన్మలనుండి సంక్రమించిన పాపములుహరించి, అంత్యమున బ్రహ్మలోకాన్ని ప్రసాదిస్తుంది. యోగసాధనలో దివ్యనాదాన్ని వినిపించి ఆత్మసాక్షాత్కారాన్ని ప్రసాదించునది.)

97. **అంతర్మాతృకా :-** మాతా అంతరాత్మయందున్న నిన్ను సేవించితే, లెక్కలేనన్ని అద్భుత ఫలములనిచ్చి ఆయుష్షును పెంచి, కీర్తినిచ్చి, బుద్ధిని నిలకడగా ఉంచగల దానవు.

98. సరస్వతీరూపుతో సకలచరాచర ప్రపంచములను నీవే సృజించి, సమస్తమూ నశింపజేయుదానవు, బాలగా, మహమ్మాయిగా ఆయా సందర్భాలలో నున్నట్టి పార్వతీ అనేకమైన కార్యక్రమములుచేయు దానవు.

99. అష్టైశ్వర్య భోగభాగ్యములననుభవిస్తూ, అనురాగము వైరాగ్యములతో నున్న సుందరీ. సర్వ సంపూర్ణ అవయవములుగలిగి చక్కనిరూపుతో మాకు సాక్షాత్క రించుచూ, పరలోకాన్ని ప్రసాదించుదానవునీవే .





100. ముత్తైదువులు అర్చించుమాతా, వారికి శుభాలనిచ్చుచూ,సదా సుఖములందు యిష్టురాలవు. మంచి జ్ఞానముగలదేవతా బృందము మధ్య నుండి, దేవలోకములో నివసించుదానవు.

101. అందరిలో అగ్రస్థానమందుండి సకల ఆనందములు పొందుచున్న శాంత స్వరూపిణీ, నమోనమః, బ్రహ్మస్థానమందుండి ప్రజలకు తల్లివై ప్రతిభను పెంచుకున్న తేజోమూర్తి నమఃస్సుమాంజలులు.

102. మానవుల సర్వపాపములు పోగొట్టివారి శత్రుసంతతిని నాశనం చేయు దానవు నా అంతరాత్మలో ఎల్లప్పుడూ ఉండి, నా అజ్ఞానాన్ని నీ మహత్తుతో నాశనం చేసి.

103. విజ్ఞానాన్నిచ్చి విజయాన్నిచేకూర్చు విశ్వేశ్వరునికి ప్రియమగు భవానీ, వీరులనుకన్నతల్లీ, విమాన విహారీ, కొండగుహలలో నివశించుమాతా.

104. పార్వతీదేవీ పద్మముల వంటి కన్నులు గలిగి బ్రహ్మలోకములో నివసించుతూ, మాకు శాశ్వతమగు సకలైశ్వర్యములు ప్రసాదించి ధర్మము, అర్థము, కామము, మోక్షమను నాలుగు ఫలితములిచ్చు దానవుమాతా.

105. ప్రచండమగు తేజస్సుతో నున్న ఉగ్రస్వరూపిణీ, మేరు పర్వతముపై నివశించు దానవు, అనేకవిద్యలను ప్రసాదించుచూ సకల పాపములు నశింప జేయు పరిశుద్ధమగు దానవుమాతా.

106. అవర్గు అవరోహణతో విశుద్ధి చక్రాన్నిదిగుతూ.

107. లక్ష్మీసరస్వతులతో కూడిన మూల శక్తిరూపిణీ, సకల భోగభాగ్యములు నాకు ప్రసాదించు, అంతరాత్మలో స్థిరంగా మనసు నిలిపి, ఆత్మారాధన చేయు నరుల యందు అనురాగము కలదానవుమాతా.

108. దేవతాగణములకు సకల భోగభాగ్యములనిచ్చి, సంతృప్తి పరచిన దేవీ, శంకరుని అర్థాంగీ అందమగుకన్నులు గల సుందరీ, దైవరూపీ, మానవులకు సుఖాన్ని ప్రసాదించు దానవగు.

109. లక్ష్మీసరస్వతీ, పార్వతీ, మాతలరూపమగు"శక్తిని" నాలోకి ఆవాహన చేస్తున్నాను.

110. పార్వతీకలువరేకుల వంటి కనులుగలదానా, ఆత్మారాధనతో తృప్తిపొందు మాతా, రక్ష రక్షయని ఎల్లప్పుడూ తలుస్తాను, పరాశక్తీ నమఃస్సుమాంజలులు దేవీ. (97 నుండి 110 వరకు గల ఈ అంతర్మాతృకాధ్యానం, బుద్ధిని స్థిరంగా ఉంచి, కీర్తిని, ఆయుష్షును పెంచి విజ్ఞానం విజయములు చేకూర్చును.)

111. **బహిర్మాతృక :** వినుమోదేవీ బహిర్మాతృక పరిశుద్ధమగు మనస్సుతో ప్రవర్తించు వారికి అణిమాది అష్టసిద్ధులు ప్రసాదించి, ఆయుష్షును పెంచి మంచినడకతో మంచి బుద్ధినిచ్చి.

112. అమితమగు ఆనందమునొసంగుచూ అచల సాధన తీవ్రంగా చేయువారి యందు యిష్టురాలవు ఆత్మరూపిణీ, ఆత్మప్రేరకురాలా సదా ఆత్మానందముతో నుందు దానవు జననీ.

113. అవర్గస్తానమగు విశుద్ధచక్రమందు సంచరించుచూ (అ నుండి అః వరకూ గల)

114. సంజీవనమందు సదాసంచరించుచూ, అన్నిజీవులయందుండి సర్వజీవుల సృష్టికారకురాలవు హ్రీంకారరూపణీ అనేకరూపులతో విద్యను, అవిద్యనూ పెంచుదానవు.

115. పద్మముల వంటి కన్నులు, పద్మములవంటి సుకుమారపాదములతో, పద్మనాభుని హృదయమున పద్మమువలే వికసించిన ముఖముతో, రెండు చేతులలో పద్మములతో, పద్మాసనంతో కూర్చున్న పతివ్రతా.

116. కవర్గస్థానమగు అనాహతమందు చేతికంకణముల ధ్వనితో, మదించిన ఏనుగువలే నడుచుతూ, ఏనుగులయందు యిష్టురాలివై, ఏనుగులచే అభిషేకించబడుచూ, శంఖంవంటి కంఠము, పెద్ద స్తనములతో నుండి

117. చవర్గస్థానమగు అనాహతమందు చంద్రబింబము వంటి ముఖము, చంద్రునివలే 16 కళలతో, పూర్ణచంద్రుని ఆకారముతో వెలుగొందుచూ, చంద్రునివలే శోభించుదానా.చంద్రకాంతిని ఎల్లప్పుడూ పానము చేయుమాతా.

118. టవర్గస్థానమగు అనాహతము, డవర్గ స్థానమగు మాయాకమలమందుండి, వింటినారిని లాగి వదులునప్పటి శబ్దమైన కంఠం ధ్వనిచేస్తూ, విరోధివర్గ కులమును నశింపజేయుచూ, భక్తులకు లక్ష్మీకరమగు సకల శుభములు చేకూర్చుతూ, సిద్ధయోగులు, దేవతలందు యిష్టముగలమాతా.

119. అనేక మంత్రములందు యిమిడియున్న లక్ష్మీ సరస్వతులతో, కలిసియున్న పార్వతీ, పతితులను పావనమొనర్చుచూ, భక్తుల ఆర్తనాదములు వినిరక్షించుటకు సిద్ధంగా ఉన్నదేవీ, క్లీం కారముతో భక్తులకులమును వృద్ధి చేయుదానివి.

120. ఓంకారస్వరూపిణీయగు ఓ దేవీ, పరలోకదేవతానమస్సుమాంజలులు, విశ్వేశ్వరుని అర్ధశరీరాన్ని పొందిన పరిశుద్ధమగు వీరపతివ్రతా. (111 నుండి 120 వరకూ గల ఈ బహిర్మాతృకాసాధనచే పరిశుద్ధతత్వాన్నిచ్చి. అణి మాదులను వశంచేసి,





ఆయుర్వృద్ధిని మంచి బుద్ధిని ప్రసాదించుచూ, భక్తులను ఆపదలనుండి రక్షించి వారి కులాన్ని వృద్ధి చేయును.)

**పరవిద్యాభక్షిణి :-**

121. ఓం పరుల విద్యను ఆకర్షించుదేవీ. వారి విద్యను శీఘ్రంగా భక్షించి నన్ను కాపాడుము. ఆరోహణక్రమంలో అవర్గునందున్న మాతా, పరుల విద్యను భక్షించి నాలో ప్రవేశించి సర్వవిద్యలను నాకు ప్రసాదించుటకు త్వరగా నాలోప్రవేశించి సర్వవిద్యలను నాకు ప్రసాదించుటకు త్వరగానాలో ప్రవేశించుము. అవరోహణ క్రమంలో అవర్గుయందున్న ఓ విశ్వేశ్వరీ సర్వవిద్యలునాకు ప్రసాదించుము, భక్తికి వశమగువారిలో ప్రధమురాలా, శుభకరమగు మహదైశ్వర్యమును సర్వవిద్యలను కీర్తిని తేజస్సును నాకు ప్రసాదించుము, దేహి, దేహి, కళలను గ్రహించుకళా రూపిణీ, సంపూర్ణకళారూపమును, పరులను గెలుపొందుశక్తినీయిమ్మియిమ్ము, వాక్ ప్రవాహంతోనుండు దేవీ, వాక్కును ప్రేమించుదానా, యితరుల వాక్ పటుత్వమును నిలిపివేసి వారినోట మాటరాకుండా త్వరగా చేయుము, త్వరగా వారి వాక్కును ఆపివేయుము, క్లీంకారరూపిణీ నాపై నీ కటాక్షవీక్షణలను ప్రసరింపజేసి నన్ను రక్షించి కాపాడుము మాతా.
(ఈ పరవిద్యా భక్షిణి ఉపాసన సిద్ధించిన వారికి, పరుల విద్యలను నిర్వీర్యము చేసి, వారివాక్కును గాంభీర్యతను స్థంభింపజేసి సాధకునికి విజృంభణాశక్తినిచ్చి, విజయము చేకూర్చును.)

122. **అమృతం :-** ఓం అమృతవల్లీ, అమృతరూపముతో అమృతధారలవంటి విశేషమగు వాక్కు గలిగి, అమృతముతో నిండిన విజ్ఞానంగల్గి అమృతంలో నుండి, అమృతాన్ని వర్షింపజేసి అమృతహస్తములతో, అమృతాన్ని పట్టుకుని నాకు అమృతఫలితాన్నియివ్వు, దేహి దేహి, అమృతవిద్యలో నివశించుదానా, నాకు అమృతాన్ని యివ్వు, యిమ్ము. అమృతాన్ని త్రాగించు, నాకు అమృతాన్ని వరదలా ప్రవహింప జేయుము, అమృతనడక, అమృతస్తనాలు, అమృత యోనులతో, అమృతంలో పుట్టిన నీవు, నాకు అమృతాన్ని ప్రసాదించు. అమృతమును సాధించినమాతా, ఆవేశంతోనేను కోరుతున్న అమృతాన్ని నాకు ప్రసాదించు. నాకుమృతిలేని అమృతరూపాన్ని ప్రసాదించు, అమృతంలో నివశించుమాతా, నాకు అమృతవిద్యను విశేషముగా ప్రసాదించు, అమృత లోకాన్ని నాకు వశపరచుము, అర్థిస్తున్నాను నిన్ను అర్థిస్తున్నాను, మంత్ర బీజములందున్న మహామంత్రస్వరూపిణీ,దేహిదేహి (ఈ అమృతసిద్ధిపొందితే, అమృతరూపము, అమృతవాక్కు, అమృతవిద్యను, అమృతలోకాన్ని అమృతాన్ని ప్రసాదిస్తుంది. అమృతదేవి)

విలాసః :-

123. పార్వతీ పరలోకాధిపతివగు మహాదేవీ, సృష్టికార్యమనే ఆటయందు విజయంతో తృప్తి పొందినమాతా, ఈ చరాచరసృష్టికిమూలమగుమాతా, సృష్టి అంతా నిండిన మాతా, విశ్వమంతయూ నీవేయైన నీకు నమఃస్సుమాంజలులు.

124. మేము ఈ విలాసాన్ని నిత్యం అర్చించితే మా అనుష్టానమునకు ప్రీతిగలదానివై, మాకు ఆనందాన్ని, ఆరోగ్యాన్ని, ఆయుష్యాన్ని అభివృద్ధిని ప్రసాదించి అపమృత్యువును పోగొట్టుమాతా, అమితానందముతో నున్న మాతా, మాకు ఆనందాన్నిప్రసాదించు, అమితమగు ఆనందంతో రతికార్యమందుండు మాతా, ఓంకారమంత్రమందున్న మాతా, నీదర్శన భాగ్యాన్ని మాకు ప్రసాదించుమాతా, మా సర్వాన్ని నీకు అర్పించుతున్నాము.

125. **దర్శన:-** "ఓం" బీజాన్ని మూడుసార్లు "హ్రీం" బీజాన్ని మూడుసార్లు "శ్రీం" బీజాన్ని మూడు సార్లు "క్లీం" బీజాన్ని మూడుసార్లు "సౌః" బీజాన్ని మూడుసార్లు "ఐం బీజాన్ని మూడుసార్లు" ఉచ్చరిస్తున్నాను. నాకు నీ దర్శనాన్ని ప్రసాదించు మాతా దేహీ, దేహి, నా శరీరంలోకిరా "రా" నాదగ్గరలో ఉన్నదానా, అనేకములుగా వెలుగొందుమాతా, సత్తు చిత్తూ ఆనందములతో ఉన్నమాతా, నారూపం నాకు చూపించుదేహీ దేహీ,( హవిస్సులర్పించుతూ వేడుకుంటున్నా నంటూ చేతులుచాచి అర్థిస్తూ ) నీ దర్శనభాగ్యంప్రసాదించు, నాకోరిక త్వరగా తీర్చు "ఐం" బీజాన్ని మూడుసార్లు "సౌః " బీజాన్ని మూడుసార్లు "క్లీం" బీజాన్ని మూడుసార్లు "శ్రీం" బీజాన్ని మూడుసార్లు "హ్రీం" బీజాన్ని మూడు సార్లు ఉచ్చరించినవారికి సర్వజనులకు తల్లివై ఓంకార బీజమందున్న మాతా, నీదర్శనాన్ని నాకు ప్రసాదించు. ఓం ఓం ఓం (ఈ దర్శనా మంత్రాన్ని ఉపాసిస్తే ఆరాధించుదేవతామూర్తుల దర్శనం కలుగుతుంది.)

126. **జాతశౌచ ః-** జన్మదోషములు నశింపజేయుమంగళ స్వరూపీ, మహాతేజస్సు కలమాతా, జీవికిగలపూర్వకర్మలచే యింద్రియమునరేతోపానము, చేయు క్రిమి రూపును, శరీర సంబంధ ఉష్ణపైత్య, శీతల, ధాతుదోషములను విష్ణు, బ్రహ్మ, రుద్రగ్రంథుల దోషములను జన్మ సంబంధమైలు దోషములను నివృత్తి చేసి.

127. జీవి అనేకములగు లెక్కలేనన్ని జన్మలలోసంపాదించిన జన్మసంబంధదోషముల నుండి విముక్తులనుజేసి జీవుల కోర్కెలు మన్నించి సత్ఫలితములను ప్రసాదించు, దేహి దేహి మాతా నమఃస్సుమాంజలులు.

128. పరమపవిత్రులనుచేయ గల పార్వతీ, పరమపావనీ, పవిత్రమగుమాతా, భక్తులకోర్కెలు మన్నించి సత్ఫలితములను ప్రసాదించు, దేహి దేహి మాతా నమః





సుమాంజలులు. (ఈజాతాశౌచమంత్రోపాసనతో జన్మసంబంధమగు అనేక దోషములు తొలగించుకొనవచ్చును.)

129. **మృతశౌచః-** చావువలన కలుగుమైలు నుండి విముక్తులను గావించు దేవీ, యవ్వన మందు ప్రవేశించు స్త్రీ యొక్క కన్నులవలే నీ కన్నులను అలంకరించు కున్న మాతా.

130. చావుమైలు, సంపర్కమైలు, అంటుమైలు, దుర్వార్తలు వినుటచేకల్గుమైలు, దుర్వాసనలు పీల్చుటచేకల్గు మొదలగు సమస్తమైనమృతమైలుల నుండి నాకు నివారణనిమ్ము. (మృతాశౌచ ఉపాసనచే చావు సంబంధమగు సకలదోషములు పరిహారమగును.)

131. **చతుర్థంత్యః-** ఉగ్రమగు కన్నులు, ఉగ్రమగు రూపుతో, శత్రువులను నశింప జేయు భయంకరరూపీ, భయంకరమగు కోరలతో మహాబలమగు శరీరముతో నుండి మహాభయాన్ని సాధకునకు నశింపజేయు మాతా.

132. సమస్త దుష్టులను నశింపజేసి, శతృవులను నాశనం చేయుటకు, శస్త్రఅస్త్రములు ధరించిన దేవి, శత్రువుల గర్వమునణచి శత్రువులను నాశనం చేయుదానివిమాతా.

133. రక్షించు పార్వతీదేవీ, విశ్వనాధుని వామభాగమందున్న మాతా నన్ను రక్షించి కాపాడు సర్వదారక్షించు, లోకాలను రక్షించుమాతా నమఃస్సుమాంజలులు. (ఈ మంత్రసాధనచే సాధకునకు గల శత్రువులను నశింపజేసి, సాధకుని భయాన్ని తొలగించి సమస్తక్రూరవర్గాలను నిర్మూలించుతుంది.)

134. శాంతి :- చేపలవంటి కనులు, చంద్రబింబమువంటి మోముతో, తియ్యని మాటలతో, వేదముల వాదములతో, తృప్తినొందుచు, సంపెంగపూవువంటి ముక్కును, గొప్ప ఏనుగు వంటి నడకతో, బంగారం ఛాయవంటి శరీర అవయవములతో, కెంపులు పొదిగిన బంగారు కిరీటము ధరించి, మణులతో చేయబడిన స్వర్ణాభరణములు ధరించి, మేఘము వంటి రంగుగల సుందరమగు తలకట్టుతో, సూర్యచంద్రులవంటి కన్నులతో పరిశుద్ధమైన హృదయంగల నీకు ఎల్లప్పుడూ నా నమస్కారములుమాతా.

(ఈ మంత్రోపాసనచే సాధకునకు, అతనిని ఆశ్రయించినవారికి, అతను ఆశీర్వదించినవారికి, దేశానికి శాంతి చేకూరును.)

**135 నుండి 140 వరకూ యంత్రోద్ధారమంత్రాలున్నాయి.**

141. సాధకుని దేహమనే దేవాలయమున, బ్రహ్మపీఠ మనుహృదయ పీఠమున, వాయువ్య ఉత్తరభాగమున, నీలకంఠుడగు నరసింహస్వామి ఆసీనుడై యుండగా, దక్షిణభాగమున ఆంజనేయస్వామి నిలిచి యున్న సమయమున, కుశల ప్రశ్నలతో పార్వతీ విశ్వేశ్వరుల చర్చలో విశ్వేశ్వరులుపార్వతీ దేవికి తెల్పిన, రహస్యముగనున్న వేదాంతవిద్యయు, నారితో కూడిన విశ్వేశ్వరుల అర్చన, సపర్యలతో కూడిన ఈ గ్రంథమందు, మహామంత్రమును, పదేపదే పఠించు క్రమము, విశ్వేశ్వరస్తవం, పార్వతీ హృదయం, కరన్యాసం హృదయన్యాసం, విశ్వేశ్వరధ్యానం, మూలమంత్రం, పంచపూజ కవచం, దశదిశల దిగ్బంధన, మాలామంత్రం, పంజరం, సంజీవనం చైతన్యం, పాదం, శిరం, అంతర్మాతృకా, బహిర్మాతృకా, పరవిద్యాభక్షిణి, అమృతం, విలాసం, దర్శనం, జాతాశౌచం, మృతాశౌచం, చతుర్థంత్యం, శాంతి, యంత్రోద్ధార శ్లోకములతో, 26 మహామంత్రములతో, బాగా పెరిగిన ఆకులు, పువ్వులు కాయలు గల్గి, ముళ్ళు గల తీగలతోఅల్లుకున్నటువంటిదీ, మంచి పక్వానికి వచ్చి అనేకరుచులు గలవియైనటువంటి, యిలాంటి పోలికలుగల రుద్రగ్రంథితో కూడిన కారణ దేహగమనమునకు ఉపయోగపడు, అనేక బీజాక్షరసంపుటితో గల పత్రములతో కూడిన సనారీ విశ్వేశ్వర సంవాదమునందు. **తృతీయశ్వాస పూర్వ భాగం సమాప్తః**







# తృతీయాశ్వాస ఉత్తరభాగారంభం

సంధ్యావందనము

స్వామివారు స్వహస్తములతో లిఖించి 1875సం॥లో చిలకలపూడి రాజలింగాచారి గార్కి రాజమండ్రిలో యిచ్చిన గోత్రాధ్యాయంలోనిది

(స్నానము చేసి శుభ్ర వస్త్రములు ధరించి గృహస్తుడు బ్రహ్మచారి సజల భస్మధారణ సన్యాసి పొడి భస్మము ధరించి ఆచమనపాత్ర దగ్గర పెట్టుకొని)

**భూశుద్ధిః** ఓం అపవిత్రః............సభాహ్యాభ్యంతరశుచిః

**1) గురుపాదుకాధ్యానం :**

శ్లో॥ **నమో గురుభ్యో గురుపాదుకాభ్యో నమః। పరేభ్యోపరపాదుకాభ్యః।**
**ఆచార్య సిద్ధేశ్వరపాదుకాభ్యో నమోస్తు। ప్రజాపతి పాదుకాభ్యః।**
**శ్రీ సనారీ విశ్వనాథా 'గురుపాదుకాభ్యానమోనమః॥**

**2) అథ ఆసనవిధి:** ఆసనాథో కూర్మ యన్త్రం విలిఖ్య। ఓం హ్రీం ఆధారశక్తి అనంత కమలాసనాయ నమః। పృధ్వీతిమన్త్రస్య మేరో పృష్ఠ ఋషిః। కూర్మో దేవతా – సుతలంఛన్దః । ఆసన వినియోగః।

శ్లో॥ **ఓం పృధ్వీ త్వయాధృతా లోకాదేవీత్వం విష్ణునాధృతా। త్వఞ్చధారయ**
**మాందేవి పవిత్రం కురుచాసనమ్॥** (ఆసనానికి నమస్కరించి కూర్చోవాలి)

**3) శిఖాబన్ధనం:** ఓం ఊర్ధ్వకేశి। విరూపాక్షే। మాంస శోణిత భక్షణే। తిష్ఠదేవి। శిఖాబంధే చాముండే। హ్యపరాజితే! ఇతిశిఖామాబధ్వా॥ (శిఖను ముడివేయాలి)

**4) అథబాహ్యభూత శుద్ధి:**

శ్లో॥ **ఓం అపసర్పంతుతేభూతా। యే భూతాభూమి సంస్థితాః।**
**యేభూతా విఘ్నకర్తార స్తేన్యంతు శివాజ్ఞయా॥**

ఓం అపక్రామన్తు భూతాద్యాః పిశాచాస్సర్వతోదిశం। సర్వేషా మవిరోధేన జపకర్మ సమారభే॥ (అథ భైరవాజ్ఞాం గృహీత్వా।)

**5) శ్లో॥ తీక్షదంష్ట్ర మహాకాయ। కల్పాన్త దహనోపమ। భైరవాయ నమస్తుభ్యం।**
**అనుజ్ఞాం దాతుమర్హసి॥** (యిది భైరవధ్యానం)

**6) శ్లో॥ అపవిత్ర: పవిత్రో2వా... సభాహ్యాభ్యంతరశ్శుచి:**

(నది, కాలువ ఏకాంతమగుస్తలమున పద్మాసనాసీనుడై కూర్చుండి)
(ఆచమ్యః 165వ పేజియందుయున్నట్లు చెప్పుకుని:)

(ఓం కేశవాయ స్వాహా దగ్గర నుండి ఓం శ్రీ కృష్ణాయ నమః వరకు)

**7) శ్లో॥ ఉత్తిష్ఠంతుభూతపిశాచా:..... ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥**

(నీటిని చేతితో తీసుకుని తనచుట్టూ చల్లుకోవాలి)

**(ప్రాణాయామం తెలిసిన వారి వద్ద అభ్యసించాలి)**

**8)** శ్లో॥ ఓం ప్రణవస్యపరబ్రహ్మ ఋషిః పరమాత్మాదేవతా దైవీం గాయత్రీ చందః ప్రాణాయామేవినియోగః (ప్రాణాయామంలో క్రింద శ్లోకాన్ని చెప్పగల్గినన్ని సార్లు చెప్పుకుని)

8) **శ్లో॥ ఓంభూః ఓంభువః ఓగ్ంసువః ఓంమహః ఓంజనః ఓంతపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వ "రేణ్యం। భర్గోదేవస్య ధీమహిధియోయోనః ప్రచోదయాత్" ఓం మాపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భు వస్సువరోమ్॥**

**యిలా 3 సార్లు చేస్తే 1 ప్రాణాయామం**

**9) సంకల్పం (165వ పేజీ) :** మమోపాత్తదురితక్షయ ద్వారా. ... ధర్మపత్ని సమేతస్య శ్రీమద్విరాట్ విశ్వకర్మ ప్రీత్యర్థం మమాయుష్యాభి వృద్ధ్యర్థం ప్రాత స్సంధ్యాము పాసిష్యే (కాలమార్పు చెప్పి అనామిక వ్రేలితో ఉదకాన్ని స్పృశించేది).

**10) మంత్రం:** ఓం ఆపోహిష్ఠామయోభువః...ఆపోజనయధాచనః॥

(కుడిబొటన వ్రేలితో ఉదకాన్ని శిరస్సుపై జల్లుకోవలయును)

**11) ప్రాతఃకాలమున చెప్పుకునే మంత్రము :**

ఓం సూర్యశ్చమామన్యుశ్చ"మన్యు పతయశ్చ మన్యుకృతేభ్యః। పాపే"భ్యో రక్షంతాం, యద్రాత్ర్యా పాపమకారిషం। మనసావాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా। రాత్రి స్తదవ లుంపతు యత్కించం దురితమయి। ఇదమహం మామమృత యోనౌ సూర్యేజ్యోతిషి జుహోమిస్వాహా"॥ (జలపానం చేసేది)

**12) మధ్యాహ్నకాలము చెప్పుకునే మంత్రం :**

ఆపఃపునంతు పృథివీం। పృథివీపూతా పునాతుమాంపునంతు బ్రహ్మణస్పతి బ్రహ్మపూతాపునాతుమాం॥ యదుచ్ఛిష్టమభో"జ్యం। యద్వా దుశ్చరితం మమ। సర్వం పునంతు మామాపో2నతాంచ ప్రతిగ్రహగ్గ్ స్వాహా"॥ (అని జలపానము చేసేది)

**13) సాయంకాలము చెప్పుకునే మంత్రం :**

ఓం అగ్నిశ్చ మామన్యుశ్చ।మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః। పాపేభ్యో రక్షంతాం।యదహ్నా పాపమకారషం।మనసావాచా హస్తాభ్యాం। పద్భ్యాముదరేణ శిశ్నా।





అహస్తదవలుంపతు।యత్కించ దురితంమయి। ఇదమహంమామమృత యోనౌ। సత్యేజ్యోతిషి జుహోమిస్వాహా॥ (అని జల పానము చేసేది)

**14) నీటికి నమస్కారం :** ఓం దధిక్రావణ్ణో అకారిషం। జిష్ణోరశ్వస్యవాజినః। సురభినోముఖాకరత్ప్రణ. ఆయూగ్ంషితారిషత్। (నమస్కరించేది)

**15) ఆపోహిష్ఠామయోభువః... ఆపోజనయధాచనః**

(ఈ మంత్రాలు చెప్పుతూ శిరస్సు మధ్య భాగమున పడునట్లు బొటన వ్రేలుతో నీళ్ళు చల్లుకోవాలి)

**16)** 1. ఓం హిరణ్యవర్ణాశ్శుచయః పావకాఃయాసుజాతః కశ్యపోయాస్వింద్రః। అగ్నింయాగర్భందధిరేవిరూపాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవంతు॥

2. ఓం యాసాగ్ంరాజావరుణోయాతి మధ్యే సత్యానృతే అవపశ్యం జనానాం। మధుశ్చ్యుతశ్శుచయోయాః పావకా। స్తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవంతు॥

3. ఓం యాసాం"దేవాదివికృణ్వంతి। భక్షంయాఉ అంతరిక్షేబహుధా భవంతి। యాఃపృథివీం పయోసోందంతి శుక్రస్తానా ఆపశ్శగ్గ్ స్యోనాభవంతు॥

4. ఓం శివేనమాచక్షుషాపశ్య తాఉ పశ్శివ యాతనువోపస్పృ శతత్వంచమే। మధుశ్చుత శుచయోయాః పావకాః స్థాన అపస్సగ్ స్యోనాభవంతు॥

(పై నాలుగు మంత్రాలకు తన శిరస్సుపై నీరు చల్లుకోవాలి)

**17) మంత్రం**

5. సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదోహువేవో మయివర్చో బలమోజోనిధత్త। ద్రుపదాదివ ముంచతు। ద్రుపదాదివేన్ముముచానః। శ్విన్నస్నాత్వే మలాదివా। పూతం పవిత్రేణేవా"జ్యం। ఆపశ్శు ధంతుమైనసః॥

(గోకర్ణాకారంగా హస్తం పట్టి నీరుపోసుకుని ముక్కు దగ్గర పెట్టి వాసన చూడక శ్వాస వదలి పాపకృత్యముల నుండి విముక్తి ప్రసాదించమని భగవంతుని తలంచి నీరు ఎడమ వైపున వదలవలయును)

**18) ఆచమ్య :** పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగ మర్ఘ్యత్రయప్రధానం కరిష్యే।

**19) ప్రాతఃకాల అర్ఘ్యప్రధాన మంత్రమ్:**

ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరే"ణ్యం భర్గో దేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయా"త్। (దోసిలినిండాఉదకముతో 3 సార్లు సూర్యునకు ఎదురుగా అర్ఘ్యం యిచ్చేది)

**20) మధ్యాహ్నకాల అర్ఘ్యప్రధాన మంత్రమ్:**

ఓం హగ్ం సశ్శుచిషద్వ సురంతరిక్ష సద్ధోతావేదిషదతి థిర్దురోణసత్ నృషద్వర సదృత సద్వ్యోమసదబ్జాగోజాఋతజా। అద్రిజాఋతం బృహత్॥

పైన చేసినట్లు అర్ఘ్యం యిచ్చుకోవాలి)

**21) ప్రాతఃకాల అర్ఘ్య ప్రధాన మంత్రమే సాయంకాలము చెప్పుకునేది:**

( 3కాలాలలో సమయం మించినప్పుడు దోషపరిహారార్థం చతుర్థ అర్ఘ్య ప్రధానం కరిష్యే అంటూ నాల్గవసారి ప్రాయశ్చిత్తమంత్రంతో అర్ఘ్యం యివ్వాలి)

**22) ప్రాయశ్చిత్త అర్ఘ్యము:** ఓం భూః। ఓం భువః, ఓగ్ం సువః, ఓంమహః। ఓంజనః । ఓం తపః। ఓగ్ం సత్యం। ఓం తత్సవితుర్వరే"ణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్। ఓ మాపోజ్యోతి రసో2మృతం బ్రహ్మభూర్భువస్సువరోం॥ (దోసిలితో నీటిని వదలాలి).

**23) అర్ఘ్యము :** ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ కుర్వన్‌[నా"హ్మణో విద్వాన్ త్సకలం భద్రమశ్నుతే। అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మప్యేతియ ఏవంవేద అసవాదిత్యో బ్రహ్మ (దోసిలితో ఉదకం ఉంచుకొని ప్రదక్షణ చేస్తూ నీటిని వదలాలి.)

**24) ఆచమ్య :** పూర్వోక్తఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభదినే శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థ్యం ప్రాతః సంధ్యాంగ దేవతా తర్పణం కరిష్యే॥

(అనామిక వ్రేలితో ఉదకం స్పృశించేది; కాలములు మార్చు చెప్పుకునేది)

**25) ఉదయకాలం చెప్పుకొనేది:**

సంధ్యాం తర్పయామి। గాయత్రీం తర్పయామి॥ బ్రహ్మీం తర్పయామి॥

**26) మధ్యాహ్నకాలము చెప్పుకునేది:**

సంధ్యాం తర్పయామి। సావిత్రీం తర్పయామి। రౌద్రీం తర్పయామి।

**27) సాయంకాలము చెప్పుకునేది:**

సంధ్యాం తర్పయామి। సరస్వతీం తర్పయామి। గాయత్రీం తర్పయామి॥

(యీ మూడు కాలముల యందు తర్పయామి అని అర్ఘ్యం యిచ్చేది)

**28) గాయత్రీ ఆవాహనం నమస్కరిస్తూ:**

(మంత్రం) ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా బ్రహ్మేతిపోర్షం గాయత్రం చ్ఛందం పరమాత్మం స్వరూపం। సాయుజ్యం వినియోగం॥ ఆయాతు వరదాదేవి





అక్షరం బ్రహ్మసమ్మితం। గాయత్రీం" ఛందసాంమాతేదం బ్రహ్మజు షస్వమే। యదహ్నా"" త్కురుతేపాపంతదహా"న్ప్రతి ముచ్యతే। యద్రాత్రా""్య త్కురుతేపాపం తద్రా త్రా"్యత్ప్రతి ముచ్యతే। సర్వవర్ణే మహాదేవి। సంధ్యావిద్యే సరస్వతి। ఓజో౽సి।సహో౽సి। బలమసి॥ బ్రాజో2సి। దేవానాం ధామనామాసి। విశ్వమసి విశ్వాయుః। సర్వమసి సర్వాయుః। అభిభూరోం। **గాయత్రీ మావాహయామి, సావిత్రీ మావాహయామి, సరస్వతి మావాహ యామి, బ్రహ్మర్షీ మావాహయామి, శ్రియమావాహయామి, బలమావాహ యామి** (వీటికి రెండు చేతులతో హృదయం వైపుకు ఆవాహన చేసుకోవాలి) గాయత్ర్యా గాయత్రీ ఛందోమను బ్రహ్మఋషి। మయర్దేవతా, అగ్నిర్ముఖం। త్వష్టశిరః। శిల్పి హృదయం। విశ్వజ్ఞ శిఖా। పృథివీయోనిః। ప్రాణాపాన వ్యానోదాన సమాన సప్రాణాశ్వేతవర్ణ సానగ గోత్ర గాయత్రీ చతుర్విగ్ం" శత్యక్ష రాత్రిపథా షట్కుక్షిం। పంచశీర్షోపనయనే వినియోగః॥

(పైన జెప్పిన అవయవములు జూపించి షట్కుక్షి అని కుడి హస్తము శిరస్సు చుట్టూ త్రిప్పి ఎడమహస్తములో వుంచేది)

**ఆచమ్య:** పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభదినే... శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగ యధాశక్తి గాయత్రీ మంత్రజపం కరిష్యే॥

(అంగుష్టాగ్రముతో ఉదకము స్పృశించేది, కాలములు మార్చు జెప్పుకునేది)

**29) గాయత్రీ మంత్రమ్**

**ఓం భూర్భువస్సువః తత్సవితుర్వ రే"ణ్యం భర్గో।**

**దేవస్యధీమహిధియోయోనః ప్రచోదయా"త్॥**

(పై మంత్రము యధాశక్తిగా 108సార్లు జపింపవలెను)

**30) శ్లో॥ యత్రభూమౌజపంకృత్వాతత్రస్సంరేణుకాంచనం। తద్భూమితిలకంధృత్వా అనంతఫలయశ్నుతే (అచటభూమిని నీటితో వేలుతో తాకి బొట్టుపెట్టుకోవాలి)**

పూర్వోక్త సంకల్ప ప్రకారేణ శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అంగన్యాస హృదయన్యాసం కరిష్యే॥

**31) అంగన్యాస** ఓంతత్సవితుః మనుబ్రహ్మాత్మనే అంగుష్టాభ్యాంనమః। వరే"ణ్యం మయ బ్రహ్మాత్మనే తర్జనీభ్యాం నమః। భర్గోదేవస్యత్వష్ట బ్రహ్మాత్మనే మధ్యమాభ్యాంనమః। ధీమహిశిల్పి బ్రహ్మాత్మనేఅనామి కాభ్యాంనమః।ధియోయోనః విశ్వజ్ఞ బ్రహ్మాత్మనే కనిష్టకాభ్యాంనమః। ప్రచోదయా"త్ సర్వాత్మనే కరతలకర పృష్టాభ్యాంనమః॥

(ఏ వేలు చెప్పినపుడు ఆ వేలును తాకాలి)

హృదయన్యాసః ఓం తత్స వితుః మనుబ్రహ్మాత్మనే శిరసేస్వాహా"। వరే"ణ్యం మయబ్రహ్మాత్మనే హృదయాయనమః। భర్గోదేవస్య త్వష్టబ్రహ్మాత్మనే కవచాయ హుం। ధీమహిశిల్పి బ్రహ్మాత్మనే శిఖాయేవషట్। ధియోయోనః విశ్వజ్ఞ బ్రహ్మాత్మనే నేత్ర త్రయాయ వౌషట్। ప్రచోదయాత్, సర్వాత్మనే అస్త్రాయఫట్। భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

(ఏ అంగము చెప్పినప్పుడు ఆ అంగము చూపించవలెను. దిగ్బంధః అనునప్పుడు రెండుహస్తముల చూపుడు వ్రేళ్ళు బంధనము జేసి విడువవలెను).

**32) గాయత్రీ ధ్యానమ్(నమస్కరిస్తూ)**

**శ్లో॥ ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీ క్షణైః।**
**యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్వార్ధవర్ణాత్మికామ్।**
**గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలంగదాం।**
**శంఖం చక్రమదారవింద యుగళం హస్తైర్వహంతింభజే॥**

**33) గాయత్రీ ముద్రలు**

సుముఖం సంపుటంచైవ, వితతం విస్తృతంతథా। ద్విముఖం త్రిముఖం చైవా చతుః పంచముఖం తథా। షణ్ముఖోఽధోముఖం చైవా వ్యాపకాఞ్జలికం తథా। శకటం యమపాంశచ గ్రంధితం సమ్ముఖోన్ముఖం ప్రళంబం ముష్టికంచైవ మత్స్య కూర్మ వరాహకం సింహాక్రాంతం మహాక్రాంతం ముద్గరం పల్లవంతథా। చతుర్వింశతి ముద్రా వైగాయత్ర్యాం సుప్రతిష్ఠితాః। (ఈ ముద్రలు ఆఖరి పేజీలో కలవు.)

ఇతిముద్రా నజానాతి గాయత్రీ నిష్ఫలాభవేత్॥ (ఇవి 24 ముద్రలు)

**34) శ్లో॥ యోదేవస్సవితాఽస్మాకం ధియోధర్మాదిగో చరః।**
**ప్రేరయేత్తస్య, యద్భర్గాస్త్వద్వరేణ్య, ముపాస్మహే॥** (నమస్కారవిధిగ పఠించవలెను)
**సురభిజ్ఞాన చక్రేచ। యోనిః కూర్మోధ పంకజం।**
**లింగ నిర్వాణ ముద్రాచే త్యష్టముద్రా ప్రకీర్తితాః॥**

(ఇవి 8 ముద్రలు ఈ ముద్రలు తెలిసిన వారి వద్ద అభ్యసించాలి)

ఓం తత్సవితుర్వ రేణ్యం--- ప్రచోదయాత్॥ తత్సద్రహ్మార్పణమస్తు. (నీటిని వదలాలి)

ఆచమ్య: పూర్వోక్త సంకల్ప ప్రకారేణ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగ సూర్యోపస్థానం కరిష్యే॥ (అనామికవేలు ఆచమపాత్రలోఉంచాలి)

**35) ప్రాతః స్యూర్యోపస్థాన మంత్రమ్**

ఓం మిత్రస్య చర్షణీధృత శ్రృవోదేవస్య సానసిం। సత్యంచిత్ర శ్రవ స్తమం। మిత్రోజనాన్యాతయతి। ప్రజానన్ న్మిత్రోదాధార పృథివీముతధ్యాం। మిత్రః





కృష్టీరనిమిషాభి చష్టే। సత్యాయహవ్యం ఘృతమద్విధేమ। ప్రసమిత్రమర్తో అస్తు ప్రయస్వాన్యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన। నహన్యతే నజీయతేత్వో తోనైన మగ్ంహో అశ్నోత్యంతి తతోన దూరాత్। (సూర్యునకు నమస్కారము చేసేది)

**36) (మాధ్యాహ్నిక సూర్యోపస్థాన మంత్రమ్।) ఓం ఆసత్యేనరజసావర్త మానో నివేశయన్నమృతం, మర్త్యంచ హిరణ్యయేన వితారథేన దేవోయాతి భువనానిపశ్యన్॥**

ఉద్వయం తమసస్పరిపశ్యంతో జ్యోతి రుత్తమం। దేవం దేవత్రాసూర్య మగన్మ జ్యోతి రుత్తమం। ఉదుత్యం జాతవేదసందేవంవహంతి కేతవః। దృశేవిశ్వాయ సూర్య"ం। చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షగ్ం సూర్య ఆత్మా జగతస్త స్థుషశ్చ, తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్చు క్రముచ్చరత్॥ పశ్యేమశరదశ్శతం। జీవేమశరదశ్శతం, నందామశరదశ్శతం, మోదామ శరదశ్శతం భవామశరదశ్శతం, శృణువామశరదశ్శతం, ప్రభ్రవామశరదశ్శతం, అజీతాశ్యామ శరదశ్శతం, జోక్చసూర్యందృశే, య ఉదగాన్మహతోఽహర్ణవా" ద్విభ్రాజమాన స్సరిరస్య మధ్యాత్సమా వృషభోలోహితాక్ష స్సూర్యోవిపశ్చి న్మనసాపునాతు॥ (సూర్యునికి నమస్కారము చేయవలెను)

**37) సాయంకాలం సూర్యోపస్థాన మంత్రమ్**

ఓం ఇమంమే వరుణశృధీహవ మద్యాచమృడయ।త్వామవస్యురాచకే। తత్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశా"స్తే యజమానో హవిర్భిః, అహేడమానో వరుణేహబో ధ్యురుశగ్ం సమానాయుః ప్రమోషీః, యచ్చిద్ధితే విశోయధాప్రదేవ వరుణ వ్రతం। మినిమసిద్య విద్యవి యత్కించేదం వరుణదైవ్యేజనేఽభి ద్రోహం, మనుష్యా" శ్చరామసి, అచిత్తీయ త్తవ ధర్మాయుయోపి మమాన స్తస్మాదేవసోదేవరీ రిషః కితవా సోయద్రిరిపుర్నదివి యద్వాఘా, సత్యముతయన్న విద్మ సర్వాతావిష్య శిధిరేవ దేవాఽ ధాతే స్యామ వరుణ ప్రియాసః। (సూర్యునకు నమస్కారము చేసేది)

**38) దిక్కులకు ప్రదక్షణ నమస్కారం పంచబ్రహ్మలకు**

ఓం నమః ప్రాచ్యైదిశే సానగ బ్రహ్మఋషి దేవతాః ఏతస్యాం ప్రతివ సంత్యేతాభ్యశ్చ నమోనమః॥ ఓం నమః దక్షిణాయైదిశే సనాతన బ్రహ్మఋషి దేవతాః ఏ ...నమః॥ ఓం నమః ప్రతీచ్యైదిశే అహభూన బ్రహ్మఋషి దేవతాః ఏ ... నమః॥ ఓం నమః ఉదీచ్యైదిశే ప్రత్నబ్రహ్మఋషి దేవతాః ఏ...నమః॥ ఓం నమః ఊర్ధ్వాయైదిశే సుపర్ణబ్రహ్మఋషి దేవతాః ఏ ..నమః॥ ఓం నమ ధరాయైదిశే సర్వేబ్రహ్మఋషిదేవతాః ఏతస్యాంప్రతివసం త్యేతాభ్యశ్చనమో నమః॥ (ప్రాగాదిగా దిక్కులకు నమస్కరించేది)

ఓం నమః పృథివ్యాకాశయోర్మధ్యే యేసంతితేమే ప్రసన్నాత్మానం చిరంజీవిత వర్ధయంతి.

ఓం నమః పృథివ్యాకాశయోః సానగాది బ్రహ్మఋషి దేవతాభ్యశ్చ నమోనమః॥

సంధ్యాయైనమః, సావిత్రీయైనమః గాయత్రీయైనమః, సరస్వత్యై నమః, సర్వేభ్యో నమః, దేవేభ్యోనమః, ఋషిభ్యోనమః, గురుభ్యోనమః, పితృభ్యోనమః మాతృభ్యోనమః

శ్లో॥ **పృధివ్యాపస్తేజో వాయురాకాశాత్, ఓం నమో**
**భగవతే వాసుదేవాయాగ్‌ం, సదాసర్వభూతాని,**
**చరణాస్తావరాణిచ, సాయంప్రాతశ్య**
**మశ్వంతిసామాసంధ్యా-భిరక్షతు॥**

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే। శివస్య హృదయం విష్ణోర్విష్ణోశ్చ హృదయగ్‌ం శివః। యధాశివమయో విష్ణుర్యేవం విష్ణు మయశ్శివః, యధాంతర్ నపశ్యామి తధామే స్వస్తిరాయుషి। నమో బ్రహ్మణ్య దేవాయ విశ్వబ్రాహ్మణ హితాయచ। జగద్ధితాయ దేవాయ గోవిందాయ నమోనమః॥ (నమస్కరిస్తూ చెప్పాలి)

**ఆకాశాత్పతితం తోయం యధాగచ్ఛతి సాగరం।**
**సర్వదేవ నమస్కారం కేశవం (విశ్వకర్మ) ప్రతిగచ్ఛతి॥**

**39) గాయత్రీ ప్రస్థానమ్ః**

ఉత్తమే" శిఖరేజాతే భూమ్యాం పర్వతమూర్ధని। బ్రాహ్మణే"భ్యో భ్యనుజ్ఞాతా గచ్ఛదేవీ యధాసుఖం। స్తుతోమయా వరదావేదమాత ప్రచోద యంతి। పవనేద్విజాతా। ఆయుఃపృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం। మహ్యందత్వా ప్రయాతుం బ్రహ్మలోకం. (గాయత్రీదేవికి నమస్కరిస్తూ తనకు బ్రహ్మవర్చస్సు యిచ్చి బ్రహ్మలోకం పంపమనికోరుట)

**40) విశ్వకర్మధ్యానం:** 1) నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే। సహస్రపాదాక్షి శిరోరు బాహవే। సహస్రనామ్నే పురుషాయశాశ్వితే। సహస్రకోటి యుగధారిణే నమః॥ 2) ఇదం ద్యావా పృథివీ సత్యమస్తు। పితర్మాతర్యదిహోపబ్రుషేవాం"। భూతందేవానా మవమే అవోభిః॥ విద్యామేషం వృజినం జీరనాదం॥ (భూమికి నమస్కరించాలి)

సర్వదేవేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలం। తత్ఫలం పురుష మాప్నోతి స్తుత్వాదేవం జగద్గురుం। వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్రయం। సర్వభూత నివాసోసి విశ్వకర్మనమోస్తుతే॥ (విరాట్ పురుషునకు నమస్కరించేది)

(పృధివ్యాపస్తేజో అనువాక్యము మొదలు చివరివరకు నిశ్చల మనస్సుతో నమస్కరించేది)





**41) ప్రవరః**చతుస్సాగర పర్యంతం విశ్వబ్రాహ్మణ శుభంభవతు పంచార్షేయ ప్రవరాన్విత యజు శ్శాఖాయాం ఆపస్తంభ సూత్ర పర్నబ్రహ్మ ఋషి గోత్ర సుగంధం సాయిబాబా చార్య స్వామీజీ అహంభో। అభివాదయే

(రెండుచేతులతో రెండు చెవులను గట్టిగా మూసి పట్టి వంగి నమస్కరించ వలయును) **యిలా** (మీమీ గోత్ర ప్రవరలు చెప్పుకొనవలెను).

శ్లో॥ **కాయేనవాచా। మనసేంద్రియైర్వా బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్ కరోమియద్యత్సకలం పరస్మై। శ్రీ విశ్వకర్మయేతి సమర్పయామి॥ ఏతత్ఫలం శ్రీ విశ్వకర్మ పరమేశ్వరార్పణమస్తు॥** (నీటిని వదలవలెను)

గాయత్రీ ముద్రలు ఆఖరున 309 వ పేజిలో ఉన్నాయి.

**<u>ఓం శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః</u>**

**సంధ్యావందనం సమాప్తిః**

1. సంధ్యావందనము చేసిన తర్వాత తృతీయాశ్వాసమందలి 1నుండి 12 మంత్రములగుస్తవశ్లోకములనుండి మూలమంత్రం వరకూచెప్పుకుని ద్వారపూజ చేయాలి.

2. వ, మంత్రాన్ని చెప్పి గణపతిని, దుర్గాదేవిని, సరస్వతీదేవిని, క్షేత్రపాలకుని, జనులందరిలో గొప్పవారందరినీస్మరించి, తానాచరించునది మంచి ముహూర్త మగు గాక యని చెప్పుకుని.

3. ద్వారానికి పంచపూజలు

యిలా:లం,పృధ్వీవ్యాత్మనే శ్రీ ద్వారదేవతాయైనమ: గంధం పరికల్పయామి.

హం ఆకాశాత్మనే శ్రీ ద్వారదేవతాయైనమః పుష్పం సమర్పయామి

యం - వాయువ్యాత్మనే --------------ధూపమాఘ్రాపయామి

రం - వహ్యాత్మనే శ్రీ ద్వారదేవతాయైనమః దీపం దర్శయామి

వం అమృతాత్మనే --------------- అమృతోపహారనైవేద్యం సమర్పయామి ( నివేదన పదార్థము పేరు చెప్పాలి)

సం సర్వాత్మనే ----------- సర్వోపచారతాంబూలం సమర్పయామి

4. గృహానికి పంచపూజలు చేయాలి. గం గేహాళ్యైనమః పైన చేసినట్లుగా యిలా;లంపృధివ్యాత్మనే గృహదేవతాయైనమః గంధం పరికల్పయామి.

5. సింహాసనధ్యానం : అష్టదిక్పాలకులు గరుత్మంతుడు ఉండగా నాలుగు ప్రక్కలా సింహములుగల వేదిక పై పార్వతీదేవితో కూడిన పరమేశ్వరుడు. మణులతో కూర్చబడిన బంగారు తాబేలు ఆసనంగల సిహాసనముపై కూర్చుని ఉండగా దేవతలు నరులతో పూజంప బడుచున్నారు యింకా ఆదిదంపతుల ఆసనాలు ఏమేమిటంటే,

6. దశావతారములలో ఒకటైన కూర్మము అనగా తాబేలు, సమస్తభూమండలము మోయు సర్పరాజగు అనంతుడు, సప్తసముద్రములలోని మంచినీటి సముద్రము, సముద్ర మధ్య నగలరత్నములతో నున్న ద్వీపము, రత్నములుగల వేదిక, రత్నములు పొదిగిన బంగారు సింహాసనము, రత్నములు పేర్చిన మండపము, ఎత్తైన ప్రదేశమునగల గొప్ప సింహాసనము, దానిపై ఛత్రము ( గొడుగు) యివన్నీ పార్వతీపరమేశ్వరుల ఆసనములు.

7. ఎడమతొడపై భార్యయగు పార్వతీదేవి కౌగలించుకొనియుండగా పరమేష్టి ఒకచేత అభయమునిచ్చుచూ వేరొకచేత త్రిశూలాన్నీ పట్టుకుని వీర పద్మాసనంలో కూర్చుని విజయ చిహ్నంతో, యోగములో ఆనందించుచూ పరిపూర్ణ జ్ఞానంతో అనేకయుగముల సాక్షీభూతడై, ఆత్మానందము కలవాడై, అమితమైన తేజస్సు గల పార్వతీసమేత విశ్వనాథా, మీ విగ్రహమును, యంత్రమును అభిషేకిస్తున్నాను.

8. గంగ, యమున, సరస్వతీ, కృష్ణాగోదావరి, నర్మధా, సింధు, కావేరి నదుల జలములను ఈ కలశములోనికి ఆవాహనచేసి ఆ నీటితో యంత్రమునకు విగ్రహానికి స్నానము చేయించుతూ

9. ఆపోయిష్ఠాదినవమంత్రములు పఠించాలి ( వీటి అర్థములు 31 లో ఉన్నాయి)

10. కలశమూలలందు బ్రహ్మ, కలశ మధ్యలో శక్తి దేవతా, కలశ ఎడమ భాగమందు ఋషులు; కలశపై భాగమున భైరవుడు ఉన్నట్లుగాధ్యానించి ( ఆవుముఖం, చేప, తాబేలు ముద్రలు చూపించాలి).

11. ఓ ప్రాణదేవీమాకు అభీష్టమైన ఈ మూర్తులందు ప్రాణమునుంచుము, మాయొక్క ఈ మూర్తులయందు మళ్ళీ దృష్టిని ఉంచుము. ఆకాశమందు సంచరించు సూర్యభగవానుని పలుమార్లుధ్యానింతుము. ఓ ప్రాణదేవి మమ్ములను సుఖాతి శయములతో సంతోషపెట్టుము. అమృతస్వరూపములే ప్రాణములు, అమృత స్వరూపములే ఉదకములు (నీళ్ళు) ఉదక ఆధారములైన ప్రాణములను యధాస్థాన మందుండునట్లు చేయుము. మళ్ళీ ఆ ఆత్మకుమళ్ళీ జీవము వచ్చి ఆ ప్రాణంరూపము దాల్చినిలిచి వేడి కాంతితో అమృతమయమై చావులేనిదైయుండుగాక. చావులేనిదై యుండుగాక. చావులేనిదై యుండుగాక! యిలాగు మూర్తులపై తమలపాకు చేతితోపట్టి 3సార్లు 5సార్లు 7 సార్లు 21 సార్లైనను చెప్పవలయును (ప్రాణప్రతిష్ఠ)





12. సుగంధాన్ని వెదజల్లు వాడు సర్వజీవులకు ఆహారాన్నిచ్చి పోషించువాడును త్రినేత్రుడయిన పరమేశ్వరుని ఆరాధించి దోస పండుకాడనుండి విడివడి నట్లుగా మరణబంధంనుండి విడివడుదుముగాక, ఆత్మస్థితి నుండి విడివడకుందుము గాక, నన్నుఅపమృత్యువునుండి రక్షించి సక్రమమార్గంలో జీవించుటకు శరీరమునకు వేడినిచ్చి హుందాగా వేయి సంవత్సరములు జీవించుటకు వేయియమపాశాలను తప్పించి మృత్యువునే హతమార్చుటకు తాను యజ్ఞస్వరూపుడై అనేక రూపమగు మృత్యువును యజ్ఞములో వ్రేల్చిప్రాణాన్ని జీవనాడులను రుద్రుడు కాపాడినన్ను ఆప్యాయంతో రుద్రుడు విష్ణువు మృత్యువు నుండి రక్షింతురుగాక.

13. **వస్త్రమంత్రః** ఇమం వస్త్రాణిపీవసా వసాధేయివో, రచ్చిద్రమంతవో, హసర్గాః ఆవాతిరతి మన్వతాని విశ్వార్దే నమిత్రావరుణాశచేధే॥ **అర్ధం :** పరబ్రహ్మము, సూర్యుడు, వరుణుడు, యింద్రుడు మొదలగు దేవతలారా! మీరు మాకు బాగుగా కట్టుకోతగిన వస్త్రములను , త్రాగుటకు పరిశుద్ధ జలమును, దేహపుష్టిని ఆరోగ్యాన్నిచ్చు ఆహారములను మాయందు అనురాగముతో నొసంగుడు.

13. **వస్త్రమంత్రం :** ఓం అభివస్త్రాసువసనాన్యషాభి ధేనూస్సుదుషాపూయమానః అభిచంద్రాభర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్రధినో దేవసోమ॥

దేవసోమ॥ ప్రకాశించు ఓ సోముడా॥ నీవు మాకు బాగుగా కట్టుకో తగిన వస్త్రములనిమ్ము॥ అలాగే పవిత్రుడవైన నీవు బాగుగాపాలనిచ్చెడి ఆవులనిమ్ము॥ సంతృప్తి కరమగు ధనమును మా పోషణార్థమైయిమ్ము । మంచి గుర్రములతో కూడిన రధము నిమ్ము॥

14. **మృత్యుదోషానికి :** విభూతి సుగంధాన్నివెదజల్లువాడు ఆహారాన్నిచ్చి పోషించే వాడు, త్రినేత్రుడయిన పరమేశ్వరుని ఆరాధించి దోసపండు కాడనుండి విడివడి నట్లుగా మరణపట్టునుండి విడివడుదుముగాక ఆత్మస్థితినుండి విడి వడకుందుముగాక॥ (సర్వదేవతలకు విభూతి ధరింపజేయునపుడు మానవులు విభూతిధరించునపుడు. అపమృత్యుదోష పరిహారానికి ఈ మంత్రాన్ని జపిస్తారు దీనివలన అపమృత్యుదోష నివారణయగును.)

14. **వివరణ** జీవులకు గల సహజమరణము అనివార్యము. అసలు మరణాన్ని జయించడమంటే శరీరం నశించకుండా వేల సంవత్సరాలు జీవించి ఉండుట కాదు శరీరం నుండి ప్రాణం పోవుట మరణమందురు. దీన్ని మానవుడు జీవించి ఉండి శరీరం ఆత్మకు భిన్నమయినదని తత్వసాధనలో గ్రహించి మరణం శరీరానికే గాని ఆత్మకు లేదనినేను శాశ్వతుడనని చావుకు భయపడ కుండుటే మరణాన్ని జయించుట.

15. **గంధం** సువాసనయే తనలక్షణముగలిగినట్టిది, యితరులను అదిలించునట్టిది. ఎల్లప్పుడూ సస్యాదులచే నిండిన పాడి ఎండిన పేడ మొదలగు వాని నొసంగి సమస్త ప్రాణులకు ఆధారమైన శక్తి స్వరూపిణియగు భూలక్ష్మిని ఈ భూలోకమునకు పిలుచు చున్నాను.

16. దేవతామూర్తుల ఎదుట యంత్రము నుంచి పైన చెప్పిన విభూతి, గంధం మంత్రములతో విభూతిగంధములను సమర్పించ వలయును. వాటి రెండు ప్రక్కలా నీటితో రెండు కలశములనుంచి

17. మహామేరు పర్వతము మొత్తం అలాగే వేదములు, బ్రహ్మాదిగా గల దేవతలు, మొత్తం నా శరీరమనెడి గృహమందుస్థిరంగా యున్నారు.

18. వాయు దేవుని, పాంచజన్యాధిపతియగు విష్ణువునుధ్యానింతుము వారు ఈ శంఖునుప్రేరేపింతురు గాక.(ఈ మంత్రము చెబుతూ ఉదక కులశములకు ఎదుట శంఖాన్ని స్థాపించాలి)

19. ముందు 10 లో చెప్పినవి యిచట చెప్పుకోవాలి. (కలశధ్యానం)

20. మహా మహిమాన్వితమగు కలశాన్ని నేను ప్రతిష్ఠస్తున్నాను, సముద్రము, నదీ, నదములందలినీరు కలశములోకి రావాలి. కలశాధి దేవత దీనికి ప్రేరణ కల్గించాలి యితరులు సావధానులై ఉండాలి.

21. **అశ్వత్థః** యజ్ఞము చేయుట చేయించునపుడు హోమమందుహవిస్సులర్పించగా అగ్నిహోత్రునిచే సేవింపబడినది (గ్రంధంలోని వ్యాఖ్యానం చెప్పాలి )

22. **నారికేళ:** ఈ కాయపండినా పండకపోయినా, పుష్పించినా పుష్పించకపోయినా, నే చేసిన నివేదన భగవదర్పితమై నాకు శుభమునొసంగుగాక! (గ్రంధంలోని వ్యాఖ్యానం చెప్పాలి)

23. చేప, తాబేలు, గోముఖం, శంఖం, స్త్రీమర్మాయవముద్రలు చూపించి, అచట గురుపాదుకలను పెట్టి వీటన్నింటికీ పంచపూజలు చేయాలి (3వ మంత్రంలో చెప్పినట్లుగా )

24. సమస్త దేవగణాలకు అధిపతివియైనందున గణపతిగా పేరొందిన నిను కీర్తించి ఆహ్వానిస్తున్నాము. మేధావులలో నీవు ప్రధానుడవని సాటిలేని కీర్తిగాంచినావు, ప్రధానులందరిలో శ్రేష్ఠుడవు, వేదాలకు నాయకుడవు, మా ప్రార్థనలాలించి మమ్ము రక్షించుటకు త్వరగా వచ్చి మమ్ము కటాక్షిస్తావు అన్ని గణములకు నాయకుడవగునీకు నమస్కారము.





25. వంకరగలట్టి ఏనుగుతొండము, ఒక్కదంతముగలట్టి వినాయకుని ప్రార్థిస్తున్నాము, సర్వఆపదలలో నుండి తనను ప్రార్థించిన వారిని కాపాడుటకు సిద్ధంగా యున్న గణనాధుని కీర్తిస్తున్నాను. యితరులు సావధానులై ఉండాలి.

26. పసుపుతో గానీ విగ్రహంతో గానీ గణపతి స్వామిని క్రమముగా ఉపచారములు చేసి పూజించాలి.

27. సర్వదిక్కులతో కూడిన ఈ విశ్వానికి అధిపతియగు విశ్వకర్మ పరమేశ్వరుడు మాగోవులను మావస్తువాహనాదులను మమ్ములను రక్షించు గాక । జగత్పితయగు విశ్వకర్మ భగవానునికి నమస్కారము.

28. బ్రహ్మరూపుడు, రుద్రరూపుడు, వరుణరూపుడు, అగ్నిరూపుడు(జ్యోతి స్వరూపుడు ) సకల ప్రపంచాధీశ్వరుడగు సృష్టికర్త మా పశువులను రక్షించి మమ్ములను కాపాడుగాక, సర్వసర్వంసహా సృష్టికర్తకు సమస్కారము, జ్యోతి రూపుతో వెలుగొందుచూ, సృష్టి అంతా ఆక్రమించినట్టి నిరాకారునకు, చాతుర్యముతో సకల చరాచరజీవరాసులను సృష్టించి రాతిలోని కప్పకు సైతము ఆహార మొసంగు జీవనాధారుడగు మొట్టమొదటి పురుషుడు. అర్థనారీశ్వరుడు పరలోక దేవత ఐదుముఖములతో 84 లక్షల జీవరాసులకు జీవమైయుండి సృష్టించినట్టి విరాట్ స్వరూపునకు శతకోటి నమస్కారములు.

29. అన్ని ఆటంకములు తొలగించువానికి , వ్యాధులకతీతుడై కళలయందు గలవాడు ఎల్లప్పుడూ ఎలాంటి దోషములు లేక, సభాగృహములకు హితములు కూర్చు వాడు, సర్వేశ్వరుడు సదాశివుడు, వేదముల ఉత్పత్తికి కర్తయైన యతీశ్వరుడు. ఆది, మధ్య, అంతములు లేని ప్రభువగు జగద్గురునికి నేను చేసిన సర్వకర్మలు సమర్పించు చున్నాను. నేను సంకల్పించు ప్రతీకార్యమూ సిద్ధించు వరాన్ని ప్రసాదించుమయ బ్రహ్మనమస్తే విశ్వకర్మానమస్తే.

30. ఎదుటవీభూతి పందునుంచి 27,28,29, మంత్రాలతో ధ్యానించి పంచ పూజలు చేయాలి. యిలా:లం పృధివీతత్త్వాత్మనే విశ్వకర్మ భగవాన్యైనమః గంధం సమర్పయామి.

**31. అపోయిష్ఠాదినవ మంత్రములకు అర్థములు :-**

1. ఓం ఆపోయిష్ఠామయోభువః= ఓ జలమానీవు దర్శన స్పర్శన స్నానపానాది అనేక క్రియల చేత మాకు పరమానందము కలుగజేయుము.

2. ఓంతాన ఊర్జేతధాతనః= మా యొక్క కృషిని ఫలింపజేసి ఆహార పదార్థములను అధికముగా కలుగజేసి మాకు సంతృప్తిని కలుగజేయుము.

3. ఓం మహేరణాయ చక్షుసే ః = ఆహార సేవనచే సర్వేంద్రియమలు వృద్ధి చెందును. ఆ అవయవములు పటిష్టతచే బుద్ధి వికసించును. కావున మాకు సుజ్ఞానము ను కలుగజేయుము.

4. ఓంయోవశ్శివతమోరసః= నీ యెక్క రసాస్వాదనచేత మాకు అధికమగు సుఖమును కలుగజేయుము.

5. ఓం తస్యభాజయతేహనః= నాకు జలము సమృద్ధిగాలభించుగాక, దాని వలన నేను వృద్ధి పొందుదునుగాక =

6. ఓం ఉశితీరివి మాతరః= తల్లి బిడ్డకు తనపాలచే తృప్తిపరచినటుల నీ యొక్క అమృతరసముచే మేముతృప్తి చెందుదుముగాక.

7. ఓం తస్మారంగమామవః= మాకు సమృద్ధిగా నీరు లభించి తద్వారా మా ఆయువు పెంపొందునుగాక (యిందులోని 7వ మంత్రాలకు శిరస్సున 8 వ మంత్రానికి పాదాలకు 9 మంత్రానికి శిరస్సున నీళ్ళుచల్లుకోవాలి.)

8. ఓంయస్యక్షయాయ జిన్వధః = నీటిచేత మా జీవనములు సంతోషము చెందుగాక.

9. ఓం ఆపోజనయధాచనః = ఓ జలాధిష్ఠాన దేవతా మాకు సంతానోత్పత్తి శక్తిని కలుగజేయుదువుగాక.

ఈ తొమ్మిదిమంత్రాకు 1 రజోగుణముచేత, 2 తమోగుణముచేత, 3, మోహము చేత, 4. జాగ్రదవస్తలో 5. స్వప్నా వస్తలో 6.సుషుప్తిలో , 7 మనస్సు చేత 8. మాట చేత 9. శరీరము చేత చేసిన తొమ్మిది రకముల పాపములు ఈ తొమ్మిది మంత్రాలు పఠిస్తూ శిరస్సు పై నీటిని జల్లుకొనుట చే పాపములు నశించునందురు.

**ఈ ఆపోయిష్మాదినవ మంత్రములతో దిక్కులను ఆర్చించుట**

1. ఓం నమః పూర్వదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాం ప్రతివసన్తే ౖతాభ్యశ్చ ఇంద్రాయనమః (ఇంద్రునకు పంచపూజలు చేయాలి) తూర్పు దిక్కున నీళ్ళుజల్లి

2. ఓం నమో ఆగ్నేయ దిగ్భాగేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసన్తేతాభ్యశ్చ అగ్నియే నమః ( ఆగ్నేయదిక్కున నీళ్ళు జల్లి అగ్నికి పంచపూజలు చేయాలి)

3. ఓం నమోదక్షిణ దిగ్భాగేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసన్తేతాభ్యశ్చయమాయ నమః (దక్షణ దిక్కున నీళ్ళుజల్లియమునికి పంచపూజలు చేయాలి )

4. ఓం నమో నైఋతి దిగ్భాగే యాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చనిర్ ఋతయేనమః (నైరుతి దిక్కున నీళ్ళు జల్లి నిర్ ఋతునకు పంచ పూజలు చేయాలి)





5. ఓం నమోపశ్చిమదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చ వరుణాయనమః పశ్చిమ దిక్కున నీళ్ళు జల్లి వరుణునకు పంచపూజలు చేయాలి)

6. ఓం నమో వాయువ్యదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చవాయవే నమః (వాయువ్యదిక్కున నీళ్ళుజల్లి వాయుదేవునకు పంచపూజలు చేయాలి)

7. ఓం నమో ఉత్తరదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చ కుబేరాయనమః ( ఉత్తర దిక్కున నీళ్ళుజల్లి కుబేరునకు పంచ పూజలు చేయాలి)

8. ఓంనమోఈశాన్యదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చ ఈశాన్యాయనమః (ఈశాన్య దిక్కున నీళ్ళుజల్లి ఈశానునికి పంచపూజలు చేయాలి)

9. ఓం నమోఊర్ధ్వదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చ ఆకాశాయ నమః ( పైకి నీళ్ళుజల్లుతూ ఆకాశ దేవతకు పంచపూజలుచేయాలి )

10. ఓం నమో ఆధోదిగ్భాగేయాశ్చదేవతా ఏతస్యాంప్రతివసన్తేతాభ్యశ్చ పృధివ్యైనమః ( భూమిపైనీళ్ళు జల్లుతూ భూదేవికి పంచపూజలు చేయాలి)

1.యిలాః లంపృధ్వీతత్వాత్మనే పృధివైనమః గంధంపరికల్పయామి
2.హాం ఆకాశతత్వాత్మనే పృధివ్యైనమః పుష్పంసమర్పయామి
3.యంవాయుతత్వాత్మనే పృధివ్యైనమః ధూపమాఘ్రాపయామి
4.రంవహ్నితత్వాత్మనే పృధివ్యైనమః దీపందర్శయామి
5.వం అమృతత్వాత్మనే పృధివ్యైనమః నైవేద్యం సమర్పయామి (నైవేద్యం పేరుచెప్పి)
6. సం సర్వతత్వాత్మనే పృధివ్యైనమః సర్వోపచారతాంబూలం సమర్పయామి

**32. కేశవనామాలు**

1. ఓంకేశవాయస్వాహాః సృష్టిస్థితి, లయములందు బ్రహ్మ, విష్ణురుద్రులుగనుండు పరమాత్మకు సమస్కారము. (బ్రహ్మతీర్థమున నీరు అరచేతిని గోకర్ణాకారముగా పట్టిత్రాగాలి.........................................................................

2. ఓం నారాయణాయస్వాహాః వైరాగ్యజ్ఞానమునకు ఎవరు ప్రధానుడో అట్టివానికి నమస్కారము( పై విధంగా చేయిపట్టి మినపగింజమునుగునంత నీరు పోసుకుని త్రాగాలి)........................................................................

3. ఓం మాధవాయస్వాహాఃమాయను(అజ్ఞానమును) జయించిన వానికి నమస్కారము( పైవిధంగా చేయిపట్టి బ్రహ్మతీర్థమున) బొటనవేలి మొదటనుండి జలాన్ని త్రాగాలి.

4. గోవిందాయనమః సర్వేంద్రియములను నియమించు ఆత్మస్వరూపునకు నమస్కారము (కుడి అరిచేతితోఎడమ అరిచేతినితుడుచుకొన వలయును )

5. విష్ణువేనమః చర, అచరరూపమైన ప్రపంచమంతట వ్యాపించిన పరమాత్మకు నమస్కారము (ఎడమ అరిచేతిలో కుడి అరిచేతిని తుడుచుకొనవలయును)

6. మధుసూధనాయనమః రాక్షస ప్రవృత్తిని నశింపజేయు పరమాత్మకు నమస్కారము (ఎడమ చేతిలో నీరు పోసుకుని కుడి చేతితో నీటిని తాకి పైపెదవిని కుడి నుండి ఎడమకు తుడుచుకోవలయును.

7. త్రివిక్రమాయనమః స్వర్గమత్యపాతాళలోకములు వ్యాపించిన పరమాత్మకు నమస్కారము (క్రింది పెదవిని కుడిచేతితో కుడినుండి ఎడమకు తుడుచుకోవలయును )

8. వామనాయనమః వేదములచే స్తుతించబడిన పరమాత్మకు నమస్కారము ( కుడిచేతితో నీళ్ళు శిరస్సుపై చల్లుకోవలయును)

9. శ్రీధరాయనమః కీర్తిని బొందినపరమాత్మకు నమస్కారము (కుడిచేతితో శిరస్సున నీళ్ళు చల్లుకొనవలయును )

10. హృషీకేశవాయనమః సర్వేంద్రియములకు ప్రభువైన పరమాత్మకు నమస్కారము (ఎడమ చేతిపైన నీళ్ళు చల్లుకోవలయును)

11. పద్మనాభాయనమః నాభియందు పద్మము కలిగిన పరమాత్మకు సమస్కారము (కుడిచేతితో పాదములపై నీళ్ళు చల్లుకోవలయును.)

12. దామోదరాయనమః హృదయకమలమందు నివశించు పరమాత్మకు నమస్కారము (శిరస్సుపైన నీళ్ళుచల్లుకోవలయును)

13. సంకర్షణాయనమః గర్భసంస్కరణమున బుట్టిన పాపమును పోగొట్టు వానికి నమస్కారము (కుడిచేతి ఐదువేళ్ళతో గడ్డమును తాకవలయును )

14. వాసుదేవాయనమః ఆత్మస్వరూపముగానున్న పరమాత్మకు నమస్కారము (కుడిచేతితో ఎడమ ముక్కును తాకవలయును)

15. ప్రద్యుమ్నాయనమః స్వయంజ్యోతిస్వరూపుడగు పరమాత్మకు నమస్కారము (కుడి ముక్కును కుడిచేతితో తాకవలయును)

16. అనిరుద్ధాయనమః బంధవిరహితుడగు పరమాత్మకు నమస్కారము (కుడి చేతితో ఎడమకన్ను తాకవలయును)

17. పురుషోత్తమాయనమః సమస్తజీవరాసులలో శ్రేష్టుడైన పరమాత్మకు నమస్కారము (కుడి చేతితో కుడికన్ను తాకవలయును)





18. అధోక్షజాయనమః ఇంద్రియములచేత ఎరుగబడిన పరమాత్మకు నమస్కారము ( కుడిచేతితో ఎడమ చెవినితాకవలయును)

19. నారసింహాయనమః నాశములేని పరమాత్మకు నమస్కారము (కుడి చెవిని కుడిచేతితో తాకాలి)

20. అచ్యుతాయనమః సృష్టినశించిననూ శాశ్వతముగా నుండు పరమాత్మకు నమస్కారము (కుడిచేతితో బొడ్డును తాకవలయును)

21. జనార్ధనాయనమః జీవికి జనన మరణములేకుండా తనయందు ఐక్యము చేసుకొను పరమాత్మకు నమస్కారము (కుడిచేతి వేళ్ళకొనలతో హృదయాన్ని తాక వలయును)

22. ఉపేంద్రాయనమః పరమేశ్వరస్వరూపుడుగు ప్రభువునకు నమస్కారము (కుడిచేతి వేళ్ళతో బ్రహ్మరంధ్రాన్నితాకాలి)

23. హరయేనమః భక్తులపాపములను పోగొట్టు పరమేశ్వరునకు నమస్కారము ( కుడిచేతితో ఎడమ భుజాన్ని తాకవలయును)

24. శ్రీ కృష్ణాయనమః భక్తుల మనస్సు పరవశింపజేయుప్రభువునకు నమస్కారము ( ఎడమచేతితో కుడిభుజాన్ని తాకవలయును)

**సమంత్రక ఆచమనముః-**

1. ఋగ్వేదఃప్రీణాతు = ఋగ్వేదప్రియము కొరకు। యజుర్వేదఃప్రీణాతు = యజర్వేదప్రియముకొరకు। సామవేదఃప్రీణాతు =సామవేదప్రియముకొరకు। (ఈ మూడింటికి జలాన్ని త్రాగాలి) అధర్వవేదఃప్రీణాతు = అధర్వవేదప్రియము కొరకు। ప్రణవవేదఃప్రీణాతు = ప్రణవవేదప్రియము కొరకు। (ఈరెండింటికి రెండు చెక్కిళ్ళును అంగుష్ఠమూలమచే తుడుచుకోవలెను) చంద్రమాఃప్రీణాతు= చంద్రుని ప్రియముకొరకు, (అంగుష్ఠమధ్యవేళ్ళతో ముఖము, లలాటము మొదలు గడ్డము వరకూ తాకవలయును) మహేశ్వరప్రీణాతు = మహేశ్వరుని ప్రియముకొరకు (ఐదువేళ్ళకొనలతో శిరస్సును తాకాలి) ఆదిత్యఃప్రీణాతు, సోమఃప్రీణాతు =ఈ రెండిటికి (అంగుష్ఠము అనామికవేళ్ళతో రెండు చెవులను తాకాలి) వాయుఃప్రీణంతు దిశఃప్రీణంతు = ఈ రెంటికి (అంగుష్ఠ తర్జనీ వేళ్ళతో ముక్కురంధ్రాలను తాకాలి) ఇంద్రఃప్రీణాతు, ఇంద్రఃప్రీణాతు = అంగుష్ఠ కనిష్ఠ వేళ్ళ చే రెండు భుజములను తాకాలి, విష్ణుఃప్రీణాతు = (ఐదు వేళ్ళతో హృదయాన్ని తాకాలి), అగ్నిఃప్రీణాతు=(అంగుష్ఠముచేనాభిని తాకాలి) ఈ సమంత్రకాచ మానాన్ని దానముయిచ్చుట, పుచ్చుకొనుటయందు, హోమమునందు సంధ్యా వందనమందు, ఆదియందుఅంతమందు రెండుసార్లు చేయవలయును.

33.ఎ. భూమికిభారముగానేయే భూతములు, పిశాచములుయిక్కడ ఉన్నవో అవన్నియూ ఇక్కడ నుండి దూరముగా తొలగిపోవుగాక (ఆ ప్రదేశంలో నీళ్లు చల్లాలి )

33.బి. భూమికి భారమయిన భూత ప్రేత పిశాచములు, నా శరీరమందలి కామ క్రోధములు మానుండి తొలగునుగాక, వాటితో అవరోధము లేకుండా ఈ దైవ కార్యాన్ని ప్రారంభించెదను గాక.

34. ఓం అనగా ప్రణవము పరబ్రహ్మఋషిగ్రాయత్రీ చందస్సుకు పాదానికి ఆరు అక్షరాలు, పరమాత్మ సూర్యుడు అధిదేవత, దేవీ గాయత్రీ నేనుయిపుడు ప్రాణాయామము చేయుచున్నాను (దీని అర్ధము)

**వివరణ:** ప్రణవగాయత్రిని చెప్పి అర్చకులు జందెముతో ముక్కును పట్టుకో మంటారు. యిందలి అంతరార్థమేమిటంటే జందెం పోగులతో ముక్కుపట్టడ మంటే ముక్కురంధ్రములందలి యిడా పింగళినాడులలో ఒక నాడి నుండి గాలిని పీల్చి కొంత సేపు పొట్టలో ఆపి, నిదానంగా వేరే నాడి నుండి గాలిని పూర్తిగా వదులుచూ, మరల యింకోనాడి నుండి గాలిని పీల్చి స్థంభించి యింకో నాడి నుండి వదులుతూ యిలా చేయుట చే మూడవనాడి యగు సుషుమ్నలోకి ప్రాణవాయువు ప్రవేశించుటకు చేయు ప్రయత్నము. దీనినే యోగసాధన అంటారు. యిలా చేయగా చేయగా సాధకునకు వాయుస్వాధీనమై యోగ సిద్ధి కలుగుతుంది. ఆ వాయు స్థంభనలో సంధ్యావందనమందలి 8వ మంత్రాన్ని నీలో చెప్పుకుంటూ దినక్రమేనా సమయాన్ని పెంచుకుంటూ నిమిషాలు గంటలు క్రమంగా వాయువును స్వాధీనపరచుకుంటే నీలోని 24 తత్వాలు స్వాధీనమైపరబ్రహ్మ సాక్షత్కారంపొందుటకు చేయు యోగమార్గాన్ని బహిరంగంలో యిలా చెబుతారు. ఊరికే జందెం నూలు పోగులతో జందాన్ని ముక్కుతో పట్టుకుని ప్రణవ గాయత్రిని చెప్పినందువలన ఫలితము లేదు. దీని అంతరార్థం సాధకులు గ్రహించి ఆచరించాలి.

35. ఎ) ఓం = పరబ్రహ్మము, భూః = భూలోకము, ఓం = సకల చరాచరసృష్టికర్త విశ్వకర్మ, భువః= భువర్లోకము। ఓగ్ంసువః=సువర్లోకము।మహః= మహర్లోకము। జనః =జనలోకము। తపః= తపోలోకము। ఓంగ్‌సత్యః = సత్యలోకము, ( యివన్నీయూ ఆ సృష్టికర్త రూపములే) తత్=అట్టి, సవితుః =సూర్యభగవానుడు, వరేణ్యం=సర్వోత్కృష్టమైన, భర్గః=దివ్యతేజస్సు, దేవస్య=సకలచరాచరములకు జీవనాధారుడైన దేవుని, ధీమహి = ధ్యానింతుము గాక।

35. బి) పరబ్రహ్మమగు విశ్వకర్మభగవానుడు భూలోకమందలి సకలచరాచర జీవకోటిని సృజించి, యింకనూ భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము





తపోలోకము, సత్యలోకములు అన్నియూ ఆసృష్టికర్తరూపములే, ప్రత్యక్షసాక్షిగా సూర్యభగవానుని రూపముతో సర్వోత్కృష్టమైనదివ్య తేజస్సు నొసంగి సకల చరా చరములకు జీవనాధారుడైన పరమేష్టిని ధ్యానింతుముగాక.

36. సృష్టికర్తయగు విరాట్ విశ్వకర్మభగవానుడు సమస్త జలాశయములందలి నీరు, నిప్పు సూర్య, చంద్ర అగ్నులందలి తేజములుగా తీపి మొదలగు ఆరు రుచులుగా, దేవస్వరూపము, భూలోకమునుండి సత్యలోక పర్యంతముగల ఏడులోకములు యివన్నియూ ఆ సృష్టికర్త విశ్వకర్మ స్వరూపములే.

### సంకల్పాసనము : బ్రహ్మాంజలి

**కర్త పద్మాసనముగా కూర్చుండి కుడికాలు మీద ఎడమచేతి నుంచి అందులో కుడిచేతి బొటనవ్రేలిచే ఎడమచేతి బొటనవ్రేలిని చుట్టి "బ్రహ్మాంజలి" గా నుంచి తాను చేయు కర్మను స్మరించుట సంకల్పమనబడును.**

37. మాకు సంప్రాప్తమైన సకల దుష్కర్మలదోషములు తొలగిపోవుటకు పరమేశ్వరుని కృపా కటాక్షవీక్షణములకై పరమేశ్వరుని ప్రీతి కొరకు శ్రీ విరాట్ విశ్వకర్మ భగవాన్ ఆజ్ఞచే దినదినాభివృద్ధి చెందుచున్న ఆ బ్రహ్మచే నిర్మించబడిన ప్రపంచ మధ్యన గల తూర్పుభాగానశ్వేతవరాహుని కల్పంలోవైవస్వతునిమన్వంతరమున కలియుగ మొదటి పాదములో జంబూద్వీపమందలి (భరతవర్షే) హిమాలయల ములకు దక్షిణమున, దక్షిణ సముద్రమునకు ఉత్తరమునగల ప్రదేశములో దేవతలందరి సమక్షమున ప్రస్తుతం నడుస్తూ పిలవబడు శుభసంవత్సరము, శుభ ఆయనము, శుభఋతువు, శుభమాసము, శుభపక్షము, శుభతిది, శుభవారము, శుభనక్షత్రము, శుభయోగము, శుభకరణముయిన్ని శుభములతో కూడిన శుభఉదయమునగల శుభముహూర్తంలో, ఒప్పిదమైనట్టి మతములో (పర్నబ్రహ్మర్షి గోత్రం) సుగంధసాయిబాబాచార్య స్వామీజి, ధర్మపత్నీ విమలాదేవి) సమేతంగా మాకు జన్మ, కర్మల రీత్యా సంక్రమించినట్టి సకలపాపముల యొక్క దోషములు తొలగి పోవుటకు శుభములనొసంగు పరమేశ్వరుని ప్రీతి కొరకు ప్రాతఃకాల సంధ్యా వందనాన్ని ఆచరిస్తున్నాను. (సనారీ పూజ చేస్తున్నాను)

38.1. **ఆపోయిష్ఠాదినవ మంత్రములు** మొదటి మూడు మంత్రములకు ఆపోయిష్ఠా మయోభువః 2. తాన ఊర్జేతదాతన 3.మహేరణాయచక్షుసే.

ఓజలాధిదేవతలారా। మీరు మాకు అన్నమును సమకూర్చి దానిని భుజించిన మాకు చక్కనియింద్రియ పటుత్వమును శక్తిని ప్రసాదింపుడుని కోరుట.

4. యోవశ్శివతమోరసః 5 తస్యభాజయతేహనః 6 ఉశతీరవమాతరః ఓజలాది దేవతలారా। మీరు మమ్ములను తల్లులు పిల్లలకు పాలిచ్చి పెంచు నట్లుగా పెంచి

పెద్దజేసినట్లుగా మీ యందుగల సారాన్ని శక్తిని మాకిచ్చి మమ్ముపోషింపుడు. 7. తస్మారంగమామవః 8 యస్యక్షయాజజిన్వదః 9. అపోజనయధాచనః ఓ జలాధి దేవతలారా। మీ యందుగల ఏరసపదార్థముతో మీరు పరమప్రీతులగుచున్నారో ఆపోషక పదార్ధములను మాకీయవలసినదిని మిమ్ము ప్రార్ధించు చున్నాము మాప్రార్ధనలాలించి ఆరస పదార్థములను మాకు ప్రసాదించిమమ్ములను సంతానోత్పత్తికి తగు శక్తినిచ్చి సమర్థులనుగా జేయుడు.

39. సూర్యుడును, క్రోదాభిమానదేవతయు, క్రోధాధిపతులైనరాగాదులును, నేనుక్రోధము వలన చేసిన పాపములనుండి రక్షించుగాక, కామ,క్రోధ, లోభ, మోహ, మదము, మాత్సర్యములుచే పరులను హింసించవలెనను మానసిక పాపములు, అప్రియములు, అసత్యములు మొ॥ పరుషసంబాషణ వివాదము, వేదవిక్రయణముచే కలుగువాగ్ధోషములను, ఆకులుతృంచుట కొమ్మలు విరుచుట, దొంగిలించుట, హత్యచేయుట, అభిచార(పరులను హింసించుటకు చేయు) హోమాదుల చేకలుగుచేతి సంబంధపాపములును, దుష్టప్రదేశములకు వెళ్ళుట గోవులను, బ్రహ్మజ్ఞానంగల వారిని ఉత్తములను కాలి స్పర్శముతో కలుగు పాదసంబంధదోషములను తినకూడని పదార్ధములు తినుట త్రాగకూడని వాటిని త్రాగుట మొదలగు ఉదరదోషములను పర స్త్రీ సంపర్కము చే కలుగులింగపాపములను రాత్రియందు చేసిన పాపములను రాత్రి అభిమానదేవత నశింపజేయుగాక, ఈ జన్మయందుగాని పూర్వజన్మ లందు గాని చేసిన పాపములు ఏవైనా నా యందు ఉన్నచో వాటన్నింటి దోషములు పోవుటకు అమృత మయమగు సూర్యని యొక్క తేజస్సు నుందు హోమము చేయుచున్నాను, అవన్ని పూర్తిగా నశించుగాక.

40. కేశవనామాలు 32 లో చెప్పినట్లుగా చేయవలయును.

41. లోకయాత్రానిర్వాహకుడైన, సూర్యమండలాంతర్గతుడైన సర్వజీవకోటికి ఆహారము నొసంగి జయశీలుడై సర్వమూ తనజ్ఞానతేజస్సుచే వ్యాపించివేగముగా సంచరించు సూర్యనారాయణమూర్తిమాకు నిరుపద్రవమైన ఆయుష్యమును యిచ్చుట కొరకును మాలోని బ్రహ్మజ్ఞానమును వృద్ధిచేయుటకొరకునూ స్తోత్రము చేయుచున్నాను.

42. ఆపోయిష్ఠాదినవమార్జనమంత్రాలు (31) లో చెప్పినట్లుగా చెప్పుకోవలయును.

43.ఎ. బంగారు రంగు కిరణములు గల అగ్నిహోత్రములు ఈ జలములయందు పుట్టినవి కశ్యపుడు, ఇంద్రుడును ఈ జలముల నుండి యే ఉద్భవించుచున్నారు. ఒక్కనిగయున్న అగ్నిహోత్రుని ఈ జలములు బహురూపములుగా పుట్టించుటకే గర్భములు ధరించుచున్నది. అలాంటిజలములు మాకు శుభములనుచే కూర్చు గాక.





43.బి. పగలు సూర్యరశ్మి సోకి బంగారు రంగుగా కన్పించు నీరు స్వతఃపరిశుద్ధము గలిగి యితరులను పవిత్రము చేయుచూ, కశ్యప ప్రజాపతి దేవేంద్రునకు ఉత్పత్తి స్థానమే "ఆపోవాయిదగ్ం సర్వం" అన్నట్లుగా సర్వమూ తన రూపముగా నుండి, బడబాగ్నినిగర్భమున ధరించిన ఉదకములు మాకు దుఃఖములను పోగొట్టి సుఖములను ప్రసాదించుగాక.

44.ఎ.ఓ ఉదకములారా। నన్ను మంగళకరమైన దృష్టితో చూచెదరు గాక ఈ శరీరమును చర్మమును చక్కని స్పర్శజ్ఞానముతోసంపూర్ణముగా స్పృశింతురుగాక. ఈ జలములు నివాసముగా గల దేవతలు నాయందు తేజస్సును, బలమును (ఉత్సాహము) ఓజస్సును నిలుపుదురుగాక.

44.బి. కర్మసాక్షియైన సూర్యభగవానుడు నన్ను బండకొయ్యనుండి బంధవిముక్తుని చేసినట్లుగా సర్వపాపములనుండి నన్ను విడిపించుగాక (బండకొయ్య అనగా కఱ్ఱతో చేసిన ఒక యంత్రము) పూర్వము నేరస్తుని కాళ్ళుచేతులు ఆబండ కొయ్యలోదగిలించి యుంచెదరు. వాని శిక్షాకాలము పూర్తియైన పిదప దాని నుండి విడిపింతురు) ఆ విధముగా సూర్యభగవానుడునన్ను పాపదోషముల నుండి విడిపించుగాక. మరియూ జలములు పాపములనుండి నన్ను పరిశుద్ధుని చేయుగాక, చెమటపోసిన వాని శరీరమంతయూ మురికిపట్టగా స్నానముచే శరీరశుద్ధియైనటుల పవిత్రమగుదర్భలచే నెయ్యి పరిశుద్ధ మగునటుల ఈ జలప్రోక్షణచేనాకు గల పాపములు తొలగి పరిశుద్ధుని చేయుగాక.

45. ఓం కారపరబ్రహ్మము భూలోకము, భువర్లోకము, సువర్లోకములును, ఉదయాస్తమయకల్పనలతో లోకయాత్రనడిపించుచున్న సూర్యభగవానుని యొక్క సర్వోత్కృష్ణమయిన దివ్యతేజస్సును సదాధ్యానింతుము గాక, మా యొక్క బుద్ధి ప్రవృత్తులను ఆదేవుడు ఆ పవిత్ర విషయములను గ్రహించుటకు మా బుద్ధిని ప్రేరేపించుగాక.

46. (జలాన్నిఈ మంత్రములతో చక్కగా విసిరివేసినతరువాత, తాను విభూతి ధరించుకుని పీఠముపైనున్న అన్ని విగ్రహములకు విభూతి అలంకరించిన వాటికి గంధాన్ని సమర్పించాలి.)

47. పసుపు కుంకుమ బియ్యములో కలిపిన "పసుపు" కుంకుమాక్షతలతో దేవతలకు అలంకారార్థముగా ఆరాధన ఎల్లప్పుడూ నేను చేస్తుంటాను. (దోసిలితో నీళ్ళను సూర్యభగవానుని ఎదురుగా వదలాలి)

48. మూడు కళ్ళువలే నున్న మూడు ఆకులతో నుండి మూడు జన్మలదోషముల నుండి రక్షించి భక్తులయొక్క సర్వపాపములు హరించు తులసీదళాన్ని సమర్పిస్తున్నాను.

49. బంగారాన్నిచ్చు వ్యాపారునియింట బంగారు రంగుతో బంగారంవలే చక్కగా కూర్చబడిన త్రాగుపాత్ర పచ్చరంగుతో ప్రకాశిస్తూ అందు పెరుగన్నముపై మీగడ యున్నట్లుగా యున్న పుష్పాన్ని సమర్పిస్తున్నాను.

50. గుగ్గిలం, నెయ్యి, కుంకుమ, మహిసాక్షికంతో కూడినట్టిపొగను సర్వదేవతలు పీల్చుటకు ధూపంగా వేస్తున్నాము, ఆధూపాన్ని సర్వదేవతలు అఘ్రాణింతురు గాక. అట్టి ధూపాన్ని ప్రీతితో దేవతలు పీల్చుటకు సమర్పిస్తున్నాను.

51. ఓ అగ్నిహోత్రుడా, నన్ను హింసింపదలచిన క్రూరులెవ్వరుకలరో వారిని నశింపజేసి నీవు ప్రకాశింపుము నాకొరకుపశువులను కలుగ జేయుము. నేనేదిక్కున కేగినను నిరభ్యంతరముగా జీవించునట్లుచేయుము.

52. దేవతలు ప్రయాణించివచ్చుటకు, వచ్చిమమ్మల్ని రక్షించుటకు ఘంటానాదం చేస్తూలాంఛన ప్రాయంగా దేవతలను ఆహ్వానిస్తున్నాను. అందుకు ఘంటా నాదాన్ని సమర్పిస్తున్నాను.

53. మహామేరు పర్వతం సర్వమూ, వేదములందలి బ్రహ్మాదిసర్వదేవతలు నా దేహ మందు స్థిరంగాయున్నారు (యిలాచెప్పకుని శంఖాన్ని ఊదాలి).

54. నీటిబుడగవంటి జీవితమందు శరీరతాపముచే పశువువలేప్రవర్తించే

55. ఆ గుణములనుండి విముక్తుని గావించుటకు కామనరాన్ని త్రెంచి పశు గుణముల నుండి తప్పించమని భగవంతుని ధ్యానించుచున్నాను. మేకపోతు వలేప్రేరే పించు కామ విషయములందు యితరులు సావధానులై ఉండాలి.

56. **నివేదనా పదార్ధములకు గల శాపాన్ని పోగొట్టుటకు చెప్పుమంత్రములు** బ్రహ్మశాపమునుండి విమోచనకు ఓం- బాం- బీం- బూం- బేం-బైం, బౌం- బః బ్రహ్మశాపవిమోచనాయ ఈ పదార్ధములోఅమృతంరావాలి ఉంచుతున్నాము ఈలాగు పదిసార్లు చెప్పిదర్భలతో జలాన్ని సంప్రోక్షించాలి (నీళ్ళను చల్లాలి)

57. విష్ణుశాప పరిహారమునకు ఓం- వాం - వీం - వూం- వేం- వౌం-వః విష్ణుశాపవిమోచనాయ ఈ పదార్థములోకి అమృతం రాహాలి (ఈలాగే పదిసార్లు చెపుతూ దర్భలతో నీళ్ళుచల్లాలి)

58. రుద్రశాప విమోచనకు - ఓం-రాం-రీం-రైం-రౌం- రః రుద్రశాపవిమో నాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి రావాలి ఈ లాగు పదిసార్లు చెపుతూదర్ నీళ్ళుచల్లాలి.

59. కృష్ణశాపవిమోచనకు - ఓం-క్రాం - క్రీం- క్రూం - క్రేం- క్రౌం- ః- కృష్ణశాప విమోచనాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి రావాలి (ఈలాగు ప ార్లు చెపుతూ దర్భతో నీళ్ళు చల్లాలి)





60. శుక్రశాప విమోచనకు- ఓం -శాం -శీం - శూం- శైం - శౌం - శః శుక్రశాప విమోచనాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి రావాలి (ఈలాగు పదిసార్లు చెప్పుతూదర్భతోనీళ్ళుచల్లాలి)

61. త్రిపురసుందరీ శాపవిమోచనకు - ఓం -ఐం- క్లీం- సౌః- సౌః క్లీం -ఐం -ఓం- మాం- మీం - మూం - మేం- మైం -మౌః-మః త్రిపుర సుందరీశాప విమోచనాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి (ఈలాగు పదిసార్లు చెపుతూ దర్భలతో నీళ్ళుచల్లాలి)

62. నివేదనా పదార్ధములగు సమస్త తినుపదార్థములు ఫలములు మొదలగునవి ఆరాధనమూర్తుల ఎదుట నుంచి పై విధంగా శుద్ధిచేయవలయును.

63. **కుంభస్థాపన :** నివేదనా పదార్థము వండిన పాత్రదైవం ఎదుట పెట్టి కుంభ పాత్రను పెడుతున్నాను. దీనిలోనిపదార్థము అమృతతుల్యము కావాలి. తేనెను ప్రేరేపించుతున్నాను.

64. దేవీ ఈ అమృతపాత్రను పెడుతున్నాను దీనిపై అధికమైన పాలతెరగలదు. మాకు ధనాన్ని, శుభాలను, జయాన్నియిచ్చి శత్రువులను నశింపచేయుము జగజ్జననీ

65. ఓం- ఐం- బీజాక్షరములందుగల త్రిపురాదేవిని తెలుసుకుందాము అందు కొరకు ఓం - క్లీం బీజాక్షరములందుగల కామేశ్వరీదేవిగా ధ్యానిద్దాం ఓం - సౌః బీజాక్షరములలో నిండివారు మనకు ప్రేరణనిచ్చుగాక యితరులు సావధానులై ఉండాలి అంటూ నమస్కరించాలి.

66. ప్రణవమంత్రంగాను, భూ=భూలోకం (శరీరం) భువః = పితృలోకం (మనస్సు) సువః= దేవలోకం ( ప్రాణం) ఈ మూడులోకాలలో శరీరమందలి ఈ మూడు స్థానాల్లో ఉంటూ ఎవరుమనబుద్ధిని ప్రేరేపిస్తున్నారో ఈ చరాచరలోకాన్ని సృష్టించినదైవమైన, జ్యోతిరూపుడగు ఆ విరాట్ విశ్వకర్మను ధ్యానించుదాం యితరులు స్థిరగుణంతో సావధానులైఉండాలి. యిలా ఐదుసార్లు చెబుతూ ఐదుసార్లు నివేదనా పదార్ధములపై నీళ్ళుచల్లూతూ సత్యాన్నిపాటిస్తూ ఆహారపదార్ధముల చుట్టూ నీళ్ళుచల్లి ఆహార పదార్ధము లు అమృతతుల్యంకావాలంటూ ఐదుసార్లు చెప్పి పదార్ధాలపై ఆకుతో నీళ్ళు చల్లాలి.

67. హృదయ మందుండు ప్రాణవాయువు, గుదస్థానమందుండు అపానవాయువు, నాభియందుండు సమానవాయువు, కంఠమందుండు ఉదాన వాయువు, శరీర మందంతటా ఉండు వ్యానవాయువు, ఈ పంచవాయువులు యధాస్థానము లందుండమని కోరుతూనివేదనచేయాలి.

68. దేవతామూర్తుల ఎదుట మూడు చిన్నగిన్నెలు పెట్టి ప్రధానపాత్రయందలి పదార్థాన్ని చిన్నగిన్నెలలో వేసి ఆ మూడు ప్రసాదపాత్రలకు పంచపూజలు చేయాలి. యిలా లం పృధివీతత్వాత్మనే ప్రసాద దేవతాయై నమః గంధం పరికల్పయామి.

69. పీఠమందలి విభూతిపండును గురువుగా భావించి గురువునకు పంచపూజలు చేయాలి. **గురుధ్యానం**, గురుశూలీ, గురోచక్రి, గురుధాత్రు, బృహస్పతి, గురుశుక్ర, గురుత్వష్టా, యిమేదేశికవర్థకి.

70. పూజాపీఠానికి ఎడమ భాగంలో ముత్తైదువులను, యోగాభ్యాసస్త్రీలను, మహేశ్వరులను కూర్చుండ బెట్టి వారికి తన శక్తికొలది పంచపూజలు చేయాలి.

యిలా లంపృధివీతత్వాత్మనే సువాసినీ దేవతాయైనమః, యోగినీదేవతాయై నమః గంధం సమర్పయామి.

**71. ప్రథమా వరణాః**

1. ఓం-ఐం-బీజాక్షరములందున్న సంభోగక్రియకు మూలమగు రతీదేవి, మాతానీపాదుకలనుపూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుతున్నాను మాతా జగన్మాతా.

2. ఓం- క్లీం- బీజాక్షరములందున్న సంతోషాన్నిచ్చు మన్మథుని భార్యయగు ప్రీతీదేవీమాతా నీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను మాతా.

3. ఓం-సౌః-బీజాక్షరములందున్న మనస్సులో కామప్రేరణలు కల్గించుదేవీ మాతా నీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నానుమాతా

4. ఓం - ఐం- క్లీం-సౌః-సౌః- క్లీం - ఐం-ఓం - బీజాక్షరములందున్న పై దేవతలకు గల వారివాహనములు, ఆయుధములు, వారిశక్తులు , పరివారములతో సహా అందరిపాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితో కడుగుచున్నాను.

**72. ద్వితీయ వరణాః**

5. ఓం-హ్రీం-శ్రీం - ఐం-క్లీం-సౌః మూలమంత్రమందున్న ఐశ్వర్యప్రదాయినీ మహాలక్ష్మీదేవి జననీ శుభకరమగు మీ పాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితో కడుగుచున్నాను తల్లీ.

6. .................... మూలమంత్రమందున్న సర్వశక్తులనొసంగు దుర్గాదేవీ జననీశోభాయుక్తమగు మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నారు జగజ్జననీ .

7. ........................ మూల మంత్రమందున్నసర్వ విద్యలనొసంగు సరస్వతీదేవీ శోభాయుక్తమగు మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను, జననీ.





8............. మూలమంత్రమందున్న సర్వవిద్యలనొసంగు సరస్వతీదేవీ శోభాయుక్తమగు మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితోకడుగుచున్నాను జననీ

9............ మూలమంత్రమందున్న సర్వశక్తులనొసంగు దుర్గాదేవీ మీ పాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితో కడుగుచున్నాను జగజ్జననీ.

10........... మూలమంత్రమందున్న ఐశ్వర్యప్రదాయినీ మహాలక్ష్మీదేవీ జననీ మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను తల్లీ.

11............ మూలమంత్ర మందున్న మాతలకు గల వారి శక్తులు, ఆయుధములు, పరివారములు వాహనములతో సహాఅందరిపాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితో కడుగుచున్నాను.

**73. తృతీయావరణాః**

12. ఓం- హ్రీం-శ్రీం- ఐం - క్లీం- సౌః మూలమంత్రమందున్న జగద్గురుని పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను జగద్గురుదేవా

13. ..................... మూలమంత్రమందున్న లోకాలగురుని పాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితోకడుగుచున్నాను లోకగురుదేవా.

14. ........................... మూల మంత్రమందున్న దేశాల గురునిపాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను దేశగురుదేవా.

15 ............................ మూల మంత్రమందున్న మహాగురునిపాదుకలను ................................................................... మహాగురుదేవా

16 ................................ మూల మంత్రమందున్న దేశాలగురుని పాదుకలను .................................................... దేశగురుదేవా

17 .............................. మూల మంత్రమందున్న లోకాలగురుని పాదుకలను ........................................................ లోకగురుదేవా

18 ......................... మూల మంత్రమందున్న జగద్గురుని పాదుకలను పూలతో పూజించిపాదాలను నీటితో కడుగుచున్నాను జగద్గురు దేవా

19 ............................ మూల మంత్రమందున్న జగద్గురుదేవుల యొక్క ఆయుధములు,వాహనములు, వారి శక్తులు, పరివారములతో అందరి పాదుకులను పూలతో పూజించి, నీటితో పాదాలుకడుగు చున్నాను

20 ..................... మూలమంత్రమందున్న మత విషయకమగు కార్యాచరణ చేయు శ్రీ విశ్వేశ్వరగురుని పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను. కర్మగురుదేవా,

21......................... మూలమంత్రమందున్న సకల విద్యలను బోధించు విద్యాగురుని...................... నీటితో కడుగుచున్నాను విద్యాగురుదేవా.

22 ......................మూలమంత్రమందున్న యోగసాధనలు తెలుపు యోగగురుని..................... నీటితో కడుగుచున్నాను యోగ గురుదేవా.

23............................... మూలమంత్రమందున్న బ్రహ్మజ్ఞానాన్నెరింగించు జ్ఞాన గురుని..................... నీటితో కడుగుచున్నాను జ్ఞాన గురుదేవా.

24.....................మూలమంత్రమందున్న సర్వాన్ని ఎఱుకపరచు సర్వేశ్వరుని నీటితో కడుగుచున్నాను సర్వగురుదేవా

25................మూలమంత్రమందున్న శ్రీ విశ్వేశ్వరుల వారి యొక్క ఆయుధములు, శక్తులు, వాహనములు పరివారములతో సహా అందరి పాదుకలను పూజించి, పాదాలు నీటితో కడుగుచున్నాను.

**74. చతురావణః**

26. మూలమంత్రముందున్న శక్తిప్రదాయినీపార్వతీదేవీ జననీ మంగళకరమగుమీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను నీటితో కడుగుచున్నాను జగన్మాతా.

27......... మూల మంత్రమందున్న పరమేశ్వరుని అర్ధాంగీ ఉమాదేవీ మాతా మంగళకరమగు మీ పాదుకలను .......... నీటితో కడుగుచున్నాను జననీ.

28.................... మూలమంత్రమందున్న విశ్వకర్మసంతతికి యిలవేల్పువగు కామాక్షీమాతా మంగళకరమగు మీ పాదుకలను ...... నీటితో కడుగుచున్నాను జననీ.

29...........మూలమంత్రమందన్న పంచ శిరస్సులుగల గాయత్రీ మాతా సర్వ జీవరాసుల జననీ మంగళకరమగు మీ పాదుకలను ................జగజ్జననీ .

30.............. మూలమంత్రమందున్న సకల విద్యలకు ఆధారమగు విద్యాదేవీ అంబా మీ పాదుకలను పూలతో పూజించి, నీటితో కడుగుచున్నాను సర్వవిద్యలకు జననీ.

31........మూలమంత్రమందున్న సకల యోగాలకు మూలమగు యోగ మాతా జననీ మీ పాదుకలనుపూలతో పూజించి, పాదాలనునీటితో కడుగుచున్నాను యోగదేవీమాతా

32.............. మూలమంత్రమందున్న తపస్సుసిద్ధింపజేయుగల తపోదేవీ అంబా మీ పాదుకలను పూలతో పూజించి, .................. తపోదేవీ జననీ.

33........మూలమంత్రమందున్న జ్ఞానాన్ని ప్రసాదించు జ్ఞానదేవీం అంబా మీ పాదుకలను ............... నీటితో కడుగుచున్నాను జ్ఞానదేవీ జగజ్జననీ.





34............... మూలమంత్రమందున్న దశావతారదేవీలకు మాతృకవైన పార్వతీదేవీ అమ్మా మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను .....మహాదేవీ జగజ్జననీ

35.......మూలమంత్రమందున్న పార్వతీదేవి ప్రతిరూపమైన దుర్గాదేవీమాతా మీ పాదుకలను పూలతో పూజించి, పాదాలను........ సర్వశక్తి స్వరూపిణీ దుర్గాదేవి

36....................... మూలమంత్రమందున్న దశావతార శక్తి స్వరూపిణులకు గల వాహనములను వారివారి శక్తులను, ఆయుధములను సపరివార సమేతంగా అందరి పాదుకలను పూలతో పూజించి, నీటితో కడుగుచున్నాను.

**75.పంచమావరణః**

37................ మూలమంత్రమందున్న నవ భైరవీ దేవీల మూలరూపమగు మహా భైరవదేవీం మాతా మీ పాదుకలను.........నీటితో కడుగుచున్నాను జగజ్జననీ.

38.................... మూలమంత్రమందున్న కోప భావనతో నున్న భైరవదేవీం అంబా మీ పాదులకను పూలతో పూజించి, ............చండభైరవదేవీ జననీ.

39................ మూల మంత్రమందున్న సమ్మోహనపరచు శక్తిగల ఋ,ఋ భైరవదేవీం అమ్మా మీ పాదుకలను ....... పాదాలను నీటితో కడుగు చున్నాను ఋ,ఋ భైరవదేవీ మాతా

40.................... మూలమంత్రమందున్న మత్తు స్వభావంగల ఉన్మత్త భైరవదేవీం జననీ మీ పాదుకులను..... నీటితో కడుగుచున్నానుఉన్మత్త భైరవదేవీ అంబా

41. ........మూలమంత్రమందున్న భయంకరస్వరూపిణివగు భీషణ భైరవాదేవీ అంబా మీ పాదుకలను పూలతో......నీటితో కడుగుచున్నాను భీషణభైరవాదేవీ జననీ

42.......మూలమంత్రమందున్న మానవపుర్రెలను మాలగా ధరించి భీకరాకృతితోనున్న కపాలభైరవదేవీం...........నీటితో కడుగుచున్నాను జననీ.................

43............... మూలమంత్రమందున్న సర్వజీవులను సంహరించగల సంహారభైరవీ దేవీ మీ పాదుకలను.....పూజించి ........ నీటితో కడుగుచున్నాను మాతా.

44.......మూలమంత్రమందున్న బంగారాన్ని ఆకర్షించగల స్వర్ణాకర్షణభైరవీ దేవీ మాతా మీపాదుకలను.....పూజించి......నీటితో కడుగుచున్నాను స్వర్ణాకర్షణ భైరవీమాతా.

45..........మూలమంత్రమందున్న నవభైరవీ అంబలకు గల వాహనములు వారివారి శక్తులను, ఆయుధములను సపరివార సమేతంగా అందరిపాదుకలను పూలతో పూజించి.... కడుగుచున్నాను.................................................

**76.షడావరణః**

46............. మూలమంత్రమందున్న విశ్వేశ్వరీదేవీ దేవీ అంబా శుభకరమగు మీ పాదుకలను పూలతో.......... నీటితో .......... జగజ్జననీ..................

47.............మూలమంత్రమందున్న మా తండ్రి, తండ్రితరపు వారందరి శుభకరమగు పాదుకలను.............పూలతో.......నీటితో కడుగుతున్నాను. పితృదేవతలారా

48...................మూలమంత్రమందున్న మా తల్లి తల్లి తరపువారందరి శుభకరమగు పాదుకలను పూలతో......నీటితో కడుగుచున్నాను.........మాతృదేవతలారా

49............మూలమంత్రమందున్న నేనర్చించు సనారీ సద్గురుని, గురుని తరపు వారందరి నీ వారి ముఖ్యశిష్యుల శుభకరమగు పాదుకలనుపూలతో .....నీటితో ... గురువర్గీయ పుణ్యులారా.

50............... మూలమంత్రమందున్న మా వంశగోత్ర బ్రహ్మర్షీ దంపతులగు శీతేక్షణాదేవి సమేత పర్న బ్రహ్మర్షి శుభకరమగు పాదుకలను పూలతో .... నీటితో కడుగుచున్నాను. మావంశ ఆదిదంపతులారా.

51................ మూలమంత్రమందున్న నాకు జ్ఞానభిక్షనొసంగిన సాంబశివానంద రాజయోగి ఆచార్యుని శుభకరమగు పాదుకలను పూలతో పూజించి నీటితో కడుగు చున్నాను ఆచార్యదేవా!

52................సర్వులను వీరందరి పాదుకలను పూలతో పూజించి నీటితో కడుగు చున్నాను పుణ్యమూర్తులారా!

53................ మూలమంత్రమందున్న వీరందరి ఆయుధములను, వాహనములను వారిశక్తులను సపరివారసమేతంగా శుభకరమగు వారి..... పూలతో పూజించి నీటితో ........ కడుగుచున్నాను ముఖ్యమూర్తులారా.

54................మూలమంత్రమందున్న నేను చెప్పని మనవోత్తములందరి పాదుకలను పూలతో పూజించి పాదాలను నీటితో కడుగుచున్నాను ధన్యజీవులారా.

**77. తనుసంస్కారః**

1) 25 తత్వాలు జీవితో కలసిన ఎదుగుదలగల శరీరం పరిశుద్ధంకావలయును 2) జ్ఞానేంద్రియములు5, కర్మేంద్రియములు 5, ప్రాణాలు 5, మనసుబుద్ధికలసి 17 తత్వములుగల సూక్ష్మశరీరము పరిశుద్ధంకావలయును. 3) ఆత్మను పరమాత్మ కలిసిన కారణశరీరము శుద్ధికావలయును, 4) స్థూల,సూక్ష్మ, కారణ శరీరములతో కూడిన మహాకారణ శరీరము శుద్ధికావలయునని శ్రీ గంధాన్ని గానీ సుగంధద్రవ్యాలను గానీ చేతులకు రాసుకుని శరీరాన్ని తాకుట.





**78. భైరవపూజః**

భంకారశబ్దముతో నున్న మహా భైరవుడు మెడలో ముత్యాలహారము పూదండలతో పెద్దనాలుక చాపి ఏనుగువలే ఘీంకరిస్తూభయంకరములగు గొప్ప కోరపళ్ళు గల ఆకారంలో ఐదు శిరస్సులు గల కోటిమంది పరాక్రమంతో (శౌర్యంతో) పైకెగసిన తోకతో శరీరము కప్పబడి యుండి సర్వశత్రువులను సంహరించగలట్టి మహాభైరవా నన్ను రక్షించుకాపాడు.

79. అంటూ భైరవునిధ్యానించి పంచపూజలతో తృప్తి పరచవలయును.

80. ఓం-ఐం-బీజాక్షరప్రేరణగల ఆత్మతత్వమగు ఆణవమలాన్ని శోధించుటకు స్థూల దేహాన్ని పరిశోధించుటకు ఈ ప్రసాదాన్ని స్వీకరించుచున్నాను.

81. ఓం-ఐం- బీజాక్షరముల ప్రేరణగల విద్యాతత్వమగు మాయికమలాన్ని శోధించుటకు సూక్ష్మదేహాన్ని పరిశోధించుటకు ఈ ప్రసాదాన్ని స్వీకరించుచున్నాను.

82. ఓం -సౌః- బీజాక్షరముల ప్రేరణ గల శివతత్వమగు కార్మికమలాన్ని శోధించు టకు కారణదేహాన్ని పరిశోధించుటకు ఈ ప్రసాదాన్ని స్వీకరించుచున్నాను.

83. ఓం- ఐం-క్లీం-సౌః -అన్ని తత్వాలను శోధించుటకు అన్ని దేహాలను పరిశోధించుటకు ఈ ప్రసాదాన్ని స్వీకరించుచున్నాను.

**ఈ పరిగ్రహణమంత్రములచే తీర్థం సేవించిన, స్థూల, సూక్ష్మ కారణ, మహాకారణదేహములు పరిశుద్ధమగును.**

84. యిలా చెప్పుకుంటూ ఆ పీఠస్తుడుముందుగా ప్రసాదాన్ని తీసుకుని అక్కడగల ముత్తై దువులకు ప్రసాదగిన్నెలనిచ్చి మిగిలిన ప్రసాదాన్ని అందరికీ యిచ్చేది అందరూ ఈ మంత్రాలతోనే స్వీకరించాలి. కులమతబేధంలేకుండా అందరూ ప్రసాదాన్ని భుజించాలి.

85. వక్కలతో, కర్పూరపుపొడితో, తమలపాకులతో ముత్తైపు పొడితో గూడిన తాంబూలమును స్వీకరించుము దేవా.

86. నీటిలో ప్రకాశించే జ్యోతినినేనే ఆ జ్యోతిగా ప్రకాశించే బ్రహ్మనేనే, ఎవరునేనుగా ఉంటున్నానో ఆ బ్రహ్మంనేనే. నేనైఉంటున్నాను. బ్రహ్మమేనేను, "నేను నేనే" నన్ను నేను ఆహుతిగా అర్పించుకొంటున్నాను.

## స్థవశ్లోకములు (భక్తులు చేయువిశ్వేశ్వర స్తవః)

87. సర్వఅవయములకు విభూతిని ధరించిన పరమపురుషా, పరిశుద్ధమైనతత్వము గలిగి, మూడు కన్నులుగల విశ్వేశ్వరా, అమితముగా పూజింపబడుదేవా, ఆర్తులగు ఆపదలోనున్న నీభక్తులను రక్షించు మహాపతివ్రతయగు పార్వతీపతీ!

88. అమితమగుతేజస్సుగల అవధూతలకు నాయకుడా, అంతులేని విద్యా సంపన్నుడా, ఆ విద్యలే ఆభరణములుగా గలవాడా, అనంతమైనలెక్కలేనన్ని పాపాలను హరింపజేయగల అమోఘపురుషుడా, పార్వతీదేవికి అర్ధ శరీరానిచ్చిన అనేక రత్నమండలములకు ప్రభువా, నీకు నమఃస్సుమాంజలులు.

89. యోగముచేయుచూ, యోగవిద్యను ప్రచారంచేయుయుగపురుషుడా, పార్వతీదేవి మనస్సును జయించినవాడా, భక్తులను రక్షించుచూ పోషించుదేవా, నీకు నమస్కారము.

90. నందివాహనుడవగు"రుద్రుడా", నాట్యశాస్త్రమును చెప్పిన నాట్యప్రవీణా ఆదిపురుషుడవగు విశ్వకర్మా, యతీశ్వరుడవగు విశ్వనాధానీకు నమఃస్కారము.

91. **భక్తులు చేయు పార్వతీస్థవః-** విశ్వేశ్వరుని అర్ధాంగి, మృధుమధురగాయనీ, విశాలమగు తేజస్సుతో నున్న ప్రకృతిరూపిణీ, వైరాగ్యముతో యోగాభ్యాసము చేయు వారిని గాంచి వినోదించుదానా, నన్నుక్షమించి రక్షించుపరలోకనాయకీ పార్వతీమాతా.

92. సుకుమారమైన పద్మములవంటి పాదములుగల దేవలోకనాయికీ, అపార మగు దయగలదానా, భక్తులకులములు వృద్ధిచేయుదానా శ్రేష్ఠమయినకెంపులు పొదిగిన ఆభరణములుధరించి, ఆపదలు నాశనంచేయు మాతా, నమఃస్సుమాంజలులు.

93. **పార్వత్యువాచః-** సకల జ్ఞానముకళలతో ఎల్లప్పుడూ, ఆనందించు మయవంశ నాయకా, మేము ఉపాసించు విద్యాఫలాన్నిచ్చి అందరికీ ఉపకారంచేయుము దేవా.

94. **విశ్వేశ్వర ఉవాచ :** పార్వతీ వినుము, ఉపాసనస్థిరమైనది చక్కగా అర్థంచేసుకుని ఆచరించు వారికి ఆనందం, అమితమైన ఐశ్వర్యం, ఆరోగ్యముకల్గిశ్లేష్మరోగ నాశనమవు తుంది.

95. ఉపాసకులకు అద్భుతమగు వెలకట్టలేని ఐశ్వర్యములనిచ్చి, ప్రభుత్వసంబంధ ఉద్యోగములను వశంచేసి విద్యను దినదినాభివృద్ధిచేస్తూ, విజయాన్ని కీర్తిని వృద్ధిచేస్తూ

96. లోకజ్ఞానాన్ని దైవజ్ఞానాన్ని, భక్తిజ్ఞానవైరాగ్యములనిచ్చి, సృష్టిరూపాన్ని అణిమాది అష్ట సిద్ధుల ఫలితాన్ని, యోగసిద్ధితో గొప్ప ఫలితములను కలుగజేస్తూ





97. తనలో తనరూపాన్ని చూపించి, ప్రకృతిసంబంధ విషయములందు విరక్తిని దైవకార్యము లందు ఆసక్తి పెంచుతూ, నదీనదములందు పునీతులగుచూ, పదేపదే పుణ్యక్షేత్రములను దర్శించు వారికి.

98. అనేక శుభములనొసంగు శక్తిస్వరూపిణిని, ఎల్లప్పుడూస్మరిస్తూ, మహిమాన్విత మగు ఫలితములను పొందుచూ. మహామంత్రసాధనతో, మహాద్భుతమగు జ్ఞానరూపాన్ని పొందుటకు.

99. కుంకుమ, అక్షతలు, శ్రీగంధం, బిల్వదళములు, మందార, తామరపూలు, తులసీ మొదలగు సమస్త పత్రపుష్పములతో యధాప్రకారం పూజించాలి.

100. యిలా ఆశ్వయుజ శుద్ధ నవరాత్రులందు, ప్రతీపూర్ణిమ, శుక్రవారములు, ప్రతీనెలలో అమావాస్యపూర్ణిమలు, యింకాప్రతీరోజూ.

101 ఎల్లసమయములందూ జపంచేసుకుంటూ, మళ్ళీ మళ్ళీ యిలా ఎల్లప్పుడూ అచరిస్తూ ఎనిమిది సంవత్సరములు వయసుగల కన్యమొదలు 16 సంవత్స రముల వరకూ.

102 20,30 సంవత్సరముల వయసుగల బాల్యం, యవ్వనం గల సంసారులు, వయోవృద్ధులు, వేశ్యలుసైతము, విప్రులు మొదలు సర్వకులములు, కన్యలు సువాసినీలు, ముత్తైదువులు.

103 యోగినీలుసైతం,ఈ పూజాకార్యక్రమాలు యధాప్రకారం చేసుకోవచ్చును "మ" అక్షరముతో మొదలగు ఐదు తినుపదార్ధములు, మత్యం (చేప)మాంసము (వివిధ మాంసములు) మధు (తీపి పదార్ధములు) మనుః (పెరుగుతో చేసిన పదార్థములు)

104. మాషం (మినుములతో చేసినవి) ఈ ఐదురకములు తిను పదార్ధములు, వీటికిభేదం లేదు. ఏదితిన్నా ఒక్కటే, పరిశుద్ధమైనవి, తీపిపదార్ధములతో చేర్చి నెయ్యిపోసి తింటే మంచిది.

105. మామిడి పండ్లు, బెల్లం, పంచదార, పెరుగు, పాలు, అమృతసమానమైనవి, పరమాన్నము, బెల్లంపాలతో చేసిన చక్రపొంగలి తినే అన్నిరకముల అన్నములు మంచివే

106. మధ్యమధ్యన దైవానికి నివేదించిన గిన్నెలలో గల ద్రాగేద్రవపదార్ధములు సేవించుతూ, యిష్టమైన భోజనాన్ని కంటినిండా తృప్తిగాపెట్టి, దక్షిణ సహిత తాంబూలములతో ఆరాధించుటచే సర్వకోర్కెలుతీరును.

107. రుద్రాక్షలు, తులసి పూసలు, కెంపులు, స్పటికములు, తామరపూసలు, తాటి ఆకుతో చేయబడినవి, ఈ మాలలన్ని మంచిని చేకూరుస్తాయి

108. అంతులేని పరిశుద్ధమైనవి, పూజింపదగినవి అంతులేని ఐశ్వర్యాన్నిచ్చునవి, నిన్నుమించిన విజ్ఞ్యానం, నిన్ను మించిన సంపద

109 నిన్ను మించిన సర్వలోకాలు నీ కంటే రాజసం, నిన్ను మించిన శక్తి నిన్ను మించిన మానవులు.

110 నీ కంటే గొప్పకులం, నిన్ను మించిన భజింపదగినవారు, నీకంటే మేము కన్న సంతానం గానీ , నీ కంటే శరీరాన్ని నాశనంచేయగల వారు గానీ, పరలోకాన్నిచ్చే వారు గానీ లేరు.

111. లెక్కలేనన్ని యజ్ఞములు, అమితమైన అన్నదానములు, అనంతమైన గో దానాలు, కన్యాదానాలు, అనంతభూములు, బంగారుదానములు, అనంతమైన నదీ జలములందు స్నానమాచరించిన ఫలితములు కలిగి.

112. 1. ఆరోగ్యం,2. అమితమగు ఆయుష్షు, 3. వేయి అశ్వమేద యజ్ఞములు చేసిన ఫలితమును, 4. సంపూర్ణజ్ఞానమును, ఈ నాలుగు విధముల ఫలితములు లభిస్తాయి.

113. పూజలో యివన్నీ చెప్పి, తరువాత మంత్రపుష్పము చెప్పి, పుష్పములు,అక్షతలు, తులసీ, మొదలగు ఆకులు పీఠముపై వేసి, ఆఖరున.

114. నమస్కారము విశ్వేశ్వరీ దేవీ,అనేకమైన కోర్కెలుతీర్చి, అనేకమైన వరముల నొసంగుదానవు. నా శరీరమునే గృహమందు నివశించుచూ, భక్తులను కృపాకటాక్ష వీక్షణములతో చూచుమాతా నమఃస్సుమాంజలులు.

115. యిది అంతర్వేధియను సాధకుని హృదయాంతరమున, వశిష్ఠుని దేహమనే దేవాలయమున బ్రహ్మపీఠమను హృదయపీఠము పై వాయువ్య ఉత్తరభాగమున నీలకంఠుడగు నరసింహస్వామి ఆశీనులైయుండగా దక్షిణభాగమున ఆంజనేయస్వామి నిలిచియున్న సమయమున కుశలప్రశ్నలతో పార్వతీ విశ్వేశ్వరుల చర్చలలో విశ్వేశ్వరుడు పార్వతీదేవికి తెల్పిన రహస్యముగా నున్న వేదాంత విద్యావివరములను, మహామంత్ర యుక్తముగా పూజించుక్రమము, పదేపదే పూజించుటచే కలుగు ఫలితములు, పూజ ప్రారంభించి చేయవలసిన క్రమము, ద్వారాపూజ, పంచపూజ, గృహపూజ, సింహాసన ద్యానం, పార్వతీ విశ్వేశ్వరుల ధ్యానం, అభిషేకవిధానం, కలశధ్యానం, ప్రాణప్రతిష్ట, విభూతి మంత్రం, వస్త్రమంత్రం, గంధం, శంఖుస్తాపన, కలశస్థాపన, రావిఆకులు పెట్టుట, కొబ్బరికాయపెట్టుట, గణపతిధ్యానం, విశ్వకర్మప్రార్ధన, కేశవనామాలు చెప్పి సంకల్పం చెప్పుకొనుట, అర్ఘ్యంవిడుచుట, కుంకుమ, అక్షతలధ్యానం, బిల్వపత్రధ్యానం పుష్పపూజ, ధూపము సమర్పణ, దీపసమర్పణ, శంఖం ఊదుట శరీరాన్ని శుద్ధిచేయుట,





నైవేద్యముల బ్రహ్మశాపం, విష్ణుశాపం, రుద్ర శాపం, కృష్ణశాపం, శుక్రశాపం త్రిపుర సుందరీ శాపవిమోచనా మంత్రములు, ప్రసాదపాత్రలు పెట్టుమంత్రము త్రిపురసుందరీ గాయత్రీ ధ్యానం, నైవేద్యనివేదనా పద్ధతులు, మంత్రములు, ప్రధమ ఆవరణ, ద్వితీయావరణ, తృతీయావరణ, చతురావరణ, పంచమావరణ, షడావరణలతో మంత్రోచ్చాటనలతో పాదుకలను కడిగి పూజించుట, శరీరశుద్ధి మంత్రం, భైరవధ్యానం, ప్రసాదతీర్థములు పుచ్చుకొను మంత్రములు, తాంబూల మంత్రం, కర్పూర నీరాజనము, విశ్వేశ్వర ప్రార్ధనా మంత్రములు, పార్వతీ ధ్యానము, పార్వతీప్రశ్న, విశ్వేశ్వర సమాధానము ఈ పూజయొక్క ఫలితములు, ఈ 48 మంత్రములతో 16 రకముల ఉపచారములతో పూజించు పద్ధతులు కైలాస పర్వతపై భాగమున గల పరమేశ్వర సంస్థానమున ఆగమ శాస్త్ర బద్ధంగా చర్చించిన పార్వతీపరమేశ్వరుల సంవాదమందు మిక్కిలి పెద్దదైరివ్వున పోవు బంతివలే సాగిన మూడవ అధ్యాయ మందలి పై భాగము సంపూర్ణము.

**ఉద్వాసన మంత్రము :**

**యజ్ఞేనయజ్ఞమయజంతదేవాః ! తానిధర్మాని! ప్రథమాన్యాసన్**

**తేహనాకం మహిమానస్స చంతేయత్రపూర్వే సాధ్యాస్సన్తిదేవాః॥**

**అర్థం :** తత్వ వేత్తలు జ్ఞానయజ్ఞముచేత, యజ్ఞ స్వరూపుడగు భగవంతునిసేవించిన ఆ దివ్యమానవుల కార్యములే ముఖ్యమైన ఆదర్శములు అయినవి. ఏ పరమేశ్వర స్థాన మందు, ప్రాచీనులైన సాధకులు, దివ్య పురుషులు ఉన్నారో, అట్టి పుణ్యలోకమున ఎవరు జ్ఞానయజ్ఞము నొనర్చినారో వారు మహిమగలవారై పొందుచున్నారు.



## చతుర్థోధ్యాయః గురుపూజా ఫలితములు

1. **పార్వత్యువాచ** : శ్రీ శంభో, శివ, సర్వేశ, భూలోకమందలి వారికి సకల పూజా పద్ధతులు తెలియజేయండి. మిమ్ముమించిన జగద్గురువు లేరు కావున, సకల జనులు మోక్షంచెందుమార్గము తెలుపండి.

2. **ఈశ్వరఉవాచ :** శ్రద్ధతో విను పార్వతీ నిజగురుని సేవించు పద్ధతులు:- సర్వలోకములలోని జీవులు ఆచరించవలసిన పద్ధతులు.

3. ప్రపంచంలో గురువు ముఖ్యము ఆ సద్గురుని మంత్రం కన్నాగొప్పది ఈ భూమిపై వేరేదేమీ లేదు. గురుపూజ, గురుధ్యానం, గురుమంత్రాన్ని జపించుట.

4. గురుపాదతీర్థాన్ని సేవించుట, గురునికి నివేదించిన పదార్థాన్ని భుజించుట, గురువుకు శుశ్రూషలు చేస్తూ భక్తితో తను, ధన, ప్రాణములు సైతం అర్పించుటకు సిద్ధపడుట యివి గురువునకు శిష్యునిపై అనురాగం కల్గించునవి, యింకా గురు యంత్రానికో, రూపానికో, గురునామాలతో తర్పణలు చేయుట, సేవచేయుట, గురువుకు నైవేద్యము నివేదించి, వారిని కీర్తించుట.

5. గురుని వాక్యములు వినుచూ ఆనందించుట, గురుని చూస్తూ ఆనందించుట, ఈ 12 విధముల సేవలు శక్తి కొలది చేయుట పరలోకసౌఖ్యము కన్నా ఉత్తమమైనవి గురునామమే. మోక్షప్రాప్తికి గురువేశరణ్యము అట్టి గురువునకు నమస్కారము.

6. గురుసేవకు మించిన మంచి పని ఏమీ లేదు, గురువుకు మించిన సంపద ఏదీలేదు, గురువుకు మించిన విజ్ఞానం లేదు, గురువుకు మించిన దైవమూ లేదు. మోక్షప్రాప్తికీ గురువేశరణ్యము అట్టి గురుదేవునకు నమస్కారము.

7. గురువునకు కులమత జాతి బేధములు లేవు, గురువు కంటే మంచి పరలోకమూ లేదు. గురునిసేవ కంటే తక్కువైనదే బ్రహ్మపదం పొందటము, కావున ఎల్లప్పుడూ సద్గురునికరుణ కోసమే సాధనలు చేయాలి అట్టి గురుదేవునకు నమస్కారము.

8. ప్రపంచమందలి సర్వజనులకూ గురువే ఆధారం కావున పంచాననుడగు ఆగురువునే; సదా ధ్యానించాలి, పూజించాలి, కీర్తించాలి, అట్టి విశ్వకర్మ జగద్గురు దేవునకు నమస్కారము.

9. శరీరమందలి అన్ని తత్వాలు, పరలోకతత్వం, పరబ్రహ్మతత్వము కలిగి, సృష్టి, స్థితి, లయములకు కారణుడగు జగద్గురుని సేవించుటచే కలుగు ఫలితము అన్నిటికన్నా మిన్న. యజ్ఞయాగాదులుచేయుట, అనేక వేదములు, స్మృతులు పురాణములు





చదువుటకంటే, పరలోకదైవమగు సద్గురుని మనసా,వాచా, కర్మణ త్రికరణ శుద్ధిగా స్మరించుటే ఉత్తమము అట్టి మా గురుదేవునకు నమస్కారం. నమస్సుమాంజలులు

10. **పార్వత్యువాచ :** సర్వులనూ రక్షించు ఆగురువును ఎలా చూడాలి, ఎలా గుర్తించాలివారి గుణగణాలు ఎలా కీర్తించాలో ఈ ప్రపంచంలో చెప్పుము నందివాహనా, నాధా ఉత్తమగురువును ఎలా తెలుసుకోగలమో?

11. **ఈశ్వరువాచ :** ఆజ్ఞాచక్రమనెడి త్రికూటస్థానమందు నివశించుచూ, విజ్ఞాన కాంతులను ప్రసరించుచూ, అభయహస్తముతో నుండి,సదా సేవించువారి కోర్కె ప్రకారం ప్రజ్ఞావిశేషములనిస్తూ, అజ్ఞానాన్ని హరించుగురుదేవునకు నమఃస్సుమాంజలులు.

12. బాల్యంలో బ్రహ్మచర్యం, యవ్వనంలో గృహస్థధర్మం, కౌమారంలో వాన ప్రస్థజీవనం, వార్థక్యములో సన్యాసమనెడు, నాల్గు విధముల జీవనముగడిపి, పరిశుద్ధమగు, మనస్సుతో గుణరహితులైసంచరించు సర్వజీవుల యందు దయగల విశ్వకర్మకులోద్భవా గురుదేవా నమఃస్సుమాంజలులు

13. యమము, నియమము ఆసనము. ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం ధారణం, సమాధియను అష్టాంగ యోగములు ఆచరించుచూ, (గోపీ) రాధా యంత్ర యోగముద్రలను చూపిస్తూ, ఎల్లప్పుడూ మంచి పనులు చేయుచూ, నిజం చెప్పడమనే (సత్యవ్రతము) వ్రతాన్ని గట్టిగా ఆచరించుతూ.

14. శాస్త్రజ్ఞానము కలిగి, చేసే పనులు మంచి జ్ఞానముతో చేస్తూ ధర్మము, అధర్మము లనితెల్పుచూ, అన్నపూర్ణాంబయే భార్యగా, యితరస్త్రీలను తోబుట్టువులుగా భావిస్తూన్న మహనీయునకు (నమస్కారములు) నమఃసుమాంజలులు

15. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను అరికట్టి యింద్రియాన్ని నిగ్రహించి, జితేంద్రియుడై, మంచి హృదయము కలవాడై, పూజింపదగిన మానవునిగా, ఏ వ్యాధులు లేనివానిగా విశ్వకర్మకులమందు జన్మించి నట్టి మహనీయునకు నమస్కారములు.

16. అనేకలోకములుగా, లోకపాలకునిగా లోకసంబంధంలేకుండా కొన్ని చోట్ల తనప్రతిభతో సర్వలోకాలు నిర్మించినట్టి దేవాదిదేవుడగు విశ్వకర్మ జగద్గురువు నకు నమస్కారములు.

17. లోని పదాలు 23లోని పదాలు ఒకటే కావున 23 అర్థాలు చూచుకోవలయును.

18. మాసర్వకోర్కెలు తీర్చునట్టి గురురాజా, ఆనందతేజో మయా, శరీరమంతా విభూతి ధరించి దోషరహితుడవై జన్మించి, ఫాలభాగమున దృష్టి గలపావనుడా, మీ

పాదపద్మముల ధూళిని శిరస్సునదాల్చిన వారి హృదయకమల మందుండు వాడా, వినయవిధేయతలతో సదానిన్ను స్మరించెదను సర్వ లోకములకు గురుదేవా నమః సుమాంజలులు.

19. గురువేశివుడు, గురువే విష్ణువు, గురువేబ్రహ్మ, బృహస్పతీ, గురువు శుక్రాచార్యుడు, గురువుత్వష్ట బ్రహ్మదేవుడు(విశ్వరూపాచార్యుడు) వీరేజగద్గురువులు (కారణ గురువులు) వీరందరూ నీవర్చించు గురుస్వరూపులే.

20. విశ్వకర్మ పరబ్రహ్మ పరలోకాధీశుడు, విశ్వమంతా నిండినవాడు, విశ్వాన్ని సృష్టించి, పోషించు లయమొనర్చు సర్వకార్యములు ఆమహనీయునివే.

21. అలాంటి వంశములో జన్మించిన తాపసీ,శరీరతత్వాలను స్వాధీన పరచుకున్న గొప్ప మునీశ్వరా అహంకారాది వికారములులేని ఎలాంటి దోషములు లేని, నిర్మలమగు ఆత్మ గల నిజరూపా.

22. సర్వకార్యములు చేపట్టినట్టి విశ్వసృష్టికారుడు విరాట్‌విశ్వకర్మభగవాన్‌యే జగద్గురువు నమఃసుమాంజలులు.

23. శిరస్సున శిఖ, మెడలో దక్షిణభాగమున జందెము, నొసట విభూతి, మెడలోరుద్రాక్షలు ధరించి 64 విద్యలయందు ఆరితేరిన విశ్వకర్మకులమందలి ప్రముఖుడా గురుదేవా సనారీవిశ్వనాధా నమఃసుమాంజలులు.

**24. పార్వత్యువాచ :** గురువును వేయినామాలతో పూజించి సేవించుట మహా భాగ్యము, పూర్వజన్మలకర్మలు నశించును, ఓ మహాదేవా, మంచి వారి మనస్సు నందున్న మహాగురువగు నిను పూజించి ధ్యానించి కీర్తించెదను సనారీ.

**25. శంకరువాచ :** శ్రద్ధగావిను పార్వతీ, గురుని పూజించుట వలన కలుగు ఫలితములు తెల్పెదను. ఓంకారముతో మొదలై నమఃతో కూడిన నామాలు ఎల్లవేళలా, ఎప్పుడూ సర్వకాలములందు.

26. ప్రతీరోజూ ప్రతీ శుక్లపక్ష కృష్ణపక్షములందు, అన్ని నెలలందు రెండుపూటలా పూజా కార్యములు చెప్పినట్లుగా చేయుట, గురునామాన్ని సదాజపించుట, వినయ విధేయతలతో భక్తిపూర్వకంగా ప్రదక్షణలు చేయుట.

27. కర్పూర నీరాజనములతో తర్పణలు, హారతులిచ్చి కీర్తించుచూ, గురుభక్తులను, గురు శిష్యులను సేవించి పూజలు చేయుట, మహాపుణ్యాన్ని కల్గిస్తాయిదేవీ.

28. గురువుకు దక్షిణసమర్పించుట గొప్ప సంపదలనిస్తాయి, గురువుకు నమస్కరించుటచే గొప్ప రక్షణ కల్గుతుంది, గురువును ఎల్లప్పుడూ ధ్యానించుటచే మహాపుణ్యం లభిస్తుంది. యివన్నీ గురుసేవకు కల్గు ఫలితములు. దేవీ,





29. చాతుర్వర్ణములగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు యింకా అనేకకులముల సర్వజనులు, ఆనందంగా భక్తితో పూజించి నమస్కరించాలి, గురుదేవుని ప్రతిమను గానీ, ఛాయా చిత్రాన్నైనాసరే.

30. యిలా చేయుటవలన ఎల్లప్పుడూ సకల శుభములుకల్గుతాయి, సకల దోషములు శాంతించి, ధర్మ, అర్థ, కామ, మోక్షములు లభిస్తాయి.

31. గురుధ్యానముచే కీర్తి పెరుగును, గురుమంత్రజపముచే మోక్షము నొందెదరు, గురు తీర్థసేవనచే మహాపుణ్యము కల్గును, గురువునకునివేదించిన పదార్థములు భుజించుటచే అద్భుతమగుగొప్ప ఫలితములు చేకూరును.

32. గురువును సంతోషపరచి, వారికి యిష్టమగునట్లు ప్రవర్తించుటచే, శిష్యునకు మంచి గుణములబ్బును గురువు నీవుచేయుతర్పణలచే తృప్తిచెందును. గురువుకు సపర్యలు చేయువారికి ఎల్లప్పుడూ సౌఖ్యము కల్గును. గురువును అన్నాదులచే పోషించిన వారిని, శరీర కవచమువలే రక్షించి కాపాడుదురు గురువులు.

33. గురువును కీర్తించుటచే మనసు ఆనందమయమగును. గురువను రెండక్షరములు పారాయణ చే యోగధ్యానంలో సాధకుని సమాధిస్థితికి చేర్చును, గురు దర్శనము వారి మనసును ఉల్లాసపరచును, గురునికి కర్పూరనీరాజనములిచ్చుట చే జీవన్ముక్తికల్గును.

34. పార్వతీ యిట్టివారికి సర్వసిద్ధులు ప్రాప్తిస్థాయి, అమితమైన ఉత్తమ మహా ఫలితములు కల్గుతాయి, ఈ జగతిలో కంటికి కన్పించునదంతా భ్రమయే, గురువే ఎల్లప్పుడూ సత్యము శాశ్వతము, కావున యిట్టి దాని కొరకు సాధన చేయాలి.

35. గురుపూజ కంటే ఏదైవమూ లేదు, గురుపూజకు మించిన మోక్షము లేదు, గురుపూజకు మించిన ఏ యోగమూ లేదు, అట్టి గురుపూజాపద్ధతులు సక్రమంగా పాటించాలి.

36. గురుపూజకుమించినది ఏ పూజా లేదు, చూడడానికిగానీ, చేయడానికి గానీ ఎక్కడా ఏలోకంలోనూ లేదు.

37. **సనారీ ఉవాచ :** 16 రకముల ఉపచారములతో బిళ్వదళములు పూలతో పూజించాలి. సహస్రనామాలు చెప్పుచూ గానీ 108 నామాల పారాయణతో గానీ స్తుతించాలి. "గురుపూజాఫలితములు విను." కాలసర్పము యొక్క విషము ఔషధముచే ఎట్లు విరిగి మానవులు జీవించుచుండిరో "అట్లే" మానవులు తెలిసీ తెలియక చేసిన సర్వపాపములు గురుపూజా, స్మరణ మాత్రముచే నశించి పావనులగుదురు. ఆత్మ విచారణ సలిపి మానసారాధనతో ముక్తిని పొందుడని మానవులందరికీ తెల్పుచున్నాను.

38-39-40-41 యివి అంగన్యాస కరన్యాసంపంచ పూజలు.

- ః ఏతత్‌ఫలాని ః -

42. శ్రీసూక్తం, పురుషసూక్తం, భూసూక్తం, నమకం, చమకం, అఘోరమంత్రాలతో అభిషేకం చేసి, 16 రకముల సేవలు, యింకా సర్వోపచారములతో గురుని పూజించినచో.

43. అనంతమగు తీర్థములందు స్నానమాచరించి ఫలము, అనంతదానములు, అనంతవ్రతములు, అనంత మైన ఉపాసనలచే కల్గుఫలితము గురుధ్యానము తో లభించును.

44. **మంగళహారతి,** శుభములు, గొప్ప గుణములు గలవానికి గొప్పవానికి సౌందర్యము గల వానికి శుభములనొసంగువానికి, భ్యూమ్యాకాశములు అంతాతా నైనవానికి ఏ ప్రదేశములలోనూ కనుపించని దుర్లభమగు హారతి, మోక్షమొసంగువానికి వరాన్ని ప్రసాదించువానికి. మంగళహారతి.

2. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులూ, ఎనిమిది దిక్కులు పాలించు వారికి, దేవతలు, రాక్షసులు, దితిపుత్రులు వీరందరికి, అంతములేనివానికి (భూమిని మోయు అనంతనకు) మొట్టమొదట పుట్టిన శక్తికి, భువిపై జన్మించిన మహనీయులైన నరులకు వీరందరి కంటే మొదటివాడగు విశ్వనాథ గురుదేవులకు, శుభములు, శుభములతో మంగళహారతి.

3. యజ్ఞములు చేయుట, చేయించుట, వేదములు చదువుట, చదివించుట, దానంయిచ్చుట పుచ్చుకొనుట. సంధ్యావందనం, జపం, హోమం, దేవతా పూజ, ఆతిథ్యం, విశ్వేదేవతల కొరకు చేయుహోమం, వీటన్నింటినీ సక్రమంగా నిర్వహించినట్టి పూజనీయునకు, వీటన్నింటినీ సమభాగములుగా పంచి ఆచరించి, దుష్టజనుల యొక్క అనుమానములు నశింపజేసిన పరమేశా. పూజింపదగిన సన్మార్గుల మనస్సులందుగల గురుదేవా మంచి గురుదేవా మీకు శుభములు శుభములతో మంగళహారతి.

4. ఓం కారరూపుడా, యింద్రియ నిగ్రహం గలవారినాయకుడా. యోగంలో చెవులతో దశ విధనాదములను విను పద్ధతులను వేద ప్రమాణంగా బోధించు వారిలో అధికుడా. పరిపూర్ణ వేదాంతసారాన్ని సిద్ధించుకున్న విద్యారూపుడవు నీవే. మీ పాదములనుండి ముఖం వరకూ భక్తిప్రవత్తులతో మేమిచ్చు మంగళహారతిగైకొను గురుదేవామంగళహారతి మీకు శుభములు.

5. అన్ని కులములవారికి అన్ని చేతి పనులనిచ్చి అందరికీ జీవనాధారం కల్పించావయ్యా సర్వమూనీవైన ఓ దేవా పర్వతప్రాంత గిరిజనులకు పట్టణము లలో నివసించునాగరికులకూ అందరికీ అన్నీయిచ్చావు అన్నిలోకములకు గురువగు జగద్గురువా మీకు శుభములు శుభములు.





6. భూలోక సుఖములు కోరువారికోర్కెలు తీర్చడానికి యిలపై అవతరించిన ఆత్మబంధువా, "అవధూతదేవా" మా సర్వస్వాన్నీ నీ కర్పించి సంతోషముతో సత్కరించు తాము గురు ప్రముఖుడా మీకు శుభములు శుభములు.

7. విష్ణుభక్తసముదాయంలో విస్తారముగా వీరశక్తియుడవై వెలసినావు విష్ణుభక్తులను, శివభక్తులనూ కలసిన విశ్వానికినాధుడా జగత్తునకు గురువగు జగద్గురువా మీకు శుభములు సద్గురుదేవా మీకు శుభములు శుభములు.

8. భూమిపైన గల జనులందరికీ ఆధారముగా నుంటూ ఆరు మతముల వారికీ ఆధారదైవముగా నుండి మా యింటి ( మాశరీరము) లో నివశిస్తూనిజమగు మీ భక్తులను కాపాడుము. పరిశుద్ధదవగు గురుదేవా మీకు మంగళహారతి నిస్తున్నాము. సద్గురువామంగళములు జగద్గురుదేవా మీకు శుభములు శుభములు. మా మంగళహారతి స్వీకరించుమద్గురుదేవా!

## - ః సనారీవిశ్వేశ్వర సహస్రనామావళి ః - (స్తోత్రం)

వీటన్నింటికి మొదట పరమాత్మా, ఆఖరున మీకు నమఃసుమాంజలులు యిలా చెప్పుకోవాలి.

1. శుభములనొసంగు కీర్తిగల జగద్గురుదేవా, దైవమా, సమర్ధతగలగురురాజా, సత్‌పురుషా ఎల్లప్పుడూ సుఖసంతోషములు నిర్మలమగుమనస్సుతో నుంటూ.

2. దేనియందూ మోహములేని ఆనందరూపా, జగత్‌ను సమ్మో హింపజేయు రూపుతో, అమితమగు ఆనందముతో, నుందు అంతము లేనివాడా, హఠయోగీశ్వరా మా భవిష్యత్ నెరింగి,

3. మా పూర్వజన్మదోషములు నాశనంచేసి, మరుజన్మలేకుండా చేయువాడా, అంతర్లక్ష్య, మధ్య లక్ష్య, బహిర్లక్ష్య మనుయోగములచే సిద్ధిపొంది, సత్‌బుద్ధితో ఆది దేవతలనారాధించి,

4. అజ్ఞానాన్ని నశింపజేయుపరిశుద్ధుడవై, సర్వమంత్రతంత్రములనెరింగి, ఋషీశ్వరుల ఆరాధనచే తృప్తిపొంది, మద్యం, మాంసం, క్షీరాన్నము, దద్ధోజనము, గారెలు భుజించుచు, సకల శుభములు గల సత్‌పురుషుడవై,

5. యింద్రియములను జయించి, మీ చుట్టూ అనేక శుభములు గలిగి సృష్టికార్యము నిర్వహించి, దోషరహితుడవై, దేవతలను ఆవాహనచేసి, మీ హృదయాగ్నితో బ్రహ్మయజ్ఞము లాచరించిన మంచి రక్షకుడవు, సత్వగుణుడవు.

6. మీదేహమందలి జ్యోతితో, అగ్నికార్యము చేసిన రజో గుణుడవై యజ్ఞకర్మల నాచరించి భక్తుల సర్వకోర్కెలు తీర్చుచూ, దక్షిణ దిక్కున ఉంచిన అగ్నితో పితృదేవతలకు పిండప్రధానమనెడి మహాయజ్ఞము చేసిన పరాత్పరుడవు.

7. రేతస్సును శిరస్సుకు నడిపి, ఎలాంటి ఆటంకములు లేక, దుర్మార్గులకు దుష్టులకు ఆటంకములు కలుగజేయు సులక్షణ సంపన్నుడవు, అన్ని రకముల ఆహారములతో తృప్తిచెంది, అన్ని రూపములతో, భక్తుల మనస్సుకు ఆనందం కల్గించుచూ ఆకర్షించుచూ.

8. శక్తిస్వరూపము శివరూపములతో ఆదిశంకరు (విరాట్‌విశ్వకర్మ)ని వలన ఉద్భవించి, మంచి శోభతో శ్రేష్టమగు వరములనొసంగు విష్ణు స్వరూపుడవు, సర్వ ద్వేషములను నశింపజేయువాడవు కైలాసాధిపతివి.

9. సంస్కృతాంధ్రములు వాక్కుగల పరబ్రహ్మవై జగతికి ప్రభువు వై చంద్రుడు ఎడమ కన్ను గల వజ్రదేహంతో అమృతతుల్యమగు వాక్కుగలవాడవు. శరీర ఎడమ భాగముందు పార్వతీదేవిగలవాడవు.

10. మహాతేజస్వివి సుందరుడవు, సూర్యుడుకుడికన్నుగల సర్వభూతనాయకుడవు, మంచి రూపముతో అన్నిటాయిష్టుడవై, జగతిని పాలించి పోషించు అధికారివై, అన్నీ తనయందు కలుపుకొనుచు,

11. లయ కర్మ మరియు, కారణదేహము యొక్క విధి మరియు లాంబికాయోగము నాచరించి, శాంభవీముద్రయందుండు శాశ్వత ఆనందరూపుడవు.

12. దిక్పాలకులకు అధిపతివి, లోకానికి అధిపతివి, లోకనాయకుడవై, లోకాన్ని పావన మొనర్చినగౌతమీ నదీ ప్రాంతనివాసివై పాలకొండలో నున్నవాడవు.

13. పద్మాసనముతో నున్న మయబ్రహ్మవంశీయుడవు, తామరరేకులవంటి కంటి చూపుగల ఐశ్వర్యవంతుడవు, ఎవరూలేనివాడవు అందరికీ అధిపతియను కీర్తిగలవాడవు.

14. నామపారాయణ చే ప్రీతినొందు నందివాహనుడవు, నాట్యప్రియుడవు, స్పష్టతచే కూర్చువాక్కును, సుమనస్సుగలసంతోషివి, భగవంతుడున్నాడని వేరేదీ లేదనువాడవు పెద్దవస్తువుకన్నా పెద్దగా, సూక్ష్మవస్తువు కన్నా అతి సూక్ష్మమై వుంటూ.

15. అణిమాదిసిద్ధులను పొంది సఫలుడవై యక్షగానముచే ఆనందించుచూ, శుక్లపక్ష కృష్ణపక్షము లందు వింజామరలతో సేవలందుచూ,

16. సింహాసనముపై నుండి గొప్పవగు వింజామరలతో సేవలందుచూ కాళీ, గాయత్రీ సావిత్రీ దుర్గాభైరవరూపములతో నుండి,





17. మీ శరీరమందలి అన్ని అవయవములు భక్తులచే ఆరాధించబడుతూ, స్వయంప్రకాశంతో ఉత్తమమగు ఆరాధనలు, మధ్యమ ఆరాధనలు, సూక్ష్మ ఆరాధనలు పొందుచు భక్తులను పాలించువానికి.

18. లక్ష్మీరూపుగల స్త్రీలపూజతో తృప్తినొందుచు, సత్‌పురుషుల పూజకు పరవశించుచూ, సంగీతముచే ఆనందించుచూ, భూత, భవిష్యత్‌ల నెరింగిన వానికి.

19. అన్ని మంత్రముల, అన్ని యంత్రముల, అన్నితంత్రములందు సాటిలేనివానికి, శరీరావయములన్నింటికీ విభూతి ధరించిన వానికి, నాట్యముతో పరవశించు భద్రుడు, రుద్రరూపులైన శుభకరునకు.

20. సర్వశుభములు గల వాక్కు భూషణమై, విశ్వకర్మ వంశము నందు జన్మించి, తుర్యావస్థలో దివ్యనాదములు వినుచూ, శుభమగుధ్వనులు తన చుట్టూ ఆవరించి యున్నవానికి.

21. హృదయమందు అమితసాహితీ భావనలు కలిగి, వాక్కు సంకీర్తన భజనలతో కీర్తింపబడుచున్న బ్రహ్మజ్ఞానులందరిలో ఉత్తముడవు, త్రిమూర్తులలో గొప్ప వాడవు జనులందరిలో ఉత్తమునకు

22. ఏ దిగులు లేనివాడవు, మంచిఆలోచనలు గల వాడవు యితరుల మనసునకు ఆనందంకల్గించువాడవు మూడవకన్ను గలిగి, అంతరాత్మలో చేయుయోగము అందు తృప్తిచెంది, ఉల్లాసముగా నుండి, బాహ్యయజ్ఞములందు ప్రియుడవై భక్తులతో సఖ్యతతోనున్నవానికి.

23. ఎర్రని ఛత్రము(గొడుగు)తో ఎర్రని వస్త్రాలు ధరించి రత్నములు పొదిగిన వేదిక పై, రాజభోగములతో నివసించుచూ మతసంబంధకార్యాచరణయను సాగరమున మధ్య నుండి కారణశరీరకార్యములు గమనించుచూ.

24. గాంభీర్యముగా లోతుహృదయముతో నుంటూ భక్తుల చెడు కోరికలు నశింపజేసి, కలిప్రభావముచే కల్గు దోషములు నశింపజేసి మానవులను కాపాడుచూ, ఆవువంటి సాధు స్వభావములతో నుంటూ గొప్ప యజ్ఞములందు ప్రీతితో తన్నాశ్రయించిన వారి యందు దయగలవానికి.

25. మంచి రూపము మంచి గుణములు కలిగి, సత్వ,రజ,తమోగుణముల నణిచి, ఆది గుణములు గలట్టి మాయకు చిక్కని అతీతుడవై గొప్ప భూత, తత్వముతో మంత్రతంత్ర విద్యలెరింగిన శివస్వరూపునకు.

26. కాంతిచిహ్నముతో భూమిపై తిరుగుచూ, ఆకాశగమనము సాధించి, పూర్తిగా మనస్సును స్తంభింపజేసి, మనస్సున ఆలోచనలనాపి అచలసాధనలో చలించని వానికి.

27. శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానమను, ఆరు యోగములు సాధించి మంచిగుణముగల్గి, రజస్సత్వతమోగుణములు వదిలిన, నిర్గుణుడవై మాయనుకల్గించు మోహినీ తంత్రవిద్యలనెరింగి, వాటికి చిక్కక గొప్ప మంత్రములు సాధకులకిచ్చినవానికి.

28. గొప్పకులమునపుట్టి కులబేధములు నశింపజేసి, ఆర్తులగు అన్ని కులముల వారినీ రక్షించుచూ అన్నీతానై అన్నింటినీ సృష్టించిదైవమునకు మారుగా నున్నవానికి.

29. పంచతత్వములందు ప్రియముతో అన్నితత్వములతో మెలగుచు, ఐదు తత్వాత్మలతోస్థిరంగా ఉంటూ, ఎలాంటి ఆసనములేని పరిశుద్ధమగు జ్ఞానముతో, జగత్సర్వాన్ని స్థిరాసనంగా చేసుకున్నవానికి.

30. సృష్టి అంతటా ఆవరించి సర్వమూ ప్రదక్షిణగా తిరుగు పీఠము, అన్ని పీఠములలో గొప్పదైన భూమి పీఠము నధిష్టించి, అంతటా సాక్షిగానుంటూ స్వస్వరూపముతో సర్వాన్ని త్యజించిన మంచి రక్షకునకు.

31. సమస్తజీవకోటి లింగస్థానమందుండి కోటిలింగాలు గల ఈశ్వర సన్నిధానమే నిజఆలయమై, ముల్లోకములకు తండ్రియైతండ్రుల తండ్రియై సర్వమూతనలో కలుపుకొనుచూ, శ్మశాననివాసియై తండ్రిని విడిచినవానికి.

32. ప్రేతార్చనచే ప్రేతాత్మలకు మోక్షమిచ్చువారిలో ప్రధానుడై, యజ్ఞ ప్రియుడైన యజ్ఞస్వరూపుడు యజ్ఞపాలకుడగు యజ్ఞాగ్నివినీవే స్వామీ

33. అన్నియజ్ఞముల స్వరూపుడవై, అన్ని వ్యాధులనివారించుచూ వాతతత్వముగల, వాతరోగరూపియై వాత దోషాలను తగ్గించువానికి.

34. శ్లేష్మతత్వముగల శ్లేష్మరోగరూపియై శ్లేష్మదోషాలను తగ్గించు వాడు, పిత్తతత్వము గల పిత్తరోగరూపియై పిత్తదోషాలను తగ్గించువానికి.

35. ఆణవమలము, మాయికమలము, కార్మికామలము, లను శోధించి శుద్ధి చేయుచూ ఆ మూడు స్థానములందుండువాడును, మూడు శరీరములు అలంకారము లతో సకల లోకములు నిర్మించి పోషించి రక్షించు రక్షనాయకునకు.(స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు)

36. తనచుట్టూ తేజో వలయంగల తేజోరూపుగలిగి, కాంతికిరణములను యితరు లపై ప్రసరించు అమితమగు తేజస్సు గలిగి, కళలను వశపరచుకొని పరిపూర్ణ కళామయుడైన కళాశాస్త్ర పండితునకు.





37. సుజ్ఞానాన్ని భక్తులకిచ్చు జ్ఞానశీలుడై, పరిపూర్ణ జ్ఞానులమనసులు దోచు కొనుచూ, జ్ఞానమే తన జీవనోపాదియై జ్ఞానగుణములతో జ్ఞాన శీలాన్ని పాలించువానికి.

38 (ఏ)నాదమై నాదమే రూపముగలవాడివై, నాదమందులీనమై అగోచరుడవై, నాదము ద్వారా సమస్తక్రియలు నెరవేర్చు వాడవై, సమస్త మూలికల యందున్న వానికి

38. (బి) బ్రహ్మరూపమగు నాదముగలబ్రహ్మస్వరూపుడు, స్వాధిష్టాన చక్రమందలి బ్రహ్మతోకలిసి మానవనేత్రానికి దొరకక, బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించుచూ, నీతి పాలకుడై, నీతి తప్పక ఏ వృక్షమూలములందూ తపస్సు చేయక ఏమూలిక సర్వరోగ నివారిణియో దానియందున్నవానికి

39. శ్రీశైల పర్వతపై భాగమున రాజలాంఛనములతో సభగలిగి, అచట తపస్సు చేసి సిద్ధిపొందినగురుప్రియుడు, వననివాసి, దోషరహితుడై భక్తుల పాపములు నశింపజేసి, అశుభముల నుండి తప్పించువానికి,

40. (ఏ) అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, బంధువులు అనే వ్యామోహములు లేనివానికి సమస్త పదార్థములు సమదృష్టితో భుజించువానికి

(బి) తోబుట్టువులు లేని, తన వారినందరినీ తనలో ఐక్యము చేసుకున్న సోదరులు లేని, సోదరీలు లేని, ప్రసాదపు గిన్నెయందలి క్షీరాన్నప్రియుడు, సృష్టిలోని ఫలములను తినువానికి

41. పరిశుద్ధ హృదయములందుండువాడు, మూడుమలములను శోధించి పరిశుద్ధుడై, శాశ్వతదేహముగలిగి ఓర్పుగలట్టి మనసురూపములతో నుండి ఏ మార్పులేని వానికి.

42. కరక్కాయ, తానికాయ, ఉసిరికాయలు తినుచూ, యివి ఆరోగ్యానికి మూలమని తెల్పుచూ భూతభవిష్యత్, వర్తమానములనెరింగి, స్థూల, సూక్ష్మకారణ దేహము లతో (అణురూపిగా పనులు చేయించుచూ శివశరీరముతో) అతీంద్రియ జ్ఞానము చూపిన వానికి.

43. ఆకాశగంగనుచూపి, మహాబలముతో తుచ్ఛములైన కామాది వర్గములగు శత్రువర్గాన్ని మొదలంటానాశనంచేసి, ఆత్మపూజను ప్రత్యక్షంగా చూపిన వానికి. (ఆత్మారాధనచే కన్పించువానికి)

44. సమస్త సృష్టికి తల్లివై, తండ్రివై, పుత్రవ్యామోహ వర్జితుడవై, చెరుపు చేయని శ్రేష్ఠుడవై సమస్త వర్ణముల వారికి శ్రేష్ఠుడైన వానికి.

45. గొప్పవానికి, అతిగొప్పవానికి, ఏ గుణములు లేని పరిశుద్ధునకు పరమాత్మ యగు ప్రాణవాయురూపునకు, వాయుస్థంభనాసాధకునకు.

46. ఎట్టిహింసాకార్యములు చేయక, అనేక జీవరాసులందున్నవాడు, ఎల్లప్పుడూ గొప్పరూపములతో చల్లని చంద్రకాంతితోనుంటూ, రాజభోగములనుభవించు రారాజుయై అనురాగముతో భక్తులను ఆదరించు వానికి.

47. సదాసంతోషముతో నుంటూ కోపము, అసుయా రజోగుణముల నంతం చేసుకుని మనోహరములగు సంకల్పమును సాధనచేసి, దేశజనులందరికీ ప్రియుడైన తేజోరూపుడు, గ్రహరాజువలే నుండి సంసారియైన యోగికి.

48 ఓరకంటి చూపుతో కటాక్షించుచూ, ఉన్నది ఉన్నట్లు చెప్పుచూ, స్త్రీలేని ఏకాకి, శరీర సగం నారితో ప్రకాశిస్తూ, భార్యయందు ప్రేమతో, నారితో కూడిన "సనారీయై" శుభములిచ్చువానికి.

49. భువిపై శుభములనొసంగు గృహస్తుడై, శుభస్థానములందు స్థిరంగాఉండి అనేక శుభములనిస్తూ సర్వశుభములతో కూడి పార్వతీదేవిని ప్రీతితో కలిసిన అర్థనారీశ్వరునకు

50. స్త్రీల చే కూడి సేవింపబడుచూ, లింగపూజను సాక్షిగా చూపి, మోక్షాన్నిచ్చి ఉద్ధరించుచూ ఆడదిలేనివాడైయ్యు బాలతో కూడిన వానికి.

51. బాలను తనలో ఐక్యము చేసుకుని జీర్ణించుకుని, పాపకార్యములు చూడని కన్నులుగలట్టి సప్త చక్రాలలోని దేవతలను సదా అర్చించుచూ 9 ఆవరణములు కలిగి 16 కళలుగల చంద్రునివలే అందరిచే మోహింపుబడువానికి,

52. స్త్రీ పురుష సంపర్కమును బోలు లింగరూపముతో, శోభాయుక్తమగు కులమందు ఉద్భవించి సాక్షాత్‌శివునివలే భక్తుల భయాన్ని నశింపచేయుట యందు ఉత్సాహముగల, గగనప్రకాశపతాకనాయకునకు.

53. సతీసుతులను, ధనాన్నీ త్యజించి, సూర్యచంద్రులున్నంతవరకూ ఉండి, మధుర మగువాక్కుతో, కలయికయందు, ఎడబాటునందు, కలుపుటయందు వీటన్నింటి యందు యిష్టునకు.

54. అన్నీచేయుట, అన్నిటినీ భరించుట మొత్తం భూమిపై జనులను రంజింప జేయుట, మాటలతో వాదించుట, వాదించి మెప్పించుట, సిద్ధించు మాటపల్కుచూ సర్వమూ ఎరింగినవానికి.





55. మంత్రస్వరూపుడు, తానేమంత్రమై, అనేకమంత్రములనెరింగిన, పరమేశ్వరుడు, తన ఆత్మయందు అనేక మంత్రములు గల్గి, నిజరూపులేనివాడై సత్యమనే సముద్రమును సాధించినవానికి.

56. మృత్యువును జయించి, తానే మృత్యువై, మునియనే మంచివ్రతాన్ని ఆచరించి, మోహము కల్గించు రూపముతో, మొదలు చివరలేని మొట్టమొదటివాడు, మొదటి పేరుతో అంగులిముద్ర (ముద్దుటుంగరము)గలవానికి.

57. సజాతీయులలో గొప్ప ప్రతిభగల ముఖ్యమైనవానిగా, ముక్తిని ప్రసాదించగల వానిగా, ప్రశంసలందు ఆసక్తిగల్గి, ప్రశంసలు పెరిగి, ప్రశంసేతానై ప్రశంసలతో ఉపచారము పొందువానికి.

58. ప్రశంసలందు యిష్టుడు, యోగముద్రలతో భోగముననుభవించుచూ, సదా యోగ మందుండు శాంభవీ ముద్రనాయకుడై, ముద్రసాధనలు చేస్తూ, వాటిని రక్షించుచూ ముద్రలయందు ఆసక్తితో యోగముద్రలే యిష్టసఖునిగా యున్నవానికి.

59. యోగసాధనలో నిపుణుడై, యోగసాధనానిపుణులచే పూజింపబడుచూ, యోగ సాధనా పద్ధతులను బోధించుచూ, మౌనదీక్షలో నుండి, జ్ఞానము అజ్ఞానమని నిర్ణయించి తెలుపు ఆత్మజ్ఞానం బ్రహ్మజ్ఞానం కలసి యున్నవానికి.

60. స్తోత్రములు చేయువానికి, పాటలు పాడనివానికి, స్తోత్రము వినియోగించని వానికి, స్తోత్ర స్వరూపునకు, ప్రమధగణనాయకునకు, సర్వమత స్వరూపునకు, మతద్వేషములనణచిన వానికి, మతరూపునకు సర్వ మతప్రియునకు.

61. గిరిజాతనయ ఆరాధించువానికి, మూలగ్రంధస్వరూపునకు, తేనె అభిషేకముతో తృప్తి పొందువానికి, రక్తమాంసశరీరునకు, మాంసము మాంసేతరములు ప్రీతితో తినువానికి.

62. ఆహారప్రియునకు, ఫలములందిష్టునకు, నేరేడు, మారేడు ఆకులయందు యిష్టునకు, చెక్కెర జలము త్రాగువానికి, నీటిని సేవించువానికి పాయసాన్నమందు యిష్టునకు, యితరులకు బ్రహ్మజ్ఞాన సాధనాపద్ధతులు చెప్పువానికి.

63. యోగప్రియునకు, యోగమే అలంకారముగా ఉన్నవానికి, యోగశ్రేష్టునకు, మంచి యోగికి, యోగీశ్వరులచే పూజింపబడువానికి, యోగినీ సేవలందు వానికి.

64. ఏ చింతలూ లేని ఆలోచనా స్వరూపుడై భూలోకమున భయంకల్గించురూపుతో, భక్తులను ఆదరించు సామర్థ్యము గలవానికి

65. ఆర్తులైన భక్తులను రక్షించు ఉత్సాహము గల ప్రాణస్వరూపునకు, (అపాన వాయువును ఆపి) ప్రాణవాయువును నిల్పి, శ్వాసను స్థిరంగా ఉంచినవానికి.

66. సర్వభోగములనుభవించు సుఖస్వరూపునకు, సుఖములు యిచ్చువారిలో ప్రధముడై సర్వసుఖములు చేకూర్చు పుణ్యాత్ముడగు పురుషుడు, భుక్తిముక్తుల నిచ్చుచూ, గొప్ప విద్వాంసుల ప్రియునకు.

67. బోధించుటయందు ఆసక్తి గల వేల్పులలో ఉత్తమునకు, శ్రేష్టమగు స్త్రీ పురుషులచే పూజలందుచూ, నారితో కూడినవాడు, (సంసారధర్మాన్ని ) ధర్మాన్ని అధర్మాన్ని వదిలినవానికి.

68. మంచిధర్మాన్ని పోషించుటయందు ఆసక్తుడు, సాధ్యాసాధ్యములగు కార్యములు సాధించిన (మిధ్యా)రూపుడు, మాయలేని స్వరూపుడు అగు ప్రతిమరూపుగల మంచి లక్షణములుగల వానికి.

69. నశింపులేని శాశ్వతుడై ఆశ్చర్యము గలించు, ఊహకందని కార్యములు నెరవేర్చి భ్రమలు తొలగించి, ఆకాశరంగు శరీరముతో మేఘవాహనుడై పులిచర్మాన్ని ధరించిన వానికి.

70. శివునివంటి ఆత్మశివరూపుతో, సర్వఅవయవములందు శివలక్షణములతో, శివునివలే జీవించి శివునివలే ప్రవర్తించి, పాదరసంతో వాదముచేసి శివలింగము ప్రతిష్టచేసినవానికి.

71. యిరవై అయిదు తత్వములందు ఆదియగు ప్రకృతి స్వరూపముతో, శివలింగా న్నర్చించిన వాడు సదాశివునితో కలసియుండి శివలింగాన్నిస్థాపించి, కాపాడిదండక మండలకాషాయాంబరములు ధరించి, స్త్రీపురుషలింగభేదాన్ని గమనించువానికి.

72. శివలింగముతో సమానమై, శివునివలే వరములిచ్చుచూ, సర్వజనులు లింగా న్నర్చించుట యందుతాను తృప్తిపడుచూ, లింగసేవలు చేయు శివమతస్తుడు, లింగములు కనుగొనుచూ, కాషాయ, కమండలము జటా ధారణగలవానికి.

73. పరమాత్మ స్వరూపుతో, తన ఆత్మను పరమాత్మలో కలుపుచూ, ఈ విషయాన్ని ఎల్లప్పుడూ బోధించుచూ, తత్వయోగాన్నిచ్చుచూ, పరమాత్మతో ఏకమై పంచ భూత గుణములతో మెలగువానికి.

74. 25 తత్వములతో గల ప్రపంచముతో కూడి, శరీరమందలి 25 తత్వాలను శోధించిన నిద్రాసక్తుడు, నిద్రలేక యోగనిద్రలో ఎల్లప్పుడూ ఉన్నవానికి.





75. నియమిత నిద్రతో శాంతస్వభావముతో, ఎట్టికళంకములు లేని ధర్మసాధకుడు, తనలో తానుండి మనస్సును స్వాధీనపరచుకుని, వశీకరణ శక్తిగల సుందరమగు కామచింతన గలవానికి.

76. మన్మధుని నశింపజేసినవాడు, మానముగల స్త్రీకి సైతమూ మోహము కల్గించుచూ, అందరినీ ఆకర్షించుచూ, సత్యము పల్కు స్వభావముతో సత్య వ్రతము నాచరించిన వానికి.

77. మతవిషయములందు ఆసక్తితో, మతసంబంధకార్యములు చేస్తూ, మత ధర్మములు కాపాడుచూ, మతధర్మములే అన్నపానీయములుగా, మత ధర్మముల సాక్షిగా నుంటూ, నిత్యకర్మలకు దూరముగా నుంటూ మతకార్యములు చేయుచూ, చేతివృత్తులు చేయువానికి.

78. మతసంబంధకార్యములు వృద్ధి చేయుటకై జన్మించిన " సృష్టికర్తయై " ఏ యితరపనులు చేయక తారాస్థాయికి జేరిన సత్యవ్రతుడై బ్రహ్మాన్ని చేరుకార్యము తానా చరించి బోధించినవానికి.

79. ప్రతాపవంతుడై శరీరసగభాగాన్ని శక్తికిచ్చి "సనారీయై" అంతములేని మూడు రేఖలు గల విభూతిధరించుచూ, ఏదోషములు లేని గొప్పచరిత్ర గలిగి అందరికీ ఆరోగ్యానికి అవసరమగు వనమూలికలు వశపరచుకున్న వానికి.

80. సర్వాన్నీ స్వాధీనపరచుకో గలట్టివాడై, వశపరచుకొనుభావాలుగల వాడై, తప్ప కుండా వశపరుచుకో గల శంకరుడై, అన్నిటినీ వశపరచుకున్న, శృతి, స్మృతులలక్షణాలు గలవానికి.

81. వేదశాస్త్రోక్త విధిగా ఎల్లప్పుడూ పల్కుచూ, గర్వము లేని మంచుపర్వత ప్రభువునకు, చిన్ముద్రలో నుంటూ చిత్కళలే జీవనమై సుజ్ఞానముగలిగి, ఎలాంటి కదలిక లేక స్థిరంగా యున్న ఆకారునకు.

82. జ్ఞానానికి మారుగా నుండి జ్ఞానం పొందుటే లక్ష్యమైన పరిపూర్ణజ్ఞాని, జ్ఞానాన్ని పొంది అజ్ఞానాన్ని పారద్రోలి ఆరోగ్యం ఆనందాన్నిచ్చు ధన్వంతరిని పూజించు చూ ఎట్టి కళంకము లేనివానికి.

83. తనతోసరిలేనివాడు ఏదోషములు లేని నిర్మలుడు, ఆనందస్వరూపుడు, సత్యమగు వానికి యోగ్యమగు దేహముతో, పంచభూతములను వశపరచుకొని, వాటికంటే అధికుడైనవానికి.

84. పంచభూతముల యందు దృష్టికలవాడై, నియంత్రించుచూ, యోగ్యమగువాటిని సాధించి, దుష్టభూతములను నాశనంచేసి, పంచభూతముల లక్ష్యాన్ని గమనించు చూ, భూచరీయోగముతో చూస్తూ యోగీంద్రులనుకాపాడుచూ, మంచి వారిని యిష్టపడు వానికి.

85. సుకృతరూపుతో సుకృతము పొంది, సుకృతమునొసంగు కీర్తనలు వినుచూ, వీనుల విందుగా ఆనందించుచూ, దుష్కృత్యములను నియంత్రించుచూ, చైతన్యపరచి.

86. రాజులమూలపురుషులతో పూజలంది, సర్వాలంకారములు, సర్వ శాస్త్ర సారాన్ని సాధించి, నాలుగువేదములను మనస్ఫూర్తిగా ఆచరించి, బ్రహ్మ చర్య, గృహస్తు, వానప్రస్త, సన్యాసి, ఈ నాల్గు ఆశ్రమాలు సాధించినవానికి.

87. చతురత బుద్ధి సమృద్ధిగా నుండి, ధర్మ, అర్థ, కామ, మోక్షములు సిద్ధించుకుని, బ్రహ్మ, క్షత్రియ వైశ్య, శూద్రకులముల వారి కోర్కెలు తీర్చుచూ, విషాన్ని త్రాగి, విషము శరీర మందు నిల్పి విషదోషాన్ని హరించినవానికి.

88. విశేషమైన యోగాలను కూర్చియూ, లోకవిద్యలు లేని, వేదోక్తబ్రహ్మ విద్యల నాచరించు వారిలో ఉత్తముడై, అనేక రహస్య విద్యలలో అధికుడై మంత్రస్వరూపుడై గొప్ప మంత్రములు ప్రచారంచేసినవానికి.

89. సర్వశక్తులతో సంచరించువారికి అధికారియై, తరగని వ్రతాన్ని సాధించి క్షుద్బాధగలవారికి ఉపాదినిచ్చుచూ, ఆకలిబాధను నివారించి, కుచ్ఛితమగు ఆత్మలను నాశనం చేయువానికి.

90. (ఎ) తామరాకు నీటిలో ఉండినీరంటనట్లు మయా జగత్తునందుండి చంచల మగు మనస్సునుగ్రహించి నిగ్రహించి ఆనందించుచూ, కాషాయ రంగు గోచీతో, సువాసనసుగంధ పరిమళములు గలవానికి.

(బి) శుద్ధమగు కర్మలనాచరించుచూ, నిరంతర హంసదృష్టితో కాషాయ వస్త్రములు మరియు గోచితో నిరాడంబరుడై అంతటాసంచరించువానికి

91. (ఎ) శివస్వరూపుడై స్త్రీ పురుషుల కలియికలో నుంటూ, వండిన ఆహారాన్ని వదిలి వేసి గొప్ప ఆనందరూపుతో, అద్భుతయోగములు తెలుపు మహాప్రబంధాన్ని రచించి యమ స్వరూపుడై కరారిచేతబట్టి తాటియాకును వేరొకచేత బట్టి జనులందరివలే గాక వేరుగా ప్రవర్తించువానికి

(బి) సృష్టిక్రియ, సృష్టి, సంహారక్రియలు, మరియూ సృష్టి, స్థితి క్రియలను బోధించుచూ ప్రకృతికి విరుద్ధమగు కర్మలనాచరించు వారి పాలిట యముడై దండించు వానికి.





92. (ఎ) కమండలంచేత బట్టి, పండితుడై, జగమును మోహింపచేయురూపుతో, సహస్రారంతో సహ అన్నిచక్రాలు శుద్ధియైనవాడు, సహస్రారాన్నదిరోహించు పురుషులలో అగ్రుడై, ఉత్తమపురుషులను పాలించుచూ మృగములవంటి కన్నులు గలవానికి.

(బి) కమండలం చేతబట్టి జగమును మోహింపచేయుచూ, అష్టదిగ్గజస్థానమే వాహనమై తన భక్తులకోరికలు నెరవేర్చు దృష్టిగలవానికి.

93. ఎక్కువ జనుల ఆదరాభిమానము గలిగి విస్తారమగు సంపదలను పాలించు చూ, గోవులను రక్షించుచూ సంతతి లేని సతికి భర్తయై సజ్జనోద్ధారియై హంసను (శ్వాసను) వశము చేసుకున్న ఏ బంధములు లేనివానికి.

94. కందమూలములభక్షణతో సంతసించుచూ, మల్లెచెట్టుయందయిష్టుడై మంచిబిల్వదళ అర్చనచేతృప్తి చెందుచు, పరిశుద్ధమగు తులసీ దళములందు యిష్టునకు.

95. పుష్పములు, అక్షతలచే ఆరాధింపబడుచూ, సుగుణవంతులు సంయములచేత పూజించబడుతూ, దేవఋషియై, దేవతాస్థానములేరింగి బాగుగాచూచుచు, రాత్రులందు సంచరించువానికి.

96. రాత్రులందు తిరుగుచూ యోగవిద్యను బోధించుచూ, యోగనిద్రయందుండి నిద్రను నశింపజేసుకున్న మంత్రరూపి, మంత్రమే ఆయుధముగా శత్రువంశాన్ని నాశనం చేయువానికి.

97. జన్మకారణమైన బీజములను ఛేదించి, నశింపచేసి ఖండించగలిగినవాడు జనన ప్రదేశములందుండి, జననాలకు కారకుడై, అనేకజన్మలు జీవికి లేకుండా చేయువానికి.

98. జనులకు మళ్ళీ మళ్ళీ జన్మలకు కారణమైన కోర్కెలు తెలియజేసి, పుట్టుకతో గల సర్వ దోషాలను సైతం పోగొట్టుచూ, మాయలేనివాడై, పూజించబడుచూ చాలా పూజా పద్ధతులు జనులకు చెప్పినవానికి.

99. పార్వతీదేవితో కలిసిఉండి కాంతిగల ప్రదేశములలో తిరుగుచూ,షడ్చక్రములను సదాఅర్చించుచూ, ఆజ్ఞాచక్రమగు భ్రుకుటియందున్నవానికి.

100. ఎక్కువ ప్రకాశముతో బాగా ప్రసిద్ధికెక్కి చాలా ఎక్కువగా కన్పించు ఆకాశ రూపును, సూక్ష్మరూపును గలిగి, నిర్మలమగు కాంతి, ప్రకాశవంతమగు కాంతి గలవానికి.

101. వేదములకు మూలమగు గాయత్రీ వంటివాడై, తపస్సుకు, వేదములకు మూల మగుచు, అజపమంత్రసాధనచే, ఆనందించుచూ, ధ్యానసాధనకు మూల పురుషుడై, ధ్యానములో గమ్యం చేర్చు ధ్యానరూపియై, వేదములు నేర్పుచూ, వేదములందలి మూలకారణములు గమనించువానికి.

102. దరిద్రముచే కలుగు దుఃఖమును పోగొట్టుచూ హృదయమందు ఉపాసన చేయువారిని, సాధుసేవలు చేయువారిని యిష్టపడుచూ, వారికి శరీరంలోని 25 తత్వాలను నిరూపించి పాలించువానికి.

103. సత్యాన్ని పలుకు వారిని యిష్టపడు పరమాత్మ స్వరూపుడు, పరమాత్మ నెరింగిన మానవుడు, సదా తపస్సు చేయువాడు బీజాక్షరములతో యంత్రానికి మంత్రార్చన చేయునపుడు, తానేయంత్రములందలి బీజాక్షరమైయంత్రాన్ని ప్రభావితం చేయువానికి.

104. అనేక యంత్రస్వరూపుడై, యంత్రములు శోధించు స్వతంత్రభావములు గల మానవజాతి మొత్తంలో ప్రధానుడై, వర్గములు నియంత్రించి వర్గముల మూర్తియై, వర్గనాశనకర్తయై, కర్మబంధములు తెంచువానికి.

105. గుణవంతులకు ఆదర్శుడై, సంపూర్ణ సుగుణము మూర్తీభవించిన సుగుణ స్వరూపుడు, గుణాధికుడు పూర్వులు బ్రహ్మవిద్యను భద్రపరచి దాచిన దానిని బయలుపరచి, తాను మరుగుననున్నట్టివానికి.

106. అనురాగముతో సూర్యునివలే ప్రకాశించుతూ, ఆ ప్రేమను పంచుతూ, నరుల హృదయములో వుండి సంపదలనుకోరు వారి ఆర్తిని నెరవేర్చుటకు ఉత్సాహముతో నుండి రాక్షసులలో అధికులను (రాక్షసస్వభావాన్ని నాశనం చేస్తున్నవానికి)

107. జనులు ఉత్తమ పద్ధతులు అనుకరించుటకు తాను ఆచరించి చూపి, శరీర మందలి తత్వములను మానవులకు అద్దము చూపునట్లు చూపించి, తన్నాశ్రయించిన శత్రువుకైనా కోరినదిచ్చుచూ, ఆపాత్రదానముచేయక, ధనానికి అధిపతియైన మిక్కిలి ప్రేమాస్పదుడు, సర్వాన్ని సృష్టించిన విశ్వకర్మ కొరకు తపించువానికి.

108. పురాణములందు కీర్తించనట్లు, సృష్ట్యాది నుండియున్నవాడు, మళ్ళీ జన్మ లేకుండా చేయగల సమర్ధుడై, శాంభవీముద్రలో ఉంటూ తన గమ్యానికి పూర్తిగా చేరి, జనులమనస్సును హరించువానికి.

109. ఆది మధ్యము అంతము లేనివాడై సర్వసంపదలతో నిండినవాడై ఓం నుండి క్షం వరకూ గల అన్ని బీజాలను సమంగాఅర్చించి, బ్రహ్మతేజస్సుతో ఎప్పుడూ తిరుగు వానికి.

110. మంచి కీర్తిని సాధించి ఆ కీర్తి నాలుగుదిశలా బాగా విస్తరించగా శాస్త్రబద్ధమగు శిలా ప్రతిమవలే నుండి, మంచి భక్తుల చే ఆవిగ్రహానికి ఆరాధనలు, పాదుకలకు అర్చనలతో కూడిన పూజలు పొందువానికి.





111. ఛందస్సుతో శాస్త్ర బద్ధంగా పూజలను సిద్ధంచేసి, పరతత్వమంత్రతంత్రాల భేదములు తెలుసుకొని పరలోక సంబంధ విద్యతో పరబ్రహ్మ విద్యయే ఆహారమై, పర లోక విద్యయే జీవనముగా ఆలోచించుచూ, తనలోతానుంటూ, బలమైన స్థితప్రజ్ఞతో బాగా ప్రచారమై మొట్టమొదటిసారిగా అధర్వణ వేదక్రియలు జనులకు చెప్పినవానికి.

112. ఏవర్ణములు లేని వాడు పరమాత్మయైన ఓంకారస్వరూపుడై ప్రార్థింపతగినవాడు, శుభములు చేకూర్చుచూ సర్వదేవతలయందుండి సర్వప్రాణులందు దయగలవానికి.

113. మిగుల లోక ప్రసిద్ధి చెంది తాను రహస్యముగా నున్న ప్రసిద్ధుడు, భక్తులను అనుగ్రహించి అక్షతలు మొదలగునవి యిచ్చుచూ, మిగిలిన పాపఫలాన్ని నశింపజేసి గరళమును సేవించి మానవుల కంటినల్లగుడ్డులో గల చుక్కరూపియై ఉండి విశేషముగా జపసాధన చేసిన వానికి.

114. కానుకలొసంగుటకు తగిన వాడు, తాను భక్తులకివ్వదలచినదిచ్చువాడు, ఉపకారము చేయుచూ అధికముగుపనులు చేసి, వేదాంతవిషయములు వివరించి పోలికలతో చెప్పుచూ జనులబుద్ధిని చెదరనీయనివానికి.

115. అందరివలె గాక సదా భగవంతునిలో కలిసి యుండువానికి, సమస్తమూతానై అన్నీజయింప బడిసృష్టిఅంతా తనలో చూపించుచూ, దేనికీ కట్టుబడని వాడై అందరూ అర్థం చేసుకోగల మాటలు చెప్పగల విద్వాంసుడై సర్వార్థ లక్షణములు గల విద్వాంసునకు,

116. సర్వానికి మూలమైన అన్నియోగము లెరింగి సర్వవేద పద్ధతులెరింగి ఆ వేదపద్ధతులను ఆచరించి, ప్రసిద్ధిగల శిష్యులు గలిగిన సన్నిధిలోని సర్వలోక గురువునకు, యజ్ఞవిశేషముగలవానికి నమస్కారములు

117. **యిక్కడ నుండి** విరాట్ విశ్వకర్మ పంచముఖముల నుండి పంచబ్రహ్మలు ధ్భవించి, వారు పంచభూతములకధినాయకులై ఆ తత్వములతో ఒక్కొక్కరికి 5గురు సంతతి చొప్పున 25 మంది కలిగిరి వారుమానవశరీరమందు 25 తత్వములకు అధిపతులైరి. వారొక్కక్కరికి 5గురు చొప్పున సంతతి కలుగగా 25×5=125 మంది బ్రహ్మ ఋషులైరి, వీరే విశ్వబ్రాహ్మణ వంశగోత్రఋషులు. స్వామివారు "సనారీ సంవాదమందు" నేనే విశ్వబ్రహ్మ యని తెలిపిరి, కావున వారి ప్రతిరూపులైన గోత్రఋషులందరూ తానుగా చెప్పుచున్నారు. **యిక్కడ నుండి సుపర్ణస బ్రహ్మర్షి సంతతివారు.** 1.సుపర్ణసబ్రహ్మయను విశ్వజ్ఞబ్రహ్మ స్వరూపుడగు 2. పరీతాబ్రహ్మర్షి విశ్వజ్ఞ బ్రహ్మర్షి (ఈ రెండుపేర్లు తానై) 3 సౌర సేన బ్రహ్మర్షి 4 సాంఖ్యాయన బ్రహ్మర్షి 5 మణిభద్రబ్రహ్మర్షి 6 మునిసువ్రతా బ్రహ్మర్షి.

118. 7.శ్రుతివర్ధన బ్రహ్మర్షి 8 యాజ్ఞిక బ్రహ్మర్షి 9.సంజ్ఞిక బ్రహ్మర్షి (సంజ్ఞాదేవిని పాలించుసూర్యుడు). 10 ఆదిత్య సేనబ్రహ్మర్షి 11 అర్వంత బ్రహ్మర్షి12 అర్చిత బ్రహ్మర్షి (6 బీజాక్షరములు కలవాడు) 13.కర్ధమబ్రహ్మర్షి

119. 14 "పరార్చిత బ్రహ్మర్షి (పరలోకప్రభువు) 15 తేజోధర్మబ్రహ్మర్షి 16 సుదర్శన బ్రహ్మర్షి 17 ఉపగోపబ్రహ్మర్షి 18 యజ్ఞ బ్రహ్మర్షి 19 సాంత్వబ్రహ్మర్షి (మంచి మనసు గలవాడు) 20. సంయమ బ్రహ్మర్షి.

120. ఉపకల్పబ్రహ్మర్షి 21 దేవసేన బ్రహ్మర్షి 22 ఆదిత్య బ్రహ్మర్షి 23. నిగమబ్రహ్మర్షి 24. ఉపయజ్ఞబ్రహ్మర్షి; 25. అనుపయజ్ఞబ్రహ్మర్షి వీరు సుపర్నస బ్రహ్మర్షి సంతతివారు వీరికి నమస్కారములు.

121. **యిక్కడ నుండి ప్రత్నబ్రహ్మర్షి సంతతివారు.** 1. ఉపప్రత్నసబ్రహ్మర్షి ; 2. రుచిదత్త బ్రహ్మర్షి; 3. వాస్తోష్పత్తి బ్రహ్మర్షి; 4. కౌశల బ్రహ్మర్షి; 5. సనాభస బ్రహ్మర్షి; 6. ప్రహర్షణ బ్రహ్మర్షి; 7. లోకవేత్త బ్రహ్మర్షి; 8. శిల్పికమను బ్రహ్మర్షి; (చిత్రకాయ బ్రహ్మర్షి;)

122. 9. సహస్రబాహు బ్రహ్మర్షి; 10. దేశికమను బ్రహ్మర్షి; 11.వాస్తుపురుష బ్రహ్మర్షి (నవాస్తుకాయ బ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి). 12. ఇంద్రసేనాబ్రహ్మర్షి; 13.గిరి ధర్మ బ్రహ్మర్షి; 14వ సుధర్మ బ్రహ్మర్షి (వసుప్రియ బ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గల వానికి)15. వజ్రచేత బ్రహ్మర్షి (వజ్రధరబ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి) 16. విశ్వభద్రబ్రహ్మర్షి (సుముద్రికాబ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి).

123. 17 జ్ఞానభద్ర బ్రహ్మర్షి; 18. దేవభద్ర బ్రహ్మర్షి; 19. వ్యంజక బ్రహ్మర్షి; 20. ప్రభోదమను బ్రహ్మర్షి; 21. శక్వరబ్రహ్మర్షి; 22. వేదపాల బ్రహ్మర్షి; 23.రాజధర్మ బ్రహ్మర్షి (సురాజ్ఞ బ్రహ్మర్షి) ఈ రెండు పేర్లు గలవానికి; 24. భోక్తవ్యమను బ్రహ్మర్షి; 25.ప్రజ్ఞమతి బ్రహ్మర్షి వీరు ప్రత్న బ్రహ్మర్షి సంతతివారు.

124. **యిక్కడి నుండి అహభూన బ్రహ్మర్షి సంతతివారు.** 1. అహభూన బ్రహ్మర్షి; 2. భద్రదత్త బ్రహ్మర్షి; 3. కాండవ బ్రహ్మర్షి; 4. (విశ్వాకార) విశ్వరూప బ్రహ్మర్షి; 5. శ్రీముఖ బ్రహ్మర్షి; 6. త్వష్ట బ్రహ్మర్షి;

125. 7. యజ్ఞపాల బ్రహ్మర్షి; 8. కుశధర్మ బ్రహ్మర్షి; 9. తామ్రగర్భ బ్రహ్మర్షి;10 అతిధాతృబ్రహ్మర్షి (అనాధాతృ బ్రహ్మర్షి ) ఈ రెండు పేర్లు గలవారికి. 11 లోకేశమను బ్రహ్మర్షి; 12. పద్మదక్షబ్రహ్మర్షి.

126. 13. వితమబ్రహ్మర్షి (వితక్షమను బ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి) 14. మేధామతిబ్రహ్మర్షి; 15. విశ్వమయ బ్రహ్మర్షి; (మహామయ, మయ బ్రహ్మర్షియను





ఈ మూడు పేర్లుగలవానికి) 16. బోధాయన బ్రహ్మర్షి; 17.జాతరూప బ్రహ్మర్షి; 18. చిత్రసేన బ్రహ్మర్షి (అచిత్రకృతుయను రెండు పేర్లు గలవానికి);

127. 19. జయసేన బ్రహ్మర్షి; (విజయసేన బ్రహ్మర్షియను రెండు పేర్లు గల వానికి) 20. విఘనస బ్రహ్మర్షి; 21. ప్రభోన్నత బ్రహ్మర్షి (స్వయం ప్రభతో వెలుగొందు సూర్యరూపుడగు ) ఈ రెండు పేర్లు గలవానికి; 22. దేవర బ్రహ్మర్షి (మహా బ్రహ్మర్షియను రెండు పేర్లు గల వానికి); 23. వినయ బ్రహ్మర్షి; (వినయము గల ఋషియను రెండు పేర్లు గలవానికి) 24.బ్రహ్మదీక్షాబ్రహ్మర్షి 25. హరిధర్మ బ్రహ్మర్షి (అసత్కర్మ, అకర్మ, కర్మ సంస్థితాయయను పేర్లు గలవానికి) యింత వరకూ అహభూనసంతతివారు)

**యిక్కడ నుండి సనాతన బ్రహ్మసంతతి వారు వీరికి నమస్కారములు**

128. 1. సనాతన బ్రహ్మర్షి; 2. వామదేవ బ్రహ్మర్షి; 3. విశ్వచక్షు బ్రహ్మర్షి (వితక్షక బ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి).

129. 4 ప్రతితక్ష బ్రహ్మర్షి (సునంద బ్రహ్మర్షి ఈ రెండు పేర్లు గలవానికి) 5 సునందన బ్రహ్మర్షి 6 మానుష మయ బ్రహ్మర్షి 7 సనత్కుమార బ్రహ్మర్షి 8 ధార్మిక బ్రహ్మర్షి 9 విధాతృమను బ్రహ్మర్షి (విధాతృమను) సంయమాయ ఈ రెండు పేర్లు గలవానికి).

130. 10 ద్విజధర్మ బ్రహ్మర్షి ద్విజపతిబ్రహ్మర్షి (ద్విజయనురెండు పేర్లు గలవానికి) 11 వర్ధక బ్రహ్మర్షి (అనవర్ధక బ్రహ్మర్షి యను ఈ రెండు పేర్లు గలవానికి) 12. భావబోధబ్రహ్మర్షి 13 తక్షుబ్రహ్మర్షి 14 శాంతా బ్రహ్మర్షి (శాంతమతి బ్రహ్మర్షి, హితాయ అను ఈ రెండు పేర్లు గలవానికి).

131. 15. యజ్ఞసేన బ్రహ్మర్షి యజ్ఞజనకాయ, (యజ్ఞజనయను ఈ రెండు పేర్లు గలవానికి) 16. చక్షుష బ్రహ్మర్షి, 17. విశ్వదక్ష బ్రహ్మర్షి, 18. విశ్వతబ్రహ్మర్షి, 19. సుమేధక బ్రహ్మర్షి; 20. పర్న బ్రహ్మర్షి;

132. 21. రైవతమను బ్రహ్మర్షి; 22. ప్రవర బ్రహ్మర్షి; 23.జయధ్వన బ్రహ్మర్షి; 24.పరిషంగ బ్రహ్మర్షి; (సంయముడు ఈ పేర్లుగలవానికి) 25. విద్యా బ్రహ్మర్షి; (అవిద్యాబ్రహ్మర్షి యను రెండు పేర్లు గలవానికి). యింతవరకూ సనాతన బ్రహ్మర్షి సంతతివారు వీరికి నమస్కారములు

133. **యిక్కడ నుంచి సానగ బ్రహ్మర్షి సంతతివారు.** 1. సానగ బ్రహ్మర్షి; (శాశ్వత ప్రభువను రెండు పేర్లు శివునకు) 2. బిభ్రాజ బ్రహ్మర్షి; 3. కశ్యప బ్రహ్మర్షి; 4. మనువిశ్వ కర్మ బ్రహ్మర్షి; (శివప్రియుడు, శివ రూపుడు, మనుబ్రహ్మ, మనునాముడు, మానవుల నాయకుడు, ఈమొత్తము పేర్లు గలవానికి).

134. 5.విశ్వాత్మక బ్రహ్మర్షి (విశ్వాన్ని భరించి, పాలించు కవీశ్వరుడు యజ్ఞమాచరించువాడు ఈ పేర్లు గలవానికి) 6. మన్యుపతి బ్రహ్మర్షి; (పూజ్యుడు పేర్లు గలవానికి) 7. మామన్యుపతి బ్రహ్మర్షి; 8 భూబల బ్రహ్మర్షి;

135. 9. సంవర్త బ్రహ్మర్షి 10 విశ్వదత్త బ్రహ్మర్షి; 11. సమంత బ్రహ్మర్షి; (సర్వుల అంతరంగంలో నుండి, అంతటానిండి మంచి ఆలోచనలు కల్గించువానికి) 12 శ్వేతాంగబ్రహ్మర్షి, 13. పురంజయబ్రహ్మర్షి,

136. 14. భానుమతి బ్రహ్మర్షి; (శివుడు రచించిన గ్రంథము. పరమేశ్వరుడు సూర్యునివలే ప్రకాశించువానికి) 15. జయత్కుమార బ్రహ్మర్షి; (జయముల నొసంగు దేవుడు పార్వతీ రూపుతో పార్వతీ దేవి యందు యిష్టుడై).

137. పార్వతీ దేవితో కూడి, ఆమె ఉపఅంగములతో ఆమెను పొంది నిగ్రహముగా నుండి జయమునొందగలబుద్ధి జయించు ప్రజ్ఞతో న్యాయముగా.

138. జయించుసమర్ధతతో జయించి దుంధుభి మ్రోతతో జయించిన పండితునకు. (జయము నొందగల క్రియలనెరింగిన రథము గలవానికి). 16.వనజ బ్రహ్మర్షి; 17.భాస్వంత బ్రహ్మర్షి; 18. మధు బ్రహ్మర్షి; 19. చిత్రవసుబ్రహ్మర్షి; 20. తాపన బ్రహ్మర్షి; 21. సుయక్ష బ్రహ్మర్షి; (సంయ్యమ బ్రహ్మర్షి రెండు పేర్లుగలవానికి), 22. సుతక్షబ్రహర్షి, 23. ప్రబోధక బ్రహ్మర్షి (ఎల్లప్పుడూ సంచిరించువాడు) 24. వసులోచన బ్రహ్మర్షి; (మనుస్వరూపుడు) 25. చిత్రధర్మబ్రహ్మర్షి (విచిత్రమగురూపుగలవాడు). వీరికి నమస్కారములు.

139. **యింతవరకూ సానగ బ్రహ్మర్షి సంతతివారు వీరికి నమస్కారములు**

140. జ్ఞానములోని అధికులతో కలిసి మంత్రద్రష్టలున్న చోటునుండు దీప్తిమంతుడు, యజ్ఞములతో పరులపీడను తొలగించు వెండికొండకధిపతి, పాలకొండను పాలించుచూ భవిష్యత్‌కుమూలమై దహరాకాశమును పాలించువానికి. నమస్కారములు (మానవులభృకుటి స్థానంలో నున్నవానికి)

141. వేదములనొసంగిన సుకుమార సౌందర్యునకు, సుబుద్ధియే అలంకారముగ నున్న గొప్పమునీశ్వరుడు, రత్నంవంటి స్త్రీకి పుత్రుడై అందముతోనున్న మానవుడు, నరులలో ఉత్తమునికి నమస్కారములు

142. చిరునవ్వుతో మతములనేవగించుచూ, సనాతన సాంప్రదాయము అలంకారముగా, మూలగ్రంథమేతానై, తనలో భార్యనుకలుపుకొని మానసిక, మనో నిష్టలతో మనుసును స్వాధీనపరచుకున్నవానికి. నమస్కారములు.





143. అనేకమన్వంతరములనుండి నరులు జీవించుటకు ఆధారుడై, జీవులకు అధిపతియై, వాయువును స్వాధీనపరచుకుని, సంతోషిస్తూ, ఎక్కువ మానసిక సంతోషముగల్గి గర్వాన్ని నశింపచేసి, ఆనందాన్ని యిష్టపడువానికి నమస్కార ములు.

144. మదాన్నివిడనాడిన గొప్ప పాలకుడు, తలపై గంగను ధరించి గంగాప్రియుడై, సదాజ్ఞానమునే ధారణచేస్తూ జ్ఞానాన్ని ప్రేమిస్తూ, అజ్ఞానాన్ని నశింపచేసి, సృష్టి కార్యములు కూడా నెరవేర్చువానికి నమస్కారములు.

145. విస్తరించుచూ విరుద్ధరూపుకాని త్యాగభోగి, త్రినేత్రదారియై, సంకటములు తొలగించుచూ, విశ్వరూపుడై అంతటా వ్యాపించి విద్వాంసులకు నాయకుడైనట్టి వానికి నమస్కారములు.

146. బ్రాహ్మణ ప్రియుడు బ్రహ్మకారుడగు బ్రాహ్మణుడు, బ్రాహ్మణనడవడికలుగల, బ్రాహ్మణశ్రేష్టుడు, బ్రాహ్మణులకు గురవగు ఆదిదేవుడై, బ్రాహ్మణుల సంశయములు పోగొట్టువానికి నమఃస్కారములు.

147. ఆచారజ్ఞానములు యింటియందు గలిగి, ఏవ్యాధి లేనివాడై శుభముల నొసంగు మనోహరుడు, మానవ జాతిమూల పురుషుడగు, విశ్వకర్మ పాదములు సేవించు ఆదిస్వరూపునకు, నమస్కారములు.

148. రేతస్సును విడుచు స్వభావాన్ని నశింపజేసి, ఊర్ధ్వముఖంగా వీర్యాన్ని నడిపించుచూ, చక్షురింద్రియగోచరమేసాధనగా, మనస్సును లీనము చేసి, సుజనుల రక్షించుచూ పాపులను నాశనంచేయువానికి నమస్కారములు.

149. చిద్విలాసరూపుడైన జగద్గురువు విరాట్ విశ్వకర్మ యగు ఆదిదేవునకు, నమస్కారములు.

150. నారితో కూడిన విశ్వనాధుడు, అన్నిలోకములకు గురువై పరలోకదైవమైన విశ్వనాధుడు, గొప్ప సంయమీశ్వరుడైన సత్‌పురుషుడు, పుట్టుట పెరుగుట నశించుటకు కారణుడై, ఎట్టిదోషములు లేని మోక్షవిషయబుద్ధిగల వానికి, నమస్కారములు.

151. యమము, నియమము, ఆసనము ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధియను యోగములు తాను సిద్ధింపజేసుకుని, భక్తులకిచ్చు వానికి, విశ్వాన్ని సృష్టించిన స్వయంభూయైన పార్వతీపతియగు మునీశ్వరునకు. నమస్కారములు.

152. ఆరుమతాలనుద్ధరించి, యింద్రియనిగ్రహంతో అన్నిటినీ చాలించిన గురువు, సమస్త దేవతా స్వరూపములందుండి అంతులేని జగత్తుకు ఆధారమైన విరాట్ విశ్వకర్మయను గొప్ప ప్రభువునకు నమస్కారములు.

153. అన్ని ఎరిగిన విశ్వరూపుడు, అన్ని పనులు తెలిసి అన్ని కార్యములు నిర్వహించిన మహేశ్వరుడు, ఆదిశంకరులు (మనుబ్రహ్మయను శంకరుడు) వంశములోని గొప్పవాడు, విష్ణురూపుడగు విశ్వకర్మ భగవానునికి నమస్కారములు.

154. ఎడమభాగమున పార్వతీదేవితో నుండి, పాపులను పవిత్రులను చేయగల పరిశుద్ధుడు, భవిష్యత్ నెరింగిన దిగంబరుడగు, అవధూతయైన మహనీయు డగు విశ్వకర్మకు, నమస్కారములు.

155. అన్నిరకముల ఆభరణములతో నున్న నిత్యజ్ఞానముగల సుఖస్వరూపునకు, సకల దేవతల ఉత్పత్తికి మూలమగు దేవాదిదేవుడగు జగద్గురువునకు నమస్కారములు.

156. గౌరీదేవి పుత్రుడు, కులమందలి శ్రేష్ఠుడు, చేతిపనులు అన్నీ చేస్తూ వడ్రంగి పని చేయుచూ, యజ్ఞములనాచరించిన యజ్ఞస్వరూపుడు, యజ్ఞములకు రాజై పూజలందుటలో ప్రధానునికి నమస్కారములు.

157. సర్వమానవులతో పాదాలకు పూజింపబడుతూ సర్వమూతానై, సమస్త ప్రపంచానికి సాక్షిగా నుండి, గొప్పమహత్యముగల బ్రహ్మవిష్ణు, రుద్ర స్వరూపుడై ఆది దేవుడైన విశ్వేశ్వరుడుధనం, ధాన్యం, పరివారముపుత్రులనొసంగువానికి నమస్కారములు.

158. జగత్‌ను పాలించుచూ మోక్షాన్నిచ్చు యోగసంపన్నుడు, సర్పకోరల విషాన్ని హరించుచూ (సేకరించి) వైద్యానికి న్యాయం చేసి, తలపై జలము ధరించిన వాడు, ధనముగలిగి విష్ణుస్వరూపుడై సేవలుచేయుచూ, సేవతో అన్నము పొందుచూ, హృదయమున అమృతముగలవానికి, నమస్కారములు.

159. ఎల్లప్పుడూ సంతోషంతో సదా అనుభము గలిగి, మనోసంశయములను త్రుంచి, తపోదీక్షలో నుండి, 6 రుచులుగల ఆహారములు సేవించు అనంతదేవ స్వరూపుడు, సాధువులచే పూజించబడు పద్మముల వంటిపాదములు గలవానికి. నమస్కారములు.

160. యోగసాధనలో సమర్థుడగు, ఈశ్వరుడైన గొప్ప ఋషియగు దిగంబరుడు, సున్నితమగు వస్త్రము ధరించి, పంచముఖములు గలకులమున బుట్టి, భక్తుల మొర లాలకించు అన్నిలోకముల జగద్గురువునకు. నమస్కారములు.





161. తలపైగొడుగు, కాళ్ళకు పాదుకలతో తిరుగుచూ, అన్ని అవయవములు రుద్రాక్ష నగలతో అలంకరించబడి, హృదయ వ్రణములు పోగొట్టుచు, భయంకరమగు మూడవ కన్నుగల పరమాత్మకు నమస్కారములు.

162. పరమాత్మ తత్వబోధనలో సరస్వతి వంటి ఉత్తముడు, సర్వాన్నిత్యజించి కాషాయము వస్త్రమునుధరించి, రౌంజనాదముతో ఆనందించు శివస్వరూపము గల మునీశ్వరునకు, నమస్కారములు.

163. అన్నిలోహపు పనులు చేయువాడు, అన్ని రకముల కర్రలతో పనిచేయుచూ, రాతి విగ్రహములు చేస్తూ యోగభ్యాసములతో యోగియై, భక్తులను కరుణతో కాచువానికి నమస్కారములు.

164. స్వర్గాన్ని మోక్షాన్ని భక్తులకు ప్రసాదించుచూ, రజోగుణము చే కల్గిన అనుభవమును పొంది, సూర్యస్వరూపుడై చేయుపనులన్నీ వదిలి, షట్కర్మలు మోక్షాసక్తిచే చేసిన, మయవంశదీపకునకు నమస్కారములు .(సనత్‌కుమార –బ్రహ్మర్షిగోత్రునకు నమస్కారములు)

165. స్వచ్ఛమైన మేలిమి బంగారువంటి కార్యముల యందు ఉత్సాహము గలిగి, రాక్షసవంశాన్ని వృద్ధిచేస్తూ, మూడు దేహములను నిర్మలంగా నిష్కళంకంగా యుంచిన, మూడు రూపములుగలవానికి నమస్కారములు.

166. పరిశుద్ధుడు, మంచి కులమునబుట్టి అగ్ని సర్వాన్నీదహించి నటుల, మానవుల సర్వపాపములను నశింపజేయువారిలో ఉత్తముడై, ఎల్లప్పుడూ హనుమత్పతాకంతో నుండి అనేకవిధములుగా కీర్తింపదగిన వానికి నమస్కారములు.

167. శివస్వరూపుడు, విష్ణు స్వరూపుడు, బ్రహ్మ స్వరూపుడు, దేవేంద్రరూపుడు, సూర్య స్వరూపుడగు ఈ ఐదు వంశముల ప్రజాపాలకుని రూపుతో, ఐదుపనులలో ముఖ్యుడైనట్టివానికి, నమస్కారములు.

168. ద్వైత్వము, అద్వైతము విశిష్టాద్వైతమూడుమతములందు ముఖ్యుడై దుష్ట స్వభావాన్ని దూరంగా ఉంచి, శుభదృష్టితో ఎల్లప్పుడూ బ్రహ్మాసనమునుంటూ, జడలు కిరీటముతో ప్రకాశించువానికి నమస్కారములు.

169. రత్నకంకణముగురుతు గలిగి, అన్ని వాహనములనధిరోహించి, మంచి జ్ఞానముతో గొప్ప ప్రభావముగలవానికి. నమస్కారములు.

170. మాయామోహములను పోగొట్టి చక్కని ముక్తి దారి చూపుచూ, గొప్ప వ్రతములనాచరించిన, విశేషమైన స్త్రీకి భర్తయై, ఘోరమగు నరలోకవాసుల కోర్కెలు తీర్చు శివస్వరూపునకు నమస్కారములు.

171. గుణవంతులలో అధికుడు, వికారములులేని నిశ్చలమగు ఆత్మగలిగి, విశ్వ కర్మ కులాన్ని వృద్ధిపరచు శివస్వరూపుడు, జగానికేగురువు సర్వలోకముల జగద్గురువునకు. మహాదేవులగు గురుమూర్తికి గురుబ్రహ్మార్పణమస్తు. సాక్షాత్ విశ్వ స్వరూపుడగు విశ్వబ్రహ్మకు సమస్కారములు .

172. మహాదేవులగు గురుబ్రహ్మకు సర్వాన్ని అర్పించుచున్నాను. చిద్విలాసులు, జగద్గురువులైన ఆది దేవులగు సనారీవిశ్వనాధా సర్వలోకముల గురుదేవా మీకు శతకోటినమస్కారములు.

**(చతుర్ధోధ్యాయమందలి సహస్రనామస్తోత్రం సమాప్తం)**







## సనారీవిశ్వేశ్వర సహస్ర నామావళీ ప్రారంభం

**ఓం-ఐం-హ్రీం-శ్రీం-క్లీం-క్లౌం-సౌః-ఓం**

| **ఓం పరమాత్మా** | **నమః నమస్కారములు** |
|---|---|
| ఓం-శ్రీలోకదేశికా దేవాయైనమః | - శుభములునొసంగు జగద్గురుదేవా |
| ఓం-శ్రీదేవాయైనమః | - శుభములు నొసంగుదైవమా |
| ఓం-శ్రీగురుప్రభవేనమః | - శుభ సంపదలనిచ్చు గురు రాజా |
| ఓం-శ్రీపురుషాయైనమః | - శుభకరమగు సుఖములందు సంతోషము కలవాడా |
| ఓం-శ్రీసుఖోల్లాససంతతాయైనమః | - సదా, శోభతో సుఖసంతోషములుగలవాడా |
| ఓం-శుద్ధమానసాయైనమః | - నిర్మలమగు మనస్సుగలవానికి |
| ఓం-నిర్మోహినియైనమః | - దేనియందు మోహము లేనివానికి |
| ఓం-మోహనాకారాయైనమః | - అందమగు రూపము గలవానికి |
| ఓం-జగన్మోహనవిగ్రహాయైనమః | - జగత్తును మోహింపజేయు ఆకారముగలవానికి |
| ఓం-అత్యానందాయైనమః **10** | - అమితమగు ఆనందము గలవానికి |
| ఓం-అనంతాయైనమః | - అంతము(మేర) లేనివానికి |
| ఓం-హటయోగియేనమః | - హటయోగసిద్ధునకు |
| ఓం-అగమాకృతియేనమః | - భవిష్యత్‌నెరింగిన వానికి |
| ఓం-పునరావృత్తినాశాయనమః | - మరుజన్మ లేకుండా చేయువానికి |
| ఓం-పూర్వదోషనివారణయేనమః | - గతజన్మలదోషములు తొలగించువానికి |
| ఓం-త్రిలక్ష్యాయనమః | - అంతర్లక్ష్యం, బహిర్లక్ష్యం, మధ్య లక్ష్యముల సిద్ధునకు |
| ఓం-సులక్ష్యాయనమః | - మంచి ఆశయములు గల వానికి |
| ఓం-శిష్టదేవగణార్చితాయనమః | - విశిష్టమైన దేవతల నారాదించిన వానికి |
| ఓం-అజ్ఞానభంజనాయైనమః | - అజ్ఞానాన్ని నశింపజేయువానికి |
| ఓం-శుద్ధాయైనమః | - పరిశుద్ధునకు |
| ఓం-మాయాయైనమః **20** | - లోక మాయా మూర్తికి |
| ఓం-కవులార్చనహితాయైనమః | - వేదోక్త అర్చనలచే తృప్తిపొందువానికి |
| ఓం-మకారపంచభోజ్యాయనమః | - మత్స్యం మాంసం, తీపి, పెరుగు, మినప |

పదార్థాలు తినువానికి
ఓం-సర్వమంగళాయైనమః - సకలశుభములు గలవానికి
ఓం-సుప్రజాయైనమః - మంచిగుణములు గల మానవునకు
ఓం-జితేంద్రియాయైనమః - శుభకరమైనవృత్తము కలవానికి
ఓం-శుభావరణాయైనమః - తనచుట్టూ శుభములు గలవానికి
ఓం-సృష్టికర్తాయైనమః - సృష్టి కార్యములు చేయువానికి
ఓం-ఆకల్మషాయైనమః - ఎలాంటి దోషములు లేనివానికి
ఓం-ఆవాహనీయ్యబ్రహ్మాగ్నియేనమః 30 - ఆవాహనీయమనెడు అగ్నినిబోలిన పరమాత్మకు( సత్వగుణుడు)
ఓం-యజ్ఞకర్తాయైనమః - యజ్ఞములు చేయువానికి
ఓం-సురక్షణాయైనమః - మంచిరక్షకునకు
ఓం-గారహపత్యాగ్నికర్మేశాయనమః - గార్హపత్యమనెడు అగ్ని కార్యము చేసిన వానికి (రజోగుణుడు)
ఓం-సర్వకామఫలప్రదాయైనమః - అన్ని కోర్కెలు తీర్చువానికి
ఓం-దక్షణాగ్నిమహాయజ్ఞకర్మకర్తాయైనమః- దక్షిణాగ్నియనెడు మహాయజ్ఞముసల్పిన వానికి (తమోగుణుడు)
ఓం-పరాత్పరాయైనమః - శ్రేష్ఠులందరికీ శ్రేష్ఠుడు
ఓం-ఊర్ధ్వరేతాయైనమః - యింద్రియమును శిరస్సుకు నడిపిన వానికి
ఓం-నిర్విఘ్నాయైనమః - ఎలాంటి ఆటంకములు లేని వానికి
ఓం-విఘ్నకర్తయైనమః - ఆటంకములు కలుగజేయువానికి
ఓం-సులక్షణాయనమః **40** - మంచిలక్షణములు గలవానికి
ఓం-సర్వాభరణ సంతుష్టాయైనమః- సమస్త ఆభరణములతో తృప్తి చెందువానికి
ఓం-సర్వమూర్తిమనోహరయైనమః -సమస్తదేవతా స్వరూపుడై ఆహ్లాదపరుచువానికి
ఓం-శక్తిరూపాయైనమః - పరాశక్తి రూపమైన వానికి
ఓం-శివాకారాయైనమః(శుభకరాయ) -శివునిరూపము గలవానికి(శుభములొసగు)
ఓం-శివసంభవమూర్తయే నమః - శుభకరమగుసుఖములు ప్రసాదించువాని
ఓం-లక్ష్మీరూపాయైనమః - లక్ష్మీరూపము గలవానికి





ఓం-వరశ్రేష్ఠాయైనమః కోర్కెలు తీర్చుటలో శ్రేష్ఠునకు
ఓం-విష్ణవేనమః - విష్ణుస్వరూపునకు
ఓం-విద్వేషనాశనాయైనమః - ద్వేషములను నశింపజేయువానికి
ఓం-వాణివాఙ్మయభూషాయైనమః **50** - జ్ఞాన కరమగు వాక్కే ఆభరణముగకలవానికి
ఓం-బ్రహ్మమూర్తియైనమః - పరబ్రహ్మస్వరూపునకు
ఓం-జగత్ప్రభవేనమః - సకలచరాచరప్రపంచానికే నాయకునకు
ఓం-శశీలోచనవామాంగాయైనమః - చంద్రుడు ఎడమకన్నుగా గలవానికి
ఓం-వజ్రసంభవాయైనమః - ఇంద్ర సంబంధ కార్యములు నెరవేర్చు వానికి
ఓం-వాక్సుధాయైనమః - అమృతతుల్యమగువాక్కు గల వానికి
ఓం-సౌజ్ఞస్వరూపాయైనమః - మహాతేజస్వికి -( యజ్ఞ రూపునకు)
ఓం-సద్రూపాయైనమః - మంచిరూపముగలవానికి (సుందరునికి)
ఓం-అర్కదక్షణలోచనాయైనమః॥ - సూర్యదుకుడి కన్నుగా గలవానికి
ఓం-సర్వభూతగణేశాయైనమః॥ - సకలభూతములలో శ్రేష్ఠుడు (ఎన్నదగినవానికి)
ఓం-సద్రూపాయైనమః॥ - మంచిరూపము గలవానికి
ఓం-సకలప్రియాయైనమః॥ 60 - అన్నిటియందు మక్కువగలవానికి
ఓం-జగన్నిర్మాణకర్తయైనమః॥ - అఖిలాండకోటిబ్రహ్మాండములు సృజించినవానికి
ఓం-స్తితిసందానపాలనాయైనమః॥ - పోషణము కలుగుటకు అధికారియైనవానికి
ఓం-లయకారణకర్మయైనమః॥ - తనలో కలుపుకొనువానికి
ఓం-లాంబికాయోగధారియైనమః॥ - నాలుక చివరను కొండ నాలుకకు ఆనించి యోగమునాచరించువానికి
ఓం-శాంబవీముద్రలక్ష్యాయైనమః॥ - శాంభవీముద్రలో దీక్షయందున్న వానికి
ఓం-శాశ్వితానందవిగ్రహాయైనమః॥ - శాశ్వతమగు ఆనందరూపునకు
ఓం-దిక్పాలాధిపలోకాయైనమః॥ - దిక్కులకు అధిపతియైలోకమందున్నవానికి
ఓం-లోకేశాయైనమః॥ - లోకనాయకునకు
ఓం-లోకపావనాయైనమః॥ **70** - లోకాన్ని పరిశుద్ధమొనర్చువానికి
ఓం-గౌతమీతీరవాసాయైనమః॥ - గౌతమీ నదీప్రాంతాననివాసమున్నవానికి
ఓం-క్షీరసైలాంతరస్తితాయైనమః॥ - పాలకొండలోనున్నవానికి
ఓం-పద్మాసనాయైనమః॥ - పద్మాసనముతోనున్నవానికి

| | |
|---|---|
| ఓం-బ్రహ్మమయాయైనమః॥ | - మయబ్రహ్మవంశీయునకు |
| ఓం-పద్మపత్రాక్షవీక్షణాయైనమః॥ | - తామరరేకుల వంటి కనులతో చూచువానికి |
| ఓం-ఐశ్వర్యాంగాయైనమః॥ | - అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వం, వశిత్వము అను అష్టసిద్ధులు శరీరాంగములుగానున్న వానికి |
| ఓం-అనాధాయైనమః॥ | - ఎవరూ లేని వానికి |
| ఓం-నాధాయైనమః॥ | - అందరికీ అధిపతియైన వానికి |
| ఓం-నామరూపకాయైనమః॥ | - నొసట విభూది నామములు ధరించినవానికి |
| ఓం-నామపారాయణప్రీతాయైనమః॥ **80** | - నామపారాయణచే తృప్తినొందువానికి |
| ఓం-నందివాహనాయైనమః॥ | - నందివాహనముగానున్న వానికి |
| ఓం-నటప్రియాయైనమః॥ | - నాట్యము నందుయిష్టునకు |
| ఓం-స్వస్థియేనమః॥ | - శుభములనొసంగువానికి |
| ఓం-వాక్కుయేనమః॥ | - వాక్కుకు(మాటకు) మొదటి రూపునకు |
| ఓం-మనస్సాయైనమః॥ | - మంచిమనస్సు గల వానికి |
| ఓం-తుష్టియేనమః॥ | - కలదన్నవానికి ఉండువానిగా |
| ఓం-ఆస్తియేనమః॥ | - లేదన్నవానికి లేనివానిగా |
| ఓం-నాస్తియేనమః॥ | - తనకంటే పరలోకము లేదనువానికి |
| ఓం-ఘనాఘనాయైనమః॥ | - గొప్పవారందరి లోగొప్పవానికి |
| ఓం-ఐశ్వర్యాయైనమః॥ **90** | - అణిమాది అష్టసిద్ధులు పొందిన వానికి |
| ఓం-అమోఘాయైనమః॥ | - అన్నిటాసఫలమైనట్టి వానికి |
| ఓం-యక్షగానవినోదినే నమః॥ | - యక్షగానముచే ఆనందించువానికి |
| ఓం-పక్షాపక్షోపచారాయైనమః॥ | - శుక్ల, కృష్ణ, పక్షములందు సేవలందువానికి |
| ఓం-తాలవృంతానిలావృతాయైనమః॥ | - విసనకర్ర, వింజామరులతో సేవలందువానికి |
| ఓం-చామరాగ్రసమీరస్థాయైనమః॥ | - గొప్పదగు వింజామరులతో సేవలందువానికి |
| ఓం-శార్దూలాంగాసనస్థితాయైనమః॥ | - పులిచర్మాసనముపైనున్నట్టి వానికి |
| ఓం-కాళీగాయత్రియేనమః॥ | - కాళీ, గాయత్రీరూపునకు |
| ఓం-సావిత్రియేనమః॥ | - సావిత్రి రూపునకు |





| | |
|---|---|
| ఓం-దుర్గాయైనమః॥ | - దుర్గా రూపునకు |
| ఓం-భైరవమూర్తయేనమః॥ **100** | - భైరవ రూపునకు |
| ఓం-సర్వాంగారాధన దేవాయై నమః॥ | - అన్ని శరీరాంగములు ఆరాధింపబడువానికి |
| ఓం-సర్వమూర్తియేనమః॥ | - సమస్త దేవతా స్వరూపముగా నున్నవానికి |
| ఓం-స్వయంప్రభువేనమః॥ | - స్వయంప్రకాశునకు |
| ఓం-ఉత్తమారాధనమూర్తయేనమః॥ | - ఉత్తమమైన సత్వా ఆరాధనలు పొందువానికి |
| ఓం-మధ్యమారాధనమూర్తయేనమః॥ | - మధ్యమమగు రజో ఆరాధనలు పొందువానికి |
| ఓం-అధమారాధనమూర్తియేనమః॥ | - అధమమగు తామసా ఆరాధనలు పొందువానికి |
| ఓం-పాలనాయైనమః॥ | - పరిపాలించువానికి |
| ఓం-శ్రీరూపార్చనసంతుష్టాయైనమః॥ | - లక్ష్మీరూపుగల స్త్రీల సేవతో(బ్రహ్మవిద్యతో) తృప్తినొందువానికి |
| ఓం-పురుషపూజామనోహరాయైనమః॥ | - పురుషుల పూజకు పరవశించువానికి |
| ఓం-సామగానప్రియాలోలాయైనమః॥ **110** | - సంగీతముచే ఆనందించువానికి |
| ఓం-సర్వాగమవిచారిణియేనమః॥ | - భవిష్యత్ కాలము విచారించు వానికి |
| ఓం-సర్వమంత్రాయైనమః॥ | - సమస్త మంత్రస్వరూపమునకు |
| ఓం-సర్వయంత్రాయైనమః॥ | -సమస్త యంత్రస్వరూపమునకు |
| ఓం-సర్వతంత్రప్రతాపాయైనమః॥ | - సమస్త తంత్రములందు సాటిలేని వానికి |
| ఓం-భస్మాంగాయైనమః॥ | - అన్ని అవయములకు భస్మాన్ని (విభూతి) ధరించిన వానికి |
| ఓం-భావనోల్లాసియేనమః॥ | - నాట్యముతో పరవశించువానికి |
| ఓం-భద్రాయైనమః॥ | - భద్రరూపునకు |
| ఓం-ఋద్రాయైనమః॥ | - రుద్రరూపునకు |
| ఓం-మంగళాయైనమః॥ | - శుభకరునకు |
| ఓం-బహుమంగళవాఘ్భూషయేనమః॥ **120** | - సర్వశుభములు గలవాక్కే భూషణములుగా గలవానికి |
| ఓం-పంచాననకులప్రసూతయేనమః॥ | - ఐదుముఖములుగల విశ్వకర్మ కులమందు జన్మించినవానికి |
| అహం బ్రహ్మాస్మి ,అయమాత్మాబ్రహ్మం తత్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ } | - నాలుగు మహా వాక్యములే ఆభరణములై - భూషణములై వున్నవారికి |

ఓం-తుర్యమంగళవాఘ్ఘ్యాషయేనమః। - తుర్యావస్థలో శుభకరమగు వాక్కులను అసంఖ్యాకముగా విను వానికి
ఓం-మంగళధ్వనిశృంఖలాయైనమః। - శుభకరమగు ధ్వనులతో చుట్టివేయబడిన వానికి
ఓం-మహావాఙ్మయహృద్ఘోషయైనమః। - హృదయమందు అమిత సాహిత్యభావనలు గల వానికి
ఓం-వాచాభజనకీర్తనాయైనమః। - సంకీర్తన, భజనలతో కీర్తింపబడువానికి
ఓం-అగ్రబ్రహ్మసనేసంస్థాయైనమః। - బ్రహ్మజ్ఞానులందరిలో అగ్రస్థానము పొందిన వానికి
ఓం-అగ్రమూర్తయేనమః - త్రిమూర్తులలో గొప్ప వానికి
ఓం-జనోత్తమాయైనమః। - జనులందరిలో ఉత్తమమైన వానికి
ఓం-అచింతనాయైనమః। - ఏ తలపులు లేనివానికి
ఓం-చింతనాయైనమః। **130** - ఆలోచనలు గల వానికి
ఓం-చిద్రూపాయైనమః। - స్వప్రకాశ జ్ఞానముగలవానికి
ఓం-ఆజ్ఞేయలోచనాయైనమః। - మూడవ కన్ను గల వానికి
ఓం-అతర్యాగహితోల్లాసాయైనమః। - అంతరాత్మలో చేయుయాగములందు తృప్తినొంది ఉల్లాసముగానుండువానికి
ఓం-బహిర్యజ్ఞప్రియసఖాయైనమః। - బహిరంగయజ్ఞములందు ప్రియ సఖ్యతతోనున్న వానికి
ఓం-రక్తామ్బరాయైనమః। - ఎర్రని వస్త్రము ధరించిన వానికి
ఓం-రత్నపీఠాయైనమః। - రత్నములు పొదిగిన వేదిక గల వానికి
ఓం-రాజ్యలక్ష్మీనివాశియేనమః। - రాజభోగములతో నివసించువానికి
ఓం-కర్మసాగరమధ్యస్థాయైనమః। - మతవిషయమగు కార్యాచరణయనే సాగరముమధ్యనున్న వానికి
ఓం-కారణాత్మవిచారణాయైనమః। - కారణ శరీరకార్యములు గమనించువానికి
ఓం-గంభీరాయైనమః। **140** - గాంభీర్యముగానున్న లోతుహృదయునకు
ఓం-కామనాశాయైనమః। - కోరికలను నశింపజేసిన వానికి
ఓం-కలిదోషవినాశాయైనమః। - కలి ప్రభావముచే కల్గు దోషములను నశింపజేయు వానికి
ఓం-గురుమూర్తియేనమః। - ఆరాధించు వారిని కాపాడువానికి





ఓం-గుణఘ్నాయైనమః। - ఆవు వంటి సాధు స్వభావముగల వానికి
ఓం-గురుయజ్ఞప్రియాయైనమః। - గొప్పయజ్ఞములందు ప్రీతి గల వానికి
ఓం-దయామూర్తియేనమః। - తన్నాశ్రయించిన వారి యందు దయగలవానికి
ఓం-సద్రూపాయైనమః। - మంచిరూపము (ఆకారము) గలవానికి
ఓం-సగుణాకారాయైనమః। - మంచి గుణములు గలవానికి
ఓం-నిర్గుణాయైనమః। - రజసత్వతమోగుణములు లేనివానికి
ఓం-గుణమూలికాయైనమః। **150** - ఆదిగుణములు గలవానికి
ఓం-మాయాతీతాయైనమః। - మాయకు చిక్కని ఆతీతునకు
ఓం-మహాప్రేతాయైనమః। - గొప్ప భూత తత్వము గలవానికి
ఓం-మంత్రమూర్తియేనమః। - మంత్రమే రూపముగాగల వానికి
ఓం-మహేశ్వరాయైనమః। - శివస్వరూపునకు
ఓం-ఛాయాముద్రాయైనమః। - ఛాయా పురుష యోగ స్వరూపుడైన వానికి
ఓం-భూచర్యైనమః। - భూమిపై తిరుగువానికి
ఓం-ఖేచరీలక్ష్యసాధనాయైనమః। - ఆకాశగమనము సాధించినవానికి
ఓం-సర్వామనస్కయోగీశాయైనమః। - పూర్తిగా మనస్సునిలగట్టిన యోగీశ్వరునకు
ఓం-అమనస్కాయైనమః। - మనస్సులేని వానికి
ఓం-అచలసాధనాయైనమః। **160** - దేనికీ చలించని సాధకునకు
ఓం-శమాదిషట్కసంపన్నాయైనమః। - శమము, దమము, క్రమము, తపము, తితీక్ష, సమాధానమనే ఆరుసాధించిన వానికి
ఓం-సగుణాయైనమః - మంచి గుణములు గలవానికి
ఓం-నిర్గుణమయాయైనమః। - రజస్సత్వతమోగుణములనరికట్టిన నిర్గుణునకు
ఓం-మాయామోహినితంత్రాయైనమః। - మాయను కల్గించుమోహినీ తంత్రవిద్యనెరింగినవానికి
ఓం-మహామంత్రప్రదాయకాయైనమః। - గొప్ప మంత్రములను భక్తులకు యిచ్చిన వానికి
ఓం-సత్కులాయైనమః। - మంచికులముగలవానికి( గొప్ప కులోద్భవునకు)
ఓం-కులఘ్నాయైనమః। - కులబేధములు నశింపజేసిన వానికి
ఓం-సర్వవర్నార్తరక్షణాయైనమః। - ఆర్తులైన అన్ని కులముల వారిని రక్షించువానికి
ఓం-సర్వాయైనమః। - అన్నీ తానైన వానికి

ఓం-సర్వవర్ణాయనమః।। 170 - అన్ని కులములు తానైనవానికి
ఓం-సర్వకర్తయేనమః।। - అన్నింటినీ సృష్టించిన వానికి
ఓం-ఉపప్రభువేనమః।। - ఉపకార దైవమైన వానికి
ఓం-తత్వప్రియాయైనమః।। - పంచతత్వములందిష్టునకు
ఓం-తత్వమయాయైనమః।। - అన్ని తత్వములతో నున్న వానికి
ఓం-పంచతత్వాత్మనిశ్చలాయైనమః।। - పంచతత్వాత్మలతో స్తిరంగాయున్న వానికి
ఓం-నిరాసనాయైనమః।। - ఎలాంటి ఆసనము (కూర్చుండేది) లేని వానికి
ఓం-నిర్మలజ్ఞానాయైనమః।। - పరిశుద్ధమగు జ్ఞానముగల వానికి
ఓం-నిఖిలాగ్రస్థిరాసనాయైనమః।। - సమస్త ఆసనములలో గొప్పదైన ఆసనము - కలవానికి
ఓం-నిఖిలావృత్తిపీఠాయైనమః।। - సమస్త ఆవరణములు తిరుగు పీఠము కలవానికి
ఓం-సర్వపీఠాగ్రవాశియేనమః।। 180 - అన్ని పీఠములలో ఉన్నత పీఠమునధిష్టించినవానికి
ఓం-సాక్షాత్కరాయైనమః।। - అంతటా సాక్షిగా నుండు వానికి
ఓం-సాక్షిరూపాయైనమః।। - స్వస్వరూపములతో నున్న వానికి
ఓం-సర్వవర్జియేనమః।। - సర్వాన్ని త్యజించిన వానికి
ఓం-సుసయినికాయైనమః।। - మంచిరక్షకునకు
ఓం-కోటిలింగేశ్వరస్థానాయైనమః।। - కోటిలింగాల వద్దనున్న వానికి
ఓం-నిజాలయాయైనమః।। - అదేవారి నిజమగు నివాసమైన వానికి
ఓం-మహాలయాయైనమః।। - సర్వమూ తనలో కలుపుకొను వానికి
ఓం-పితృమూర్తియేనమః।। - తండ్రి స్వరూపునకు
ఓం-పితృగణాయైనమః।। - తండ్రుల సమూహముతానైన వానికి
ఓం-ప్రేతాయైనమః।। 190 - మోక్ష రూపునికి
ఓం-పితృవర్జితాయైనమః।। - యమబాధలు విడిపించువానికి
ఓం-సర్వప్రేతార్చన సాక్షియేనమః।। - పంచభూతాత్మదేవతార్చనలకు సాక్షి యైనవానికి
ఓం-ప్రేతమోక్షప్రదాయకాయైనమః।। - ప్రేతాత్మలకు మోక్షమిచ్చు వారిలో ప్రధానునికి,
ఓం-యజ్ఞప్రియాయైనమః।। - యజ్ఞకర్మలందు యిష్టునకు
ఓం-యజ్ఞమూర్తియేనమః।। - యజ్ఞస్వరూపునకు





ఓం-యజ్ఞపాలాయైనమః।। - యజ్ఞపాలకునకు (ప్రభువునకు)
ఓం-నాగ్నియేనమః - జఠరాగ్ని లేని వానికి
ఓం-సర్వయజ్ఞమయమూర్తియేనమః।। - అన్ని యజ్ఞముల లో గల అగ్నిరూపునకు ఆ తేజస్వరూపునకు
ఓం-సర్వరోగనివారణాయైనమః।। - అన్ని వ్యాధులు తగ్గించువానికి
ఓం-వాతాయైనమః।।200 - వాతతత్వములు గల వానికి
ఓం-వాతరోగాయైనమః।। - వాత రోగ స్వరూపునకు
ఓం-వాతదోషనివారణియేయనమః।। - వాత దోషాన్ని తగ్గించువానికి
ఓం-శ్లేష్మాయై నమః - శ్లేష్మ తత్వము గలవానికి
ఓం-శ్లేష్మరోగాయైనమః।। - శ్లేష్మరోగస్వరూపునకు
ఓం-శ్లేష్మదోషనివారణియైనమః।। - శ్లేష్మరోగము తగ్గించువానికి
ఓం-పిత్తాయైనమః।। - పిత్తతత్వము గల వానికి
ఓం-పిత్తరోగాయైనమః।। - పిత్త రోగస్వరూపునకు
ఓం-పిత్తదోషనివారణియేనమః।। - పిత్తరోగము తగ్గించువానికి
ఓం-త్రిమలామలశోధాయైనమః।। - ఆణవమలము, మాయికమలము, కార్మికామలములనుశోధించిశుద్ధి చేయువానికి
ఓం-త్రిస్తాయయేనమః।। - మూడుస్థానాలు గల వానికి
ఓం-త్రిపురభూషణాయైనమః।। 210 - మూడు పురములు ఆభరణములుగాగలవానికి
ఓం-సకలలోకైకృతాకర్తాయైనమః।। - సకల లోకాలను నిర్మించిపోషించువానికి
ఓం-దక్షణాయైనమః।। - దక్షిణామూర్తిరూపునకు
ఓం-దక్షనాయికాయైనమః।। - దక్షిణ దిశనాయకునకు
ఓం-కళావర్యేనమః।। - తనచుట్టూ తేజస్సు గల వానికి
ఓం-కళామూర్త్యేనమః।। - తేజో రూపునకు
ఓం-కళాన్యాసాయైనమః - తేజో కిరణములను ప్రసరించువానికి
ఓం-కళానిధియేనమః।। - అమితమగు తేజస్సు తనలో గలవానికి
ఓం-కళాగ్రస్థాయైనమః।। - కళలను వశపరచుకున్న వానికి
ఓం-కళాపూర్ణాయైనమః।। - పరిపూర్ణమగు కళలు గల వానికి

21. యోగనిష్టతోమనోదృష్టిచే కన్పించు అనంతసచ్చిదానంద పరాత్పరులు, పరబ్రహ్మస్వరూపులు క్రమంగా ధ్యానించువారికి మానవరూపుతో కన్పించే, "సనారీ" వాక్కుకు, మనసుకందని సత్తు, చిత్తూ ఆనందముగలవానికి నమఃస్సుమాంజలులు.

22. దేవబ్రాహ్మణులైన విశ్వకర్మ (గొప్ప) కులమున జన్మించి, సర్వజనులను ఆనందకేరింతలతో మనస్సులను రంజింపజేయు వింతయగు ధ్వజంతో నున్న ఆవరణలో దేదీప్యమగు కాంతితో, భం భం కారశబ్ధముతో కూడిన మహామంత్ర బీజ ఉచ్ఛారణలతోనున్నట్టి ప్రదేశంలోనున్న ఓంకారస్వరూపులకు నమఃస్సుమాంజలులు.

23. నిండుజాబిలివెలుగులో సూర్యునివలేవెలుగొందు కాంతిమధ్యలో, ఛత్ర, ఛామర, వింధ్యామర పాటల పుష్పములతో విశేషసేవలు చేయుచున్నయిరు ప్రక్కజనుల మధ్య అగ్రస్ధానమున నివసించుచున్న వానికి నమఃస్సుమాంజలులు.

24. భువిపై జన్మించుట, జీవించుట, మరణించుటకుగల గొప్ప కర్మఫలితములను తొలగించునట్టి ప్రతిభ సాధించిన చేతివృత్తిగల కులములోపుట్టి" జాతికేమణి వలే " ప్రకాశించునట్టి సుందరునకు, జనులకు ఆనందము కలిగించు మంగళాకారునకు నమఃస్సుమాంజలులు.

25. అష్టోత్తరశతకేతనామావళి, సహస్రనామస్తోత్రం, 1128 నామకీర్తనలు, సంగీతసాహిత్యములతో చక్యనివాయిద్యసహకారంతో, వేదాగమముగా, మహామంత్రములతో కీర్తించుటచే ఆకర్షింపడి మేలుచేయు వానికి నమఃస్సుమాంజలులు.

26. ప్రపంచమందలిజనులు దుష్కర్మలనువీడి మంచి ఆలోచనలతో జీవించుటకు, వారికి గల కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను రూపుమాపి భక్తులను ప్రేమతోకాచువానికి నమఃస్సుమాంజలులు.

27. గతజన్మలో తాముచేసుకున్న ఆగామిసంచిత ప్రారబ్ధకర్మలైన ఫలితములతో ధనేషణ, ధారేషణ, పుత్రేషణయను ఈషణత్రయములలో జిక్కి ఆపదలలో బడి అలమటించువారిని రక్షించుటకు ఉత్సాహవంతులై, మృతులైనవారికి "సంజీవని " దివ్యమూలికవలేయున్నవారికి నమఃస్సుమాంజలులు.

28. మహాభాగవతోత్తముల గొప్పసభలోనాయకులై అధ్యక్షస్తానాన్ని అలంకరించిన జగద్గురువులగు సనారీవిశ్వనాధునికి నమఃస్సుమాంజలులు.

29. శవోపాసనలతో భయంకరమగుమారణహోమములునిర్వహించుగొప్ప మంత్రోపాసనిష్ణాతుల ఆస్తానంలోగలసభకు నాయకులై అధ్యక్ష సింహాసనాన్ని అలంకరించి, తెల్లతామరలవంటి కనులతో రెప్పలుపడని చల్లని చూపుగల జగద్గురువులైన మహానుభావునకు నమఃస్సుమాంజలులు.





30. అనంతకోటి సూర్యప్రకాశతేజస్సు గల మనస్సుతోదివ్య మంగళ స్వరూపులై, ఖేచరీనిజాస్ధానమైన భ్రుకుటిలో మనం ద్యానించు ఆజ్ఞాచక్రంలో నివసించు జగద్గురునకు నమఃస్సుమాంజలులు.

31. అనంతసంఖ్యగల అక్షరసముదాయంలో నివాసముంటూ భాషద్వారా ఒకరి నుండి మరొకరు ఉపదేశం పొందజేయుచూ అనంత తేజస్సుగలిగి పరుల నాకర్షిస్తూ, సప్తచక్రములకు సాక్షిగా ఆ లోకములు దర్శించి సహస్రారకమల మధ్యనున్నట్టి విశ్వబ్రహ్మకు నమఃస్సుమాంజలులు.

32. వీరశైవులు వీరశాక్తేయులైన మహాజనులందరి మనస్సులు దివ్యంగా సంధాన పరచి, రంజింపజేసి, వారిని ఆనందపరచిన సుందరాకారునకు నమఃస్సుమాంజలులు.

33. అనేకలోకములందలి జనులచే స్థుతించబడి, చిన్నా పెద్ద ఆకారములతో గల నివాసములను (జీవరాసులను)గొప్పగా సృజించిన మానవరూపము గలట్టి వానికి నమఃస్సుమాంజలులు.

34. అస్తమించు అమిత సూర్యునికాంతివంటి అనేక కోట్ల ప్రకాశంతో కుంకుమ రంగుతో శరీరమందలి ముఖ్యస్థానమగు మూలాధారచక్రమందు దివ్య మంగళ రూపంతో నివాసమున్న గణపతిని కదలించిన ప్రకాశదేహము గల వానికి నమస్సుమాంజలులు.

35. ఉదయించు సహస్రకోటి సూర్యప్రకాశంతో సింధూరపురంగుతో సుందర దేహముతోనున్న బ్రహ్మదేవుని నిజాస్ధానమయిన స్వాధిష్ఠానచక్రమందలి, త్వష్ఠ బ్రహ్మను ప్రవేశ నిర్గమమార్గములో దూరముగా పయనించి సాక్షాత్కరింప జేసుకున్న గురుదేవులకు నమఃస్సుమాంజలులు.

36. యింద్రనీలములతో ఉన్నతమైన మహారత్న హారములుధరించి ప్రకాశమగు నీలిరంగుతో వెలుగొందుచూ శత్రువులను సంహరించు విష్ణువు మణిపూరక చక్రమందు కొలువుండిన మహాజగత్తునకు( ఆస్థానమునకు) నాయకులైన వానికి నమఃస్సుమాంజలులు.

37. మధ్యాహ్న సమయమునఆకాశఅగ్రభాగమున అనంతకోటి సూర్యుల తేజస్సుతో తెల్లగా ప్రకాశిస్తూ, శరీరమంతా మహాసర్పాలను భస్మాన్ని అలంకరించుకుని దిక్కులకు అధిపతియై రక్షిస్తూ అనాహతచక్రనివాసియైన జగద్గురువునకు (సర్వేశ్వరునకు) నమఃస్సుమాంజలులు.

38. పరిశుద్ధమగుకాంతి గలిగి సుందరదేహముతో జయకరమగు మనస్సుతో జీవచైతన్యవంతమగుహంసతో కలసి, అ నుండి అః వరకూగల అక్షర మధ్య నగలవి శుద్ధచక్రంలోనున్న నామనస్సుకిష్టమగు సద్గురుదేవునకు నమః స్సుమాంజలులు.

39. ఓం, ఐం,బీజమాతృకల మధ్యన వైష్ణవమాయాతత్వంతోగూడిన సూక్ష్మదేహ మందలి దోషములు నశింపజేసి మోహమును కల్గించు సుందరాకారునికి నమః స్సుమాంజలులు.

40. ఓం, క్లీం, బీజమాతృకలమధ్యన విష్ణురూపంతో వేదాంత విద్యాతత్వంతో విష్ణుస్థానమగు మాయాకమలమునందలి మాయాదోషములు తొలగించు సుందరుడగు మోహనరూపునకు నమఃస్సుమాంజలులు.

41. ఓం, సౌః బీజమాతృకల మధ్యనవారి నిజనివాసమగు కార్మికామల చక్ర మందుండి లెక్కలేనన్ని కార్మికామల సంబంద దోషములను నశింపజేయు శివరూపముగల మహానుభావునకు నమఃస్సుమాంజలులు.

42. అనేకమగు బీజాక్షరములుగల్గి ప్రతాపవంతమగు మంత్రములతో సమస్త తత్వములు గల మానవశరీర మందలి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ దేహములను పరిశోధిస్తూ శరీరమందలి రక్తమండల, శ్వేత మండల, కృష్ణమండల, జ్యోతిమండల, సూర్యమండల, చంద్రమండల, అగ్ని మండల, గురుమండలంబులందుగలవానికి నమః స్సుమాంజలులు.

43. తీపి, కారం, చేదు, పులుపు, ఉప్పు, చప్పదనమనెడి, ఆరురుచులుగల ఆహారాన్ని తింటూ, సమస్త ఫలములనారగిస్తూ గాలిచేత వాటి సువాసనలు ఆస్వాదిస్తూ, వీటితో సంతృప్తులైనమనోహరమగు ఆనందరూపునకు నమఃస్సుమాంజలులు.

44. సనారీవారి ఎడమ భాగమునగట్టిగా కౌగలించుకున్న ఆర్ధాంగితో, మిగిలిన సగభాగము భస్మమునుధరించి, ఆధూళితో ప్రకాశించు పరిపూర్ణ రూపమునకు నమః స్సుమాంజలులు.

45. అఖండమగుతేజస్సుతో ప్రకాశిస్తూ, స్త్రీజాతిలోమణియైనట్టిపార్వతీదేవితో కాషాయవస్త్రములు ధరించి, దండకమండలములు చేతబట్టినట్టి వానికి నమః స్సుమాంజలులు.

46. జటాజూటములు, కౌపీనము,(గోచి) గాయత్రి (జందెము) మూడు విభూతి రేఖలతోభృకుటిని (భ్రూమధ్యాన్ని) చూస్తున్న త్రినేత్ర ధారికి యోగసమాధిలో నున్న వానికి నమఃస్సుమాంజలులు.

47. ముప్పైమూడుకోట్ల దేవతాగణములు, 84లక్షలజీవరాసులతో పూజింపబడు పాదపద్మములుగల వానికి నమః స్సుమాంజలులు.

48. రజో, సత్వ, తమోగుణములను స్వాధీనపరచుకుని, త్రిమూర్తులమూల స్వరూపులై అందరిచే పూజింపబడి సర్వశుభములు చేకూర్చు తెల్లని ప్రకాశ వంత మగు మానవ రూపమునకు నమఃస్సుమాంజలులు.





49. భూమి, ఆకాశము, గాలి, నీరు, నిప్పు ఈపంచభూతములతో కూడిన దేహమందలి 25 తత్వస్థానములను శోధించిసాధించిన, ఆది ప్రకృతిరూపునకు నమః స్సుమాంజలులు.

50. ముక్కు మొదటి భాగమగు భ్రూమధ్యన దృష్టినిలిపి, మహానందము కలిగించు శ్రావ్యమగు దశవిధనాదములను చెవులలో వింటున్నవానికి నమఃస్సుమాంజలులు.

51. శివ, విష్ణు, శక్తి, ఆరాధకులగు మూడుగొప్పమతస్తులను సంధానపరచి నాయ కత్వంవహించి. వీరందరిచే ఆనందముగాపాదసేవలందు కొనుమహనీయునకు నమః స్సుమాంజలులు.

52. దేవతలు, రాక్షసులు, యక్షులు, కిన్నెరులు, నరులు, మృగములు, జంతువులు, సృష్టిలోని మొత్తంజీవజాలముల పుట్టుకకు పెరుగుటకు, నశింపుకు కారకులైన బ్రహ్మదేవరూపునకు నమఃస్సుమాంజలులు.

53. సమస్తమైనదేవతలకు నిదర్శనుడై, నదులందలి తటాకముల కిరణముల వలే అమృతతుల్యమగు చక్కనివాక్కుతో, వినోదమును, ఆనందమును కలిగించునట్టి అందమగురూపముతో దర్శనమిచ్చు వానికి నమఃస్సుమాంజలులు.

54. చెడ్డ ఆచారము, చెడుకలలు, చెడ్డవారి సాన్నిధ్యము, చెడ్డప్రవర్తన, దుర్మార్గమగు చెడుఅహంకారము, చెడు భూతముల, చెడ్డపనులు, భయభ్రమలగు చెడుఆలోచనలు మొత్తం ఈచెడ్డవాటినన్నింటినీ నాశనం చేయువానికి నమఃస్సుమాంజలులు.

55. మానవశరీరమందలి 25తత్వములనుశోధించిసాధించు యోగవిద్యను ఎట్టిసందేహములు లేకుండా మధురమగు వాక్కుతో సంశయములు తొలగించి జ్ఞానోపదేశంచేసిన మహాతేజోవంతునకు నమఃస్సుమాంజలులు.

56. అనంతమైన భూలోకములోనివసించు స్త్రీపురుషుల మనసులు అనురాగముతో రంజింపజేసియిహలోకంలో సర్వభోగములను, పరలోకములో మోక్షమునుప్రసాదించు సూర్యతేజస్సుగల మహనీయునికి నమఃస్సుమాంజలులు.

57. అనంత మగువిజ్ఞానంతో వెలుగొందుచు మానవులందును జంతువులందును సమ దృష్టితో సర్వజీవుల పోషణకాధారుడగు విశ్వకర్మభగవానుని ప్రతి రూపమగు వానికి నమఃస్సుమాంజలులు.

58. మహాఋషులు, యోగులు, మునులు,యతులు,యోగినీబృందములచే సేవలను పొందుచూ, ఆనందించు. పరిశుద్ధ స్వచ్ఛస్వరూపుగల వానికి నమః స్సుమాంజలులు.

59. ధనేషణ, ధారేషణ, పుత్రేషణలలో చిక్కి , అరిషడ్వర్గములగు మద మాత్సర్య ముల భోగవర్గములయందున్న వారికాబంధముల నుండి తప్పించి, శుభకర మగురూపంతో దర్శనమిచ్చు మహనీయునికి నమఃస్సుమాంజలులు.

60. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశ్వరత్వము, వశిత్వమను ఈ ఎనిమిదింటిని సాధింపకోరువారి కోర్కెలు తీర్చు అభయ హస్తములతో నున్న వానికి నమఃస్సుమాంజలులు.

61. ముక్తాసనం, వీరాసనం, పద్మాసనములు అనేక నియమనిబంధనలతో గల,జాలంధరము, మూలబంధము, ఉద్యానబంధనలను మూడుబంధము లందు నివశించు వానికి నమఃస్సుమాంజలులు.

62. శరీరతాపసమయములో నవరత్నములతో పొదగబడి ప్రకాశించునట్టి గొప్ప సింహాసనముపై అధ్యక్షస్థానముననున్నట్టి వానిపాదుకలను పూజించు వారి, చామరములతో విసురువారి, సేవలుపొందు వానిపాదములకు నమఃస్సుమాంజలులు.

63. ఎ. అనన్యమైన విజ్ఞానశాస్త్రములందలి నిఘూడరహస్యములెరింగి మహజగ న్నిర్మాణ కర్తలైనమీకు నమఃస్సుమాంజలులు.

63 బి. అనన్యము అమోఘమగు అంతరిక్ష సంబంధమగు విజ్ఞానశాస్త్రమందలి రహస్య భావములనెరింగి ఈమహాప్రపంచ నిర్మాణము చేసిన వానికి నమఃస్సుమాంజలులు.

64. యోగసాధనలు, మహామంత్రములు శిల్పనిర్మాణములు అన్నింటినీజ్ఞానంతో సంపూర్ణముగాగ్రహించి, సాధించి, విశేషప్రజ్ఞను పొంది ప్రజ్ఞామృతము ఆస్వాధించుచూ వెలుగొందుచున్న మూర్తికి నమఃస్సుమాంజలులు.

65. అజ్ఞానాంధకారములతో వివేకశూన్యులై చిత్తశుద్ధిలేనిజీవనము చేయుచూ, బ్రతుకుమానవులు అనుభవించు పాపములను, మహాపాపములను నశింప జేయు మనస్సుతో నున్న వానికి నమఃస్సుమాంజలులు.

66. శమము, దమము, ఉపరతి, తపము, తితీక్ష, శ్రద్ధ, సమాధానము, అను ఆరు గుణములను సాధనచే సంపాదించి,మానవ జీవన మందు విరక్తి భావంతో, భక్తి చేముక్తిని పొందగల ప్రవర్తనలుగల, చిత్తముగల జనులను ఆదరించి ముక్తినిచ్చు మనసు గల వానికి నమఃస్సుమాంజలులు.

67. అప్రతిహతముగా, అంతరిక్షనివాసము చేసి ఆనందంతో అంతరిక్షాన్నితన ఆధీనంలో ఉంచుకుని పరిపాలించుచూ రాజులచే, మేధావులచే, పాద సేవలందుచున్న ప్రజ్ఞగల వాని చక్క నిపాదపద్మములకు నమఃస్సుమాంజలులు.





68. అనేకరకములగు పువ్వులు, బిళ్వదళములు, తులసీదళములు, అక్షతలతో కర్పూరనీరాజనములిస్తూ, గొప్పమంత్రతంత్ర యోగధ్యానములతో క్రమంగా మానసా రాధనచే సంతుష్ఠులగు హృదయునకు నమఃస్సుమాంజలులు.

69. శరీరమందలి పంచతత్వములనూ ఏకము చేసి మహామంత్రతంత్ర యంత్రములను, స్వతంత్రంగానియంత్రించి, నిగమాచారములచే అధర్వణ వేదమును స్వాధీనపరుచుకున్న మూలమూర్తికి నమఃస్సుమాంజలులు.

70. సర్వమండలములను తగులబెట్టి బూడిదచేయగలట్టి ప్రచండమగు అగ్ని జ్వాలల రూపమగు మహాగ్నితో ఆవాహనీయ, గార్హాపత్య, దక్షణాగ్నులను మూడురకములుగా అనుష్టించి యజ్ఞము చేయగల వానికి నమఃస్సుమాంజలులు.

71. బ్రహ్మయజ్ఞం, పితృయజ్ఞం, దేవయజ్ఞం, భూతయజ్ఞం, అతిధియజ్ఞమను ఐదురకముల యజ్ఞములను చక్కగాఆచరించి, జనులకుచూపి నాలుగు వేదముల ప్రమాణముగా, ఆగమశాస్త్రబద్ధంగా, మహామంత్రములను లిఖించి పారాయణ చేయునట్టి మహేశ్వరస్వరూపునకు నమఃస్సుమాంజలులు.

72. అనేకరకముల ఆకుల పండ్లరసములు, తినే మహామధురమగుఫలాలు, అమృతతుల్యమగునవి ప్రసాదంగా ఉంచి, నివేదనజేసి, కర్పూర నీరాజనము లిచ్చి, ప్రదక్షణలు చేసి, ధృడమగు సంకల్పంతో ధ్యానించు భక్తుల మనస్సు నందలి కోర్కెలు తీర్చువానికి నమఃస్సుమాంజలులు.

73. లలితకళల నభ్యసించివినోదించు రసికశిఖామణులు అందముగు కన్నులతో రెప్పవాల్చకుండాచూస్తున్నట్టి, "మోహనాకారుడై" సకల శుభములుకల్గించు వానికి నమఃస్సుమాంజలులు.

74. కామోద్రేకంతో ఎగసిపడు సౌభాగ్య స్త్రీలకు గల శృంగార చేష్టలను భంగపరచి, ఆధ్యాత్మిక భావాలను కలుగచేసి, సంగమించని వానికి నమఃస్సుమాంజలులు.

75. 64కళలతో ప్రకాశిస్తూ ఏఆలోచనలులేని వాడై ఆదిఅంతములులేని అధ్భుతమగు కాంతి గల భ్రూమధ్యాన్ని తదేకదృష్టితోచూచు వానికి నమఃస్సుమాంజలులు.

76. కదలిక, కదలికలేని 84లక్షలజీవరాసులను సంరక్షించుదీక్షనువరంగా పొంది పోషించుచూ, పుట్టుక, పెరుగుట, లయం చెందుటయను ఈమూడు కార్య ములతో సర్వసర్వంసహాసృష్టి కార్యము చేయువానికి నమ స్సుమాంజలులు.

77. త్రికరణశుద్ధిగా భక్తులు మనసునతలంచినంతనే సంతృప్తి చెంది, వారి హృదయములో ఎల్లప్పుడూ నివాసముండు వానికి నమఃస్సుమాంజలులు.

78. లోపల బయలునందుసంపూర్ణముగా ఉండి. అనేకమందిశరీరములలో అణు రూపుగా యుండి, నిశ్చలతత్వంతో నున్నజనులకు మాత్రమే దర్శనమిచ్చువానికి నమః స్సుమాంజలులు.

79. శ్రీశైలపర్వత ఉత్తరదిశలోగల, గుహ అంతర్భాగంలో నివశించు మహాసంయ మీశ్వరులున్న ప్రదేశసమీపమునసంచరించు ఆసక్తి గల మహాగురుదేవులకు నమః స్సుమాంజలులు.

80. మార్కండేయుడు, అగస్యుడు, వశిష్ఠుడు, మొదలగు మహా సంయములున్న గౌతమీతీర మందు నివశించు వానికి నమఃస్సుమాంజలులు.

81. భూమిపైనివశించు లెక్కలేనట్టి మానవులలో చాలాకొద్ది జనుల హృదయము లలో మాత్రమేప్రతిఫలిస్తూ శుభములు చేకూర్చువానికి నమఃస్సుమాంజలులు.

82. రేయింబవళ్ళుఆరాధించుజనప్రవాహములో క్రమంగా ధ్యానిస్తూ మానస పూజచేయుచు, మహామంత్రములతో జపములు, తపములు, ఆహుతులతో చేయుపూజలకు ఆకర్షించబడి తృప్తినొందువాని పాదుకులకు నమఃస్సుమాంజలులు.

83. కులనియమములు ఆచారములు మహానిష్టతో ఆచరించుచూ యిదే భక్తి మార్గమని భ్రమించువారిని, ఏనుగు కుంభస్థలమున అంకుశముతో పొడుచుచూ మార్గమునిర్దేశించు మావటి వానివలే, యోగమార్గమున నడిపించు మీకు నమః స్సుమాంజలులు.

84. గాలి, నీరు, నిప్పు యొక్క వ్యతిరేకతత్వాన్ని విడివిడిగా ఆనందంగా అంగీ కరించి, చిరునవ్వుతో మనసా వాచా, కర్మచే, ఆణవమల, కార్మీకామల, మాయి కమలముల దోషములను నాశనంచేసి,భక్తులఆనందమయమగు హృదయ మందిరములలో చక్కగా యున్నట్టి వానికి నమఃస్సుమాంజలులు.

85. మాటలతో చెప్పశక్యంకాని మహానందాన్ని కలిగించు ఆకారముతోనున్న వానికి, అనంతమగు అద్భుతానందములతో సేవించు మహాజనంతో సేవలను పొందు, మఠాధిపతులైన గురువులకు గురువైన జగద్గురువునకు నమఃస్సుమాంజలులు.

86. తల్లి, తండ్రి, తోబుట్టువులు, మిత్రులు, శత్రువులు, భార్యా, పిల్లలు ఈవర్గంలోని వారిలో గల దుర్మార్గములను నాశనం చేయువానికి నమఃస్సుమాంజలులు.





87. కన్నతండ్రిని పూజించునట్లుగా, ఎలాంటి భేధంలేకుండా సుందరరూపుడు, కారణజన్ములైన, విశ్వదేవులగు సనారీవారిని పూజించిన, స్వామివారి కృపాకటాక్షములు లభించును అట్టిదైవమునకు నమఃస్సుమాంజలులు.

88. సర్వవేదాంతముల సారముగ్రహించివాటి అమృతధారలుగ్రోలాలంటే మనస్సు నిశ్చలం చేసుకుని, "అచలతత్వాన్ని సాధిస్తే" మహోల్లాసంతో సాక్షాత్కరించి కోర్కెతీర్చు స్వామివారికి నమఃస్సుమాంజలులు.

89. తరుగులేని అక్షయపాత్రనుచేబూని, నిత్య గ్రాసంగా భిక్షాన్నమునారగించు వానికి నమఃస్సుమాంజలులు.

90. ఓంప్రాణాయస్వాహా, ఓంఅపానాయస్వాహా, ఓంవ్యానాయస్వాహా, ఓం ఉదా నాయ స్వాహా, ఓంసమానాయస్వాహా అనుచూ భక్తులుచేయు ఈపంచాహుతులతో కడుపునిండా నివేదన పదార్థములు ఆరగించువానికి నమఃస్సుమాంజలులు.

91. సర్వదేవతలను ఆరాధించుటకు వరుసగా చేయు ప్రధాన కలశారాధనతో మనసున సంతోషంచెంది ఉల్లాసంగా ఆనందించు విగ్రహమూర్తికి నమఃస్సుమాంజలులు.

92. అనంతయోగములు నిష్ఠాగరిష్టతలతో ఆచరించి విశిష్టమగు అద్భుత నిదర్శన ములతో మానసోల్లాసియై అమనస్కాచలసాధనతో ఖేచరీయోగసాధన చేయువానికి నమఃస్సుమాంజలులు.

93. పాలకొండలో మయవంశమందు జన్మించి గాంభీర్యంగా జీవిస్తూ అనంతమగు విద్యలను విశేషమగునైపుణ్యతతో కనుగొన్న సనారీవిశ్వేశ్వర స్వామివారికి నమః స్సుమాంజలులు. (నారితో కూడిన విశ్వనాధునికి)

94. స్వర్గలోకములోనివశించు దేవతాబృందములకు, మహా మునిగణములకు, మానవులలో ఉత్తములకు, ఉత్తమకులస్తులతో సంబంధం గలట్టి దివ్య పురుషుదైన గొప్పవ్యక్తికి నమఃస్సుమాంజలులు.

95. దేవబ్రాహ్మణులైన మహాపాంచాననకులవిశ్వబ్రాహ్మణులను ఉద్ధరించి, అన్నికులములమతముల సర్వజనులకు ఉల్లాసంగా దర్శనమిచ్చు జగతిలోని ఏకైకమూర్తికి నమఃస్సుమాంజలులు.

96. బ్రహ్మలోకాన్ని బ్రహ్మన్నిపొందగలద్వైతము, అద్వైతము విశిష్టాద్వైత విధాన ములతో నిండి సముద్రగంభీరముగానున్నట్టి, యోగనిద్రను ప్రచారం చేయు వానికి నమఃస్సుమాంజలులు.

97. ముక్కు మొదటి ప్రదేశమగు భ్రూమధ్యన సంపూర్ణకళలతో వెలుగొందు సూర్యమండలం, చంద్రమండలం, అగ్ని మండలములనెడు మూడు మహామండల ముల మధ్యనుంటూ చిత్కళలతో వెలుగొందు చిన్మయమూర్తికి నమఃస్సుమాంజలులు.

98. అ నుండి క్ష వరకూగల అక్షరములమధ్యలో అనాదిగా షట్చక్రములందు ఉండి మహాఫలితము లొసంగికోర్కెలుతీర్చువానికి నమఃస్సుమాంజలులు.

99. వీరశైవసిద్ధాంతమును ప్రతిష్ఠించినఆచార్యులు,ద్వైత్వ, అద్వైతములను రెండు వేదాంతములను నియమనిష్ఠలతో ఆచరించి, అభయహస్తంతో ప్రచారంచేసిన వానికి నమఃస్సుమాంజలులు.

100. మూడుమతములందలి లక్షణ బేధములతో కూడిన మంత్రతంత్ర పద్ధతులను క్రమపరచి, మహామంత్రములను పరిష్కరించి తెల్పుటలో ముఖ్యమగువానికి నమః స్సుమాంజలులు.

101. మానవులబాల్యం, యవ్వనం, కౌమార్యం, వృద్ధాప్యం ఈనాల్గు జీవనముల వారికి జరుగబోవు జీవితఫలములను తిలకించు మహానుభావునకు నమఃస్సుమాంజలులు.

102. సర్వాంగములందు ఆభరణములు ధరించి ప్రకాశిస్తూ తెల్లనిరూపుతో నిదర్శనంగాయున్న రూపముగలవానికి నమఃస్సుమాంజలులు.

103. అనేకమైన అగ్నిజ్వాలలు మాలలుగానుండి వెలుగుచున్నదానిని, మహాజ్ఞానంతో అజ్ఞేయ చక్రమున దృష్టినిలిపి మానస దృష్టితో చూచుచున్న వానికి నమఃస్సుమాంజలులు.

104. యిడపింగళ,సుషుమ్న మూడు నాడులు కలియుచోటు యగు భృకిటి యందు చిత్కళలను తిలకించు మనస్సుగలవానికి నమఃస్సుమాంజలులు.

105. అకార, ఉకార, మకారనాద సంయోగంతో గల, ఓంకారనాదముతో సూర్య, చంద్రాగ్ని కళలకతీతమగు మహాతేజస్సుతోనుండి ఎల్లప్పుడూ పరలోకభోగములను భవించుచూ, దుష్టులశిక్షించి, శిష్టుల రక్షించి చక్కగాపాలించు వానికి , నియమనిష్ఠలతో నుంటూ అష్టసిద్ధులను నిత్యం ఆచరించువానికి నమఃస్సుమాంజలులు.

106. మహాఘోరమగు నరకజీవన యాత్రచేయు జనులనుసైతము సనారీనామాన్ని స్మరించి నంతనే వారి మనసునానందపరచి విశేషమగు మోక్షాన్ని ప్రసాదించు వానికి నమఃస్సుమాంజలులు.

107. ఎంచదగిన పుణ్యజనుల మనస్సునకానందాన్నిచ్చు సుందరమగు మానసా రాధనతో మనస్సు లయం పొందు తపస్సుగల విద్యాధనంతో చంద్రునివలే సంపూర్ణ తేజస్సుతో నున్న వానికి నమఃస్సుమాంజలులు.





108. నిజాలయమగు దేహాలయంలో, నిశ్చలమగు మహాతేజస్సుతో, భూమిపైగల, సకల జనుల హృదయములందు బ్రహ్మాసనాసీనముతో హృదయాంతరాళ మందు వెలుగొందు జగద్గురువునకు నమఃస్సుమాంజలులు.

మహాగురువులగు జగత్ గురుదేవులకు శతసహస్రపాదాభివందనములు

## ః- ఫలశ్లోకములుః-

1. ఈ అష్టోత్తరశతకేత నామముల పారాయణచేస్తూ సనారీ విశ్వేశ్వర గురు యంత్రాన్ని పెట్టి ధ్యానించిన వారు తక్షణమే పతితపావనులగుదురు.
2. మనసు నందలి కోర్కెలుతీరి ఆయుష్షుపెరిగి ఆరోగ్యంకలిగి అనేకశుభములు చేకూరును, గురునామాన్ని నిత్యంపారాయణచేయు వారు మరుజన్మలేకుండా పరమాత్మయందుఐక్యమగుదురు.
3. వందఅశ్వమేధయాగములు, కోటికన్యాదానములు చేసినఫలితములు. వేయి ప్రధానమైన, అనంతమగుదివ్యస్థలాల్లో దేవతలనర్చించి, లెక్కలేనన్ని అన్నదానములచేసిన కలుగు ఫలితములు గురువును పూజించుటచేకల్గును.
4. ఈ108 నామాలను పారాయణచేయు మహాపురుషులు అనేక జన్మలనుండి వారికి సంప్రాప్తమైన పాపములు నశించి సంపద ఐశ్వర్యములను పొందు తారు.
5. సనారీవిశ్వేశ్వరుల సన్నిధిలో పీఠముపై పద్మాసనంతో అంజలిఘటిస్తూ కృతనిశ్చ యుడైతే స్వామివారుఅమితమైనతత్వాలను బోధపరచి ప్రాపంచకవిషయాలు తెలియజేయుదురు. (పార్వతీస్థవాన్ని వినాలి)

గమనిక: యిదిసనారీ విశ్వేశ్వరసంవాదమందలిగొప్ప జగద్గురుని మంత్ర నామములు పారాయణచేస్తూయంత్రాన్ని అర్చించుతూ ఉన్నవారికి కలుగు ఫలితములు.

**శ్రీశ్రీశ్రీ త్రిశక్తి సహస్రలింగ సహిత సనారి విశ్వనాథ దేవాలయమ్,**

మహానాడు, తాడేపల్లి పోస్టు&మండలం, గుంటూరు జిల్లా : 522 501, నవ్యాంధ్ర

# పంచమాశ్వాస ప్రారంభము

1. **పార్వతీ ప్రశ్న :-** స్వామీ శోభాయుక్తమగు మీవామాంమున ఉన్ననాకు ఆత్మపూజా పద్ధతులు బోధింపవలయును. దాని విశేషమును, ఆత్మ నిలకడ యు, దానిచే పొందు ఆనందమును, మహిమలను ఈలోకతత్వసాధకుల కోసం చెప్పండి.

2. **ఈశ్వరఉవాచ :-** మానసపూజచేకల్గుమహిమలు, అద్భుతములు ఏమని చెప్పను, ధ్యానములేదు, అంగన్యాస, కరన్యాసకరతంత్రములు చేసే అవసరంలేదు, చక్కగా స్నానం చేయుట, మంచి ఆసనము మంచి చోటులను ఎప్పుడూ కోరదు, ఈ మానసపూజ శుద్ధమగు పానీయములతో, భోజనము, భోజనముతో తినదగు పదార్థములను కోరదు, బ్రహ్మానికి వీటన్నింటితో పనిలేదు.

3. భార్యాబిడ్డలు గలవారెవ్వరైనా ఏకులంవారైనా ఏవయస్సువారైనా ఈ మానస పూజను వశము చేసుకోవచ్చును, మానసారాధనకన్నమించిన గొప్ప మంత్రము లేవీలేవు. అలాంటి మంత్రములను కనిపెట్టినవారూ లేరూ. అన్నిలోకములలో వాడుకలోలేనిది, రహస్యముగా ఉంచబడినట్టి విద్యను, నరలోకం లోని జనులకొరకు నీవు అడిగావు కావున వినుము ఈ విద్యను సాధింపుము.

4. ఎలాంటిరూపము, పేరూ, ఎలాంటి పనులు లేనట్టిదగు మహాగొప్పరూపుతో వెలుగు చున్న జ్యోతికి, నేను చేయు ఉపచారములు, పూజలో చేయుపనులు శాశ్వతముగా నుండుగాక. 1. గొప్ప సముద్రములు, నదులు, ఉపనదులందలి గొప్ప జలములన్నీ నీకు అభిషేకముగా. 2. మట్టి,రాళ్ళు, చెట్లు, జంతువులు వీటితో కూడిన 14 లోకంబులు నీకు గంధముగా. 3. నక్షత్రములు, గ్రహములు, ద్వాదశ రాసులు గొప్పమండలాలతో, మహామేరుపర్వతధూళితో కూడిన ఆకాశమునీకు పుష్పంబుగా. 4.ఆకాశంలో ప్రవేశించి, ప్రవేశింపలేక అన్ని దిక్కులకు గిరగిరా తిరుగుతూ, సన్నని రేణువులతో ఆకాశమున కెగయు వాయువు నీకు ధూపంబుగా 5. సమస్త జీవులందలి అగ్ని నీకు దీపంబుగా పంచభూతముల కలయికతో నిర్మితమైన, నేనే నీకు ప్రసాదముగా నన్ను నేనర్పించు కొంటున్నాను దేవా. భక్తరక్షకుడవై రక్షించుము పరమాత్మా సాష్టాంగ దండప్రమాణములు శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు అంటూ ఈ ఆత్మపూజను చెప్పుకోవలయును.

5. పార్వతీ నీకళ్ళతో చూస్తూ మానకుండా పూజించు, బయట ఏమంత్రములతో పనిలేదు. నీవే జ్యోతివై సృష్టికర్త ప్రతిరూపమై ఉన్నావు. ఈ పూజనువదలవద్దు బ్రహ్మాన్ని చేరు మార్గమిదే, యిందులో ఏమాయలూ లేవు.

6. ఈ పూజచేసే జ్ఞానులు వేరే ఎలాంటి పూజలు చేయరు వారికి అంతాదివ్య ప్రకాశమే. అంతరదృష్టిలోగలజ్యోతి స్వరూపుడు నీ లోను, నా లోను, బయలందు, సంపూర్ణంగా ఆమహాప్రకాశము అన్నిలోకములందు నిండియున్నది.





7. ఈ ఆత్మపూజ చేసేవారికి ప్రతీపూటా నేనే మ్రొక్కుతుంటాను, యిది యదార్థము అలాంటి పుణ్యాత్ములు ఏలోకంలోని వారైనా, నేను కంటికి రెప్పవలే కాపాడుతుంటాను.

8. శోభాయుక్తమై మిగుల ఆసక్తిగలదగు ఈ ప్రపంచమునకు ప్రశస్తమైన పరలోకా ధీనుడగు బ్రహ్మము, తానుస్వతంత్రమై, ఉందనువారికి ఉన్నట్లు లేదను వారికి లేనట్లున్న పరమాత్మకు పుట్టుక చావులేక రహస్యముగా నున్నట్టి వానిని, గురుభక్తులు యోగదృష్టిచే చూస్తారు. అందరూ సాధనచే చూడవచ్చును నిత్యమూకన్నులతో మానసదృష్టి గురి కుదిరితే యిది సాధ్యమగును.

9. శరీర సంబంధమగు యింద్రియ కార్యకలాపములందు మనసు పోనీయక, జ్ఞానముగలిగి మంచిభావనలతో ఈ ప్రపంచముననున్నవానికి, శాశ్వతమైన మానసపూజ అతనిదే.

10. పార్వతీ ఈ మానసపూజా అర్చనా పద్ధతియే, పరలోకంబగు విశ్వబ్రహ్మచే నిండి యున్నదని తెలియుము.

11. **పార్వతీప్రశ్న :** యిలాంటి బ్రహ్మానికి ప్రక్కన ఎవరు ఉండి ఏమేమి చేయు చుందురో, స్వామీ మిమ్మల్ని నేను సేవించుతాను నాకు ఆ వివరాలన్నీ తెలియజేయండి నాధా.

12. **ఈశ్వరఉవాచః-** సానగ బ్రహ్మతనకుతానై జన్మించిన **మనుబ్రహ్మయను ఈశ్వరుడు, యినుపపని కమ్మరం,"బ్రాహ్మణుడు।"అలాగే సనాతన బ్రహ్మ,యనే మయ బ్రహ్మయను విష్ణువు కొయ్యపని వడ్రంగి "రాజు" మరియొకడైన అహభవ బ్రహ్మయను త్వష్టబ్రహ్మయగు బ్రహ్మలోహ పని సర్వలోకములగురువు కంచరి "వైశ్యుడు" మరియొకడైన వాడైన ప్రత్నసబ్రహ్మయను శిల్పి బ్రహ్మయగు దేవేంద్రుడు, రాతిపని, శిల్పి "శూద్రుడు"। ఐదవవాడైన సుపర్నసబ్రహ్మయను విశ్వజ్ఞబ్రహ్మయగు సూర్యుడు బంగారుపని, కాంతి ప్రదాత।** ఈ పంచవృత్తులు గల పంచబ్రహ్మలకు వరుసగా, పార్వతీ, లక్ష్మి, సరస్వతి, శచీదేవి, సంజ్ఞాదేవి వారి భార్యలై, ఉత్తమమైన బ్రాహ్మణ ఆచారములతో, పంచవృత్తులను చేపట్టిరి.

13. యిలా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర, ఊర్థ్వ దిక్కులందు సానగ, సనాతన, అభవన, ప్రత్నస, సుపర్ణులను ఈశ్వర, విష్ణు బ్రహ్మ, ఇంద్ర, సూర్యులు, మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ వృత్తులు కలవారై. 14 మనువులు "ఈశ్వరుడై" 21.అవతారములు "విష్ణువై" , సకల జీవులకు "బ్రహ్మగురువై," 84 లక్షల జీవరాసులను వృద్ధిచేయుటకు శిల్పి"యింద్రుడై"14 లోకములు వెలుగు నిచ్చుటకు విశ్వజ్ఞుడు "సూర్యుడై," విరాట్ విశ్వబ్రహ్మవీరలకు ఈ కార్యముల నప్పగించి, అయిదు వృత్తులచే ఐదురూపములుగా

ఐదు దిక్కులందు అవతారములు దాల్చెనని ఎరుంగుము, ఈ ఐదుగురు దేవతా మూర్తులు లేనిదే జగత్తులో ఏ పనీజరుగదు. ఏ ప్రయోజనముండదు.

14. **పార్వతీప్రశ్న :-** మాయనునాశనం చేయగల మహేశా! ఏ పనులకు ఎవరెవరు అధిపతులో వారిపేర్లు ఏవో ప్రేమతో నాకు చెప్పండి.

**వివరణ :-** 14 మనువులు 1 స్వాయం భువ 2 స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5.రైవత, 6.చాక్షుష, 7.వైవస్వతః, 8.సూర్యసావర్ణిక, 9.దక్షసావర్ణిక, 10. బ్రహ్మసావర్ణిక, 11. రుద్రసావర్ణిక, 12. దర్మసావర్ణిక, 13. రౌచ్య 14.భౌచ్యమునువులు. **21 అవతారములు,** 1. బ్రహ్మ 2. యజ్ఞ 3.వరాహ, 4. నారద, 5. నరనారాయణ 6.కపిల 7. దత్తాత్రేయ 8. సుయజ్ఞ 9. ఋషభ 10. పృథు 11. మత్య 12.కూర్మ 13 ధన్వంతరి 14.మోహిని 15. నృసింహ 16. వామన, 17.పరశురామ 18. శ్రీరామ, 19. బలరామ, 20. శ్రీకృష్ణ 21. బుద్ధుడు.

15. పార్వతీ మనువృత్తి "కమ్మరపని"గల సానగులకుఈశ్వరారాధనయు, మయవృత్తి "వడ్రంగిపని" గల సనాతనులకు విష్ణ్వారాధనయు, త్వష్టవృత్తి "కంచరపని" గల ఆభవనులకు గురుపూజయు, "శిల్పవృత్తి" గల శిల్పులగు ప్రత్నసులకు యజ్ఞములు చేయుటపూజలు చేయుటయు, స్వర్ణవృత్తిగల సుపర్ణసులకు సంధ్యావందనము పూజా విధులను, విడివిడిగా, జరుపుటయే గాక యివన్నీయూ పంచబ్రహ్మ లందరూ ఆచరింతు రని ఎరుంగుము.

16. వినుము శుభములు చేకూర్చునది "ఈశ్వరుడు", సృష్టిలోని సర్వజీవరాసులను పోషించునది "విష్ణువు", సర్వులకూ సంపూర్ణముగా ఉపదేశములిచ్చునది. "బ్రహ్మ", సర్వజీవులను ధన్యత్వముచేయునది "యింద్రుడు", మోక్షము వెలుతురు ప్రసాదించునది "సూర్యుడు".

17. పార్వతీ మనుసంతతిలోని లోకేశబ్రహ్మసంతతివారు రాజ్యపాలనకు, మయసంతతి వాడగుబోధాయనుడుఉపనయన కర్మకు, త్వష్ట సంతతి వాడగు విశ్వరూపుడుగు రూపదేశమునకు, శిల్పి సంతతివాడైన వర్ధక ప్రజాపతి అన్ని విధములగు పూజాస్తానములకు, విశ్వజ్ఞ సంతతివాడగు యముడు సమస్త జీవ శరీరములను శిక్షించుటకు, రక్షించుటకు అధికారులని ఎరుంగుము. అదియునుగాక ఆరుకర్మలలో ప్రధానమగు యజ్ఞములలో యజ్ఞకర్త ఈ ఐదుగురిని ఆరాధించనిదేయజ్ఞము కాదని ఎరుంగుము. అపరకర్మలలో సమస్త విశ్వానికి దైవముగా యముడ్ని పూజించి పితృదేవతలను తరింపజేయ వలయును. గృహనిర్మాణసమయములో, శంఖుస్థాపనాది కార్యములలో మయుని సంతతివాడైన లోకవేత్తకు పూజచేయవలయును. సంధ్యావందన మందు ఈ ఐదుగురిని దిక్పాలకులుగా ఆరాధించవలయును క్లుప్తంగాయిది నీకు చెప్పాను యిలా సమస్తకార్యములకు వీరే అధికారులని ఎరుంగుము.





18. వినుము సూర్యుని కుమారుడగు గొప్ప వాడైన వైవస్వతమనువు, ధర్మసావర్ణుండనే మనువులిద్దరూ యిపుడు తృప్తిగా 14లోకములనూ పాలించుచుండిరి.

19. స్వయంభూయగు సూర్యునకు ఆయన అధీనములోగల బ్రహ్మకుమార్తె సంజ్ఞకు పుట్టిన, వైవస్వతమనువు భూమి మీదగల సకల జనులను కని ఆదరించు చుండెను.

20. పార్వతీ పంచాననులనబడు విశ్వకర్మ ఐదుముఖముల నుండి ఉద్భవించిన దేవబ్రాహ్మణులను, విశ్వబ్రాహ్మణులు తప్ప, తతిమా వరసక్రమములో నున్నవారు వస్త్ర, భూషణ, అలంకారములతో పేరులుగల విప్రులు, రాజులు, కోమట్లు, శూద్రులు మొదలగు సమస్త జనులు పంచాననం వారిలో మూడవ వాడైన త్వష్ణ బ్రహ్మయను వాని కుమార్తెయగు సంజ్ఞాదేవికి, అయిదవ వాడగు సూర్యునకు పుట్టిన వైవస్వత మనువుకు పుట్టినసంతతియని తెలియుము. వీరందరికీ మాయాతంత్రములతో ఉన్న పనులు తప్పకకావలయుననియు, యిట్టి పనులు విరాట్ విశ్వకర్మ స్వరూపులగు గొప్ప దేవ బ్రాహ్మణులకు అవసరం లేదని తెలుసుకుని, వీరలు తండ్రి యగు విరాట్ విశ్వ బ్రహ్మమును జ్యోతిరూపునిగా అంతరేంద్రియములతో చూచుటయే ప్రధానమని తెలుసు కొనుము. (మనువు సంతతి వారు కావున మానవులము

21. ఆ సూర్యభగవానుని కుమారు శహబాస్ అని పించుకునే లాగా అన్ని లోకములు పరిపాలించును, తేజస్వరూపుడైన వైవస్వతమనువు. ఓ భామాఅతడే విశ్వ దేవుడగు యముడు ఈ భూమిని పాలించుచున్నది.

22. యితను అందరి యందు పక్షపాతములేక సమముగా వర్తించుటచే! 1.సమవర్తి యని 2. సకలజీవుల ప్రాణములు హరించు వారిని యములందురు, వారికి రాజుగనుక 2.యమరాజందురు. 3.జీవుల యొక్క ధర్మాధర్మములను, ఆయువులెక్క గట్టి కాలదండ మనెడి దండమును ధరించిన వాడుగనుక 3. దండధరుడందురు. ఈ పనులచే వైవస్వతునకు మూడు పేర్లుగలవు. యితని తర్వాత పరిపాలనకు యితని తమ్ముడు సూర్యసావర్ణి వస్తాడు దేవీ. పద్మముల వంటి కన్నులు గలదానా.

23. యింకనూ ఆ విశ్వకర్మ పంచముఖముల నుండి ఉద్భవించినట్టి ఈశ్వరుడు అభిషేకప్రియుడు, విష్ణువు అలంకార ప్రియుడు, బ్రహ్మ ఉపదేశప్రియుడు, భోగవృత్తిగల యింద్రుడు ఆరాధన ప్రియుడు, యోగప్రదాత అయిన సూర్యుడు నమస్కారప్రియుడు ఇలా ఒక్కొక్కరికి ఒక్కో విధానము కలదు. వీరందరిపై విరాట్ విశ్వబ్రహ్మము పరదైవమై నిలిచి యుండును. ఆపైన దైవములు వేరే లేరని తెలియుము. యిలా విశ్వకర్మ పంచ ముఖముల నుండి ఉద్భవించిన వారు పూజింపబడుతున్నారు. యింకా వారి వివిధాంగముల నుండి ఉద్భవించిన వారు.

**వివరణ :**

శ్లో ॥ బ్రహ్మణోశ్యముఖమాసీత్ । బాహూరాజన్యకృతః।
ఊరూతదశ్యయద్వైశ్య ః । పద్భ్యాగ్ంశూద్రోఅజాయతః॥

ఈ సమస్తప్రపంచమునూ, సకల చరాచర జీవరాసులను, అనేక కోటిబ్రహ్మాండ ములనూ తన సంకల్పమాత్రముచే సృజించి, అణువునుండి బ్రహ్మాండమంతయూ తానైనట్టి ఆ సృష్టికర్త పంచముఖములనుండి ఉద్భవించి నట్టి పంచానన వంశీయులు తమ మేధస్సుచే ప్రపంచ జన జీవన విధానమునకు కావలసిన పంచవృత్తులను చేపట్టి భూమినుండి సమస్త లోహములను, ధాతువులను, రత్నములను వెలికితీసి సమస్తజనుల జననము నుండి, అంత్యేష్టి వరకూ కావలసిన సమస్త వస్తువులను తయారుచేసి ప్రస్తుతం అష్టాది వర్ణస్తుల జీవనములకు విశ్వకర్మ వంశీయుల ఆధారులైరి. **ఎట్లనగా?**

**పంచ ముఖముల నుండి ఉద్భవించిన బ్రాహ్మణులు:-**

1) మనుసంతతి వారు రాళ్ళను కరిగించి యినుమును చేసి దానితో చెట్లు నరుకుటకు కత్తి, పారను, గొడ్డలిని తయారుచేసి నేలను చదునుచేసి నివాసమునకు యింటిని ఆహారధాన్యోత్పత్తికి వ్యవసాయమునకు పొలమును, పూజకు పువ్వులు, పండ్లు, కూరకుఆకులు, కాయలు, ఉత్పత్తికి,వనమునకు కావలసినంత ప్రదేశమును సమకూర్చు కుని, నేలను దున్నుటకు నాగలికర్రను, పండిన వస్తువులు రవాణా చేయుటకు ఉపయోగించు వాహనమునకు కావలసిన సామాగ్రిని, గృహోపకరణ వస్తువులను తయారు చేసి, దేశరక్షణకు ఆత్మరక్షణ కావలసినకత్తిడాలు, బాణములు మొదలగు ఆయుధములను తయారుచేసి సకల జనుల సుఖ జీవనమునకు సహాయులైరి.

2) మయసంతతివారు గృహనిర్మాణమునకు కలపను వ్యవసాయములకు నాగలిని, తత్ సంబంధవస్తువులను, నీటిపై, నేలపై రవాణా చేయుటకు, ప్రయాణము చేయుటకు కావలసిన వాహనముల తయారీకి, విశ్రాంతికై కూర్చొనుటకు, నిద్రించుటకు కావలసిన వస్తునిర్మాణమునకు ఏజాతికలప శ్రేష్టమో గుర్తించి, ఆయావృక్షముల నుండి కలపను గ్రహించి, మానవనిత్య జీవమునకు కావలసిన అన్ని వస్తువులను చేసి జన జీవనమునకు ఆధారులైరి.

3) త్వష్టసంతతివారు భూమిలోగల వివిధ లోహములను కనుగొని, వాటితో గృహోపకరణములగు సమస్త వస్తువులను తయారుచేసి, జనులందిరి సుఖజీవనమునకు సహాయపడిరి. యింకా మానసిక ప్రశాంతతకు దైవారాధనకు కావలసిన వివిధ దేవతా విగ్రహములను, పూజాసామాగ్రిని తయారుచేసి మానసిక ఆరోగ్యమునకు కారకులైరి.యింకా దేశరక్షణకు చేయు యుద్ధరంగములో శరీర రక్షణకు కావలసిన





సమస్త అవయవకవచములను తయారుచేసి, జన జీవనవిధానమునకు, దేశరక్షణ, ఆత్మ సంరక్షణకొరకు కావలసిన సమస్త వస్తువులను తయారుచేసి సమస్త జనుల సుఖజీవనమునకు దోహదపడిరి.

5) విశ్వజ్ఞ సంతతి వారు భూమిలోగల రజిత సువర్ణములను, రత్నములను గుర్తించి వెలికితీసి, గృహస్తాశ్రమమునకు అతిముఖ్యమగు మాంగల్యమును మట్టెలను తయారుచేసి దంపతులను చేసి వారి ఆనందజీవనమునకు కావలసిన వివిధ శరీరాభరణములను తయారుచేసిరి. వారు వారి కుటింబీకులను దశరీత్యా, గోచార రీత్యా సంభవించు దోష నివృత్తికై జ్యోతిష శాస్త్రమును రచించి, తద్వారా ఆ గ్రహదోష నివృత్తికి జపహోమాధ్రికతువు లాచరింపజేసి, తగురత్న ధారణగావింపజేసి సర్వ జనుల సుఖశాంతులకు కారకులైరి.

**2. బాహువులనుండి ఉద్భవించిన రాజులు**

ఆ విరాట్ విశ్వకర్మభగవానుని బాహువులనుండి ఉద్భవించినట్టి క్షత్రియులు బాహు బలము కలవారై తమ రాజ్యమందలి ప్రజలు సుఖశాంతులతో జీవించుటకు కావలసిన పరిపాలనా విధానములను, మేధస్సుగల మంత్రి వర్యులచే నిశ్చయించి రాజ గురువులగు ఆచార్యుల తీర్పుతో నేరస్తులను శిక్షించుచూ, సన్మార్గులను రక్షించుచూ, ధర్మతత్పరులై పాలనచేస్తూ రాజ్యకాంక్షతో తమపై దండెత్తి వచ్చు శత్రురాజులను తమ బాహుబలముచే జయించుచూ తమదేశప్రజలను సుఖశాంతులతో జీవించుటకు కారకులై దేశాన్ని ప్రజలను కాపాడుచుండిరి.

**3. ఊరువులనుండి ఉద్భవించినట్టి వైశ్యులు**

ఆ విరాట్‌ని విశ్వకర్మ భగవానుని ఊరువులనుండి ఉద్భవించిన వైశ్యులుతొడ బలము కలిగి ఓపికగా కూర్చుని సమస్తజనుల నిత్యావసరాలకు కావలసిన సమస్త వస్తువులను అవి ఉత్పన్నమైన ప్రదేశములకు పోయిటోకుగా బేరంచేసి,తెచ్చి వినియోగదారులకు కావలసినంత విడిగా విక్రయించుచూ ప్రపంచ జనులకు నిత్యావసరవస్తువులనందించి జనజీవనమునకు కారకులైరి.

**4 పాదముల నుండి ఉద్భవించిన శూద్రులు :**

ఆ విరాట్ విశ్వకర్మ భగవానుని పాదములనుండి ఉద్భవించిన శూద్రులు కాలిబలం కలవారై భూమిని దున్ని సాగుచేయుచు, జనులదేహపోషణార్థమై నిత్యా హారమునకు కావలసిన సమస్త అపరాలను, వంటనూనెకు కావలసిన సమస్త నూనె ఉత్పత్తి వస్తువులను కూరలకు కావలసిన సమస్త ఆకు,కూర గాయలను పండించి, లోకమందలి సర్వజీవులకు ఆహారమునందించి సమస్త ప్రాణకోటికి జీవనాధారులైరి. ఈ అనంత విశ్వమును అఖిలాండకోటి బ్రహ్మాండములను, నక్షత్ర గ్రహ తారకాదులను,

పిపీలకాది బ్రహ్మపర్యంతమును, సకల చరాచరజీవరాసులను, నవగ్రహములను పంచ భూతములను సంకల్ప మాత్రముచే సృజియించినవారు కావుననేవారిని, విరాట్ విశ్వకర్మ భగవాన్‌యని, "ఆదిదేవుడు", దేవాది దేవుడని వేదములు ఘోషించుచున్నవి.

24. చేతిపనులు చేయుటవలన ఈశ్వరునికి స్నానప్రీతియు, రాజ సమగుపనులు చేయుట వలన విష్ణువునకు అలంకారములగు మణిహారములందు ప్రీతియు, అన్ని రకముల జంతుజాలములు సృష్టించుపని గల బ్రహ్మదేవునకు ఉపదేశము చేయుట యందు ప్రీతియు. భోగవృత్తి గలయింద్రునకు ఆరాధన ప్రీతియు. వెలుగును ప్రసాదించు సూర్యునకు నమస్కారములందుట యందుప్రీతియును. యివి వీరు పొందు చుందురు. యివన్నీ ఈఐదుగురు ఎవరికి చెందినవి వారు పొందుదురు. ఈ పంచ బ్రహ్మలకన్నా పైనగల విశ్వబ్రహ్మము మోక్షమొసంగుట యందు ఆనందముతో ఉండును సర్వసర్వం సహాసృష్టికర్త యగు విశ్వబ్రహ్మకు పైన ఏదైవములు లేరని తెలుసుకొనుము.

25. సానగ బ్రహ్మయగు "శివమతస్తులు" ఘనముగా మతపద్ధతులను ఆచరించు వారు. సనాతనబ్రహ్మయగు "విష్ణుమతస్తులు", అహభూనబ్రహ్మయగు"బ్రహ్మ మతస్థులు", ప్రత్నబ్రహ్మయగు "యింద్రమతస్తులు", విశ్వజ్ఞబ్రహ్మయగు "సూర్యమతస్థులు" వారివారి, మతసాంప్రదాయములను ఆచరించుదురు.

26. పార్వతీసానగ, సనాతన, అహభవ, ప్రత్న, సుపర్ణులను, ఈశ్వరాదులైన పంచాననంవారికి, వారిపేర్లతోనేమతములుగా పిల్చెదరనియు, ఈ ఐదుగురికి విశ్వమను పరాశక్తి తల్లియగుట వలన వీరిని శాక్తులని అందురు వీరందరికి వారి మూల పురుషులపేర్లే యుండును. వీరుగాక మిగిలిన జనులు వైవస్వత సంతతియగు వారు ఆచారవ్యవహార, అలంకారములు గల, విప్రాది సర్వకులంబుల వారిని మతస్తులందురని తెలియుము.

27. **పార్వతీ ప్రశ్న :-** యిలాగయినకులజులందరికీ ఎటువంటి వాడు గురువు అతనెవరో వివరంగా చెప్పుము నాకు, అట్లాగయిన వారికి అధిపతి ఎవరునాధా.?

28. **ఈశ్వర ఉవాచ :-** పంచాననంవారిలో మూడవవాడయిన త్వష్టబ్రహ్మసంతతి వానికి, బాలవిప్రవిధవకు పుట్టిన "బ్రహ్మమూర్తి శంకరాచార్యులు" సరస్వతీ పీఠము స్థాపించి, మునివేషముతో సంచరించుతూ విప్రులకు గురువై చాతుర్వర్ణముల వారిని 18 జాతులుగా విభజించి వీరందరికీ గురువై కలియుగము 5 వేలు సంవత్సరములు ఈ లోకమంతయూ పాలించును. కలి 5 వేలు దాటిన తర్వాత ఏమవుతుందో చూడుము, ఈ విప్రులకు మాలవాడుగురువగును. యిది సత్యము, యిందులో కూడా జాతి బేధములు చాలా గలవు. గొప్పవారి మహిమలు అప్పుడు చెల్లవు. అప్పుడు దేవతలకు సైతము దివ్యత్వము పోయి దీనులగుదురు.





దీనికి ప్రమాణము :

29. ఆసంకరజాతివాడగు శంకరాచారికి కాశీ వాసుడు మాదిగరూపుతో మా ఉపాసనాక్రమాన్ని కొద్దిగా తెలియజేయగా, దాన్ని సాధన చేసి లోకులను మాయజేసి, విప్రులకు పూజ్యత కల్పించి పాలించుచున్నాడు.

30. కలియుగము 5 వేల సంవత్సరాలు దాటిన పిదప విశ్వబ్రాహ్మణులు పూర్వం గల బ్రహ్మజ్ఞానాన్ని పొందుతారు. వివరంగా చెబుతున్నాను. ఆపైన ధర్మంనాల్గు పాదాలు నడుచును.

31. **పార్వతీ ప్రశ్న :-** పంచాక్షరికి నాధులు ఎవరెవరయిరో తెలుపమని అడుగు చున్నానునాధా, ఈ పంచాక్షరికి మించిన మంత్రము ఏదైనా ఉన్నదాయని అడుగు తున్నాను చెప్పండి, వింటాను.

32. **ఈశ్వర ఉవాచ :-** ఈ పంచాక్షరికి అధికారులను వినుము, ఓంకారము విశ్వబ్రహ్మము, నకారము శివుడు, మకారము విష్ణువు, శికారము బ్రహ్మ, వకారము యింద్రుడు, యకారము సూర్యుడు, ఈ ఐదుగురు దైవములు, ముందే చెప్పానుగదా, సానగ, సనాతన, అహభన, ప్రత్నస, సుపర్ణులు చాలా ముఖ్యులు.

33. ఈ మంత్రానికి పైన నీ మంత్రముండును గానీ, యింకా వేరే మంత్రములు ఏ మంత్రశాస్త్ర మందునూ చెప్పలేదు, యిదియే సరియైనది సుమా.

34. **వశిష్ఠ ఉవాచ:-** పంచాక్షరీ మంత్రముతో సమానమైన మంత్రముగానీ, పంచాననులను విశ్వబ్రాహ్మణులతో సమానమగు కులముగానీ, విశ్వకర్మ భగవానుని పంచముఖముల నుండి ఉద్భవించినట్టి శివుడు, విష్ణువు, బ్రహ్మ, యింద్రుడు, సూర్యునితో సమానమగుదైవములుగానీ గతంలో లేరు యిప్పుడూ లేరు. భవిష్యత్తులో ఉండబోరు.

35. **పార్వతీప్రశ్న :-** బ్రహ్మ జ్ఞానము పొందిన సాధకునికి ఆ ఫలితములు వానికేనా? తల్లిదండ్రులకు గానీ యితరులకుగానీ ఏమైనా ఉంటుందా?నాకు గల ఈ అనుమానమును నాయందు దయతో వివరంగా చెప్పండి స్వామీ.

36. **ఈశ్వర ఉవాచ:-** బ్రహ్మజ్ఞానము పొందినవాని తల్లితరపువారు 21 తరములు, తండ్రి తరుపువారు కూడా యిలాగే, భార్యావంశంవారు కూడా యింతే, శిష్యుని తరపు వారుకూడా 21 తరములవారు ప్రస్తుతం ఏలోకంలో, ఏ రూపంలో వున్నా సిద్ధి పొందెదరు.

37. ఈ బ్రహ్మజ్ఞానము నరులకు దొరుకుటకు అసాధ్యము ఎందుకనగా కుచ్చితమైన అనేక మతములు ఉద్భవించుటచే మానవులు దీనమైన నరకములపాలవు తారు.

యిది పద్ధతికాదు. ఏ దీవులలోని మానవులైనా యోగసాధనచే మాత్రమే బ్రహ్మ జ్ఞానాన్ని పొందగలరు.

38. **పార్వతీ ప్రశ్న :-** శక్తులుగలవారలే రాజులుగదా, ఎలాంటి శక్తులతో మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ బ్రహ్మలు, గురువరులు ఏపరాక్రమముగల ఆయుధములతో సర్వకార్యములు నెరవేర్చిరో, ఆ రహస్యాన్ని నాకు చెప్పునాథా!

39. **ఈశ్వర ఉవాచ :-** శివునకు త్రిశూలము, ఆదిశక్తి! విష్ణువుకు సుదర్శన చక్రము, పరాశక్తి! బ్రహ్మకు బ్రహ్మశిరమను దివ్యాస్త్రము, యిచ్ఛాశక్తులుండి! ఈ లోకంలో సృష్టి, స్థితి, లయములనెడి మూడు కార్యములు సమకూర్చు చుండిరి.

**వివరణ**

**శివుడుపట్టిన త్రిశూలానికి అంతరార్థం:** శూలానికి రెండువైపులా గల రెండుకొసలు యిడాపింగళనాడులు, వాటిచే వాయుబంధనచేస్తూ మధ్యనగల సుషుమ్నానాడిని భేదించి సుషుమ్నానాడిలో గల సృష్టినంతటి నీ వీక్షించుటకు సాధ్యమని, యిదంతా ఆమూడునాడుల వల్లనే సాధ్యమవుతుందనేది తెలియజేయుటకు పరమేశ్వరుడు శూలాన్నిపట్టి సదాయోగనిద్రలోనుండుటకు అర్థం. శూలంతో శత్రుసంహారము చేయుటయనగా? యోగసాధనకు అవరోధం కలిగించే శరీరమందలి అరిషడ్వర్గాలనే శత్రువులను అంతం చేయటయే, **"మూడుకొసలు గల శూలమనే మూడునాడులతో సాధనతో చేయుట".** పరమేశ్వరుడు నటరాజుగా తన చేతనున్న ఢమరుకముచే ధ్వని చేయగా ఆ శబ్దాన్నివిని అటుచూచు వారందరికీ తన చేతనున్న జింకను చూపుతూ, ఈ జింకవలే గంతులు వేయుచూ ఎగిరిదూకుచూ పరి పరి విధముల సంచరించెడి మీ మనస్సును. నేను జింకను పట్టినట్లుగాపట్టివేసి వేరొక చేతపట్టిన శూలముచే పొడిచి వామహస్తమందలి అగ్నియందు పడవేసి ఆ భస్మమును నేను శరీర సర్వాంగము లందు ధరించినట్లుగా, మీరునూ మీ మనస్సును హృదయాగ్నియందు భస్మంగావించి స్థిరచిత్తులై, శరీర సర్వాంగములందు విభూతిధరించి యోగసాధనతో సిద్ధులుకండని, నాశరీరమున ఎటుపోకుండా ధరించి ఐదు సర్పములను స్వాధీనపరచుకున్నట్లుగా, మీ శరీరమందు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనెడు పంచప్రాణములుండి పుట్టలోనికి పోయి బయటకు వచ్చు సర్పములవలె, మీ ముక్కు రంధ్రముల ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా లోనికి బయటకు నడచుచున్నవి, వీటి వేగము నెట్లు తగ్గించ వలెనన్న, పాములవాడు సర్పమునుపట్టి పలుమార్లు వేణువు నూదు చూ సర్పాన్నాడించి దాని వేగమణచినట్లుగా, యోగసాధనచేసి కొద్ది కొద్దిగా శ్వాసను అదుపులోపెట్టి యోగసిద్ధి పొందిన వానికి అనేక జన్మలుగా వెంబడించుచున్న మాయయనెడు పెనుభూతముచే





కల్గుపాపకర్మలను, నేనుపాదముల క్రింద అసురుని త్రొక్కి అణచివేసినట్లుగా, మీకు గల పాపకర్మలను నశింపజేసుకోవలయును. అలాంటి యోగులకు మరుజన్మ లేకుండా నాలో ఐక్యము చేసుకొందును. దానికి నిదర్శనముగా సిద్ధుల శిరములను మాలగా ధరించితిని. పంచవాయువులను అదుపులోపెట్టిన దానికి నిదర్శనముగా పంచ సర్పములను ఆభరణములుగా ధరించి మీకు చూపుచున్నాను. యిదే నటరాజస్వామి మూర్తి యొక్క అంతరార్థము ఈ విధముగా రుద్రుడు ఆదిశక్తి సహాయముతో లయ కార్యము నిర్వహించుచున్నాడు.

**విష్ణువు పుట్టిన సుదర్శన చక్రానికి అంతరార్థం.** ఈవిశ్వసృష్టిలోని అనేక బ్రహ్మాండాలలో గల ఒక్కొక్క లోకంలో గల ఆయాలోక ప్రమాణానికి సంకేతముగా భావించవచ్చును. ఉదా॥ మనలోకంలో ఒక సంవత్సరకాలం భూమి కన్నా చిన్నదగు బుధగ్రహంలో నాలుగు సంవత్సరాలుగడుస్తాయి. అలాగే కుజగ్రహంలో ఒక సంవత్సర కాలం భూలోకంలో 1సంవత్సర 10 మాసాల కాలమగును, అలాగే భూలోకంలో 12 సంవత్సరాలకాలము గురుగ్రహంపై 1 సంవత్సరకాలమగును. యిలా ఆయా లోకాల్లో ఆయాకాల ప్రమాణాన్ని బట్టి ఆయాలోకధర్మాలనుబట్టి విష్ణువు తన మాయాజాలంచే అన్ని లోకాలను నడిపించుచూ సర్వజీవుల పోషణకర్తయై కాలచక్రాన్ని నడుపు చున్నాడు. భూలోకంలో ఒక సంవత్సరకాలం పితృలోకంలో ఒకరోజుగా భావించి మనము పితృదేవతలకు ఆరాధన కార్యక్రమములు నిర్వహించుచున్నాము. యింకా బ్రహ్మలోకం విష్ణులోకం, రుద్రలోకాలలో వారివారి ఆయుఃప్రమాణాలను బట్టిదిన ప్రమాణచర్యలుండును. వీటిన్నింటినీ కాలచక్ర ప్రమాణములతో తనయింద్రజాలంతో నడిపించుటకు సాంకేతముగా విష్ణువు చక్రాన్ని బుజువుగాపట్టినాడు సుదర్శన చక్రముతో ఖండించుటయన్న కాలప్రమాణముచేత ఆయాలోకాలను నశింపజేయుటయే గానీ వేరు గాదు. విష్ణువు పరాశక్తి సహాయంతో కాలచక్రాన్ని నడిపించుచున్నాడనిభావము.

బ్రహ్మతన మేధస్సనే బ్రహ్మశిరమే ఆయుధముగా యిచ్ఛాశక్తి సహాయముతో, చతుర్దశభువనములందలి జీవరాసులను, భూమిపైగల 84 లక్షల జీవ రాసులను ఆజీవిచేసుకున్న పుణ్యాపాపఫలితములను భవించుటకై తగిన లోకంలో అనువగు ప్రదేశంలో తగిన జన్మను ప్రసాదించి తత్ఫలితములను భవించుటకు తగినరూపును, పరిస్థితులను కల్పించును. వారి పూర్వకర్మలను బట్టి ధనికుడా, దరిద్రుడా, యాజ్ఞికమా, రాజసమా, వ్యాపారమా వ్యవసాయమా! అధికారమా, సేవకా జీవనమో వారి పూర్వకర్మలను భవించుటకు ప్రజాపతుల సహకారంతో జన్మింపజేయును. ఈ విధముగా విధాత ఈ అనంతవిశ్వములో సృష్టి కార్యములు నిర్వహించుచున్నారు. ఈ బ్రహ్మవిష్ణు రుద్రులకు ఆయుఃప్రమాణ ములు కలవు. అనంతకోటి బ్రహ్మండములు సృజించి

వీటి నిర్వహణకు పంచబ్రహ్మలను. పంచశక్తులను, పంచభూతములను నవ గ్రహములను, అష్టదిక్పాలురను సంకల్ప మాత్రముచే సృజించి, ఈ చరాచరములగు 84లక్షల జీవరాసు లందు జీవిగా నుండి సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ కృత్యములను పంచబ్రహ్మల కప్పగించి తాను మరుగుననున్నాడు సృష్టికర్త.

40. మిగతాయిద్దరగు యింద్రుడు, సూర్యునకు ఆయుధమువజ్రాయుధమొక్కటే, శరీరములు వేరుగా ఉండి వారి శరీరమేశక్తిగా ఉంటుంది. ఆయుధములు వేరు వేరు వాటిని గురించి చెబుతాను విను.

41. ఎనిమిది దిక్కులతో గల ప్రకృతి శక్తి గొప్ప ఆకారంతో ఉండి, ఆరుకన్నులతో గొప్ప కీర్తిగలిగిన బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను మూడు పేర్లుగల శరీరముల ఆధారంతో భూమిపై సృష్టి, స్థితి, లయములను, మూడు కార్యములకు మూలమైనదనీ కీర్తింపబడి, సకలచరాచరసృష్టిని ప్రకృతిమాత చేస్తుంది. ఆమేగాయత్రీదేవి.

42. దేవీ, నీ అసలు రూపమగు శుద్ధ బ్రహ్మమునందు త్రిమూర్తులు త్రేతాగ్నులుగా అవే "రజ, స్సత్వ, తమో"గుణములై అవిసమంగా ఉండి, సత్వగుణము జ్ఞానసుఖము లందు కోరిక పుట్టించి, విష్ణురూపమయ్యెను. రజోగుణము అనురాగముతో సంగమకోర్కె కల్గించుచూ బ్రహ్మరూపమయ్యెను. తమోగుణముచే విపరీతజ్ఞానమును నిద్రసోమరి తనమును పుట్టించుచూ రుద్రరూపమయ్యెను. యిలాగు విరాట్ స్వరూపుడైన బ్రహ్మమగు పురుషుడు, ప్రకృతియనుశక్తి కలయిక వలన ప్రపంచమున సకలచరాచర సృష్టి జరిగెను. ఎలాగంటే "తమిశ్రసృష్టి"యిందులో చేతనము లేని కొండలు కోనలూ, చెట్లు చేమలు కలిగెను, 2. "తిర్యకసృష్టి" పశుపక్ష్యాదులుద్భవించెను. 3. "దేవసృష్టి" పరిపూర్ణాత్ములై నిత్యా నందులగు సాత్వికులు కల్గిరి. 4. "అర్వాకసృష్టి"లో తమోద్రేకులగు బహుదుఃఖములుగల కర్మశరీరులగు మానవులు కలిగిరి. 5. "అనుగ్రహ సృష్టి"లో సాత్విక తామసములు కలిసిన జంతువులు కలిగెను. 6. "కౌమారసృష్టి"లో సనత్కుమారాదులు పుట్టిరి, సత్వరజ తమోగుణములు గల త్రిమూర్తులు తమ ఆశయములను ఒకరికొకరు పంచుకుని యున్నవారి స్తితికి విష్ణువ్యూహము, బ్రహ్మవ్యూహము, రుద్రవ్యూహమందురు.

43. పార్వతీ ఈ మూడుకుండములకు ఆవాహనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులని మూడు పేర్లతో మూడు రూపులగు మహాకాళి, మహాలక్ష్మీ, మహాసరస్వతియను వీరితో ఏకార్యమున కైనా అసాధ్యముండదు. ఏదీకాని పనియుండదు.

44. మానవశరీరమందు బ్రహ్మరంధ్రముతో 10 రంధ్రములు. సహస్రారముతో ఏడుచక్రములలోని దేవతలు ఎల్లప్పుడూ ఆయుధముల చేత ధరించి యుందురు, వీటన్నిటికీ మూలమగు కుండలినీశక్తి ఆయుధమునకు లొంగక అన్నిటికీ తల్లివంటిదై, ఒక ముఖమురెండు కళ్ళూ ఒకతోక కలిగిన ఈ శక్తిని ఎదుర్కొనుటకు ఎలాంటి





ఆయుధములేదు. ఈ శక్తే మానవశరీర మందలి అన్ని లోకాలగు సప్తచక్రములను బ్రహ్మ, విష్ణు, రుద్రగ్రంధులతో సహామానవ శరీర మందలి అన్ని లోకాలను పాలించును.

45. ఈ కుండలినీ శక్తిని ప్రళయ బ్రహ్మస్త్రంబని, మహాకాళీ, మహాలక్ష్మీ మహా సరస్వతీ యని శారదా పీఠస్తులు ముఖ్యంగా చెబుతుంటారు.

46. సహస్రారమును చేరిన కుండలినీశక్తి విరాట్ పురుషునితో చేరి సృష్టికార్యమును చేయుటకు ప్రయత్నించి, విపరీతమగు భుజములశక్తితో గర్వముగలదియై, ఏమీ చూడక అన్నిటినీ ఖండించును. రెండు చేతులలో నిండుగా యున్న ఆయుధముతో, ఎలాంటి ఎదురులేనివాటినైనా తెగగొట్టును. దానికి అడ్డులేదు. మొదటి రంధ్రమగు గుదస్థానములో ఉంటూ శరీరమందలి దశరంధ్రాలు, యిడపింగళిసుషుమ్న నాడులందు పై చూపుగలిగి యుండును. సహస్రారమందలి విరాట్ విశ్వకర్మచేతి యందలి "వజ్రాయుధము" వడ్రంగి వాని చేతి యందలి ఆయుధమువలే ఉంటుంది.

47. ఈ కుండలినీ మహాశక్తిని జయించగలగొప్ప ఆయుధములుగానీ, 14 లోకవాసులుగానీ దానికి సాటిరారు. కానీ దానిని గొప్ప దైనట్టి యోగ సాధనతో పట్టవచ్చును. అంతములేని ఈ సకల చరాచరసృష్టి కలుగుటకు, పోషణలకు, కుండలినీకి మిగిలిన వేలకన్నులను పీకేయకుండా అలాగే ఉండ నిమ్ము కుండలినీ చూపుఉంటే గొప్ప పాపాత్ములు కట్టుదిట్టంగా ఉంటారు.

48. **పార్వతిప్రశ్న:-** ఏఏ యుగములలో ధర్మాలు ఎలానడిచినవో, జనులు ఎలా ప్రవర్తించి ధర్మంగా జీవించారో, అవన్నీ వివరంగా చెప్పండి, మరియూ పంచాననులగు విశ్వబ్రాహ్మణులు యంత్రమంత్రతంత్రములు ఎలా జరిపారో అవన్నీ పూర్తిగా చెప్పునాధా!

49. **ఈశ్వర ఉవాచ:-** 1.దిక్కులలో మొదటిది తూర్పుదిక్కువసంతఋతువు, జ్యోతిరూపముగల ఓం కారనాదము 15 అక్షరములు గల పంచముఖములందుద్భవించిన మనువు ఋషులలో మొదటివాడు సానగఋషి కృతయుగములో. 2. రెండవ వాడు దక్షిణ దిక్కులో మయుడు తపసిసనాతన ఋషిఋతువులలో గ్రీష్మ ఋతువు, 3.ఋతువులన్నింటికీ రాణి 17అక్షరములుమంత్ర సాధనచేయు (హంకారనాద దేవుడు) యింద్రుడు త్రేతాయుగములో. వానాకాలమందు అనుకూలమయినది పడమర దీనికి మూడవవాడు అభవన ఋషి. బ్రహ్మ 10 అక్షరములు గలమంత్రసాధనలతో కీర్తి సంపదలునిచ్చు మంత్రములకు సిద్ధులిచ్చు దేవతవిరాట్ విశ్వకర్మ, దేవతలకు దేవుడు. ద్వాపరములో యోగతత్వ అనుభవము కలుగును. యిలాచెప్పాను చూడు పత్నీ.

50. 4. వసంతఋతువులో దేవత దేవగురువగు బృహస్పతి వేదములందలి అర్ధములు సూక్ష్మమును సంశయమనస్సుతో మననము చేసి చాలా విషయవాక్యముల

అర్థము గ్రహించి, చిన్నవిషయములను వదిలి, గ్రంథవిషయములను కొద్దిగా "ఆకళింప చేసుకుని", కర్మలు చేయును, జీవములేనట్టి పనులు ఈ భూమిమీద జరుగుతాయి. కలియుగం ఐదువేలపైనయిలా ఉంటాయి పత్నీ.

51. 5. ఆ తర్వాత సూర్యుడు ప్రభువై పాలించును, లోకధర్మములు చెడకుండా ఉంటాయి. ఆ మీద పార్వతీపరమేశ్వరులగు మనమిద్దరమూ లోకపాలకుని కాపాడుతూ ఉంటాము. అప్పుడు మళ్ళీ కృతయుగారంభమవును.

52. ఓ పార్వతీకృత, త్రేత, ద్వాపర కలియుగములను ఆయాదేవతలు ధర్మము తప్ప కుండా పరిపాలించి, యుగధర్మములతో పరిపాలన చేసినది శక్తిస్వరూపిణి వగు నీవేగదా ? నీనిజదృష్టులగు దివ్యదృష్టిచే చూడుము. చతుర్థశమనువులు నేననిగ్రహిస్తావు.

53. ఈ కలియుగప్రళయం తర్వాత కృతయుగధర్మంతో పరిపాలనజరిగి ధర్మము 4 పాదాలతో హాయిగా నడుస్తుంది. మనలను సేవించువారు విద్వాంసులై భుక్తిముక్తులు పొందుదురు సుమా!

54. **సనారీ విశ్వేశ్వరు తపః ప్రభావాన్ని అరుంధతీ సమేతవశిష్ఠుల వారి వర్ణన:-** పరమేష్ఠి విషాన్నిత్రాగగా ఆకాశంలో పెద్దధూమకేతవుపుట్టి భూలోకంలో కనబడుతుంది. తపముచేయుటకు ప్రయత్నిస్తున్న గౌతమమునికుటీర మందలి పార్వతీ పరమేశ్వరుల విగ్రహములు కళావిహీనమై, ఆకాశము ఎర్రనై గొప్పవగు ధూమకేతువులు కన్పించుతాయి. కొండలు దిగబడిపోయి, భూమి వణికి, ఏకధారగావర్షంకురుస్తూ, రాత్రులందు రాబందులు కూతలు వినబడుచూ, పగలు సూర్యునికాంతి పెరిగి, గంగానది పొంగి ప్రవహిస్తుండగా, భూలోకమందలి సాధుగణము శాంతితో యుండగా, పార్వతీ దేవి భర్తయగు "విశ్వేశ్వరుడా" భక్తులందు ప్రేమగలవాడా, నిన్ను పొగడుటకు వేయి నాలుకలు గల అనంతుడుచాలడాయె. మేమెంత స్వామీ మిము వర్ణించుటకు.

55. మేము చరితార్థులమయ్యాము దేవా, పతివామభాగమందు ఎల్లప్పుడూ నివాస ముండు ఓ భామామణీ" పార్వతీ దేవీ"మాదంపతులపై కరుణాకటాక్షవీక్షణలు ప్రసరింప జేసి మమ్మమన్నించుమాతా.

56. శరీరాన్ని మరిచి తపమందున్న నీ భర్త గొప్పతనము మేముచెప్పలేము మీ చాటునుండి మిమ్ము ప్రార్థించు వారము మేము, మా ప్రార్థనలు స్వీకరించి మమ్ములను రక్షించి కాపాడుము. విశ్వనాథా శరణు శరణు శరణుయిలాగు పార్వతీ పరమేశ్వరులను అరుంధతీ వశిష్ఠ దంపతులు ప్రార్థించారు.





## - : కులనిర్ణయము : -

57. 1.జంగాలలో పదితెగలగిరిజనులు, మొదటికులమగు కమ్మరి వృత్తి చేయు మను బ్రహ్మఅంతర్భూత సంతతివారు। 2.ముచ్చిమేదర, గొడుగుముచ్చి, మాదిగ, యీడిగ, పల్లెకారులు, గొల్లలవారు మయ బ్రహ్మఅంతర్భూత సంతతి వారు3.కుమ్మరులు, యెరుకలు, సోదిచెప్పువారు, యెడ్డివారు. త్వష్ట బ్రహ్మ అంతర్భూత సంతతివారు, 4.సిష్టికరణాలు, బోగమువారు, సాలీలు. శిల్పి బ్రహ్మ సంతతివారు 5.గమళ్ళు చాకలి, కాపుకులములవారు విశ్వజ్ఞ బ్రహ్మ అంతర్భూతసంతతివారు(అనగా వీరందరూ విరాట్ విశ్వకర్మ భగవానుని పంచ ముఖముల నుండి ఉద్భవించినట్టి పంచబ్రహ్మల యొక్క అంతర్భూత సంతతివారే. ఆ సృష్టికర్త కానిది ఈ జగత్‌లో ఏదీలేదు.)

58. మరియూ పార్వతీ మనుబ్రహ్మవంశములోని లోకేశబ్రహ్మసంతతివారు రాజ్యపాలన చేయుటకు, ఒక్కొక్కదేశము లేర్పరుచుకుని వారివారి పేర్లతో దేశములపేర్లు పెట్టుకుని ప్రచారం చేసుకుంటూ గొప్పగా ఆయా భాషలను కల్పన చేసుకుని, రాజ్యములు పాలించుచుండిరని తెలుసుకొనుము.

59. నరులు, దేవతలు, కిన్నెరలు, రాక్షసులు, యక్షులు, మనుమయాదులు, భూమిపై నున్న వాళ్ళందరినీ మొత్తం భూమినీ పాలించినది, చేతివృత్తులవారగు పంచాననులైన విశ్వబ్రాహ్మణ తరతరాలవారనిచూడుము(వారి అంతర్గతమైన సంతతి వారని గ్రహించుము)

60. పాదాలు, గుదము, మర్మస్థానము, హృదయము, కంఠము, చేతులు, పాల భాగము, నేత్రములు, నోరు, ముక్కు, నాలుక, చెవులు వీటన్నింటితో మనస్సునందు కల్గు కర్మలన్నింటికీ ఈ సృష్టిలో "మనసే"రారాజు, ఈ ప్రజలను చూచి విషయాన్ని గ్రహించు పార్వతీ.

61. **వశిష్టోవాచ:** వినుము ఓంకారము విశ్వకర్మ, అదేజనులపగలను నాశనం చేయువాడు, యిందులో ఎలాంటి అనుమానమూ లేదు, ఆయన క్రూరమగు శత్రు సంహారం చేస్తూ, యోగుల హృదయకమలములందు ఆరాధ్యుడైసృష్టికర్త ఉంటాడు. ఆ మహనీయుని ప్రతీరోజూ మనోదృష్టిచే జనులు చూస్తుంటే చక్రవర్తి భోగాలనుభవిస్తారు గదా కాలాగ్నిస్వరూపుడవగు, ఓరుద్రేశ్వరా.

62. యివిఅన్నీ చెవులారా ప్రీతితో సిద్ధులు వింటే, గొప్ప గొప్ప ఫలితములు కల్గుతాయి. భూమిపై జపసాధనచేయునరులు బ్రహ్మ, విష్ణు, రుద్రులతో సమానమగు సిద్ధులవుతారు.

63. యివన్నీ విన్నా, చదివినా, వ్రాసినా, చెప్పుకున్న వారికి యిహలోక, పరలోక శుభములు చేకూరుతాయి. పూజ చేయువారికి జీవించినంత కాలమూభుక్తి మరణించిన పిదప ముక్తివారికి లభించుతాయి.

64. మంచి జ్ఞానులలో ఏనుగు వంటి గంభీరుడు, ఆత్మతత్వాన్ని శోధించిన వారిలో ప్రధానమైనవాడు, జపసాధనలో, మునులలో ఉత్తముడు, మోక్షలక్ష్మిని ఎక్కువగా పొందిన వాడు, అపారమైనవినయగుణముగలవాడు, భూమిని గురించి బాగా తెలిసినవాడు బాగా సంచరించినవాడు. పరలోకానికి గురువగు విశ్వేశా పాహిపాహి నమస్తే. (అంటూ వశిష్టుడు నమస్కరిస్తున్నాడు)

65. **గద్యము** యిది సకల విద్యలందు, విద్వత్తునందూ, కవిత్వమునందూ కీర్తితో వెలు గొందుచూ, సరసమగు కవిత్వం, అనంతమగు విద్యావిశేషములతో, అంతులేని జనులతో అర్చనలు పొందుచూ, గొప్పతత్వసిద్ధిపొందగల విషయములున్న సనారీ విశ్వేశ్వరసంవాదమందు, మానసపూజావిధానము, పంచబ్రహ్మల ఉత్పత్తిక్రమము, ఐహిక కర్మాది దేవతలనిర్ణయము, చాతుర్వర్ణములతో సహా అనేకకులముల నిర్ణయము, యితర గురువుల నిర్ణయము, పంచాక్షరీనిర్ణయము, వశిష్ఠుని సంభాషణ జ్ఞానియైన పురుషునిచే తరించుతరములు, మనుమయాదుల శక్తి నిర్ణయము, సృష్టికర్తలగు మన్వాదులకు ఆయుధనిర్ణయము, నాలుగుయుగములలో పాలించుదేవతల నిర్ణయము, ఈ 16 కథలతో మహామేరువపై భాగమున వేదిక పై మహాసింహాసనాశీనుండగు (మానవుల సహస్రారకమలమందున్న) ఆ విరాట్ విశ్వబ్రహ్మమును చూచుయోగసాధన, సర్వజన రంజకముగా నవరత్నాలు పొదిగిన బంగారుమెట్లవలే నుండి మానవులు ఆరాధించు టకు వరుసక్రమముగల సనారీవిశ్వేశ్వర సంవాదమునందు పంచమాశ్వాసము సంపూర్ణము

**గమనిక:**–షష్ఠమాశ్వాసము. రసవాదప్రక్రియలు. జ్ఞానశాస్త్రము. ఆయుర్వేదము సప్తమాశ్వాసము అంతారసవాదము దీనికి సనారీవారి కరుణకు పాత్రులు కావలయునని స్వామివారు సంవాదంలో వ్రాసారు. కనుక వీటి వివరణను నేను యోగజ్ఞానాన్ని గురించి ప్రస్తావిస్తున్నాను. రసవాదం. ఆయుర్వేదంజోలికి నేనుపోవుటలేదు. మీరూ పోవొద్దు ముందుగా సనారీవారి కరుణపొందుమార్గంలో ఆపద్ధతులను ఆచరించండి.





# సనారీ విశ్వేశ్వర సంవాదంబునందు షష్ఠమాశ్వాసము

1. **పార్వతీ ప్రశ్న:**– సిరిసంపదలు, ఆత్మజ్ఞానము కలుగజేయునట్టియోగములు అక్షరముల సముదాయములతో, ఆచరణకు వీలుగా శివనామముతో కూడినట్టి అనులోమ విలోమ పద్ధతితో తెలియజేయుము నాథా.

2. **ఈశ్వర ఉవాచ :**– సమస్త సంపదలనొసగు కారణ దేహమును సిద్ధింపజేసు కోవలెనన్న ముందుగా వెన్నెముకనందు అంతర్గతంగానున్న సుషుమ్నానాడిని యోగ దృష్టిచే కనుగొని, దానిలో ప్రవేశించి రుద్ర గ్రంథిని సిద్ధింపజేసుకున్న సమస్తమగు దివ్య ఫలములనొసగును.

3. **పార్వతీ ప్రశ్న :**– ఓ దేవా! తత్వ జ్ఞాన జిజ్ఞాసులైన వారికి ఈ గ్రంథమందలి బ్రహ్మజ్ఞానము సులభముగా గ్రహించి తత్వామృతమును పొందు మార్గములు తెలియజేయండి.

4. **ఈశ్వర ఉవాచ :**– దేవీ! నీవడిగిన ప్రశ్నకు సమాధానము వినుము. ఈ గ్రంథమందుగల తత్వజ్ఞానము సులువుగా అర్థం చేసుకుని సిద్ధించుకోవలెనన్న కోరిక గల మానవులైనా, రాక్షసులైనా, దేవతలకైననూ "గురునామము" అత్యంత మహిమ కలది అట్టి గురునామమును మంత్రంగాఅనుష్టించిన సమస్త మూలికలు, సంపదలు, దేహమందలి సమస్త తత్వములు వశమగును.

5. **దేవీ! :**– ఈ గ్రంథమందు సమస్త మూలికలు, అత్యంత రహస్యముగా చతురతతో రచించబడెను. కావున అత్యంత విమర్శనా భావముతో గ్రహించిన వారికి యిహలోక సౌఖ్యము, పరలోక సౌఖ్యము రెండునూ పొందగలరు.

6. **దేవీ! :**– ఈ గ్రంథంలో రసవాదము, బ్రహ్మ జ్ఞానము, ఆయుర్వేదమునకు సంబంధించిన రహస్యములను పొందుపరచి ఉన్నాను. వీటిని శ్రీ విద్యా కాముకులైన సత్ ప్రవర్తకులు మాత్రమే గ్రహించగలుగుతున్నారు. కావున ముందుగా సత్ పాత్రతను సంపాదించుకోవాలి.

7. ఇట్టి సత్ ప్రవర్తనలు గల సాధకులకు ధనము, సంపదలు, మనసునందలి కోర్కెలు, ధర్మప్రవర్తనము, సత్ సంతానము, దీర్ఘాయుష్షులోకవశ్యము, దేహబలము, వాక్శుద్ధి, సత్యవ్రతము, దేహతత్వ జ్ఞానము, ఈశ్వరత్వము, త్రిలోక జయములు సిద్ధించి, యమభయములేకుండును. (స్థూల, సూక్ష్మ కారణదేహములు)

8. యింతేగాక వ్రత ఫలంబులు, తపఃఫలంబులు, అనేక శాస్త్రరహస్యంబులు, సాహిత్యము, వైద్యము, మహేశ్వరత్వం, అమృతత్వం, పరోపకారశక్తి, ఆనందము, ఆరోగ్యములు కలిగి ఆత్మదర్శనము పొందుదురు.

9. ఈ అధ్యాయమునందలి కంద పద్యములలో గల అక్షరపరబ్రహ్మమైన యోగములను ఓంకారమునుండి మొదలై శివమంత్రముతో పంచ భూతాత్మకమగు విషయములను (అక్షర సాధనను) అనులోమ విలోమ పద్ధతిలో ఉంచితిని, వీటిని గ్రహించిసాధన చేసిన వారికి ఇందలి రహస్యమైన తత్వ జ్ఞానము సిద్ధించి, అణిమాది సిద్ధులువశమై ఆయుర్వృద్ధి చెందును.

10. యిది సిద్ధించినవారికి రోగములు హరించి సర్వవిషములు నశించును. శుభములు కలుగును గంభీరమగు రూపముతో భూత భవిష్యత్ వర్తమాన కాలములను తెలియజేయుచూ, దివ్యదృష్టి, అనేక యోగ తపఃఫలంబులు సిద్ధించి, యిహలోక సుఖంబులు, పూజనీయత, భోగములను అనేక పుణ్య ములను ఈ గ్రంధాన్ని భక్తిశ్రద్ధలతో పారాయణ చేయుటచే కల్గును దేవీ।

11. దేవీ ఈ గ్రంధాన్ని ప్రతీరోజూ రెండుపూటలా చదివేవారికి తత్వజ్ఞానము కలిగి పరబ్రహ్మసాధకులై హరిహరాదులకంటే గొప్పవారవుతారు.

12. సాధకుడు బ్రహ్మచర్యదీక్షతో, సద్గురుని ఉపదేశం ప్రకారం అనుష్ఠించినట్లైనచో ఆతడు పరబ్రహ్మమునందు సంయోగముచెంది సమస్త బంధములనుండి విముక్తుడౌను.

13. బుద్ధిమంతుడైన సాధకుడు నిరంతరదీక్షతో ఆత్మసాక్షాత్కారమును పొందును. సిరిసంపదలు కావలెనన్న స్థూలసూక్ష్మ దేహములతో పాటు కారణదేహమును కూడా నశింపచేయవలసి ఉంటుంది.

14. (ఎ) స్నాన సంధ్యలు చాకలులకు అవసరం ఎందుకంటే? ఊరి జనుల అన్ని రకముల మైలు వస్త్రములను, మలినవస్త్రములను శుభ్రం చేస్తారు గనుక ఆదోషనివృత్తికి వారికి అవి తప్పక కావాలి. వస్త్ర, ఆభరణ అలంకారాలు వేశ్యలకు అవసరం ఎందుకంటే ? అందచందాలతో విటులను ఆకర్షించాలి గనుక, ఏమత కులములందైనా స్త్రీ సంపర్క క్రియ ఒక్కటే! అంతఃపురకాంతకైనా, చండాల స్త్రీకైనా ప్రసవవేదన ఒకటేగదా?

14. బి. ఓ దేవీ స్నానము సంధ్య జపములు దేహమునకు అనేక జన్మాంతరాలుగా పట్టుకునివిడువనిమలినములను విడిపించుట కొరకే, అటులనే వేశ్యలవలే ఈ దేహములోని అనేక దుర్గుణములచే యితరులను ఆకర్షించి ధనాన్ని పొందవలెనన్న కాంక్షతో అలంకరించు కొందురు. ఇలా అనేక కోరికలు కామ్యములకు కారణము, మానవులచిత్త మేసుమా! జాగ్రత్తగా గమనించుమా.





15. దేవీ ఈ చిత్తమే (మనో మయకోశమగు) కారణదేహము ఇట్టికారణ దేహమును సిద్ధించుకున్నవారు అందలి చిత్కళలను సంస్కరించి మాయకులోబడక అన్నిటినీ గమనించుచూ నిగ్గుతేలి పరిశుద్ధుడై లోకమున సంచరించుచూ దేనియందూ అంటుబడక అన్ని కార్యములూ ఆచరించుచుండును.

16. దేవీ ఈ చిత్తమును స్వాధీనపరచుకొని యిహలోక కోర్కెలకు లొంగకయున్న పరిశుద్ధుడగు జ్ఞాని, సకల భోగములననుభవించగలడు.

17. అలాంటి జ్ఞానులు ఎట్టిప్రకృతి మాయకులొంగక, సమస్త యిహలోక సంబంధకర్మలను దహించి వేసి, "మాయందు" ఐక్యమగుటకు వేచియున్నారు.

**18. పార్వతిప్రశ్న:** ఓ దేవా యిన్నిఫలితములుగల జ్ఞానమును భోధచేయు అన్నపూర్ణేశ్వరిని ప్రసన్నముచేసుకున్న, ఆమె పరిపూర్ణబ్రహ్మజ్ఞానమునుసాధించు విషయములు గల శతకమును తెలుపును గదానాధా.

19. అనంతయోగములు సిద్ధింపజేయు ఔషధమా, అనంతపాపములు నశింపజేసి పుణ్య ఫలితములనొసంగుదేవా, సృష్టినంతటినీ వశపరచుకున్నవాడా, అనంత మైన శాస్త్రములందు అనంతరూపములతో వర్ణించబడినట్లుగా, సంచరించు దివ్య పురుషా యివే నీకు మా సాష్టాంగ నమస్కారములు.

**అన్నపూర్ణాదేవి చెప్పిన:- కందపద్యములు:-**

**అం1.** అన్నీటినీ పొందాలనుకునేవారు వాటికోసం చింతించవద్దు. అన్నిటినీ వదులుకుని పరబ్రహ్మమునందు మనస్సులగ్నంచేసిన అద్భుతంగా అన్నీ సిద్ధించును విశ్వనాధా-పార్వతి నాధా।

**ఓం2.** ఓంకారమును జపియించువారు యముని ఆవరణమునుండి బయటపడి, అన్నిటా అన్ని సంశయములనివృత్తి పొందుదురు విశ్వనాధ-యిభవైరిగమా।

**న3.** నమ్మకంతో గురువుయొక్క చేతలను మనస్సునందు నిలిపినయోగికి, ఈ భువిపై అధికారము ధనము ప్రాప్తించును. విశ్వనాధ-శుభగచరిత్రా।

**మ4.** మరిగారు నక్షత్ర తణుకుబెళుకుల వలే యున్న కాంతామణుల పొందును. వాటిచే కల్గుకర్మలనుపెంచుకుంటున్నారు కాంతావ్యామోహముచే, అలా గాకుండా జిజ్ఞాసతో సత్యాన్ని గ్రహించి, జ్ఞానాన్ని శోధించి పరబ్రహ్మాన్ని పొందాలి విశ్వనాధ-భవ్యచరిత్రా.

**శి5.** శిద్ధులైనవారికి ఎలాంటి కొరతలుండవు. కానీ సాధకులు యిహలోక కర్మలకు లోనైనారు, అట్లుగాకవిరక్తులైయోగసాధన చేయాలి. విశ్వనాధ-పరమప్రసాదా।

**వా6.** కుచ్చితులైనవారికి యోగబోధ చేయకూడదు. ముందు వారి చెడుగుణములను సంస్కరించి తరువాత ఉపదేశించవలెను. లేకపోతే అదివ్యర్థమగును విశ్వనాధ - నిజసత్యకళా।

**య7.** "య" అక్షరసాధకులైనవారి దేహమునకు బెల్లం, చెక్కెర, పాలు, పండ్లును తృప్తిగా భుజియించి బలమును సంపాదించుకొందురు విశ్వనాధ -పావన హృదయా।

**శి8.** జ్ఞానులైనవారు అన్నమును పరబ్రహ్మస్వరూపముగా భావించి భుజించవలెను. అలా భావించక చెడు భావనలతో భుజించిన ఆహారము విషమగును. దానిచే జ్ఞానము నశించి మోక్షభంగమగును. విశ్వనాధ-పరమమహర్షి

**ద్దం9.** కుడిఎడమ కన్నుల చూపును భ్రూమధ్యన నిలిపి స్థిరముగా నుంచిన సాధకుడు ఇంద్రియములకు ఏ మాత్రమూ చలింపకనున్నట్టివాడు సకల సంపదలను పొందును విశ్వనాధ-నిజదేశికవరా।

**న10.** యదార్ధమును గ్రహించు జ్ఞానము కావలెనన్న, ముందుగా మూలాధార చక్రమును సిద్ధించుకొన్న, బుద్ధివికసించి సత్యబోధజరుగును విశ్వనాధ -సురవర్ధకజా।

**ము11.** జ్ఞానముచే మోక్షము కల్గించువరహాలు (జ్ఞానమార్గాలు) ముప్పై సాధకులకు కావాలి. సాధన లేని అజ్ఞానికి యాభైవరహాలు యిచ్చినా ఏమి ప్రయోజనము? విశ్వనాధ- మహయోగీశా।

**మూ12.** భ్రూమధ్యన దృష్టి నిలిపి, మనస్సును అనాహత చక్రమందులగ్నంచేసి స్థాన శిద్ధిని పొంది, బ్రహ్మమును తెలుసుకొనుటకు అనేక ప్రయత్నములు చేసిన ఫలితము కల్గును విశ్వనాధ- ఆచార్యవర్యా.

**సా13.** యిహలోకపరలోక సౌఖ్యములు రెంటినీ ప్రసాదించు సాధనలు తెలిసినవారు, క్రోధము లేకుండా బ్రహ్మచర్యవ్రతమును పాటించిన ఫలితము నొందెదరు విశ్వనాధ - పూర్ణప్రసాదా।

### అకార ఆరోహణాక్రమము

**అ14.** తత్+త్వమ+అసి="తత్వమసి" ఈ మహావాక్యసిద్ధులైన మహనీయులు, పదునాలుగు లోకములలో సంచరించి, అన్ని లోకములలో మర్యాదమన్ననలకు పాత్రులై మునీశ్వరులయందు గొప్పవారుగా కీర్తింపబడుదురు విశ్వనాధ- యిహపరబోధా।

**ఆ15.** ఆతను "తత్వమసి" సిద్ధిపొందిన మహనీయుడు, అణురూపంబైన పరబ్రహ్మ స్వరూపుడై ఎట్టి మాయనుచెందక శాశ్వితుడై మాయందు ఐక్యమగును విశ్వ నాధ। మహాఋషివర్యా।





**ఇ16.** "ఇ" అక్షరనాదమందు మనస్సులగ్నము చేసి ఉపాశించే సాధకుడు, మన్మధ ప్రభావంబుచే స్త్రీ వాంఛా ప్రేరితుడై, రతికార్యసామర్ధ్యమును పొందు చున్నాడు విశ్వనాధ- రమ్యచరితా

**ఈ17.** "ఈ" అక్షరసాధనచే దేహము సువర్ణమగునని సిద్ధింపచేసుకుని, (సంపర్కము తో) చేత కాని పనులతో చెడిపోయినారు, అలాగాక వీర్యమునునష్టపరచక కేవలము మూత్రవిసర్జన మాత్రమేచేయాలి సాధకులగు స్త్రీపురుషులిద్దరూ విశ్వనాధ- రిపుకులభేధా।

**ఉ18.** చిత్తశుద్ధితో మనస్సును దృష్టిని భ్రూమధ్యమున నిలిపి "సుషుమ్న" యందు ప్రవేశించి, వెన్ను పూసయందు పైకి ఎగబాకుట తెలిసిన వారికి, సమస్త విషములు హరించిపోవును విశ్వనాధ- ఉరగవిషఘ్నా।

**ఊ19.** భూమధ్యన దృష్టి నిలిపి సుషుమ్నతో పైకి ఎగబాకితే సమస్త విషములు హరించిన, తర్వాత తైలధారవలే అమృతము స్రవించును, ఆ అమృతమును పానము చేస్తూ, యోగాగ్నిని రగిల్చి వీర్యమును ఊర్ధ్వముగా నడిపించిన దేహసంబధమగు సర్వకర్మలునశించును విశ్వనాధ- అవధూతపతే।

**ఋ20.** జన్మరాహిత్యమును కోరు సాధకుడు అనాహత చక్రమందు మనస్సు నిలిపి, సమస్త ఇంద్రియములను నిగ్రహించి "గురువును" భజయించిన, బ్రహ్మగ్రంధి విడబడును ఇది నిజము విశ్వనాధానిర్మల హృదయా।

**ౠ21.** ఇట్టి జన్మరాహిత్య సాధకునికి గురుకృప కలిగిన, ఏలోపము లేకుండా స్థూల దేహమును విడనాడి, సూక్ష్మదేహముతో సంచరించును విశ్వనాధా- సురమునివరదా।

**ఐ25.** యిట్టిసిద్ధి పొందిన జ్ఞాని దేహమున్నంత వరకూ ఇంద్రియ భ్రాంతులకు లోబడకవాటి యందు ఎరుకతో ఉండాలి. లేకున్న అవి విజృంభించిసాధకుని పతితునిగావించును విశ్వనాధా- విప్రవిధేయా।

**ఒ26.** "జ్ఞానులు" దేహముశాశ్వతము కాదని, పరబ్రహ్మమేశాశ్వతమని ఎరుక గలిగి, అణిమాది సిద్ధులయొక్క మహత్వా కాంక్షలు లేకుండాఉంటారు విశ్వనాధా- విద్యాధిపతీ।

**ఔ27.** పంచతన్మాత్రలను కట్టిపెట్టి భ్రూమధ్యస్థానమున దృష్టి నిలిపి, ఏ మాత్రం చిత్తచాంచల్య లేకుండా స్థిరంగా యున్న యోగి యొక్క సర్వపాపములు నశించును విశ్వనాధా- ఆర్యతపశ్వి।

**అం28.** అట్టియోగి లింగ దేహమును స్వాధీన పరచుకొని, స్థూల దేహాన్ని సువర్ణమయం చేయునట్టి, ఉప్పుయోగాన్ని సిద్ధించుకున్న సాధకుడు, యోగసిద్దిచే త్రిలోకములను (స్థూల, సూక్ష్మ కారణ దేహాలను,) జయించును విశ్వనాధా- ఆచార్యనుతా।

**అః29.** నేను అన బడే పరబ్రహ్మ తత్వమును శోధించు సాధకుడు, ఇహలోక సర్వ ధర్మములను త్యజించి, ఇహసంబంధ బంధములకు కట్టుబడక, బంధ విముక్తుడై మోక్షపదవిని పొందును విశ్వనాధా- సర్వశరీరా।

**క30.** రేచక, పూరక, కుంభకాదులచే సాధకుడు ఇంద్రియ సంబంధమైన సర్వపాప కర్మలను నశింపజేసి "శక్తివంతుడై", ఇహము, పరము రెండునూ అనుభవించును విశ్వనాధాశివయోగీంద్రా।

**ఖ31.** సాధకుడు ఇంద్రియములను బలవంతంగా నిగ్రహించవలసిన అవసరం లేకుండా, త్రికూట స్థానమగు భ్రూమధ్యమున దృష్టి నిలిపి, మనస్సులయం చేసిన ఇంద్రియములుసుళువుగా నిగ్రహమునొందును విశ్వనాధా- ధీవరధిషణా।

**గ32.** మళయాళ మంత్రతంత్రమర్మములను తెలుసుకొని, అంగన్యాస, కరన్యాస, హృదయాదిన్యాసములతో సుషుమ్నయందు దృష్టినిలిపిన అంగటి లో అమృతము ధారగా స్రవించును విశ్వనాధా- మిత్రవరేణ్య।

**ఘ33.** ఘంటము చేతబట్టిన కవి అనేక కథలు రచించినట్లుగా, యోగి యైనవానికి భూచరీ, ఖేచరీముద్రలతో దృష్టి నిలిపిన, భ్రూమధ్యన అనేక కళలను దర్శించును విశ్వనాధా- అమలాత్మనిధి।

**జ34.** దేహ భ్రాంతులతో ధ్యానము చేయువాడు యోగస్థితిని పొందలేడు, అలాగాక ప్రాణ, అపానవాయువుల రెంటినీ కలిపిన జ్ఞాని, ధ్యాన సిద్ధిని పొంది నేనను పరతత్వమును గ్రహించును విశ్వనాధా-నిజబ్రహ్మకళా।

**చ35.** చర్మముద్వారా ఇంద్రియములకు కర్మలను కలిగించు మనస్సును నియంత్రించి, దేహభ్రాంతులకు లోబడక,వాటికి అంటుబడకయున్నవాడు నిర్మలమైన మనో సంతోషము పొందును. విశ్వనాధా- శైవధ్యానా।

**ఛ36.** భీకరమైన హఠయోగమును బాగుగా నేర్చిన యోగి, లోకసంబంధమైన దేహ ధర్మములను జయించి కాయసిద్ధిని పొందును విశ్వనాధా-ఉపకల్పకళా।

**జ37.** తల్లిదండ్రుల సంరక్షణలో పిల్లలు ఎంత సుఖముగా జీవింతురో, అలాగే తల్లి తండ్రి దైవము అయిన "గురువు" కరుణా కటాక్ష వీక్షణలోనున్న సాధకుని జీవనము అట్లుండును విశ్వనాధా- తత్వస్థానా।

**ఝ38.** భ్రమరనాదమునందు 3 గంటలు తదేకంగా ధారణ చేసిన సాధకునకు భ్రూమధ్యమున నిండుపున్నమి చంద్రదర్శనము కలిగిదానియందు మనసు లయమగును విశ్వనాధా-ప్రియ వరదకరా।





**ఞ39.** "ఇణే" మంత్రమును అక్షరలక్షలు జపము చేసి మంత్ర సిద్ధిపొంది యిహ కోర్కెలను అదుపుచేసుకున్నవానికి, అణిమాదిసిద్ధులు కలుగును అట్టివారికి యిలపై గల మణులెందుకు విశ్వనాధా-మహామంత్రకళా।

**ట40.** టంకము చేత అతికించబడిన వస్తువులు విడిపోకుండా, అందంగా ఆహ్లాద కరమైన వస్తువులుగా ఎలా మారుచున్నవో, అట్లే గురునియందు స్థిరచిత్తుడైన సాధకుడు గొప్ప యోగిగా తీర్చిదిద్దబడును విశ్వనాధా- యింద్రియగ్రాహి।

**ఠ41.** అలా విడబడని మనసుతో గురువు యందు మనసులగ్నం చేసిన రాజయోగి, సాధనా బింకముకొద్ది. హంస (శ్వాస) స్వాధీనమై, అనాహతచక్రము వశమై హృదయ కమలనివాసము కల్గును విశ్వనాధా-ఆచార్యవర్యా।

**డ42** అన్ని దోషములకు మూలకారణమేమిటని ఆలోచించినచో, వీటన్నింటికీ మూలమైనవి ధనము, భార్యాపిల్లలపట్ల మనకు గల మోహమేనని తెలియును విశ్వనాధా-అమరమునీశా।

**ఢ43.** జీవితంలో నియమనిబంధనలు లేని పాపకర్మలా చరించుటెందుకు, యమ, నియమాదులచే,తనకు తాను నియంత్రించుకొని చూడు, అన్ని సంశయములు తీరును విశ్వనాధా-శంఖధ్వనికా।

**ణ44.** మూడవ నేత్రమగు సుఘుమ్నానాడి వశమవ్వాలంటే, నిత్యమూ వేకువ జామునషన్ముఖిముద్రను సాధన చేసి సిద్ధించుకొనిన, ఆతనికి మాత్రమే వశ మగును. యితరులకెట్లు తెలియును విశ్వనాధ- కల్మషరహితా।

**త45.** సాధన చతుష్టయములతో తపముచేసిన వారే, పరతత్వమునందు కలిసి ఉండగలరు. అలా కాకుండా జపమాలలు పట్టుకుని త్రిప్పినంతమాత్రముచే, తత్వదర్మన మగునా? అదికపటము కాదా విశ్వనాధా-కనకప్రతాపా।

**థ46.** బ్రహ్మజ్ఞానమును పొందిన సాధకుడే ధన్యుడు "ఎందుకనగా". అట్టి వానికి సమస్తలోకములు ప్రపంచమందలిసర్వము పరమాత్మగా దర్శించును. విశ్వనాధా-సర్వజ్ఞమయా।

**ద47.** లోకభ్రాంతులను విడిచి దృష్టిని భ్రూమధ్యన నిలిపిచూచిన, జ్యోతిరూపుతో పరమాత్మ దర్శనమై, మోక్షము సుళువుగా లభించును ఇది సత్యము విశ్వనాధ -నిర్మోహవరా।

**ధ48.** ధర్మబద్ధమైన నిర్మలమనస్సుతో, యిహలోకకర్మలయందు విరక్తితో సద్గురు నియందు మనస్సు లయము చేసిన వారికి, "అదే బ్రహ్మపదము" విశ్వనాధా-నిజబ్రహ్మపదా।

**న49.** లోక సంబంధమైన ఇంద్రియములకు కలుగు భ్రాంతులను గ్రహించి సాధకుడు, వాటిని దినదిన క్రమంగా విడువవలెను. లేకుంటే అవి సాధనకు ఆటంకము కలిగించును. క్రమసాధనచే అన్ని భ్రాంతులు అణుగును విశ్వనాధా- ఆనందమయా।

**ప50.** వివేకములేని సాధకులకు పంచామృతములు, పంచప్రసాదములు భుజించుట యందుగల శ్రద్ధ సాధన యందుండదు. అట్టివారికి సంచితకర్మలే భోగమగును విశ్వనాధా - సదమలబోగా।

**ఫ51.** అదృష్టవంతులైనవారికి ధన, అంగ, బంధువులనెడి అనేక బలములు కలుగును. "ఎట్లాగంటే" జీవంకలిగి, నాశనం లేనట్టి బంగారానికి ఎన్ని చిన్నె లుగలవో అట్లాగే, యిలవేలుపువగు విశ్వనాధా- యిహపరసాధా।

**బ52.** సమర్ధుడైనట్టిసాధకుడు ఈడ పింగళనాడులను వశము చేసుకుని, మూలాధార విశుద్ధ, ఆజ్ఞాచక్రములందలి కమలములకు అంటు బడి అందు హంస(శ్వాస)నుంచి కళలను దర్శించును విశ్వనాధా-యినశశినయనా।

**భ53.** అజ్ఞానమనే అంధకారముతో చేయుపాపఫలమును నశింపచేయుటకు, జ్ఞానమనే సంస్కారవృక్షమును నాటి, శక్తి ఉపాసనతో దేహమును సంస్కరించిన పుణ్య ఫలములను పొందవచ్చును విశ్వనాధా-సురవరదపధా।

**మ54.** అండపిండబ్రహ్మాండములలో నిండియుండి, సమస్త కర్మలకు మూలమైన ఓ దేవా (విరాట్ విశ్వకర్మ) మాచిదాకాశమున నివశించి మాకర్మలను సంస్కరింపుము విశ్వనాధా- కర్మఠ సదనా।

**య55.** కుడిముక్కుద్వారా గాలిని పీల్చి, భ్రూమధ్యననిలిపి తదేకంగా చూస్తూ ఈ విధమగు క్రమసాధనచే, దృష్టి నిలిచి సూర్య బింబము దర్శనమగును, కానీ శ్వాసను తొందరపడకనెమ్మదిగా విడవాలి, లేకుంటే బింబము చెదిరిపోవును విశ్వనాధా- మోహవిరోధా

**ర56.** సూర్యనాడివలన కలుగు క్రోధ భావమునకు అంటుబడక, అనేక విధములుగా దానిని నివారించవలెను, లేకుంటే అది సాధకునిలో అనేకదుష్టగుణములను ప్రేరేపించును, కాబట్టి తపోసాధనచే ఆక్రోధానికి కళ్ళెంవేసి అదుపు చేయాలి విశ్వనాధా- యజ్ఞాధిపతే।

**ల57.** బ్రహ్మగ్రంధి సంబంధమైన సృష్టి స్థితి, లయాది పంచకృత్యములకు సంబంధించిన లలిత (మనోజ్ఞ) కృత్యములు చేయునది మేమే సాధకుడైనవాడు ధీరత్వముతో వీటిని నియమింపవలసి ఉంటుంది. విశ్వనాధా- బ్రహ్మస్థానా!





**వ.58.** బ్రహ్మ గ్రంథిని ఛేదించవలెనన్న మేరువు (వెన్నుపూస) యందుగల కైలాసము నందుగల, సుమేరు పర్వతమును యోగసాధన ద్వారా సాధించవలసి ఉన్నది విశ్వనాధా- వానప్రస్థా!

**శ59.** వందలు, వేలు, లక్షల సంవత్సరములు జీవి అజ్ఞానంలో పడి, అనేక జన్మలు ఎత్తి కోరికలతో పుట్టి చనిపోతున్నారు. అట్లుగాక జ్ఞానసంపత్తి గల మహ నీయులు యోగసాధనచే, పరబ్రహ్మమునందు ఐక్యమై జన్మ రాహిత్యమును పొందుచున్నారు. విశ్వనాధ- యిహపరసాధా!

**ష60.** ఆకలి దప్పిక, నిద్ర మైధునము, మోహము,దుఃఖము, అనబడే ఊర్మలయందు భ్రాంతి లేక యున్న వాడు కైలాసాధిపతియందు ఊర్మలనే విన్యాసమును జయించును విశ్వనాధా-తాపసతేజా।

**స61.** సద్గురువులు నిత్యానిత్య వివేకముతో సత్యమగు పరబ్రహ్మమందు లీనమై ఉంటారు. అంతే కాని వారు కుచ్చితస్వభావులుకారు బ్రహ్మజ్ఞానులు ఏమీ తెలియని ముచ్చులవలే నుందురు విశ్వనాధా- ముద్రారణ్యా।

**హ62.** సాధకుడు కుటిలభావాలను విడనాడి హటయోగమున, ఫాలభాగమున శ్వాసను కుంభించి ప్రాణవాయువు నిలిపినచో, "ఆతనువు"కాయసిద్ధిని పొందును విశ్వనాధా - పరమ ప్రసాదా।

**ళ63.** ఫాలభాగమున వాయువును కుంభించి "ళ" అను అక్షరమును సాధించువాని దేహము బాగా వేడి కలిగియుండును. అపుడు జాగ్రత్తతో నిద్రలోకి వెళ్ళకుండా గమనించి చూచిన, సుషుమ్నయొక్కరాకపోకలు తెలియును. విశ్వనాధా- శుభ్రశరీరా।

**క్ష64.** శరీరములోని ధాతువులందలి ఉప్పు గుణమును కట్టి(జయించి) నిశ్చలముగా ఫాలబాగమున దృష్టి నిలిపి స్థిరత్వము పొందినదే సక్రమమైన యోగసాధన విశ్వనాధా- నిశ్చలహృదయా।

**యిక్కడనుండి అవరోహణక్రమముః-**

**క్ష65.** దేహమునకు శక్తి తగ్గిన,సాధనతో చంద్రనాడిద్వారా అమృతబిందువులను గ్రహించి, దేహమును స్వస్థతపరచుకొనవలయును. దీనికై విచారించ పనిలేదు మాయకు లోబడకు. విశ్వనాధ- నిరుపద్రపదా।

**ళ66.** ఫాలభాగమున సూర్యనాడియందు "ళ" అను అక్షరమును సిద్ధిపొంది, స్థిరముగా పంచతత్వములను దర్శించిన తరువాత, త్రిభుజ ఆకారముగా బ్రహ్మము దర్శనమగును. ఆహా ఎంతపుణ్యప్రదమైనది విశ్వనాదా-హంసనిరోధా।

**హ67.** సాధనకొలది ఫలితములు వరసక్రమముగా ముందే దైవము నిర్ణయించెను. చింతింపవలదు. హంసనుగురై రిగిపట్టుకో, సిద్ధుడవగుదువు విశ్వనాధా- వుపతను శోధా।

**స68.** లోక ధర్మమునను సరించి హిరణ్మయకోశముతో, మనసునందు పంచరసతన్మాత్ర భావములను అరికట్టగలగడం నేర్చితే, సిరులు వశమగును విశ్వనాధా- శివయోగనిధీ।

**ష69.** షడూర్ములు విడిచిపెట్టిన యోగి ఎక్కడ ఉన్నా వారు అడవి పతికి (సింహానికి) సమానమే, అంతే కాని పాలు త్రాగే పిల్లికి, పాలిచ్చేతల్లి పిల్లికి అడవి ఎందుకు విశ్వనాధా- ఆమవిరోధా।

**శ70.** శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము, అను ఆరుగుణములు తెలిసినయోగికి దేహమున ఆవరించియున్న అన్ని మలములు తొలిగి, సుళువుగా అన్ని యింద్రియములు స్వాధీనమై సాధకునకు దేహము పరిశుద్ధమై వశమగును అట్టివారికి యమబాధలుండవు విశ్వనాధా- యిరుబలయోజా!

**వ71.** ఎంత మ్రొక్కినా వరములు ప్రసాదించని దైవములనారాధించి హృదయ వికారముపొందనేల? తీక్షణమైన దృష్టితో కంఠస్థానమును శిద్ధించుకొమ్ము విశ్వనాధా- నరభయతేజా!

**ల72.** క్షుద్రమైన భావనలుగలకుచ్చితులకు, లక్ష్మీకరమగుగ్రంధిత్రయములయొక్క వివరములెట్లు తెలియును. అట్టి పాపాత్ములు గొఱ్ఱె కసాయివాని పాలైనట్లుగా యమునిపాలుబడి ఘోరనరకములను పొందుచున్నారు. విశ్వనాధా- ఆగమవిదుషా!

**ర73.** సద్గురునియందు భక్తి విశ్వాసములతోనున్న అనేక రక్షలుకలవన్న నమ్మికతో, గురునియాజ్ఞచే దృష్టిని భ్రూమధ్యమున నిలిపి, అత్యంత తీక్షణముగా చూస్తూ నిదానించిన యోగి, సమస్తమును నశింపచేయును. ఆతనే "అవధూత అని" భువిపై సాక్షాత్కరుడని గ్రహించు విశ్వనాధా-యిరుచరణవరా।

**వ74.** స్వర్గబోగములను కలిగించు యోగములకు సాటియైనయాగంబులు ఎన్నోకలవు. అలాంటి వాటిని చేసి సాధించుకోవలెను. విశ్వనాధా- యమభటదూరా.

**మ75.** ఏమాత్రమూ మనస్సు చలించని యోగికి, ఈ లోకమంతా అణువుతో సమానమే. తానుసృష్టి అంతటా నిండియుండును, అప్పుడు అతను గ్రహించును ఆత్మకు, అనాత్మకూ గల భేదాన్ని విశ్వనాధా- అమృతాశినవా!

**భ76.** ముక్తికాంత వలచిన ఉపరతిని కలిగించును. అది సామాన్యము కాదు, గొప్ప సాధనా ఫలితమది, మంచి లక్షణములు గల భక్తులకు ముక్తికాంతయందు ప్రేమేమో? విశ్వనాధ- భీకరచరితా॥





**ఐ77 (ఎ)** అప్పు అడిగితే రొక్కం యిస్తారు. వడ్డీతో సహా వసూలు చేయుటకు అలా చేయుటచే ఆ ధనం రెండింతలవుతుంది. అలాంటిదే దానం చేయుటచే యిట్టి ఫలాన్ని పొందగలరు విశ్వనాధా - మంగళ హృదయా

**ఐ77. (బి)** అప్పు అడిగితే ధనం యిస్తారు ఎందుకంటే అదునుగావడ్డీతో సహారాబట్ట డానికి ఆశతోఅలా వీలుకాకపోతే అసలుకే ఎసరు వస్తుంది విశ్వనాధా- మంగళ హృదయా॥

**ఫ78.** స్థిరచిత్తముతో సత్యాన్ని ఆశ్రయించినయోగికి "గురువు" యొక్క దీవెన బలమై, పలు విధములైన ఫలములు పొందుతారు యిది కలకాదు విశ్వనాధా- కర్మత్యాగీ!

**ప79.** పిట్ట ముక్కుతో కీటకమును పట్టినట్లుగా సాధకుడు మనస్సును గట్టిగా పట్టుకొని సువర్ణమయము చేయు ఎర్రకలువను మూలధారం సిద్ధించుకుని అలాపై పైకి ఒక్కో దానిని సిద్ధించు కోవాలి విశ్వనాధ- తత్వప్రచారా।

**న80.** యిదినాది, అదినీది, అవమానము, గొప్పతనము, నేను, నువ్వు, అనే విరుద్ధభావాలు దేనికి, ఇవన్నీ దేహభ్రాంతులు, నేనన్నది అన్నిటా నిండియున్న ఆత్మ స్వరూపమే కదా। అది అంతా ఒక్కటే కదా విశ్వనాధా- అంబరచేలా॥

**ధ81.** ధనవంతుని గొప్పగా పొగుడుతారు "ఎందుకంటే " ధనమే కదా భూమి మీద అధికారాన్నిచ్చేది. పూర్వజన్మ సుకృతముచే వారు అలా కీర్తింపబడతారు విశ్వనాధ- పావనమూర్తీ!

**ద82.** దంచిన బియ్యాన్ని చక్కగా వండి అందులో అనేక రుచులుగల కూరలుచేర్చి నమిలి మ్రింగి, ఆ హాయని సంతోషముతో అనుభవిస్తారు మానవులందరూ, అలానే పుణ్యఫలాన్నిపొందటం కూడా ఎవరెవరు చేసుకున్న దానిని బట్టివారు అనుభవిస్తారు. విశ్వనాధా- పుణ్యజననుతా!

**థ83.** రెండు ఝాములు (6గంటలు) ఏకంగా "థా" అను అక్షరాన్ని జపించినచో, ఆ అక్షరతత్వముతో సహస్రారము చేరిన జ్ఞానికి మోక్షము కలుగును, మానకుమా విశ్వనాధా-మంత్రవిచారా॥

**త84.** "త" అక్షరము జపించుచున్న , వసుసంబంధమైన సూర్య నాడి సిద్ధించును ఆపై ఇంద్రత్వము పొందెదరు, తరువాత ఫలితములు ఎలా ఉంటాయో తలచుకో విశ్వనాధా- తత్వప్రసాదా!

**ణ85.** ఒక్క శ్వాస నిలిపిన పది శ్వాసల ఫలితము నిచ్చును, కావున అనవసరంగా శ్వాసను ఖర్చుపెట్టకుము, శ్వాసను కుంభించి అంతర్ముఖంగా చూచు విధానము తెలుసుకో విశ్వనాధా- శ్రీవర్ధకజా!

**ధ86.** అనేక రకములుగా జనులను భీతిగొలిపి వశపరచుకొనచూచువారికి, ఆ తరువాత వారి గతి ఏమవునో? ఘోరమైన పాప ఫలములను అనుభవించుచున్నారు. విశ్వనాధా- రారాజకళా!

**డ87.** నిర్భయముగా తపముచేస్తూ, శ్వాసను పొట్టయందు నిలిపి ఏ మాత్రం వదలక, శరీర శ్రమను సహిస్తూ సాధన చేస్తూ, వసు సిద్ధిపొందుము విశ్వనాధా- వాయునిరోధా!

**ఠ88.** హృదయ మందుగల ఘంటానాదమునందు మనస్సులయము చేసిన సాధకుడు, లోక మందలి “సర్వకర్మరులజీవులకుకాపైన,” బుద్ధితత్వముతో ప్రకాశించును విశ్వనాధా, సురగురుకులజా!

**ట89.** మాయావాదులైన రాక్షసస్వభావసాధకులకు, ఎలాగు దేహము సువర్ణ రజిత సిద్ధికలుగును? వారు సత్వగుణమునలవరచుకుంటేమేలుకలుగును విశ్వనాధా- తాంత్రీచరా!

**ఞ.90.** దైత్య గురువగుశుక్రాచార్యుని పరంపరానుగత సాధనకలిగిన, యుద్ధతంత్ర విద్యలను పొందు రాక్షస యోగము సిద్ధించును, అక్కడ పరబ్రహ్మ తత్వమునకుతావులేదు విశ్వనాధాగోళ శరీరా!

**ఝ.91.** ఝుంకారమందు మనస్సు నిలిపి అందు శ్వాసను కుంభించి, బలాత్కారముగా నిలిపిన ఓంకార నాదము విస్తరించి, మనో సంశయములు నశించును విశ్వనాధా గిరి గుహవాసా!

**జ.92.** నీటిలో సంచరించునవి, ఆకాశమున సంచరించునవి, భువిపై సంచరించు జంతుజాలములు యివన్నీ కలలో చూచినట్లు కనబడును. యివన్నీ సృష్టికర్తయొక్క అనేక మాయలు విశ్వనాధా- బ్రహ్మ కళజ్ఞా!

**ఛ.93.** స్థూల శరీరమునందుగల చంద్రనాడిని పట్టి , శిఖస్థానమున (ఆజ్ఞాన చక్రమున) దృష్టి నిలిపి, వాయువును కుంభించి నిలిపిన ఫలముకలదు విశ్వనాధా-పరసంచారా!

**చ.94.** చెప్పుడు మాటలు విని ఉద్రేకంతో తొందరపాటు నిర్ణయాలు తీసుకోరాదు. తప్పును నీకంటితో చూచి నిర్ణయించాలి, ఎందుకంటే తొందరపాటు నిర్ణయాలు అనర్ధాలకు కారణమవుతాయి, ముప్పును తెస్తాయి, జాగ్రత్త సుమా విశ్వనాధా- తపమనవనజా!

**ఙ.95.** భైరవ సాధనయగు బాహ్యాఖేచరీయోగము నేర్పు ఎరిగి, చక్కగా చేసి నిలకడగా ఉంటే, ఈతి బాధలు లేక చక్కని జీవనము కలుగును విశ్వనాధా-రాజసుభోగా!

**ఘ96.ఎ.** హనుమంత నాడీ క్రమమున పంచతత్వములను చూచే క్రమము తెలిసి, త్రికూటస్థానమున హంసను (శ్వాసను) గమనించి పట్టిన సమస్త సిద్ధులు వశమై త్రిలోకములలో ఆతని కీర్తి విస్తరించును విశ్వనాధ- కారణపురుషా!





96.బి. నాశిక పై భాగమున దృష్టి రెండున్నర ఘడియలు నిలుపగలిగే స్థిరత్వము వస్తే, భ్రూమధ్యన స్వరము మారునప్పుడు, తెలివిగా శ్వాసను మారకుండా నియంత్రించ గలిగితే, అనేక సిద్ధులు లభించును. విశ్వనాధా- కారణపురుషా!

**గ.97.** లలాట భాగమధ్యన గల కొండనాలుక క్రింద గల భాగమున దృష్టినిలిపి, మనస్సును వశపరుచుకొని యోగాగ్నిని రగిల్చిన, మనసులయమై ఉపరతి పొందును విశ్వనాధా-క్రోశాతీతా!

**ఖ.98.** హిరణ్య గర్భస్థానము సిద్ధించిన సాధకులు, ఇంద్రియములకు చలింపక ఏ మాత్రము సంశయములు లేక, సమాధి సిద్దిని పొంది సకల సంపదలననుభవింతురు విశ్వనాధా- ధర్మవిచారా!

**క.99.** ధనము, బంగారము, భూములు సంపదలు గలవారిని ప్రజలంతా దేవుడని పొగుడుతారు. వారు గ్రామంలో ఉన్నా అడవిలో ఉన్నా సరే విశ్వనాధా- మర్మవిశోధా!

**అః.100.** ఈ దేహము సాహసోపేతమైన కార్య నిర్వహణకు, యోగసాధనా సామర్థ్యము నకు, నిత్యజీవన పోషణకు, ఇలా అనేకకార్యములు చేయుటకు కాలసిన శక్తి సామర్థ్యములు దేనివలన జరుగుతున్నవో ఊహిస్తే, ఇదంతా ప్రాణశక్తి ప్రభావమని గ్రహించు విశ్వనాధా- శుభగచరిత్రా!

**అం.101.** కంఠస్థానమునందు వాయువును కుంభించి (జాలంధర బంధముచే) నాసిక ద్వారా గాలినిలోపలకు పీల్చుతూఉండాలి, యిలారోజుకు యాభైసార్లు చొప్పున చేస్తుండాలి. అలా చేస్తూఉంటే అనాహతము సిద్ధించునుకదా విశ్వనాధా - క్షీరగిరిస్థా॥

**ఔ.102.** పన్నెండు సంవత్సరములు నియమనిష్టలతో మంత్రభావమును ఉపాశించిన జ్ఞానులకు, అన్న కోశము శుద్ధి అయ్యి అనేక వందలు, వేలు, లక్షల సంవత్సరములు ఆయుష్షుపొంది, భువిపై స్థిరమునొందెదరు విశ్వనాధా- పరమ పవిత్రా!

**ఓ.103.** యోగియైనవాడు భ్రూమధ్యన స్థిరముగా దృష్టి నిలిపి, లోక సంబంధమైన సకల కర్మతంత్రజాలములందు మనసును పోనీయక, ఇంద్రియములను అణచి ఉంచెదరు విశ్వనాధా- యిభవైరినిభా!

**ఐ.104.** దిక్పాలకాధిపత్యము ఐరావతము యింద్రునకే, జ్ఞాన యోగులుదానిని కోరుకోరు, కానీ అనవసరంగా పామరుల వలే వైరానికి దిగుతారు భైరవులు విశ్వనాధా- బ్రహ్మకలాపా!

**ఏ.105.** శ్వాసనుగట్టిగా పీల్చి పూర్తిగా బయటకు వదిలి, మూలాధారమునుండి శ్వాసనులాగిగట్టిగా బిగించి ఉంచిన సాదకునకు, పెద్ద వయస్సు వచ్చి నా దేహానికి ముసలి తనపు ఛాయలు కానరావు విచిత్రంగా విశ్వనాధా- ఆలోకనిధీ!

**ఌ 106.** ధనముకోసం అనవసరంగా లోకమున దొంగపనులు చేయకుము "( ఌ )" అక్షరసిద్ధిని పొందుము. కాటేరీభూతం (శివసహచరభూతం) వశమగును, అపుడు కోటీశ్వరుడౌతావు విశ్వనాధా- ఆలోకనిధీ!

**ౡ 107.** చెడుగుణములకు, చెడుపనులకు లొంగక గుర్తెరిగి నిగ్రహించిన వారు లోక మాయకు లొంగక పరబ్రహ్మమును తెలుసుకొందురు విశ్వనాధా- అమలశరీరా!

**ఋా.108.** శరీర సౌందర్యము, విద్యా, ధనము, వీటిని కలిగించునది పరబ్రహ్మ సహచర్యమే, ఈ స్థానసిద్ధిని పొందిన సౌఖ్యములననుభవింతురు, ఏ లోపమూరాదు. ఇలా కాకయితరమార్గములు పాప హేతువు విశ్వనాధా - పాంచాననజా!

**ఋ.109.** ఆ పరంజ్యోతి స్వరూపము యొక్క ఆది, అంతము కనబడుటలేదు. అంతేకాదు దాని మధ్యము కూడా ఎక్కడ ఉందో తెలియట లేదు, విశ్వనాధా- సాంఖ్యాంతరధీ!

**ఊ.110.** మనసున ఏ ఆలోచనలు లేకుండా నిర్విషయంగా ఉంచుట తెలిసిన "కారణాచార్యులకు" వేద విది కర్మలు అవసరంలేదు. అట్టి వారికి దేహ సంబందమైన వర్గ మూలములు దరిచేరవు విశ్వనాధా- మిత్రవిధేయా!

**ఉ.111.** సాధనమున అంగిట్లో ద్రవించు అమృతాన్ని బయటకు ఊయకుండా, నిదానంగా దానిని, శ్వాసను లోపలికి పీల్చి, అనాహత చక్రమందు నిలిపిస్థిరము చేసి, చెవిలో తుమ్మెదనాదము నందు మనస్సు లగ్నము చేయవలెను విశ్వనాధా- కాంతి విశేషా!

**ఈ.112.** "ఈ" స్థానమే అందరి భవిష్యత్ అనుభవములను కలిగిస్తుంది. కాసంత పంతంతో సాధన చేసిన సమస్త భోగములు కల్గును విశ్వనాధా- పురుషవరేణ్యా!

**ఇ.113.** యిడపింగళనాడుల ద్వారములందు కావలులున్నారు. వారిని దాటి ఈ రెండునాడులను వశము చేసుకుని సహస్రారమున గల కమలమునందు కలిపిన, పరబ్రహ్మ దర్శనమగును విశ్వనాధా- బ్రహ్మకులీనా!

**ఆ.114.** నిన్ను ఆక్షేపించిన వారి "ఆక్షేపణకు" చలించక సామరస్యంగా వారిని సమాధాన పరచ వలసి ఉంటుంది. లేకుంటే వారి ఆక్షేపణ నిజమయ్యే ప్రమాదముంది విశ్వనాధా- గానవిలోలా.!





**అ.115.** యింతని మితములేనట్టి ఆ పరబ్రహ్మమును సుళువుగా సాక్షాత్కరించుకునే "గురుసూత్రము" నెరుగ వలెను. అలాకాకుండా వేరే విధంగా చిత్తశుద్దిలేనట్టి బ్రహ్మకైనా సాధ్యంకాదు విశ్వనాధా- విమలప్రతాపా.!

**మూ.116.** త్రికూటస్థానమున దృష్టి నిలిపి అచటగల ఒక ముత్తైదువ (సరస్వతి) ని ప్రసన్నం చేసుకుని ఫలంపొందలేక సాధకులు మనస్సు చేసే అలజడులకు లొంగి పోతున్నారు. దానిచే తఫః ఫలితాన్ని పొందలేకున్నారు విశ్వనాధా- మృధువాక్ప్రౌడీ!

**దం.117.** జపములు, తపములు, యోగాలు, యాగాలు, ఆచరించువారు యిహలోక భోగాలేవి అనుభవించక, జీవితాన్ని వ్యర్ధం చేసుకుంటున్నారని యిహలోక భోగులు భావిస్తే "యిహలోక సౌఖ్యులారా" మీరు చిత్తసుద్ధితో ధర్మాన్నైనా ఆచరించండి ఫలిత ముంటుంది విశ్వనాధా- బలదేశికరా!

**న.118.** ప్రాణవాయువునందు సమానవాయువును కలిపి, ఏ మాత్రం చలించక దేహమున వేడిపుట్టించి చూడు. మహాయోధుడవవుతావు, ఏమీ తెలుసుకోకుండా దైవాన్నెందుకు దూషిస్తావు విశ్వనాధా- ఓమహాయోధా!

**ధం.119.** నిర్భయముగా నిదానముతో భ్రూమద్యన దృష్టి నిలిపి శ్వాసను లోపలికి పీల్చి శరీరాన్ని నిటారుగా నిశ్చలంతో స్థిరంగా ఉంచిన, సర్వశుభములుకలుగును విశ్వనాధా- యిహపరశోధా!

**శ.120.** అనాహత చక్రమందు మనస్సు నిలిపి,ఐహిక భ్రాంతులందు మనసు పోనీయక, స్థిరంగా నిలిపినచో, చెవిలో నాదము విస్తరించగా దానియందు యోగులు లయమగుదురు విశ్వనాధా- ఆత్మప్రతాపా!

**య.121.** నాభి క్రింద స్థానమును వత్తిడి చేసి గాలిని పూర్తిగా బయటకు వదిలి, మరల పూర్తిగా గాలినిపీల్చి, కుంభించి ఉంచుతూ, ఈవిధంగా సాధన చేస్తుంటే కంఠం లోపల నుండి రసాయనములు (అమృతము) పాకమువలే ఊరును. ఎలాగంటేపెద్ద వృక్షములకు మొర్రులు ఏర్పడినచోటద్రవము కారు విధముగా విశ్వనాధ- ముని గణశోధా!

**వా.122.** తులసీవన ప్రాకారముగల విష్ణుగ్రంధియుక్తమైన సూక్ష్మ దేహసాధన చేయుట తెలిస్తే, దేహము లోపల నిదానముగా వెలుగు విస్తరించి దర్శనమగును విశ్వనాధా- తాపసహృదయా!

**శి.123.** హృదయమునందు దృష్టి నిలిపి ప్రశాంతముగా వినిన, ఘంటానాదము విస్తరించును. అప్పుడు ఫాల భాగమున సూర్యనాడినిలిపిన, సకల సంపదలు కల్గును విశ్వనాధా - భాగ్యాబ్ధికరీ!

**మ.124.** నాశిక చివర దృష్టి నిలిపి కాపుకాచి, భ్రూమధ్యస్థానమునందు గల సుషుమ్నలో ప్రవేశించి బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంధులను ఛేదించి, వాటిని వశమొనర్చు కొనుటకు శిఖిస్థాన మందు వారిని నిలిపిన వశమగుదురు విశ్వనాధా- దివ్యయశశ్రీ!

**న.125.** జ్ఞానశక్తి యుక్తమైన స్వాధిష్ఠాన కమలమునందు దృష్టినిలిపినయోగి ఫాలమున సూర్యనాడిని నడిపించిన, అనాహతకమలముచేరును విశ్వనాధా- చిత్కళమూరీ!।

**ఓం.126.** ఓంకారము సమస్త వేదములకు మూలము సంశయము దేనికి? రేచక, పూరక, కుంభకముల ద్వారా శ్వాసను నడిపించి తెలుసుకో విశ్వనాధా- బేరాకారా!

**సో.127.** ఛందోబద్ధంగా శ్వాసను నడిపించు వారికి, నాడి శుద్ధియై లోపలపూర్ణ చంద్రుని దర్శనము కలిగి, దానియందు మనసు లీనమగును విశ్వనాధా- వుపవరధీశా!

**హం.128.** శ్వాసను ఆరోహణ క్రమంగా నడిపించువారు దాని (శ్వాస) యందేమనసు స్థిరము చేసిన, వారికి అర్ధనారీశ్వరతత్వము బోధపడును విశ్వనాధా- సమదరిశనగా!

**శిం.129.** నాశిక చివర భాగమున దృష్టి నిలిపి యోగాగ్నిని రగిల్చిన, అందలినాడి యొక్క తోక భాగము చైతన్యము చెంది మేల్కొనును, అలా జరిగిన యోగికి మంగళకర మని తెలియును, వెర్రి వెంగళులకు ఏమి తెలుసుదాని సరసం విశ్వనాధా- శింహాద్రివరా!

**హా.130.** సూర్యనాడియందు రోజూ శ్వాసను పూర్తిగా బయటకు వదిలి, మరల శ్వాసను పూర్తిగా తీసుకుని, శ్వాసను నిలుపుచూ సాధనచేయు యోగికి యిష్టమైన పదార్ధములు హాయిగా భుజించవచ్చును, దానివల్ల సాధనకు, దేహానికిఎలాంటి యిబ్బందులు లేవు విశ్వనాధా- అమలశరీరా!

**ద్రి.131.** మానవులు అజ్ఞానులై పుణ్యక్షేత్రాలు, పుణ్యతీర్ధాలు, అంటూ వ్యయ ప్రయాసలకోర్చితిరుగుతున్నారు. కానీ చక్కని జ్ఞానమార్గాన్ని గమనించి ఆచరించలేక పోతున్నారు, ధనవ్యయం లేని, శరీర శ్రమలేని జ్ఞానమార్గాన్ని తెలుసుకుని ఆచరించాలి విశ్వనాధా- లీలచరిత్రా!

**వి.132.** మంగళస్వరూపము, సుజ్ఞానతత్వము, నిర్మలమగు శివతత్వం సిద్ధించుట సులువుకాదు. కఠోర దీక్షలేని బ్రహ్మ, విష్ణు, మహేంద్రులకైనా అదిఅలవికాదు విశ్వనాధా- శాశ్వతరూపా!

**శ్వ.133.** సుజ్ఞానులు కల్లాకపటములు లేకుండా ఉత్తమకులస్తుని, చండాలునియందు సమదృష్టి కలిగి యుంటారు. యిలాకాకుండా బేదభావముతో నున్న సుజ్ఞానమని పించుకొనునా? ఈ బేధభావముతో చేయు మంత్రసాధనలో ఫలితము లుండునా? నెపమేకదా విశ్వనాధా- నిర్మలమూర్తీ!





**నా.134.** పామరులు నేనున్న లోకమే అద్భుతంబని దీనిని మించినది వేరే లోకం ఏమీ లేదనియిదేశాశ్వత మని భావించి,కడకు అనేక కష్ట నష్టములనుభవించుచున్నారు. కారణమేమంటే, వీరు దేహాభిమానులు ఇంద్రియలోలురు కాబట్టి విశ్వనాధా- మాన్యచరిత్రా!

**ధా.135.** భూమండలాన్ని (శరీరాన్ని) మొత్తం శోధించి నిజం తెలుసుకోవలెనన్న, గురువు బోధించిన మంత్రాన్ని జపించి, మూడవ కన్ను తెరిచి యధార్దాన్ని గ్రహించాలి విశ్వనాధా- శుభకరతేజా!

**బా.136.** గడ్డిపురుగును తుమ్మెద తెచ్చి మట్టిగూట్లో పెట్టి దాని చుట్టూ తిరుగుతూ "భం" కారశబ్దముచేయును. ఆ శబ్ధాన్ని వింటున్న కీటకము భయంతో తుమ్మెదగా మారును. అలా శిష్యుడు గురుభోధను భయంతో శ్రద్ధగా ఆచరించి, సహస్రారమందలి నాదమందులీనమై ధ్యానసిద్ధిని పొందును. విశ్వనాధా- గురుకులవరదా!

**ర్యా.137.** స్వాధిష్టానకమలమునందు "ర్యా" అక్షరదళము యొక్క పుప్పొడియందు ధ్యాన నిమగ్నులై సాధకులు ఆ తత్వమునందు ఐక్యము చెందితే వారికి కామధేనువు వశమగును విశ్వనాధా- తనువరశోధా!

**వ.138.** నాలుగు వర్ణాలు ఎలా ఏర్పడ్డాయో గురుతు చెబుతా విను. వేదవిధి కర్మలను అనుసరించుటలోని కర్మ విభాగములని తెలియుము విశ్వనాధా- వాహనయానా!

**ధూ.139.** వేదవిధిని అనుసరించి, నియమ నిష్టలతో వారికి హితమైన జాతి సమూహము నకు మేలుకలుగునట్లు చేయుతంత్రము "ఎలాగంటే" చెట్టునాటి దాని ఫలములు తిని జీవించునట్లుగా విశ్వనాధా- మేలుప్రసాదా!

**త.140.** కోర్కెలు నియంత్రించుకొనుచు, చిత్తపరిపక్వముతో జ్ఞానాన్ని పెంచుకుంటూ, యోగసాధనలో ధ్యాననిమగ్నుడై, రెండురోజులుండిన "శిరిభోగముకలుగును". అలా కాక భ్రాంతులతో ఇంద్రియములకు పట్టు బడిపోతే పాపము అంటుబడును విశ్వనాధా- చింతవిదూరా!

**స్వా.141.** మానవులు భ్రాంతులతో కలిగే దేహాభిమానమును వదిలి, యోగానుభవమున దేహసౌఖ్యముపొంది, సమయాన్ని అనుకూలింపచేసుకోవలెను విశ్వనాధా- మాయ విదూరా!

**ము.142.** యోగులు, మునులు, ధనహీనులు కారు. కానీ వారు ముక్తికి ప్రియులై సంచరిస్తున్నారు. అవసరమైతే వారు బంగారాన్ని తయారు చేసుకోగల సమర్ధులు విశ్వనాధా- వరమునివరదా!

**ల.143.** సంచితకర్మలు తొలగించుకొనుటకే "నాదాన్ని" ఉపాశించుట. చేతనైతే మీరు నూ అనేక సంవత్సరములు సాధన చేసి మోహాన్ని నశింపచేసుకొనుడు విశ్వనాధా- లోకసుబోధా!

**వా.144.** సత్య ద్వారములు తెరుచుకోవలెనన్న, భ్రూమధ్య స్థానమున తర్జినీ వ్రేలునుంచిన తర్వాత శ్వాసను, అనులోమ విలోమ పద్ధతిన నడిపిన, ఆదరము తో ముద్ద లాగా జ్యోతి త్రికూటమున దర్శనమగును విశ్వనాధా- అనుభవదీరా!

**రు.145.** ఇది సత్యమైన మార్గమే కదా దీనిని సాధించి, "బ్రహ్మ, విష్ణు రుద్రులను వారిని "వరుసగా మునులు, యోగులు భజియించుచున్నారు. విశ్వనాధా- సృష్టిస్వతంత్రా!

**యి.146.** ఈ స్థానమందుగల శక్తిపాదంబులచెంతనే, భూసంబంధమగు బీజములతో సుందరవతి (సరస్వతి) చక్కని విద్యను ప్రసాదించును విశ్వనాధా- అగ్రస్థానా!

**ఛ్రైళ్.147.** ఇందుగల కంద పద్యములను చందో బద్ధముగా ధ్యానించిన, యమబాధలు తొలగి స్థిరమైన బోగములు కలుగును, కంఠస్థానమునందు ఉపాశించిన, బంగారు వెండి పర్వతములు సిద్ధించును. అలాకాక గ్రంధి స్థానములందుంచి ధ్యానించిన గ్రంధులు వశమగును.అంతేకాక దేహమునందు గల అనేక స్థానముల యొక్క భావరహస్యములు బోధపడును. యింకా పాపములు నశించి యిహలోక శుభములు కలుగును. అనేక యజ్ఞయాగములు చేసిన ఫలితం లభించి, సర్వజీవులయందు సమభావంకలుగును.

**148.** పద్దెమిది పద్యములను సిద్ధి ఫలములను కలిపి యిందు యిచ్చాను. ఈ దేహమునందుగల మూడు ముద్దుల భావములను తెలియజేయు విధముగా.

**149.** సూర్య, చంద్ర, సుషుమ్న అనుమూడునాడులందు, దేనియందైనా మీరుకోరుకున్న అక్షరసిద్ధిని పొందతలుచుకున్న, ఆనాడియందు "ఆ అక్షరమునుంచి" ఏ అక్షర సిద్ధి పొందవలెనన్న అక్షర స్థానము నెరిగి అనులోమ, విలోమ పద్ధతితో వాటిని జప, తప, ధ్యాన సిద్ధిని పొందిన సమస్తశుభములు కలుగును. విశ్వనాధా- శ్రీగిరివాసా!

**150.** శ్రీ విద్యా ఉపాసన తప్ప వేరే కోరిక లేమీ నీకు లేకుంటే, సూరుడవైతే చేయుము. ఇదే విధానము శ్రీ విద్యాస్వరూపిణియగు "రమ" యందురమించు జిజ్ఞాసగల శ్రీరామా. విశ్వనాధా- శ్రీగిరివాసా!

**151.** మాలినీ:- వరమిచ్చు మిషతో సంచరించు ఓగురుదేవా! వాద విద్యలను విచారించు వాడా జనులను, మునులను, దేవతలను, దానవులను పాలించువాడా। మంగళకరముగా విశ్వమును పాలించువాడా। స్థిరమైన మనస్సు, చక్కని గుణములు గలధీరుడా । భూతిధారణతో శుభ్రమైన శరీరముగల వాడా। నిరంతరము పరమును ధ్యానముచేయువాడా। భక్తులను లాలించి రక్షించు ఓ దేవా।





**152.** గద్యము:- ఇది శోభాయుక్తమైన మంగళకరమగు సమస్త విద్యలను జయించ వలెనన్న కోరిక కలిగిన వారికోసం, జ్ఞానయుక్త మగు కవిత్వమును రచియించి, వివిధగణాలు, అనంతమైన జనుల ఆనందం కొరకు, యోగసిద్ధికొరకు, తత్వ రహస్య ములు, యోగములు అఖండమైన వర్ణయుక్తమగు మహామంత్రవాద విశేషంబులును, కల్పవృక్షములుగల వనమును బోలియున్న సనారీ విశ్వేశ్వర సంవాదంబను మహా వేదాంత ప్రబంధమునందు సప్తమాశ్వాసము సంపూర్ణము.

153. ఎ) జపముచేయు స్థానగురుతెరుగవలెనన్నా!గురుతెరిగి అచట జపము చేసిన అంబ ఫలమిచ్చునన్నా ఫలమందిన వాడు పరమ గురుడన్నా!

153. బి) స్వామివారు వ్రాసిన కూర్మాసన శ్లోకంయొక్క అర్థము. బ్రహ్మజ్ఞానాసక్తి గల బుద్ధిమంతుడగు సాధకుడు యిడాపింగళ నాడులయొక్క స్వరసంబంధ సాధనకు పూర్వమే సూర్యచంద్రనాడులను ఫలింపజేసే విధంగా ప్రసన్నం చేసుకొనుటకు కూర్మాసనంపై తనకు అర్పణమగు స్థానం అదే శిరస్సుగా భావించి అచట శిరస్సు నుంచి కూర్చుని, ఏమి సాధించాలను కున్నాడో ఆ దిశగాచూస్తూ అక్షరలక్షలు జపించిన ఆ ఫలితాన్నీ పొందగలరు. (అనగా కూర్మంలో తన అక్షరమున్న స్థానము సాధకుని అర్పణస్థాన మగును.)

**గమనిక :** సాధకునకు ఏ మంత్రం అర్పణమగునో గ్రహించి కూర్మాసనముపై తనకు అర్పణ స్థానంలో పద్మాసనాసీనుడై కూర్చుని మంత్ర అక్షర లక్షలు జపించి జపసిద్ధిని పొందగలరు.

**వివరణ:-** యిందలి అక్షరసిద్ధిని పొందగోరువారు "అ" అక్షరస్థానము ఏ చక్రపద్మదళ మందుగలదోగుర్తెరిగి, అచట దృష్టి నుంచి అక్షరలక్షజపము చేసి సిద్ధి పొందిన ఆకామ్యములు సాధకుని వశమగును. (అతనికోరికలు సిద్ధించును)

**సూచన:** ఈ సిద్ధులను పొందగోరువారు అనుభవజ్ఞుల ద్వారా, యింకా విపులంగా విషయాన్ని గ్రహించి వారి పర్యవేక్షణలో సాధన చేసిన సత్ ఫలితములను సులువుగా పొందగలరు.

# శ్రీ సనారీ విశ్వేశ్వర సంవాదంబు నందు సప్తమాశ్వాసము ప్రారంభము

1. **పార్వతి ప్రశ్న:-** శ్రీకరమగు సంపదలను సిద్ధింపజేయునట్టి మంగళకరమగు రసామృతమువంటి "ఓ దేవా", నిన్ను సర్వకాల సర్వావస్థలందు సేవించెదను. రసవాద విద్యకు ఆధారమైన మొక్కలు, లతలు, మూలికలు ఏమిటి, అవి ఏ విధంగా పనులు చేయునో మరియు ఏమేమి ఫలితములు కలిగించునో, వాటియందు ఎన్ని బేధములు కలవో చెప్పునాధా అత్యంత ప్రియముగా వినదలచితిని.

2. **ఈశ్వరఉవాచ:-** కొబ్బరి కల్లునుంచి తీసిన ఉప్పుతో హరి తాళము, శంఖ పాషాణము నుండి తీసిన ఉప్పుతో సవీరము, శుద్ధముగా భస్మములు కాగలవు. మూడు లోకముల నుండి (స్థూల,సూక్ష్మ, కారణదేహములనుండి) విముక్తులు కాదలచిన వారు "జిజ్ఞాసులు" చేయువాదము ఇదే దేవీ।

3. చిత్రమూలము, నల్లని గంధకములతో పాదరసంలోని దోషాలు తొలగి శుద్ధి అవును. అలాగే తెల్లపువ్వుగల ఉత్తరేణి దివ్యమైనది.

4. పెద్ద ఈతతో "తుత్తము" శుద్ధి చేయుము, అడవిపంది చమురు ఉపయోగించకుమా। అర్ధంకాని విషయములను బాగా ఆలోచించి విచారించి అర్ధంచేసుకొని చేయాలి, తుత్తము రాగినుండి తీసినది కాకుండా సస్యమును వాడుము.

5.కానుగరసము, చినపేలుడు, తెల్లచెట్టురసములతో తాళకమును, కుందేటిరక్తముతో ఇనుమును శుద్ధి చేసి, భస్మము చేసి అదే ధనమని తలంచుము నిజందేవీ।

6.శుద్ధి చేసిన పాదరసమును, తమలపాకు, యిర్రిపాలరసంతో, అప్పుడే ప్రసవించిన ఆవు మూత్రంతో శుద్ధిచేసిన తాళకము, తెల్లగురువింద గింజరసము, చాలా మంచి పనిచేయును, దేహానికి ముసలితనమును రానీయదు.

7. కూతురుబుడగ, పెద్దఏలిక దొరికిన వాటి ద్వారా ధాతువులు( లోహములు) శుద్ధి చేసి భస్మములు చేయు విధానము గ్రహించుము. మరియూ రాజ ఉశిరి సహదేవి మొక్కలు తెల్లని ఈతరసము తెచ్చి చేసిన లోహములు వశమగును. ఎక్కడ "గురువు" దేహము, లోకము, శాస్త్రములనెడు వాసన త్రయమందున్నాడు. "అంటే" గురువును ఈ వాసనా త్రయముద్వారా తెలుసుకోదగినవాడా?

8. ఎర్ర ఉత్తరేణి, దుంపరాష్ట్రము, ములుదోట, వీటితో శుద్ధిచేసి సత్తుభస్మము చేయదగును, అంతేగాకుండా తెల్లబోడతరము, తెల్లవాకుడు, పిట్టకాలు, వలన "రాగిసున్నము" పెద్దపరుసం.





9.కిట్టెలి (యినుపతుప్పు) నాగజెముడుతో కట్టును, మొండి వుల్లితో ఇంగిలీకము, వాము, మిరియాలుతో శుద్ధరసము కట్టును. రావిచెట్టుతో వంగము, పిట్టకాలుతో బంగారము, వెండి భస్మములగును, వీటితో లోహములు ఎంత లొంగునంటే "తప్పు చేసినవాడు తిట్లు భరించినట్లుగా" వీటిలో పిట్టకాలు రాగిపరుశం.

10. విష్ణు క్రాంతవేరు, తెల్లశివక్రాంత కలిపి రాగికి కవచముగా చేసిపుటము వేసిన రాగి భస్మమగును. అలాగే పుట్ట పొదరతో వెండి, నేపాళము రావి చెట్టుతో సీసము, వంగములు భస్మమగును.

11. అంతేగాక యింకా యోగ్యమైనవి ఏవంటే, వెలక్కాయ, పచ్చని సున్నము, జిల్లేడు పాలు, రసము, ఆకులు, రాక్షసనీరు, నేరేడు, వేపకాయలు, బెరడు, ఆకులు, పూలు, రసము, గంజాయి, మోదుగ చిగురు, ఉప్పు మరియు యోగియొక్క అంగటి బిందువు మయూరశిఖి.

12. కోడి ముల్లంగి, ముల్లంగి దుంప, గుంటకలగర, తెల్ల గురువింద, లేత మేక మాంసరసము, పుట్టకొక్కు, నాగనేత్రి, కారు మినుము, నల్లేరు కారుశంబ.

13. తెల్లనిఉప్పులు, సరిపడు లవంగము, నల్ల ఉమ్మెత్తలతో వంగమును కవచము చేసిపుటము వేసిన, తెల్లని భస్మము అయిన దృఢమైన మందు అదిసుమా"

14. ఆ, బిడలవణమునకు సత్తు, మరియు, సాంబ్రాణి దృతికి రసము, ఎర్రతేలు యర్రకంద మరియు, ఎర్రటికలబందలతో ముద్దతాళకమును భస్మము చేయును ఏడి "గురువు" ఎటువంటి ఆలోచనలు లేని మునులకు చదువు చెప్పుతూ ముచ్చటిస్తున్నాడు. "గురువు" మునీశ్వరుడా!

15. వినుమో పార్వతీ! నింబ, వృశ్చిక, వసా, యింతాలము, యిర్రిపాల భూతమాల, పందితివ్వ, కూతురు బుడము, ములుదోస, సాంబ్రాణి దృతి, పెద్దయేలిక, త్రిధారాద్వయ, కాకరి, పుట్ట పొదర, కారుమినుము, కారుశంబ, కానుగ, భూతమాల వర్రపొన్నగంటి, వాడి వడిశ, దేవకుసుమ, కవిర, సున్నం, ఖర్జూర, రెండు తలల పాము, కారు బచ్చలి, కోడిముల్లంగి, ఎర్రగుంటకలగర, చిట్టి నారకమ్మ, రుదంతులు, వీటితో "పాషాణములు", మయూరశిఖి, గంధకం, శిద్ధపంచకాదులతో శుద్ధ "రసంబు" ములు నిర్రగన్నె, మెంతె, గంధకం, నవాసారము- పుట్టకొక్కు, తెల్లగరిక, కణపు ఉత్తరేణి-ములుదోట- ముద్ద బెండ- పిట్టకాలు- శిద్ధ పంచకాదులతో "రాగియును" పుట్ట పొదర - అడవినీలి- మాక్షికం - సిద్ధపంచకాదులతో "వెండి", శిర్రి వుత్తరేణి, ములుదోట, దుంపరాష్ట్రములతో 'సత్తుయును' వెలిమిడి పూతిక, పురుషరత్నం "నాగమును" యూషాణము, తంగేడు, గోరింత, రావి, వాము, గంజాయి, మామిడి, నేపాళములతో "వంగమును". వెలగ-

జిల్లేడు-పసగడుగు- సున్నము, పసుపు, అరటి, వీటితో 'పాషాణములు' సుగంధకం- నాగజెముడు- జిల్లేడు- పెద్ద మందు, వీటితో 'ఇంగిలీకము', పసిరికపాము- ఖర్జూరము, ములగ జిల్లేడు, బ్రహ్మదండి వీటితో మయలతుత్తము, గజరీపటిక, సురేకారము, బోడతరము- కర్పూరవల్లీ, గోరింత, బ్రహ్మదండి, నేలవేము, జిల్లేడు, యింతాలము, నారికేళము- తాలము- జీలుగు- వనితాగోమయం - కిట్టలినారమంబులు, వీటితో "తాళకము" తెల్లకారామిద, నేరేడు- ఇంగిలీకము- శిద్ధపంచకములతో 'యినుము' ఈ చెప్పబడ్డ మూలికలతో పాషాణములు, లోహములు శుద్ధముగా భస్మములు అవుతాయి, కాకపోతే చేసే విధానము, పుటములు వేసే విధానములు చక్కగా తెలుసుకుని చేయాలి, అంతేగాదు ఇక్కడ చెప్పబడ్డ వాటిలో ఎక్కడో సువర్ణపర్వతమను "మహా మేరువును" వెండి పర్వతమను "కైలాసమును" సాధించు విద్యలు కలవు. ఓ పార్వతీ అవి నీకు తెలుసును. వీటిని కల్మషమేధస్సులు, ధనకాంక్ష గలవారు గుర్తించలేరు. మహామేరువు అనబడే సుమేరువును (సహస్రారాన్ని) అధిరోహించి దేహమును పదహారణాల వన్నె గల 100% అపరంజివంటి దేహముగల యోగులమేధస్సుకు మాత్రమే తెలియబడును. ఇట్టి దేహమునే సిద్దులు మస్తానులు "షరుమాయని" దేవతలు "పరుశము" అని చెప్పుచున్నారు. యిందు నీకు తెలియని వేమున్నవి. అన్నీ నీవెరిగినవే ఎక్కడ "గురువు" అంగటిలో (బజారులో) ఆడుచున్నాడు "గురువు" నాణ్యమా (అంటే లోహములు, పాషాణములు, మూలికలు, రసము ఇత్యాదిసరుకులనాణ్యత)

16. దేవీ వినుము నల్లని గంధకతైలము, ధాతువులను భేదించును. మరియుకొక్కు పాషాణము కూడా అలాగు పని చేయును. అనుమానములేదు.

17. యిదిగాక సిద్ధ పంచకాదులతో సమస్థకుష్టులు, రాచపుండులు, పాండురోగాలు, మొదలగు సమస్త మొండివ్యాధులు, సర్వవిషంబులు హరించటమేగాక సమస్త పాషాణములు, లోహములు గురుభస్మంబులవుతాయని తెలుసుకో, ఏడి "గురువు" కరమలవాడా! (అంటే పాషాణములు, లోహములు ఎంత వేడిలో ఎలాంటి పుటములు వేయాలో తెలియబడుట)

18. దేవీ సిద్ధులైనవారు ప్రాంతీయ బేధములను బట్టి వారిలో వారే వీటిని అనేక పేర్లతో యిందలి రహస్యాలను దాచి ఉంచారు.వారు కొంచెమైనా తెలుపరు ఎంతటి వారికైనా సరే

19. వినుము "రుదంతికంద"యనగా నరులదేహమందలిలో జిహ్వా నాగలోచమను కంద తేలుకొండి, సవ్యముగావశబడిన గంధకము "క్రోడకంద" అని, అడవి ఈత "తైలకంద" అని, మారేడుకాయ "సుకందయని", ఈ విధంగా ఐదుకందలున్నవని ఎరుంగుము.





20. వినుమోపార్వతీ ఉప్పును ఘనమైనసున్నముగా చేయగలిగిన అడవి ఎందుకు యోగివరులకు, లోహములు చెప్పినట్లు వినిన అంతాధనమేనని ఎరుంగుము.

21. పార్వతీ "బ్రహ్మరాక్షసి" అనుమూలిక, మిరపాకులాగా ఉంటుంది. దానిని చూచినంతనే మానవుల దేహము నావహించిన భూతములు పారిపోవును. దేహములు సౌక్యములు పొందితేజస్సు కలుగును. ఆ ఆకుగాలి లేకపోయినా ఊగుతూ ఉంటుంది అడవిలో.

22. మరియూ "పిండక్కరువు" అనుమొక్క పేరు తలచినంత మాత్రము చేతనే పిశాచ గణాములు పరిగెత్తిపారిపోవును. దాని శక్తిముందు హరి హరబ్రహ్మాదులైనా సరిపోరు. అంత శక్తివంతమైనదది.

23. ఇవియునుంగాక గాడిదగడపయొక్క స్థానభేదంబు వయస్సుతెలిసి ఉపయోగించిన బలవంతముగా చనిపోయిన వారిపాలిట సంజీవినిగా పనిచేయును. అలాగే వెదురు బొంగు చెట్టుకు పుట్టిన బదనికలు కూడా "సంజీవీకరణి" అవును. మరియూ కశివింద యెక్క స్థానబేధము వయసు తెలిసి ఉపయోగించినవిరిగిన ఎముకలు అతుక్కొనును. మరియు సత్తుపొత్తును- నిద్రగన్నేరు-యర్ర ఉత్తరేణి "సాధనకరణులు" మరియూ బ్రమలమర్రి సంమోహనకరణిగా పనిచేయును. అలాగే అడవి పంది రోమములు, బొంగిలి సంశయకరణిగా పనిచేయును, యిర్రిపాల, ఈశ్వరీ, గొడ్డుకాకరి, భూనాగము (ఎర్రలు) అదృశ్యమగుటకు, నిద్రగన్నేరు ఆవాహన చేయుటకు, "నల్లవావిల" ముసలితనము పోగొట్టుటకు, త్రిధారాద్వయము, యింతాలము, ఎర్రచిత్రమూలము, పిట్టపాదములు బంగారము చేయుటకు అలాగే "విద్య", కీర్తి పెరుగుటకు, "ధనము" భోగములను భవించుటకు, "యోగసాధన" మహత్తులు పొందుటకు, "దానము చేయుట" కోరుకున్నది పొందుటకొరకు, "అభిమానముండిన చలింపచేయుట కొరకు, "లోభి తనము" పాపము పొందుటకు, "వివాహము"సంతానము కొరకు, "సంపద" కష్టములు కలుగుట కొరకు, "గురుసేవ" -సాధనా పద్ధతులు తెలియుటకొరకు, "జ్ఞానము" మోక్షము పొందుట కొరకు అని తెలియుము పార్వతీ।

24. యిందు చెప్పబడిన మోక్షము పొందుటకు ఏమందూ లేదు. సద్గురుల యొక్క కరుణా కటాక్షములతో శిష్యుని మన్నించిన బ్రహ్మజ్ఞానము సిద్ధించును అది సూది మొనమోపసందు లేకుండా జగత్తునంతా నిండియున్నది దేవీ।

## -: సేవకుల లక్షణము:-

1. దేవీ కారణగురువులు అగ్ని వంటివారు వారిని ప్రసన్నంచేసుకొనుటకు, నరనాయకులైనా(రాజులు) అమరనాధుడైనా (దేవేంద్రుడు) హరిహర బ్రహ్మాదులనైనా కరుణించరు. కనుక వారిని సేవించి ప్రసన్నంచేసుకొను విధానము తెలియవలెను.

2. భూమి యందు సంచరించు మొత్తం సర్పజాతి విషముకన్నా అత్యంత బలమైనవారు, దుర్గతులను తొలగ చేయగల "దుర్గా" సాధనాయుక్తమగు జ్ఞాన దృష్టికలవారు, సమస్తాన్నీ నశింపచేయగలఫాలనేత్రముగలవారు, ప్రళయకాలమున విఱ్రవీగునటువంటి భైరవ శక్తులను వశపరుచుకున్నవారు మృత్యువును మొదలు "అగ్ని" విషముల యొక్క శక్తిని నియంత్రించుసమర్ధులు, ఆత్మను అంటి పెట్టుకొని దేహజీవసంబంధమైన భ్రాంతులను దరిచేరనీయరు. పిల్లలు, హితులు, కామినీ స్త్రీ సౌందర్యములను ఏమాత్రం లక్ష్యపెట్టక సంచరించెదరు. యివన్నీ తత్వశోధనయందు మక్కువతో నున్న వారి నిర్ణయాలు .వారు నిర్ధయులు సుమా.

3.మనసు ఎటు మళ్ళితే పూర్తిఎరుకతో ఆవంకనే సంచరిస్తుంటారు. ఎవరికీ ఎలాంటి సేవలుచేసే అవకాశాన్నివ్వరు. సేవకులసేవలందు లక్ష్యముపెట్టరు రాత్రి ఐనా పగలైనా సరే.

4. కానీ వారి దృష్టిలోపాత్రులైనవారిని చేరదీసి తగుసమయమందు భావమును తెలియజేసి బ్రహ్మవిద్యావిశేష గురుతులను తెలియజేస్తారు, "ఎలాగంటే" యినుముచేరిన పరుసువేదిలాగా పత్నీ. (యినుముకు పరశువేదితగలగానే బంగారమైనట్లుగా)

5. పార్వతీయిలా చెప్పిన ప్రకారముగానున్న సద్గురువుల యొక్క సేవదొరికిన శిష్యులు ఎట్టికార్యములనైనా ఏలోకమందైనా, ఎలాంటి లోపములేకుండా సంపూర్ణవ్యక్తులై సాధించెదరు. అలాంటి గురుబిడ్డలు కాలాగ్నిరుద్రులవలే సంచరిస్తుంటారని తెలియుము.

6. పరిశుద్ధమైన అవయములు కలిగి దేహసౌఖ్యముతో, సమస్త పాపములు సందర్భోచితంగా నశింపచేయు అద్భుతమైన శక్తితో అనేక మహిమలు కలిగియుందురు.

7. వంటింట్లో, నట్టింట్లో, కంసాలి వానియింట్లో, పెరటిలో, మట్టిపని చేయువానితోటలో, బజారులో దొరికే వస్తువులతో బంగారం అవుతుంది.

8. రాచఉశిరి, పిట్ట అడుగు, సీతావేరు, వీటితో పాదరసంకట్టు విధానము తెలియుము. అది సిద్ధించిన తరువాత దానిని దేనికోసం ఉపయోగిస్తారంటే ఆ చిత్త శుద్ధే మనకు వెండి కొండ వశముకావటానికి కారణము. (వెండి తయారగుటకు)

9. పనస, రావిచెట్టు, ఘనమైనమర్రిపాలు, ఈ చెట్లయొక్క పాలను అయస్కాంతముకిట్లో పోసివండిన, సమస్తపాషాణములు, ధాతువులు, రసము, ధనమని తెలుసుకొనుము.

10. ఆయుధములు పట్టుకొని అగ్రస్థానమున నిలిచి ఉన్న వాని దేహమందు తలకాయ ఒకటి। పిల్లవారిని సైతమూ ఆనందింపజేయు శబ్దమురెండవది। పసుపొన్న మూడు। వాలంబు(తోక) చేవాటముగాపీడించుటనాలుగు । కాలము యొక్క ఛాయఐదు। ఆజ్ఞేయమందున్న ఆ భూమి పతి ఆరు। అన్నంబు చేయించునది ఏడు। ఇవి ఏమిటో





తెలుసుకుంటే నిజముగాకారణా చార్యుల పాదములకు సేవచేయు భాగ్యము కలుగును. అబద్ధము కాదు నమ్ముము, ఈ ప్రపంచమును నమ్మకు, విశ్వగురునాధుడు శింహాద్రి విశ్వనాధుడు.

11. ఓ పార్వతీ భూమి సర్వసంపదలకు నిలయమై ఉన్నది. వాటిని సాధించవలెనన్న ఇంతకు ముందు చెప్పిన ఏడు వాక్యములను అవగాహనచేసుకుని ఆ ఏడుగురు మాదిగులు (అంటు బడకూడని గుణములు) పట్టికుత్తుకలు( మనస్సున అంటబడకయుండుట) కోసిన తావున పచ్చబండ। (పరిశుద్ధమైన దేహము) న ఉన్నాడు "గురుడు" గురువుకసాయి వాడా?

(అంటే నిర్ధాక్షిణ్యంగా శిష్యులను పట్టించుకోకుండా ఉండువాడు కాదు గురువు కరుణామయుడు. పాత్రత కలిగిన వారి పట్ల

12. 1.మిట్టమీద 2.తెట్టతెన్ను 3. గుట్టు లేదు 4. పట్టుకొమ్ము 5. వెంటనుండు 6. నిండుకుండ 7. వడ్లు పొల్లు 8. తన్బెరాశి 9. చూడు పార్వతీ ఒకవంతుకు పదహారు వంతుల ఫలముకలుగును, యిదినీ సహాయముగలవారికి సిద్ధించునని తెలియుము.

1. మిట్టమీద = కొండమీద (సుమేరుపర్వతం)
2. తెట్టతెన్ను = నట్టనడివీధిలో (సుషుమ్న)
3. బట్టబయట = ఏమీలేని ప్రదేశము (బ్రహ్మమందు)
4. గుట్టమీద = ఎత్తుపల్లములు లేనిమెరక
(శరీరపైభాగమందు దృష్టినిలిపి)
5. పట్టుకొమ్ము = అచటలీనమై పట్టుకుని
6. వెంటనుండు = దానివద్దనే స్థిరంగా వుండి
7. నిండుకుండ = పూర్ణపాత్ర (శరీరంలో నిండుగా గాలినుంచి)
8. వడ్లు పొల్లు = వరిబీజము (సాధనాక్షర బీజము)
9. తన్బెరాశి = రాశియందు(కాల విశేషమున)

అర్ధము:- సుషుమ్నానాడియందు సువర్ణపర్వతమనెడు "సుమేరువును" అచంచలధైర్యముతో చలింపక పట్టి అందు స్థిరత్వంచెంది బ్రహ్మతత్వమును పొంది, పరిపక్వమైన చిత్తమునందు అక్షరపరబ్రహ్మమును కాల విశేషమును గ్రహించి ఉపాశించవలెను.

## -: పారదబంధము :-

13. స్వామివారు యిక్కడ ముస్లిం సోదరులైన మస్తానులు, సిద్ధుల కొరక ఉర్ధూ భాషలో రచించినారుగమనించగలరు దీని అర్ధము తెలుగులో ఇచ్చినమంత్రభావమే.

14. ఓంహేమాహేమస్వరూపా హేమకారకా- మమధాతుం - హేమరూపంకురు - కురు - సువర్ణన విద్యా విశేషాయ సనారీ విశ్వేశ్వరాయస్వా॥

15. ఓంసనాతనాయ-మయస్వరూపాయ- మమపారద స్వచ్ఛవేదాయ సనారీ విశ్వేశ్వరాయస్వా॥ (పాదరసమును స్వచ్ఛముగా వేదించి బంగారముగా మార్చు మంత్రము)వీటిని అక్షరలక్షలు జపించి సిద్ధించుకోగలరు.

16. పార్వతీ ప్రతీ మంత్రమును యోగి యైవాక్సిద్ధియు కలిగిక్రమముగా చందోబద్ధముగా మరల మరల గురు ఉపదేశానుసారంగా అష్టోత్తరము మాదిరిగా జపము చేసి వేదము సాధించవలయును.

17. వేపచెట్టుపూలు, ఆకులు, కాయల రసముతో తాళకము, ఇంగిలీకము, సవీరములు కొంచెం కూడా తేడారాకుండా పుటము వేసిన కర్పూరమందు సింధూరము అగును.

18. కలబంద, అంతర్ తామర వలనశిలాజిత్తు వెలక్కాయతో కట్టిన నవపాషాణముల। దృతితో పాదరసము। రాగి, నిమ్మకాయతో అన్న భేది భస్మములు అవును.

19. వంగము కలిసిన తాళకము - ఇంగిలీకము కలసిన ఇనుము - సీసము కలిసిన బంగారము - మణిశిలకలిసిన సీసము - మాక్షికంకలిసిన వెండిపాదవును. కనుకదీనికి సహాయము పురుషరత్నమువాడి శుద్ధి చేసుకోవలయును.

20. సీసముచేతగరము - సత్తునుదుష్ట చెట్టుతో - తుత్థమును అరటిఆకు నల్లేరు ఆకుతో భస్మములు అవుటనిజము. పూర్ణముగా అనువుసుమా।

21. పందికందచే ఇప్పుడు చెప్పినవన్నీ పూర్ణముగా భస్మములు అగునని తెలియుము.

22. ఎర్రదుంపరాష్ట్రము, ఎర్రమెంతి, ఎర్రకొత్తిమీర, ఎర్రఉత్తరేణిలతో పుటమువేసిన, మేలిమి బంగారము, రాగి, సత్తు, భస్మములుకాగలవు చింతించకుము.

23. నేపాళమును ముద్దచేసిదాని యందు శుద్ధి చేసిన తగరమును ఉంచి, ఒక డిబ్బీ లో పెట్టి దానినిండా జీడిమామిడి తునకలు అమర్చివేడి తట్టుకునే విధంగా ఈసుదు గుడ్డతో డిబ్బీకి చుట్టి సీలమన్నుగావించి, పుటము వేసిన అదిలోపములేక భస్మమగును. పుటమువేసిన రోజు తీయకుండా మరుచటిరోజు తీసిచూచిన భస్మము అగును, ఆ భస్మము తెల్లగానుండవలెను.





24. తొమ్మిది ఉప్పులతో వరుసగా ఒక్కొక్క ఉప్పుతో, ఏదైనా ఒక పాషాణానికి కవచము చేసి, ఆపైన సున్నముతో కవచము చేసి చక్కని పిడతనందుంచి సీలువేసి, పుటము వేసిన భస్మమగును. ఆ తర్వాత ఆభస్మమును తగరము, రాగి మీద ప్రయోగించిన తెల్లని భస్మమగును.

25. వస, యింతాలము, పిట్టపాదము, శుద్ధి చేసిన గంధకము, సమ భాగములు తీసుకుని సరిపడు రాగిని దానియందు ఉంచి, రాత్రియందు పుటము వేసిన రాగి సున్నము కాగలదు (వసువు) సర్వసంపదలనొసగు సాధనమయిది.

26. ఓపార్వతీ! దీనినే, రుదంతికంద అంటారు, ఈ భస్మాన్నే పరుశం అని "షరుమాయ" అని మస్థానులు, అవధూతలు, శిద్ధులు వాడుకుంటున్నారు.

27. ఈ విధంగానే మయలతుత్తము - తాళకము. గోదన్తి - కొక్కుపాషాణము - సవీరములు. గురుభస్మములు అవునని తెలుసుకో!

### పెట్లుప్పు యోగము

28. ఉప్పును చేయు క్రమము చెబుతాను. దీనిని జ్ఞానులందరూ చేసి ఉపాధికొరకు చక్కగా సిద్ధించుకున్నారు, దానిని చేసే విధానము అది దేనికి ఉపయోగపడేదీ వివరంగా చెబుతాను వినుము.

29. 7ఫలముల (తూకము) పెట్లుప్పును ఇనుపమూకిటిలో పోసి, పసిపిల్ల యొక్క మూత్రమును పెట్లుప్పునందుపోసి, నిరారగావండవలెను. ఆ తర్వాత ఆ ఉప్పుయాశకు. ఏడుఫలముల చొప్పున మామూలు ఉప్పును బాగాకలసిపోయేలాగా కలిపి, రెండు రోజులు బాగా ఎండ బెట్టవలయును, ఆ తర్వాత 50 పిడకలయందు దానిని చక్కగా కాల్చవలెను, ఆ తరువాత మరల పసిపిల్ల మూత్రంతో బాగా నూరి వడియాలవలే చేసివారం రోజులు ఎండబెట్టవలెను. ఆ తర్వాత 16 పిడకలతో పదిసార్లు పుటము వేయవలెను, ఆ తర్వాత నల్లగానున్న ఆ ఉప్పును తీసుకుని 2 1/2 ఫలములహారతి కర్పూరము నందు నేర్పుతోకండబట్టగచేయవలెను. మరల పసిపిల్ల మూత్రమును పోసివారంరోజులు ఎండబెట్టవలెను. తర్వాత రోజున దానిని బాగా పిశికి గాజు కుండనందు దానిని బాగా గదియించి పెట్టవలెను. పైన కొద్దిగా కాళీ ఉంచవలెను, మూతవేసి దానిని భూమిలోపల 40 రోజులు పాతి పెట్టవలయును. (దానిలోసారము పుట్టిమందులాగా తయారగుటకు) ఆ తరువాత నిష్టతో ఆ ప్రదేశమున పూజాకార్య క్రమములు చేయవలెను. 40 రోజులు గడిచిన పిదప భూమినుండి తీసిమరల నీరు యిగురునట్లుగా ఎండబెట్టవలయును. తరువాత మరల గాజు కుండలో కొంచెం ఖాళీ ఉండేటట్లు మందును భాగామెదిపి, దానిపైన మూతవేసి శీలువేసి దీపము

అంతమంటయందు 3 గంటలు వంట చేయవలెను. తరువాత మరల కమలము అంతమంటయందు 3 గంటలు వంట చేయవలెను. ఆ తరువాత గాజు కుండ మొత్తం ఆవరించునంత మంటతో 3 గంటలు వంట చేయవలెను. ఇలా మూడు సార్లయినపిదప దానిని తీసిదానిలో మరల పసిబాలమూత్రము కలిపి ఎండించి, మూసతో మెదిపి శీలువేసి పుటము వేయవలెను. తర్వాత పుటమునుండి తీసిమూత్రంలో కలిపి ఎండించి మూసలో మెదిపి శీలువేసి పుటము వేయవలెను. మరల తీసి మూత్రము పోసి ఎండించి మూసలో మెదిపి శీలు చేసి పుటమువేయవలెను. యిలా మూడుసార్లు అయిన పిదప ఆ మందు తెల్లగా ఉండాలి. ఆ తర్వాత ఆ మందుకొంతలో సాధకుని వీర్యమును కలిపి పిడచకట్టించవలెను. పుష్యమాఘమాసములయందుండు మంచు నందు పిడచకట్టిన మందు గాజుపాత్రలో ఉంచి మంచు ప్రదేశములో వారంరోజులు ఉంచాలి. తరువాత దానిలో జయనీరు పుట్టును. ఆ జయనీరును తీసి గాజుసీసాలో పోసి ఎండలో వారంరోజులుంచాలి, తరువాత ఆ నీటిలో మందు కలిపి ఏమరుపాటు లేకుండా 10 రోజులు ఎండించవలెను. ఆ తరువాత పిడతలో పెట్టి శీలు చేసి భూమిలోపాతి 5 పిడకలతో పుటము వేసిన సాధన పూర్తి అయ్యిసున్నము తయారవును.

38. పార్వతీ పెట్లుప్పు అంటే మాఘపాల్గుణమాసములలో చౌడు నేలలందుగానీ, చౌడుయింటినిగానీ తెల్లగాసురాకారమువలే, దూదిలాగా పుట్టును దానినే పెట్లుప్పు అందురు. మరియు ఈ యోగమునందు చెప్పబడ్డ దీప, కమల, గాఢాగ్నుల కొరకు కొబ్బరి ఆకులను మంటకి ఉపయోగించవలెను. ఈ ఉప్పు సున్నము సిద్ధించిన పుణ్యాత్ములకు త్రిలోక ములు వశమగును. ఎలాగంటే సిద్ధపంచకాదులవలే కాయముసిద్ది పొందిసమస్త లోహములు మనోహరముగారంగులు భేదించి సువర్ణమయమగునని తెలియుము.

39. గురుతత్వమునకు గురుతు తెలుసుకో పరబ్రహ్మజ్ఞానముతో కూడి సమస్తమూ అధ్భుతముగా తానే అవును. ఏమాయాలేదు, వారి మాటయందుగానీ నడవడికల యందుగానీ దేహముతోనున్నా ఏమీ అంటనిదేహము వారిది.

40. ఓ పార్వతీ ! ఈ విషయములన్నీ స్వచ్ఛమైన పరిశుద్ధమనస్సు గలిగినయింగిత జ్ఞానులు చదివినా వ్రాసినా వారికి యిందుగల సాధనా భావములు అన్నీ తెలుసుకుని వాటిని చేసి సిద్ధింపజేసుకుని సర్వసుఖ సంపదలతో భోగములను భవించెదరు. అంతేకాక జ్ఞానము గల మహానుభావులై బ్రహ్మపధమగు మోక్షమును పొందుదురు.

41. మాలినీ:- మునులను, దేవతలను, నరులను, రాక్షసులను, సర్వులను సమదృష్టితో వృద్ధిబొందించు వాడా। భూమియందుగల మూలికలకు, గనులకు , మూలమై విశ్వమునకు రక్షకుడైన వాడా। శిరిసంపదలు, సమస్తవరములు ప్రసాదించుశక్తిగలవాడా!





పంచభూతాదులచే సేవింపబడువాడా! దేవబ్రాహ్మణకులమునకు గురుమూర్తిస్వరూపా! “శుద్ధపరబ్రహ్మస్వరూపమా” నీ కిదే మా సాష్టాంగ దండ ప్రమాణము.

42. ఇది సమస్త శుభములు, మంగళములను జయించవలెనన్న కోరికగలిగిన వారి కొరకు జ్ఞానయుక్తమగు కవిత్వముతో అనంతమగు విద్యాసుగుణములుగల గణములకు మణి వలే ప్రకాశింపజేసి అధికారగణముల అర్చనలతో తత్వముల విశేషములు ప్రసాదింపచేయు సనారీ విశ్వేశ్వర సంవాదంబునందు “గురుసేవ” చేయువిధము, ఔషధీ స్వభావము, భస్మక్రమము, వాదవిద్యా విశేషము, సిద్ధజయమగు ఉప్పుయోగంబు అను అయిదు కథలతో కూడినదై పాలకడలి చిలికినప్పుడు సంభవించిన అమృత భాండమును చేత ధరించిన మోహినివలే ఎదురు చూస్తూ, సత్ పాత్రతో ఔదార్యము, దానబుద్ధిగల మంచి జ్ఞానికొరకు ఎదురుచూస్తూ ఉన్నది ఈ గ్రంధము (అట్టి వారికి మాత్రమే యివి సిద్ధించును.) **సప్తమాశ్వాసము సమాప్తము.**

## కూర్మాసనం



## అష్టమాశ్వాసము - కాలజ్ఞానము

1. **పార్వతీ ప్రశ్న :-** కీర్తిగలిగి శుభములు కల్గించువాడవు, అణిమాద్యష్ట సిద్ధులను పొంది ప్రకాశించుచూ, లేశమాత్రమైననూ మాయకుచిక్కనివిశ్వేశా, మీసేవాభాగ్యముచే మహాదోషములు సైతమూ తొలిగిపోయి, సంతోషంతో ఉంటూ షట్చక్రములందలి బ్రహ్మాది దేవతా నివాసములలో, సంచరించుచున్నాము మాకు ఎటువంటి ఆటంకములూ ఎచటా లేవు. షట్చక్రములందూలేవు.

2. స్వామీ జగద్గురు వరప్రసాదుడవై ఉద్భవించి, త్రినేత్రములందు సూర్య, చంద్ర, అగ్నులతో సాక్షాత్కరించుచూ చెక్కు చెదరనికీర్తి ప్రతిష్టలు గల్గునట్లు, భవిష్యత్ కాల జ్ఞానమును సాక్ష్యంగా చెప్పండి.

3. **ఈశ్వర ఉవాచ:-** పార్వతీవినుము, కలియుగమందు వైవస్వతమనువు వలన జన్మించిన మానవకులములు, గొప్పమృగములు, పక్షులు, వృక్షములు, పర్వతజాతులు, భూమిపై నున్న యివన్నీ

4. మరియు విశ్వబ్రహ్మకులము వారగు పంచవృత్తుల పంచాననులు, మొత్తం దేవతలందరునూ,

5. బలమును కోల్పోయి నిస్సారములవుతారు, వారి సమూహములన్నియూ కళావిహీనమౌతాయి. అలాగే భూతగణములన్నీ సూక్ష్మమవుతాయి. మానవులందరూ వంచకులు, మోసగాళ్ళవుతారు, సత్యమురూపుకైనా కానరాని సంకోచయుగము అగును.

6. మానవులు ఆశామోహములలో చిక్కుకుని ఆనందాన్ని కోల్పోయి, వ్యభిచారం, దొంగబుద్ధి, కుచ్ఛిత మనసులతో నాశనమవుతారు, గురువులు, దేవతలు, శక్తులు, రాజులు, వీరికి ఘోరమగు శిక్షలు విధిస్తారు. 12 రాసులందలి సర్వజనులు గ్రహ దోషములచే, దేశమందంటతా బాధింపబడతారు.

7. గొప్పకులములు నీచకులములందలి స్త్రీలందరూ, కపట స్వభావంతో ఎలాంటి పురుషులతోనైనా సమయంకుదిరితే సంపర్కం పొందుతారు. ఎలాంటి అనుమానమూ లేదు, యింకా సహింపరాని ఆశ్చర్యం కలిగించునట్లు తమకు కల్గిన సంతానముతో మాతాపితురులు క్రీడించుతారు. ఎలాగంటే వావివరసలు తెలియని మృగములవలే, చూడుమా.

8. వివాదములచేత, ఘోరమైనట్టి కార్యములచేత, కల్గిన కారణములచేత, అస్థిరమైన మనస్సుచే కల్గిన పదేపదే హృదయమందలికోర్కెలచేత, అకస్మాత్తుగా వచ్చు





విపరీతరోగములచేత, పంచభూతములైన, గాలి, నీరు నిప్పు, భూమిఆకాశములను ఆరాధించని కారణములచేత, చిక్కులబడిచింతింతురు నరులు, అద్భుతమగు కాల ప్రవాహములోపడి నశిస్తారు ఏమని చెప్పాలో తెలియడం లేదు. దేవీ.

9. చేయకూడనిపనులు చేయాలనేతలంపుతో, కుచ్ఛితస్వభావంతో, స్త్రీలను పొందినరోగముల చేత కొందరు, ఆయుధములచేత యింకొందరు, ఆడినమాట తప్పుట చేత, దేహమందలి గుణములచేత, ఎన్నడు కనివినీఎరుగని వింతశిక్షలను యమలోకంలో చవిచూస్తారు.

10. తాతలు, తండ్రులున్నట్టి ప్రాంతాన్ని వదిలిపొట్టచేత బట్టి అనేక ప్రదేశములు తిరిగి "నోటివిద్యలచే" కొత్తజీవనవిధానములతో సంపూర్ణ సేవాభావంతో సేవలు చేయుచూ, ధనహీనులై, అకాలమృత్యువుపాలగుదురు, ఆడవారికి ఆయువు ఎక్కువై కామాతురతతో, మృగములతో రతిక్రీడ ముచ్చటలు పూర్తి కామవాంఛతో జరుపుకుని శరీరం చాలిస్తారు. యిలాగు అడివిలో ఉన్నా ఊరులో ఉన్నా జనమంతా చనిపోవుట నిజము. ఆకాశమునుండి ఉల్కలు రాలి, పెద్ద పెద్ద కొండరాళ్ళుపడి, పాముకాట్లచేత, దేవతల చేత చనిపోయెదరు దీనజనులు.

11. దక్షిణాయనమున భూమియందు సర్పజాతి శ్రేష్టుడయిన తక్షకవంశములోని వాడు నిలిచి, భువిపై నరులను యింకరక్షింపక యమరాజు వద్దకు యమలోకంపంపు తాడు.

12. ఆసమయంలో కొన్ని ధూమకేతువులు భూమిపై కనబడతాయి, సూర్యచంద్రులు కళలు తప్పుతారు, దేవతలు, మునులు నియమములు తప్పినడుస్తారు. గొప్ప కులస్తులు నిందలపాలవుతారు, ధర్మప్రవర్తనలు లేక నరులందరూ మరణిస్తారు.

13. పర్వతములు భూమిలో దిగబడతాయి, వృక్షములు సహజత్వముకోల్పోయి వికృతంగా తయారవుతాయి, పశువులు, మృగాలు మాట్లాడుతాయి, ఆకాశం నుండి అగ్నివర్షం కురుస్తుంది. అ నృతములును సత్యంకానివి యిలాంటివి చాలా జరిగి విపరీత చావులుంటాయి.

14. చిత్రవిచిత్రసంఘటనలు అనేకము జరుగుతాయి, గొప్పవారు చెడ్డపనుల గురించి ఆలోచిస్తుంటారు, శిల్పి బ్రహ్మసంతతివారు, గొప్పజాతుల్ళవారు వింత ప్రవర్తనల తో ఉంటారు, ప్రతీ యింటవిగ్రహపూజలు వరుసగా చేస్తుంటారు. యితర పూజా పద్ధతులు గ్రహించలేరు ఏమి చిత్రమో? యిది కలిప్రభావమేమో?

15. కొత్తమతములు చాలా పుట్టి జనులను మాయమాటలలో పెట్టి మత మార్పిడులుచేస్తారు, మంత్రవాదులు జనులకు మేలు చేయు పనులు చేయక,

ధనార్జనకోసం, నీచమనస్కులైదుష్టకార్యములాచరించుచూ దుఃఖములపాలై సద్గతులు కానలేక, తుదకు తిరునామములు గల వైష్టవమతములో చేరి, యతులమతమదేయనుచూ ఆ సమూహములతో కలిసి ప్రచారం చేసి, అంత్యమున నరకలోకమున బడి యమభటులు విధించు శిక్షలననుభవించుచూ వారు పెట్టిన తినరాని వస్తువులు తిందురు. యిలా అసత్య ప్రచారములు చేయుట చేత జరుగును.

16. దేవతలు, ఋషులు, భూపాలకులు, కొండగుహల నుండి బయటకు వచ్చిన మునులు, భయమునొందిన నరులను పట్టించుకోరు, రహస్యంగా ఉన్న కాలజ్ఞాన విషయాలను గమనించు ప్రయత్నం కూడా చేయరు. ఆపదకల్గినపుడు అప్రయత్నంగా నైనా గమనించరు వారందరూ.

17. దేవతలిచ్చిన వరాలు ఫలించకపోవడం నిశ్చయము, నదీనదములందిలి నీరు యింకి పోవుట సత్యము, ఆ నీరంతా ఎక్కడికిపోతుందో? అన్ని పుష్పజాతులకు సుగంధ పరిమళములు పోయి సహజత్వాన్నికోల్పోయి పూలచెట్లన్నీ ఎక్కడ దాగిఉంటాయో? ఎండ తాపానికి తట్టుకోలేక చాలా మంది జనులు నశిస్తారు.

18. నీచజాతులవారు గొప్పవారౌతారు, అగ్రజాతులవారు ఆపదలపాలౌతారు, ప్రతీ యింటిలో ఏడ్పులుంటాయి, ఏడుయిళ్ళకు ఒక యిల్లు ఉంటుంది. పతివ్రతలు వ్యభిచారులగుదురు, రాత్రులలో పక్షులు భయంకరంగా కూస్తాయి, ఆకాశము ఎర్రనౌతుంది, మిత్రులకు విరోధములు కల్గుతాయి.

19. ఎనిమిది దిక్కులలోనిజనులుగగ్గోల పెడతారు, ప్రాణమున్నంతవరకూ దిగులు తోనే రోజులు గడుపుతారు, ఏదిక్కులో చూచిన రాక్షసులు, జనులను ఏనుగుకుంభస్తలాన్ని పొడిచిచే అంకుశంతో పొడిచినట్లు పొడిచి బాధిస్తారు.

20. మంచి కులముల గౌరవములు పోతాయి, కొంచెం పుణ్యభూమి ఎక్కడగలదని జనులు వెత్తుక్కుంటా సూర్యుని కాంతిగల ప్రదేశాలకు తరలిపోతారు. సత్కార్యము లాచరించువారికి నివసించు ప్రదేశమే కరువగును.

21. సానగ సనాతన, అభవన, ప్రత్న, సుపర్ణసులు, మొత్తం విశ్వబ్రాహ్మణజాతి చాలాకష్టమగు పనులు చేసుకుంటూ ఒక్కరోజుని, ఒక యుగములాగా గడుపుతారు. వేదపఠనము ఆచార్య వ్యవహారాలు వదలుకుని హీనజీవులై పనికి మాలిన వారై చాలా కష్టంగా రోజులు గడుపుతారు. పంచాననులు.

22. అనేక విధములకట్టడితో నదీనదములలో నీటిని నిలుపుతారు, దేవతలు వాక్సిద్ధి కోల్పోతారు, అన్ని దుష్టభూతములు విచ్చలవిడిగా భూమిపై తిరుగుచూ పుణ్యాత్ములకు కష్టాలు కలిగిస్తాయి. రోగాలు బాగా పెరుగుతాయి. మానవులకు కోపాలు పెరుగుతాయి.





నెలలోని ప్రతీపక్షంలోను అధికమైన మేఘాలు, ఏర్పడి విపరీతమైన వానలు పడి, భూమి అంతా బురదయై వ్యవసాయానికి వీలుకాకుండా నాగళ్ళు దిగబడిపోతాయి.జనుల పాలునీరు ఒకేరకంగా భావిస్తారు. ఆయువులు తగ్గుతాయి. ఆపదలు పెరుగుతాయి. జనుల పాపాలు తగ్గక మానవులు చేష్టలతో అవి పెరుగుతుంటాయి. పనికి మాలిన జ్ఞానం జనులందరిలో ఉంటుంది, మలమూత్రములు తినే మూర్ఖులుగా జనం తయారవు తారు.

23. భూకంపనలచే భూమి పగులును, దానిచే విపరీతంగా జనం మరణిస్తారు, వారికోసం యమకింకరులు భూమిపై ఎక్కువగా తిరుగుతారు, రాత్రివేళ సూర్యుడు కనబడి, నక్షత్రములు కంటికికానరావు, పగలు నక్కలు విపరీతంగా కూస్తాయి, దుష్ట జంతువులు ఎక్కువగా తిరుగుతాయి.

24. మాయలో చిక్కిన నరులు, శరీరసుఖాలను పొందలేరు, అయ్యో వేయి విధములుగానైనా న్యాయాన్ని చేపట్టక అనేకరకములయిన దుష్టకార్యములా చరించి ధర్మాన్ని తప్పుతారుజనులు.

25. పార్వతీ వినుము యిలాంటి గొప్ప వింతలు నాలుగుయుగాంతములందూ జరుగుతుంటాయి. "ఎలాగంటే" కృతయుగనాల్గవపాదమున, త్రేతాయుగమూడవ పాదమున, ద్వాపరయుగ రెండవపాదమున, కలియుగమొదటి పాదాంతమున, ఆయాయుగ ప్రమాణములను బట్టి ఎక్కువ తక్కువకాల ప్రమాణములతో జరుగు తుంటాయి. ఈ కలియుగంలో ఐదువేల సంవత్సరముల తర్వాత ఈ చెప్పినవన్నియూ జరుగు తుంటాయి. ఈ కలియుగంలో ఐదువేల సంవత్సరముల తర్వాత చెప్పినవన్నీ జరిగిపోయి, కులములన్నియూ సంకరములైన పిదప మరల కృతయుగధర్మంగా 84 లక్షల జీవరాసులు సుఖంగా ఉంటాయి. కావున

26. ఈ కాలజ్ఞానమును పూర్తిగా చూచి చదివిన నరులకు, శివుని కరుణతో గల లోకంలో, శివుని వలే ప్రఖ్యాతితో నుండుట యదార్థము.

27. ఈ గ్రంథాన్ని చదివి పురవీధులందు ఊరేగించి, పట్టాభిషేకం చేయువారి పుణ్యము ఏమని చెప్పను, అట్టినరులకు సంపూర్ణమగు భుక్తి, ముక్తి, జ్ఞానము, కీర్తియు గలిగి శివసాయుజ్యంపొందగలరు.

28. గొప్ప కొండగుహయందునివాసముండి, సకల దోషములు నశింపజేయగలట్టి, వినయముగల జనులందువిశేషుడా. విశ్వమందలి జనులను ఆపదనుండి కాపాడి పోషించు వాడా, వనములందు తిరుగుట యిష్టమగువాడా, రసవాద విద్యాధికులకు నాయకుడా, మునులహృదయమందు నివాసముండు విశ్వానికి అధిపతీ, నమస్తేనమః

.29. యిదిశోభాయుక్తమైసకల విద్యలు నేర్చి కవిత్వంతో వెలుగొందుచూ, సరసకవితయు, విశేషమగు అనంతవిద్యలు సాధించి, జనసమూహమునకు తత్వశోధన, అర్చనలు తెలియజేసి కాలజ్ఞానమనే జరుగబోవు విషయములతో గల ఒక భాగంలో శమము, దమము, ఉపరతీ, తితీక్ష్యశ్రద్ధ, సమాధానము, ఈ ఆరునూగల కాల నిర్ణయములు గల మంత్ర, లయ, హట, రాజయోగములతో, మహేశ్వరుని మూడవ నేత్రం వలే ప్రభావము గల, మానసిక స్థిరత్వం పొందగలట్టి సనారీ విశ్వేశ్వర సంవాద మండలి **అష్టమాశ్వాసము సంపూర్ణము. శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు**

ఇది శ్రీమద్గాయత్రీ విశ్వకర్మ పరమేశ్వరులచేనుత్పన్నమైన సానగాది పంచ బ్రహ్మఋషి గోత్రములలోని ద్వితీయ మగుసనాతన బ్రహ్మఋషి గోత్రమండలి పర్ణబ్రహ్మఋషి గోత్రోద్భవులైన **బ్ర॥ సుగంధం ఆదినారాయణ, అన్నపూర్ణాంబల** పౌత్రుడు, వెంకటేశ్వరరావు పాపాయమ్మలకు సమర్ధ సద్గురు శిరిడి సాయి వరప్రసాదలబ్ధ "సుపుత్రుడును" విమలాదేవి మనోహరుండు, యింద్ర కీలాద్రిపై వెలసిన శ్రీశ్రీశ్రీ కనకదుర్గామాతా కరుణాకటాక్ష వీక్షణలతో విలసిల్లు విజయవాడ నగరవాసుడును "జగజ్యోతి" **శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి** లోకమున కెఱుక పరిచిన భవిష్యకాలజ్ఞాన వాక్యప్రకారముదయించిన పరమ శివావతారులగు "జగద్గురు" శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధుల పాదసేవకుడును। తణుకు సాంబశివానంద రాజయోగి ప్రియశిష్యుడు **1. సనారీ నిత్య పూజా విధానము, 2. సనారీశ్వరవ్రత సంకల్పనము, 3. సనారీ మాలాధారణ కర్త 4. సనారీ పూజాప్రచారకులు, 5) శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్థములు,** సనారీ పీఠాధిపతి, **శ్రీశ్రీశ్రీత్రిశక్తీ, సహస్రలింగ సహిత విశ్వనాధాలయ** నిర్మాణాధ్యక్షులు, పూర్వాశ్రమమున నవరత్న స్వర్ణాభరణ నిర్మాణ శిల్పి, వాస్తుజ్యోతిష సిద్ధాన్తి , పౌరాణిక నటకుండగు **బ్రహ్మశ్రీ సుగంధంసాయి బాబాచార్య స్వామీజీ** (విశ్వకర్మ) విరచిత **శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్థములు** సమాప్తము.

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు





-ః శ్రీ పరమగురు విశ్వబ్రాహ్మార్పణమస్తుః-

(1) శ్రీ విరాట్ విశ్వబ్రహ్మ స్తోత్రము

శ్లో॥ విశ్వకర్మా దిశామ్పతి స్సనః పశూన్పాతు, సోస్మాన్పాతు తస్మై నమః
ప్రజాపతిః రుద్రోవరుణోగ్నిర్దిశాంపతి సనః పశూన్పాతుసోస్మాన్పాతు తస్మైనమః
పంచవక్త్రం జటాజూటం - పంచాదశ విలోచన।
సద్యోజాతాననం శ్వేతం - వామదేవంతు కృష్ణకం॥
అఘోరం రక్తవర్ణంచ- తత్పురుషం పీతవర్ణకం।
ఈశాన్యం శ్యామవర్ణంచ - శరీరం హేమవర్ణకం॥
దశాబాహుం మహాకాయం - కర్ణకుండల మండితం।
పీతాంబరం పుష్పమాలా - నాగయజ్ఞోపవీతనం॥
రుద్రాక్షమాలాభరణం - వ్యాఘ్రచర్మోత్తరీయకం।
అక్షమాలంచ పద్మంచ - నాగశూల పినాకినం॥
డమరుం వీణా బాణంచ - శంఖ చక్ర గదాన్వితం।
కోటి సూర్య ప్రతీకాశం - సర్వజీవ దయాపరం॥
దేవదేవం మహాదేవం - విశ్వబ్రహ్మ జగద్గురుం।
ప్రసన్న వదనం ధ్యాయేత్ - సర్వ విఘ్నోప శాంతయే॥
అభీప్సితార్థ సిద్ధ్యర్థం - పూజతో యస్సురైరపి।
సర్వవిఘ్న హరం దేవం - సర్వవిఘ్న వివర్జితం॥
సర్వ నక్షత్ర గ్రహానుగ్రహం - సర్వరాజ్య వశీకరం।
ఆహుః ప్రజానాం భక్తానా - మత్యంత భక్తి పూర్వకం॥
సృజితం విశ్వబ్రహ్మణాం - నమో బ్రహ్మహితాయచ।
ఓం శ్రీం గాయత్రి విరాట్ విశ్వ బ్రహ్మణే నమః॥

**గ్రంధసారాంశమైన అక్షరసత్యాలు**

2. ఈ 33 కోట్ల దేవతలకు మూలబ్రహ్మలు అనగా ఎవరు ? వీరు ఏ విధంగా మూల బ్రహ్మలు అయినారు ? వీరిని సృష్టించినవారు ఎవరు ? ఈ విశ్వమును, విశ్వములోని అనేక కోటి బ్రహ్మాండములను సృష్టించినవారు ఎవరు? ఆ సృష్టికర్త ఏ రూపములో ఉన్నాడు ? ఎక్కడ ఉన్నాడు ? మానవులమని పిలవబడే మనం ఎవరము ? మనను సృష్టించినవారు ఎవరు? పంచ బ్రహ్మలు అనగా ఎవరు ? ఈ పంచభూతాలు అనగా ఏమిటి? వాటిని ఎవరు సృష్టించారు? పంచభూతాలలో ఉన్న శక్తులను ఏ దేవతలుగా పిలవబడుతున్నారు ? మన శరీరము పంచభూతాలతో ఏ విధంగా ఏర్పడినది ?

.29. యిదిశోభాయుక్తమైసకల విద్యలు నేర్చి కవిత్వంతో వెలుగొందుచూ, సరసకవితయు, విశేషమగు అనంతవిద్యలు సాధించి, జనసమూహమునకు తత్వశోధన, అర్చనలు తెలియజేసి కాలజ్ఞానమనే జరుగబోవు విషయములతో గల ఒక భాగంలో శమము, దమము, ఉపరతీ, తితీక్షశ్రద్ధ, సమాధానము, ఈ ఆరునూగల కాల నిర్ణయములు గల మంత్ర, లయ, హట, రాజయోగములతో, మహేశ్వరుని మూడవ నేత్రం వలే ప్రభావము గల, మానసిక స్థిరత్వం పొందగలట్టి సనారీ విశ్వేశ్వర సంవాద మందలి **అష్టమాశ్వాసము సంపూర్ణము. శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు**

ఇది శ్రీమద్గాయత్రీ విశ్వకర్మ పరమేశ్వరులచేనుత్పన్నమైన సానగాది పంచ బ్రహ్మఋషి గోత్రములలోని ద్వితీయ మగుసనాతన బ్రహ్మఋషి గోత్రమందలి పర్నబ్రహ్మఋషి గోత్రోద్భవులైన బ్ర॥ **సుగంధం ఆదినారాయణ, అన్నపూర్ణాంబల** పౌత్రుడు, వెంకటేశ్వరరావు పాపాయమ్మలకు సమర్ధ సద్గురు శిరిడి సాయి వరప్రసాదలబ్ధ "సుపుత్రుడును" విమలాదేవి మనోహరుండు, యింద్ర కీలాద్రిపై వెలసిన శ్రీశ్రీశ్రీ కనకదుర్గామాతా కరుణాకటాక్ష వీక్షణలతో విలసిల్లు విజయవాడ నగరవాసుడును "జగజ్యోతి" **శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి** లోకమున కెఱుక పరిచిన భవిష్యకాలజ్ఞాన వాక్యప్రకారముదయించిన పరమ శివావతారులగు "జగద్గురు" శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వనాధుల పాదసేవకుడును। తఱుకు సాంబశివానంద రాజయోగి ప్రియశిష్యుడు **1. సనారీ నిత్య పూజా విధానము, 2. సనారీశ్వరవ్రత సంకల్పనము, 3. సనారీ మాలాధారణ కర్త 4. సనారీ పూజాప్రచారకులు, 5) శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్థములు,** సనారీ పీఠాధిపతి, **శ్రీశ్రీశ్రీత్రిశక్తీ, సహస్రలింగ సహిత విశ్వనాధాలయ** నిర్మాణాధ్యక్షులు, పూర్వాశ్రమమున నవరత్న స్వర్ణాభరణ నిర్మాణ శిల్పి, వాస్తుజ్యోతిష సిద్ధాన్తి , పౌరాణిక నటకుండగు **బ్రహ్మశ్రీ సుగంధంసాయి బాబాచార్య స్వామీజీ** (విశ్వకర్మ) విరచిత **శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వర సంవాద గ్రంధార్థములు** సమాప్తము.

శ్రీ విశ్వబ్రహ్మార్పణమస్తు





-ః శ్రీ పరమగురు విశ్వబ్రాహ్మార్పణమస్తుః-

(1) శ్రీ విరాట్ విశ్వబ్రహ్మ స్తోత్రము

శ్లో॥ విశ్వకర్మా దిశామ్పతి స్సనః పశూన్పాతు, సోస్మాన్పాతు తస్మై నమః
ప్రజాపతిః రుద్రోవరుణోగ్నిర్ధిశాంపతి సనః పశూన్పాతుసోస్మాన్పాతు తస్మైనమః
పంచవక్త్రం జటాజూటం - పంచాదశ విలోచన।
సద్యోజాతాననం శ్వేతం - వామదేవంతు కృష్ణకం॥
అఘోరం రక్తవర్ణంచ- తత్పురుషం పీతవర్ణకం।
ఈశాన్యం శ్యామవర్ణంచ - శరీరం హేమవర్ణకం॥
దశాబాహుం మహాకాయం - కర్ణకుండల మండితం।
పీతాంబరం పుష్పమాలా - నాగయజ్ఞోపవీతనం॥
రుద్రాక్షమాలాభరణం - వ్యాఘ్రచర్మోత్తరీయకం।
అక్షమాలంచ పద్మంచ - నాగశూల పినాకినం॥
డమరుం వీణా బాణంచ - శంఖ చక్ర గదాన్వితం।
కోటి సూర్య ప్రతీకాశం - సర్వజీవ దయాపరం॥
దేవదేవం మహాదేవం - విశ్వబ్రహ్మ జగద్గురుం।
ప్రసన్న వదనం ధ్యాయేత్ - సర్వ విఘ్నోప శాంతయే॥
అభీప్సితార్ధ సిద్యర్థం - పూజతో యస్సురైరపి।
సర్వవిఘ్న హరం దేవం - సర్వవిఘ్న వివర్జితం॥
సర్వ నక్షత్ర గ్రహానుగ్రహం - సర్వరాజ్య వశీకరం।
ఆహుః ప్రజానాం భక్తానా - మత్యంత భక్తి పూర్వకం॥
సృజితం విశ్వబ్రహ్మణాం - నమో బ్రహ్మహితాయచ।
ఓం శ్రీం గాయత్రి విరాట్ విశ్వ బ్రహ్మణే నమః॥

**గ్రంధసారాంశమైన అక్షరసత్యాలు**

2. ఈ 33 కోట్ల దేవతలకు మూలబ్రహ్మలు అనగా ఎవరు ? వీరు ఏ విధంగా మూల బ్రహ్మలు అయినారు ? వీరిని సృష్టించినవారు ఎవరు ? ఈ విశ్వమును, విశ్వములోని అనేక కోటి బ్రహ్మాండములను సృష్టించినవారు ఎవరు? ఆ సృష్టికర్త ఏ రూపములో ఉన్నాడు ? ఎక్కడ ఉన్నాడు ? మానవులమని పిలవబడే మనం ఎవరము ? మనను సృష్టించినవారు ఎవరు? పంచ బ్రహ్మలు అనగా ఎవరు ? ఈ పంచభూతాలు అనగా ఏమిటి? వాటిని ఎవరు సృష్టించారు? పంచభూతాలలో ఉన్న శక్తులను ఏ దేవతలుగా పిలవబడుతున్నారు ? మన శరీరము పంచభూతాలతో ఏ విధంగా ఏర్పడినది ?

పంచభూతాలతో ఏర్పడిన ఈ శరీరములో ఎన్ని తత్వాలు ఏర్పడినవి? ఈ తత్వాలలో ఎన్ని గుణములు ఏర్పడినవి? ఒక్కొక్క గుణమునకు, తత్వమునకు ఎవరెవరు అధిపత్యము గల్గియున్నారు? మన శరీరములో ఎన్ని రకముల అవయవములు ఉన్నవి ?వాటి పరిమాణముల గురించిన పూర్తి వివరములు తెలుపబడినది. ఈ పుస్తకము చదివినచో సర్వమూ అర్థము అవుతుంది. మరియు ఇందులో 125 మంది బ్రహ్మ ఋషులను వారి వారి శక్తులతో సహావారికి నమస్కరించడము ప్రతి మానవునకు తప్పని సరియై యున్నందున వారికి నమస్కరించుటకు వీలగు పద్ధతిలో వారి పేర్లను తెలియ జేయడమైనది. ఈ 125 మంది బ్రహ్మ ఋషుల గురించి తెలుసుకోవలసిన ప్రత్యేకత ఏమంటే? ఈ భూగోళముపై ఏ ప్రాంతములో అయినా, ఏ మతములో అయినా, ఏ జాతిలో అయినా, ఏ కులములో అయినా, అవతరించిన అవతార పురుషులైన, అవధూతలైన, ప్రవక్తలెనా, దైవదూతలైనా, దేవుళ్ళైనా, దేవతలైనా, ఎక్కడ, ఎవరు, ఏఅవతారమెత్తినా ఈ 125మంది బ్రహ్మ ఋషులలో ఒకరై ఉంటారు. అవతారము దాల్చిన, అవతారపురుషుల గుణగణాలను బట్టి, ఆ గుణము ఆదిక్యతను బట్టి, మన శరీరము లోని ఏ తత్వగుణమునకు ఆధిపత్యము ఏ బ్రహ్మ ఋషి కలిగి యున్నాడో ఆ బ్రహ్మఋషియే ఆ అవతారమూర్తి అంశయని తెలుస్తుంది, అఖిలాండకోటి బ్రహ్మాండముల సృష్టి కర్త స్వయంభూః శ్రీవిరాట్ విశ్వ కర్మ భగవానుని పంచ ముఖముల నుండి వెలువడిన తేజస్సుయందు ఉద్భవించిన పంచ బ్రహ్మలలో, శ్రీ మను బ్రహ్మయగు, మహాశివుడు, విశ్వనాధావదూతగా శ్రీకాకుళము జిల్లా నాగావళి నదీ తీరాన గల పాలకొండ గ్రామములోని బ్రహ్మశ్రీ సింహాద్రి వీరాచారి – గౌరీదేవి అనే సాత్విక సంపన్నులైన విశ్వబ్రాహ్మణ దంపతుల గర్భమందవతరించారు. బాల్యములోనే సకల విద్యలు నేర్చినారు, రసవాదవిద్యలో ఆరితేరినారు, బాల్యములోనే ఎన్నో మహిమలు చూపించినారు. పాలకొండ సమీపాన గల సుమంగళిపురం అనే గ్రామములోని బ్రహ్మ శ్రీబ్రహ్మానందాచారి– భ్రమరాంబ అను విశ్వబ్రాహ్మణ దంపతుల తపఃఫలంతో కుమార్తెగా జన్మించిన అన్నపూర్ణా దేవిని వివాహమాడినారు. చెన్నపురిలో పండితులతో జరిగినవాగ్వి వాదముతో "నేనే నారితోకూడిన"సనారీ విశ్వనాధావ దూతగా" సంభోదించు కున్నారు. అంతలోనే సభలో నుండి కొందరు దుడుకువారు సనారీ అంటే మరి పార్వతీదేవి ఏది అని హేళన చేయగా శ్రీ స్వాములవారు అది గ్రహించి పార్వతిని రమ్మని పిలిచిన తోడనే సభమద్యలో నుండి పార్వతీ దేవి 8సం॥ల బాలిక రూపములో వచ్చి స్వాములవారి తొడపై ఆశీనురాలు అయినది. దీనికి ఆశ్చర్యపోయిన సభ్యులందరు తమ తప్పిదమునకు క్షమించమని ప్రాధేయపడినారు.





లోక కళ్యాణము కొరకు పార్వతీ దేవి ఎన్నో ప్రశ్నలు పరమేశ్వరుని అడిగి వారి ద్వారా చెప్పించి మనకు అందించినదే సనారి విశ్వేశ్వర సంవాదము అను గ్రంథము. ఈ గ్రంథములో విశ్వ సృష్టి క్రమము, విశ్వములో మరియు శరీరములో ఉండిన విశ్వమును శరీరమును పాలించు దేవతల వివరములు, వేదాంతము, పంచభూతాలను, పంచీకరణము, రసయోగము, దేహ, సాంఖ్యా లక్షణము, అచలము, యోగ విమర్శ, ఆసనాలు తెలిపియున్నారు. ఎన్నో గొప్ప మహిమలు చూపించియున్నారు. శివునికి గల మూడవకన్ను చూపించినారు. మద్రాసు వెళ్ళి స్వయముగా "సనారీ విశ్వేశ్వర సంవాదము" అనుగ్రంథమును ముద్రింపించి చివరిలో దేశ సంచారము చేస్తూ శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి మఠము మీదుగా శ్రీ శైలము వెల్లి అక్కడి కదళీ వనములోని గుహలో మహాతపోదీక్ష యందుండి, స్వామివారిని నమ్మి కొలిచే భక్తులకు దర్శనమిస్తుంటారు. అట్టి వారి కోర్కెలు తీర్చుతున్నారు.

శ్రీ సనారీ విశ్వేశ్వరులవారు పార్వతి దేవికి తెలిపిన విశ్వసృష్టి క్రమములోని సారాంశము ననుసరించి 33 కోట్ల దేవతలకు మూల బ్రహ్మలు అను విషయములు యిందు రూపొందించడము జరిగినది. ఇది ప్రతి మానవుడు ఇహములో సుఖశాంతు లను పొందుటకు, పరములోముక్తి లభించుటకు ప్రతి అమవాస్య రోజు మరియు ప్రతి పౌర్ణమి రోజు ఈ వివరములకు మొత్తమును ఒక మారు చదివితే సరిపోతుంది. క్రమము తప్పకుండా ఒక సంవత్సరముపాటు చదివిన వారికి ఫలితము వారి అనుభూతియే తెలియజేస్తుంది. ఈ విశ్వసృష్టికి మూలమగు శ్రీశ్రీశ్రీశ్రీశ్రీవిరాట్ విశ్వకర్మ గాయత్రీ ఆదిదంపతుల దండకాలను నిత్యంపఠించండి.

## (3) శ్రీ మాతా గాయత్రీ దేవి దండకము

తల్లీ: జగత్కల్పవల్లీ, చిదానందవల్లీ, సుధారాగవల్లీ! త్రివర్ణ స్వరూపా! త్రయీపాదరూపా! త్రిసంధ్యా స్వరూపా! త్రిమూర్త్యాత్మరూపా! త్రినేత్రా! ప్రసాదింపవే తల్లీ! తద్రూపిణీ, దివ్య సద్రూపిణీ, వేద విద్రూపిణీ, తుర్య భాగ్రూపిణీ, వర్యవాగ్రూపిణీ, పూర్ణకుంభస్వన ద్రేచకోద్భాసినీ, నీలవేణి, యతీంద్రాది హృత్పద్మ సంచారిణీ, భాస్కరీ, భవ్య లోకసంచారిణీ, దేశకాలానురూపా, వషట్కారరూపా, సదాచార రూపా, మహాధీర గంభీర రూపా, యోగినీయోగేశ్వరారాధితా, నామ పారాయణ ప్రీత, హృత్పద్మినీ, ప్రాణసంజీవనీ, సత్యధీచోదినీ, ధర్మదాక్షిణ్య రూపా. యధాశక్తి నర్చింతునోయమ్మ.

అగ్నియే మోముగా, బ్రహ్మశీర్షంబుగా, విష్ణుదేవుండు దెందంబుగా, రుద్రుడే కేశపాశంబుగా, భూమియే యోనిగా పంచప్రాణంబులొప్పన్, భూతసంబంధియైనట్టి, ఈ జంగమ స్థావరాలంకృతం భీప్రపంచంబు, వాక్సారమై శాబ్దికంబైన బ్రహ్మంబుగానొప్ప తద్బ్రహ్మవేదోక్తగాయత్రిగా కీర్తి నందన్, భవద్వ్యాపితానంత, శక్తిన్ ప్రపంచంబు

పూరించుచున్, సర్వభూతాత్మకత్వంబుగా, పృధ్వీరూపంబుగా నొప్పి తన్మంత్రమున్ గానముంజేయు భక్తాళిన్ రక్షించుచున్, సార్ధకంబైన గాయత్రీ నామంబునుందాల్చి పేర్వడ్డనీరూపు భావింతు, నీనామ సామర్థ్యంమూహింతు, సూర్యోదయం బంధుం బ్రత్యగ్రరూపంబుతో రక్త పద్మాసనారూఢవై, అర్థోదయం బంధునన్, నీదు దివ్యారుణ జ్యోతికిన్ చిత్తముప్పొంగ మేనున్ గగుర్పాటు వ్యాపింప రాగామృతాస్వాదనాయత్త, భృంగమ్ముమై, మధ్యాహ్న కాలంబులో నీవు శ్వేతాంగివై, శ్వేతవస్త్రంబులందాల్చుచున్, శ్వేతపద్మాసనంబందు శోభిల్లుచున్, అస్తాద్రిసూర్యుండు తాకంగ నీ వంతటన్ కృష్ణవర్ణంబుతో, కృష్ణపద్మాసనారూఢవై ఆత్మచైతన్య, విస్ఫారితా లోకాన అనంతశక్తికిన్, "మహాదేవి"కై మోద్పులో తల్లి. భాస్వత్కిరిటాం, మహాకుండలైర్మండితాం. శంఖు చక్రాంక హస్తాం, స్ఫురత్కాంతిరూపాం, ఉదూఢద్యుతిం, శ్యామలాం, కోమలాం, సుందరీం, చంద్రతారాత్మికాం నిత్య సత్యాత్మికాం, మోహినీం, సర్వమంత్రాశ్రితాం, శుద్ధవిద్యాం, జయాం జ్ఞానరూపాం, తమోహారిణీం, వేదాది ధాత్రీం, ఉషఃకాల గమ్యం, ఉదాత్త స్వరూపాం, సదాహంస యానం, అశేషాది వంధ్యాం, సుమేధాంద దానాం, సుశాంతాం, సుకాంతాం శుభాం నిత్యమైశ్వర్య సౌఖ్యప్రదాం, శాఖినీ, ధాకినీ, ఘోర భూతాళి విద్రావిణీం, త్వాంభజేయంచు నిన్‌గొల్తు రెవ్వార లవ్వారి పాపంబులంద్రుంచి కష్టంబులన్ బాపవేతల్లిరో, వేదమాతాః నమస్తే, నమస్తే, నమస్తే నమః **శ్రీ గాయత్రీ, పరబ్రహ్మార్పణమస్తు.**

## శ్రీ విరాట్ విశ్వబ్రహ్మ దండకము

శ్రీ మన్మహా విశ్వబ్రహ్మా! జగత్సృష్టి మర్మా! సదానంద బ్రహ్మా! స్వయం సర్వధర్మా! చిదానంద జన్మా! స్వయంభూ ప్రకాశం! సహస్రారవాసం! మహాఘౌఘ నాశం! సదా చిద్విలాసం! బుధాళీవిహాసం! మహాదివ్యపూజం! సురాసురవిరాజం! ప్రశస్తాత్మభాజం! జగద్రాజ రాజం! సదాసాధు పూజం! ఘన దివ్యకాయం! ప్రకీర్తి ప్రదాయం! ప్రపంచాత్మ కాయం! ప్రజామోక్ష దాయం! మహానిర్వికారం! మహావాక్ ప్రచారం! మనస్సాధుహారం! జగదృగ్విచారం! పరాపర విహారం! బజేభక్తమోక్షా! భజేశిష్టరక్షా! ఖజేదుష్ట శిక్షా! భజే ధర్మదీక్షా! భజే గణాధ్యక్షా! భజే జగద్రూపం! భజే యోగతాపం! భజే స్వస్వరూపం! భజే మోక్షరూపం! భజే హమ్మటంచున్! యోగులెందున్! మదిన్ పూజచేయన్! గనన్ సర్వమీవే। మహామహుడవీవే! పరాత్పరుడవీవే! పరంజ్యోతి నీవే! పరబ్రహ్మ మీవే! నీరాకార మీవే! నిజానంద మీవే! నిరాపాధి నీవే ! యటంచున్! ఉషస్సందు మధ్యాహ్న సాయంత్రములల్! నామసంకీర్తనల్ జేసి! నీ శక్తి వర్ణించి! నీమీద నేదండకం బొక్కటి జేయ! నూహించి నీతత్వమున్ గాంచి! నీ సోయగం బెంచి! యోగివర్యుండనై! నీకు





భక్తుండనై నిన్ననే గొల్చెదన్! నామొరాలించుమా! నన్ను రక్షించుమా! దాతవై బ్రోవుమా! దగ్గిరన్నిల్వుమా! ఘోర కష్టంబులున్ బాపుమా! నీ కృపన్ జూపుమా! ధన్యునిన్ జేయుమా! నిన్ను సేవించినన్! మోక్షమున్ గల్గునే! బ్రహ్మమై చెలగునే! అచలమై బరగునే! ఆనందమొందునే! పంచభూతంబులున్! బంధనైయుండునే! హాసద్గురు బ్రహ్మ! ఆహా పరబ్రహ్మా! హాజగద్రక్షకా! హా విశ్వరూపమా! హా స్వప్రకాశమా! హా జ్యోతిరూపమా! హా నిర్వికాలమా! ఓ సచ్చిదానందా! నీ రూపువర్ణింప! నే శక్తిహీనుండ! దీనుండ నన్నుం గటాక్షించివేవేగ! నాదుయత్నంబులన్! సాఫల్యమున్ జేయ! నీదరిం జేరితిన్! ఈ భక్తుని ముక్తికై, భుక్తికై, రక్తికై,వ్యక్తికై, శక్తికై, నిత్య సంకల్పముల్ నిర్విఘ్నమున్ జేసి దీనుడన్ బ్రోవుమా! తప్పులన్ గావుమా! మహనీయ్యమూర్తివై! మత్కటాక్షండవై! వేదాంతవేద్యవై! విశ్వత్ప్రకాశమై! విశ్వస్వరూపమై! విజ్ఞానదీపాయ! విశ్వనిర్మాణాయ–ఓంకారరూపాయ–చిన్మయానందాయ–చిత్కళాధీశాయ–చిద్విలాసాయ! శ్రీ అప్రమేయాయ! హృత్పుండరీకాయ! అవ్యక్తరూపాయ! ఆత్మస్వరూపాయ! ఓంకారానాధాయ! శ్రీ విశ్వబ్రహ్మన్! పరబ్రహ్మమూర్తే నమస్తే! నమస్తే! నమస్తే! నమః !! **ఓం శ్రీ విరాట్ విశ్వబ్రహ్మార్పణమస్తు.**

## 33 కోట్ల దేవతలకు మూల బ్రహ్మలు

శ్రీ విరాట్ విశ్వకర్మ గాయత్రి సంతానమైన 125 మంది దంపతులు వీరు 33 కోట్ల దేవతలకు మూలమైనవారు. మరియు మానవ శరీరములోని ఆత్మ, పరమాత్మ, జీవాత్మ, పంచభూతాలకు, పంచభూతాలతో ఏర్పడిన 25 తత్వాలకు, స్థూల శరీరమునకు, సూక్ష్మ శరీరమునకు, కారణ శరీరమునకు,మహాకారణ శరీరమునకు అధిపతులు వీరే. పంచభూతాలతో ఏర్పడిన సమస్తప్రాణుల ఒక్కో అవయముపై మరియు విశ్వము లోని సమస్త గోళాలపై అధికారులు వీరే. వీరిని ప్రతిరోజు గాని, కనీసము ఆదివారము, శుక్రవారము, పౌర్ణమి, అమావాస్యల రోజులలో నైనా చదవడము వలన వీరి అనుగ్రహము లభించుతుంది. 33 కోట్ల దేవతలకు మన నమస్కారములు అందుతాయి. ఈ భూగోళము పై అవతరించిన అవతార పురుషులు, దేవతలు ఈ 125 బ్రహ్మలలో ఒకరై ఉంటారు. సమస్త మానవకోటికి పితృదేవతలు వీరే. స్వామివారి సంవాదములో యివన్నీ ఉన్నాయి.

**శాంతిమంత్రము**

**శ్రుతి ॥ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీరంకరవావహై**
**తేజస్వినావ వధీతమస్తు। మావిద్విషావహై। ఓం శాంతి శ్శాంతి శ్శాంతి**

**తా॥ సృష్టికర్తయగు విరాట్ పురుషుడు, ఆచార్య శిష్యులగు మనలను రక్షించుగాక। ఆధ్యాత్మిక ఆది భౌతిక ఆది దైవికములగు బాధలు శాంతి నొందుగాక**

ఓం ఓం ఓం. ఓం ఓం

ఓం, శ్రీం, శ్రీ మాతా గాయత్రి దేవీ సమేత శ్రీ విరాట్ విశ్వబ్రహ్మణేనమః

1. మనుబ్రహ్మ సంతతి

1. ఓం శ్రీం ఆదిశక్తీదేవీ సమేత శ్రీ సానగబ్రహ్మర్షియేనమః
2. ఓం శ్రీం సులక్ష్మీదేవీ సమేత శ్రీ బిభ్రాజబ్రహ్మర్షియేనమః
3. ఓం శ్రీం అథితీదేవీ సమేత శ్రీ కశ్యపబ్రహ్మర్షియేనమః
4. ఓం శ్రీం కల్యాణీదేవీ సమేత శ్రీ మనువిశ్వకర్మబ్రహ్మర్షియేనమః
5. ఓం శ్రీం సుమంగళీదేవీ సమేత శ్రీ విశ్వాత్మకబ్రహ్మర్షియేనమః
6. ఓం శ్రీం శ్రద్ధాదేవీ సమేత శ్రీ మన్యుపతిబ్రహ్మర్షియేనమః
7. ఓం శ్రీం కమలాదేవీ సమేత శ్రీ మామన్యుబ్రహ్మర్షియేనమః
8. ఓం శ్రీం భాషాదేవీ సమేత శ్రీ భూబలబ్రహ్మర్షియేనమః
9. ఓం శ్రీం రమాదేవీ సమేత శ్రీ సంవర్తబ్రహ్మర్షియేనమః
10. ఓం శ్రీం చారుమతీదేవీ సమేత శ్రీ విశ్వదత్తబ్రహ్మర్షియేనమః
11. ఓం శ్రీం దృతీదేవీ సమేత శ్రీ సుమంతబ్రహ్మర్షియేనమః
12. ఓం శ్రీం సాత్వికాదేవీ సమేత శ్రీ శ్వేతాంగబ్రహ్మర్షియేనమః
13. ఓం శ్రీం సుగుణాదేవీ సమేత శ్రీ పురంజయబ్రహ్మర్షియేనమః
14. ఓం శ్రీం సుక్ష్మాదేవీ సమేత శ్రీ భానుమతబ్రహ్మర్షియేనమః
15. ఓం శ్రీం భోగవతీదేవీ సమేత శ్రీ జయపుత్రబ్రహ్మర్షియేనమః
16. ఓం శ్రీం శుచీదేవీ సమేత శ్రీ వనజబ్రహ్మర్షియేనమః
17. ఓం శ్రీం సుకుమారీదేవీ సమేత శ్రీ భాస్వంత బ్రహ్మర్షియేనమః
18. ఓం శ్రీం మందహాసినీదేవీ సమేత శ్రీ మధుబ్రహ్మర్షియేనమః
19. ఓం శ్రీం సుధీమణీదేవీ సమేత శ్రీ చిత్రవసుబ్రహ్మర్షియేనమః
20. ఓం శ్రీం సుందరీదేవీ సమేత శ్రీ తాపసబ్రహ్మర్షియేనమః
21. ఓం శ్రీం కంజవాగ్దేవి సమేత శ్రీ సుయక్షబ్రహ్మర్షియేనమః
22. ఓం శ్రీం మందగమనాదేవీ సమేత శ్రీ సుతక్షబ్రహ్మర్షియేనమః
23. ఓం శ్రీం ప్రజ్ఞావతీదేవీ సమేత శ్రీ ప్రభోదకబ్రహ్మర్షియేనమః





24. ఓం శ్రీం ప్రభావతీదేవీ సమేత శ్రీ వసులోచనబ్రహ్మర్షియేనమః
25. ఓం శ్రీం శాంతమతీదేవీ సమేత శ్రీ చిత్రధర్మబ్రహ్మర్షియేనమః

2. మయబ్రహ్మ సంతతి

26. ఓం శ్రీం పరాశక్తీదేవీ సమేత శ్రీ సనాతనబ్రహ్మర్షియేనమః
27. ఓం శ్రీం కటాక్షిణీదేవీ సమేత శ్రీ వామదేవబ్రహ్మర్షియేనమః
28. ఓం శ్రీం చారులోచనాదేవీ సమేత శ్రీ విశ్వచక్షుబ్రహ్మర్షినమః
29. ఓం శ్రీం కోమలాంగీదేవీ సమేత శ్రీ ప్రతితక్షబ్రహ్మర్షియేనమః
30. ఓం శ్రీం గంధవతీదేవీ సమేత శ్రీ సునందనబ్రహ్మర్షియేనమః
31. ఓం శ్రీం పద్మావతీదేవీ సమేత శ్రీ మానుషమయబ్రహ్మర్షియేనమః
32. ఓం శ్రీం అలకాదేవీ సమేత శ్రీ సనత్కుమారబ్రహ్మర్షియేనమః
33. ఓం శ్రీం సురతీదేవీ సమేత శ్రీ ధార్మికబ్రహ్మర్షియేనమః
34. ఓం శ్రీం విశాలాక్షీదేవీ సమేత శ్రీ విధాతృమనుబ్రహ్మర్షియేనమః
35. ఓం శ్రీం కామాక్షీదేవీ సమేత శ్రీ ద్విజధర్మబ్రహ్మర్షియేనమః
36. ఓం శ్రీం సుగామినీదేవీసమేత శ్రీ వర్ధకబ్రహ్మర్షియేనమః
37. ఓం శ్రీం కారుణీకాదేవీ సమేత శ్రీ భావభోదక బ్రహ్మర్షియేనమః
38. ఓం శ్రీంఊరుమతీదేవీ సమేత శ్రీ తక్షుబ్రహ్మర్షియేనమః
39. ఓం శ్రీం కౌమారీదేవీ సమేత శ్రీ శాంతిమత బ్రహ్మర్షియేనమః
40. ఓం శ్రీం అరుణేక్షణాదేవీ సమేత శ్రీ యజ్ఞసేనబ్రహ్మర్షియేనమః
41. ఓం శ్రీం సువాగ్దేవి సమేత శ్రీ చక్షుషబ్రహ్మర్షియేనమః
42. ఓం శ్రీం శుభాంగినీదేవీ సమేత శ్రీ విశ్వదక్షబ్రహ్మర్షియేనమః
43. ఓం శ్రీం సుకుమారీదేవీ సమేత శ్రీ విశ్వతబ్రహ్మర్షియేనమః
44. ఓం శ్రీం తారాక్షిణీదేవీ సమేత శ్రీ సుమేదకబ్రహ్మర్షియేనమః
45. ఓం శ్రీం శీతేక్షణాదేవీ సమేత శ్రీ పర్నబ్రహ్మర్షియేనమః
46. ఓం శ్రీం వేదినీదేవీ సమేత శ్రీ రైవతమనుబ్రహ్మర్షియేనమః
47. ఓం శ్రీం కృష్ణకేశినీదేవీ సమేత శ్రీ ప్రవరబ్రహ్మర్షియేనమః
48. ఓం శ్రీం కాంతాదేవీ సమేత శ్రీ జయధన్వబ్రహ్మర్షియేనమః
49. ఓం శ్రీం మోదవతీదేవీ సమేత శ్రీ పరిషంగబ్రహ్మర్షియేనమః
50. ఓం శ్రీం తరుణీదేవీ సమేత శ్రీ విద్యాబ్రహ్మర్షియేనమః

3. త్వష్టబ్రహ్మ సంతతి

51. ఓం శ్రీం ఇఛ్ఛాశక్తిదేవీ సమేత శ్రీ అహభూనబ్రహ్మర్షియేనమః
52. ఓం శ్రీం నీలవేణీదేవీ సమేత శ్రీ భద్రదత్తబ్రహ్మర్షియేనమః
53. ఓం శ్రీం సుమిత్రాదేవీ సమేత శ్రీ కాందవబ్రహ్మర్షియేనమః
54. ఓం శ్రీం సుందరాననదేవీ సమేత శ్రీ విశ్వాకార బ్రహ్మర్షియేనమః
55. ఓం శ్రీం సుమానసాదేవీ సమేత శ్రీ శ్రీముఖబ్రహ్మర్షియేనమః
56. ఓం శ్రీం సుభాషిణీ సమేత శ్రీ త్వష్టబ్రహ్మర్షియేనమః
57. ఓం శ్రీం రంజనీదేవీ సమేత శ్రీ యజ్ఞపాలబ్రహ్మర్షియేనమః
58. ఓం శ్రీం దరహాసినీదేవీ సమేత శ్రీ కుశధర్మబ్రహ్మర్షియేనమః
59. ఓం శ్రీం సుముఖీదేవీ సమేత శ్రీ తామ్రగర్భబ్రహ్మర్షియేనమః
60. ఓం శ్రీం సుందరాంగిదేవీ సమేత శ్రీ అతిధాతబ్రహ్మర్షియేనమః
61. ఓం శ్రీం చారునేత్రదేవీ సమేత శ్రీ లోకేశబ్రహ్మర్షియేనమః
62. ఓం శ్రీం సువర్చలాదేవీ సమేత శ్రీ పద్మతక్షబ్రహ్మర్షియేనమః
63. ఓం శ్రీం సుపవీదేవీ సమేత శ్రీ వితమబ్రహ్మర్షియేనమః(వితక్ష)
64. ఓం శ్రీం సుదేవీ సమేత శ్రీ మేధామతి బ్రహ్మర్షియేనమః
65. ఓం శ్రీం నిరామయీదేవీ సమేత శ్రీ విశ్వమయబ్రహ్మర్షియేనమః
66. ఓం శ్రీం సుభోదినీదేవీ సమేత శ్రీ బోధాయనబ్రహ్మర్షియేనమః
67. ఓం శ్రీం వార్తాళీదేవీ సమేత శ్రీ జాతరూపబ్రహ్మర్షియేనమః
68. ఓం శ్రీం తబగళాదేవీ సమేత శ్రీ చిత్రసేనబ్రహ్మర్షియేనమః
69. ఓం శ్రీం బాలాదేవీ సమేత శ్రీ జయసేనబ్రహ్మర్షియేనమః
70. ఓం శ్రీం చిత్రాంగిదేవీ సమేత శ్రీ విఘనసబ్రహ్మర్షియేనమః
71. ఓం శ్రీం చిత్రభాషిణీదేవీ సమేత శ్రీ ప్రభోన్నతబ్రహ్మర్షియేనమః
72. ఓం శ్రీం ఉచ్ఛాంగినీదేవీ సమేత శ్రీ దేవరబ్రహ్మర్షియేనమః
73. ఓం శ్రీం కలకంఠీదేవీసమేత శ్రీ వినయబ్రహ్మర్షియేనమః
74. ఓం శ్రీం గౌరీదేవీ సమేత శ్రీ బ్రహ్మదీక్షితబ్రహ్మర్షియేనమః
75. ఓం శ్రీం శివకరీదేవీ సమేత శ్రీ హరిధర్మబ్రహ్మర్షియేనమః





4. శిల్పిబ్రహ్మ సంతతి

76. ఓం శ్రీం క్రియాశక్తి సమేత శ్రీ ప్రత్నసబ్రహ్మర్షియేనమః
77. ఓం శ్రీం రక్తాక్షిదేవీ సమేత శ్రీ రుచిదత్తబ్రహ్మర్షియేనమః
78. ఓం శ్రీం ధర్మవతీదేవీ సమేత శ్రీ వాస్తోష్పతిబ్రహ్మర్షియేనమః
79. ఓం శ్రీం లీలావతీదేవీ సమేత శ్రీ కౌశలబ్రహ్మర్షియేనమః
80. ఓం శ్రీం సుయోగినీదేవీ సమేత శ్రీ సనాభసబ్రహ్మర్షియేనమః
81. ఓం శ్రీం సుప్రతీకాదేవీ సమేత శ్రీ ప్రహర్షణబ్రహ్మర్షియేనమః
82. ఓం శ్రీం శనైర్వాచీదేవీ సమేత శ్రీ లోకవేత్త బ్రహ్మర్షియేనమః
83. ఓం శ్రీం చంద్రగంధీ సమేత శ్రీ శిల్పికమనుబ్రహ్మర్షియేనమః
84. ఓం శ్రీం జ్ఞానవాగ్దేవి సమేత శ్రీ సహస్రబాహుబ్రహ్మర్షియేనమః
85. ఓం శ్రీం సీమంతినీదేవీ సమేత శ్రీ దేశికమనుబ్రహ్మర్షియేనమః
86. ఓం శ్రీం పావనీదేవీ సమేత శ్రీ వాస్తుపురుషబ్రహ్మర్షియేనమః
87. ఓం శ్రీం జల్పకీదేవీ సమేత శ్రీ ఇంద్రసేనబ్రహ్మర్షియేనమః
88. ఓం శ్రీం ప్రకాశినీదేవీ సమేత శ్రీ గిరిధర్మబ్రహ్మర్షియేనమః
89. ఓం శ్రీం వరమతీదేవీ సమేత శ్రీ వసుధర్మబ్రహ్మర్షియేనమః
90. ఓం శ్రీం సురభీదేవీ సమేత శ్రీ వజ్రచేతబ్రహ్మర్షియేనమః
91. ఓం శ్రీం అకుంఠితదేవీ సమేత శ్రీ విశ్వభద్రబ్రహ్మర్షియేనమః
92. ఓం శ్రీం శుభాంగిదేవీ సమేత శ్రీ జ్ఞానభద్రబ్రహ్మర్షియేనమః
93. ఓం శ్రీం మంజుభాషిణీదేవీ సమేత శ్రీ దేవభద్రబ్రహ్మర్షియేనమః
94. ఓం శ్రీం వేదవతీదేవీ సమేత శ్రీ వ్యంజకబ్రహ్మర్షియేనమః
95. ఓం శ్రీం సత్యవతీదేవీ సమేత శ్రీ ప్రభోదకబ్రహ్మర్షియేనమః
96. ఓం శ్రీం సౌహార్ధవతీదేవీసమేత శ్రీ శక్వరబ్రహ్మర్షియేనమః
97. ఓం శ్రీం భోగినీదేవీసమేత శ్రీ వేదపాలబ్రహ్మర్షియేనమః
98. ఓం శ్రీం మదురాక్షీదేవీ సమేత శ్రీ రాజధర్మబ్రహ్మర్షియేనమః
99. ఓం శ్రీం అమలమతీదేవీ సమేత శ్రీ బోక్తవ్యమనుబ్రహ్మర్షియేనమః
100. ఓం శ్రీం భాసురాంగిదేవీ సమేత శ్రీ ప్రజ్ఞామతిబ్రహ్మర్షియేనమః

5. విశ్వజ్ఞబ్రహ్మ సంతతి

101. ఓం శ్రీం జ్ఞానశక్తీదేవీ సమేత శ్రీ సుపర్ణబ్రహ్మర్షియేనమః
102. ఓం శ్రీం చంచలాక్షీదేవీ సమేత శ్రీ విశ్వజ్ఞబ్రహ్మర్షియేనమః
103. ఓం శ్రీం మంగళాంగీదేవీ సమేత శ్రీ పరితబ్రహ్మర్షియేనమః
104. ఓం శ్రీం అంగనాదేవీ సమేత శ్రీ సౌరసేనబ్రహ్మర్షియేనమః
105. ఓం శ్రీం ఆర్థ్రమతీదేవీ సమేత శ్రీ సాఖ్యాయనబ్రహ్మర్షియేనమః
106. ఓం శ్రీం సుఖీదేవీ సమేత శ్రీ మణిభద్రబ్రహ్మర్షియేనమః
107. ఓం శ్రీం లావణీదేవీ సమేత శ్రీ మునిసువృతబ్రహ్మర్షియేనమః
108. ఓం శ్రీం లలితాదేవీ సమేత శ్రీ శృతివర్ధనబ్రహ్మర్షియేనమః
109. ఓం శ్రీం కేళీదేవీ సమేత శ్రీ యాజ్ఞికబ్రహ్మర్షియేనమః
110. ఓం శ్రీం వామాక్షీదేవీ సమేత శ్రీ సౌంజ్ఞికబ్రహ్మర్షియేనమః
111. ఓం శ్రీం వనితాదేవీ సమేత శ్రీ ఆదిత్యసేనబ్రహ్మర్షియేనమః
112. ఓం శ్రీం సుధీదేవీ సమేత శ్రీ అర్వంతబ్రహ్మర్షియేనమః
113. ఓం శ్రీం రమణీదేవీ సమేత శ్రీ అర్చితబ్రహ్మర్షియేనమః
114. ఓం శ్రీం భామినీ దేవీ సమేత శ్రీ కర్దమబ్రహ్మర్షియేనమః
115. ఓం శ్రీం ధర్మిణీదేవీ సమేత శ్రీ పరార్చితబ్రహ్మర్షియేనమః
116. ఓం శ్రీం శ్రీకరీదేవీ సమేత శ్రీ తేజోధర్మ బ్రహ్మర్షియేనమః
117. ఓం శ్రీం అమృతవాగ్దేవి సమేత శ్రీ సుదర్శనబ్రహ్మర్షియేనమః
118. ఓం శ్రీం ధర్మాత్రవాదేవీ సమేత శ్రీ ఉపగోపబ్రహ్మర్షియేనమః
119. ఓం శ్రీం మహిళాదేవీ సమేత శ్రీ యజ్ఞబ్రహ్మర్షియేనమః
120. ఓం శ్రీం రక్తోష్ఠీదేవీ సమేత శ్రీ స్వాంతబ్రహ్మర్షియేనమః
121. ఓం శ్రీం మధురవాణీదేవీ సమేత శ్రీ ఉపకల్పబ్రహ్మర్షియేనమః
122. ఓం శ్రీం శ్రీవర్ణినీదేవీ సమేత శ్రీ దేవసేవబ్రహ్మర్షియేనమః
123. ఓం శ్రీం మాలినీదేవీ సమేత శ్రీ ఆదిత్యబ్రహ్మర్షియేనమః
124. ఓం శ్రీం మాయాదేవీ సమేత శ్రీ నిగమబ్రహ్మర్షియేనమః
125. ఓం శ్రీం మహతీదేవీ సమేత శ్రీ ఉపయజ్ఞబ్రహ్మర్షియేనమః

శ్రీ విశ్వబ్రహ్మర్పణమస్తు





శ్రీశ్రీ

5.

**ఎలాంటి కార్యాములకు ఏ దిక్కులు చూడాలి**

ఈశాన్యం చూస్తూ - దేహశాంతి పూజలకు
తూర్పు చూస్తూ - వశీకరణకర్మలకు
ఆగ్నేయం - విద్వేషణకర్మలకు
దక్షిణం - మారణ కర్మలకు
నైరుతి - స్తంభనమునకు
పడమర - ధనం, జనం వశీకరణకు
వాయువ్యం - ఉచ్చాటనకు
ఉత్తరం - మోక్షానికి

**జపస్థాన ఫలితములు**

శిరస్సు - సిద్ధి
చేతులు - దుఃఖం
కాళ్ళు - ఆయుఃక్షీణము
తోక - బంధనం
గర్భం - ఉదాశీనత
ప్రక్కలు - నిష్ప్రయోజనము




కూర్మ యంత్రాన్ని ఎలావేసుకోవాలంటే **ఉ॥సాయిబాబాకు** ఉత్తరదిశ అర్పణము గావున ఉత్తరదిశగా కూర్మశిరస్సు నుంచి ఆశిరస్సు పై కూర్చుని కావలసిన కార్యానికి ఏ దిశశుభ ఫలితమో గ్రహించి ఆ దిశను చూస్తూ జపం చేసి సిద్ధిపొందాలి.






శ్రీకాకుళంజిల్లా సోమరాజుపేట, సుగంధం వారి వంశవృక్షం పర్న బ్రహ్మఋషి గోత్రం
సు॥ గంగన్న (వీరు 4గురు అన్నదమ్ములు)
సీతమ్మ
వీరి సంతతి 4 గురు
సు॥ గురన్న
పాపమ్మ
సు॥ పాపన్న
సెలమ్మ
సు॥ సూరన్న
అమ్మన్న
1) సు॥ గురుమూర్తి
గంగమ్మ
వీరి సంతతి కాట్రగడ్డ లో ఉన్నారు
2) సు॥ ఆదినారాయ
అన్నపూర్ణ (చిట్టూరు)
వీరి సంతతి ముగ్గరు కుమ
3) సు॥ అప్పన్న- భద్రమ్మ
వీరి కుమారుడు సూర్యనారాయణ
భార్య మాణిక్యమ్మ
వీరి కుమారుడు వెంకటరమణ
4) సు॥ తాతయ్యమేస్త్రి -చిట్టిమ్మ
వీరి సంతతి లేక సుగంధం సత్యం గారబ్బాయి
ఆచారినీ పెంచుకున్నారు ఆచారి చెల్లెలు సింహాద్రి కాంతమ్మ
1) సు॥ వెంకటేశ్వరరావు
పాపాయమ్మ (వేముల)
వీరిసంతతి 6గురు అమ్మాయిలు 4 అబ్బాయిలు
వీరు విజయవాడలో ఉన్నారు
2) సు॥సూర్యనారాయ
భానుమతి (వేముల
వీరి కుమారుడు కృష్ణార్జునరా
3) సు॥ గంగరాజు
20సం॥లో శివైక్యముచెంది
వీరులైనారు
ఈమెకు 4 కుమారులు
1) సింహాద్రి నరసింగరావు
2) శ్యామసుందరం
3) సింహాద్రి గోపికృష్ణ
4) నాగేశ్వరరావు (శివైక్యం)
1) అనసూయమ్మ
వేముల ఆచారి
2) నారాయణమ్మ
కొండూరు సింహాచలం
3) సావి
కొమ్మోజురామారావు
4) సు॥సాయిబాబా- విమలాదేవి(బోనుమద్ది)
వీరికి 3 అమ్మాయిలు, 4 అబ్బాయిలు
5) సు॥ వెంకటగంగాచారి
కామాక్షమ్మ (ఆరిపాక)
6) మల్లికాంబ
అనుపోజు ఆనంద్
7) వరలక్ష్మి
కాద సత్యనారాయణ
8) సు॥గురుబ్రహ్మ
కమలకుమారి(రు)
9) సు॥ సాంబశివరావు
6సం॥లో శివైక్యం
10) ఉమామహేశ్వరమ్మ
లక్కోజు అమరలింగేశ్వరరావు
4) సు॥సాయిబాబాచార్య స్వామిజీ- విమలాదేవి
వీరికి 3 అమ్మాయిలు, 4 అబ్బాయిలు
ఈ దంపతులు "సనారీ పీఠాన్ని" 2 విజయవాడ సత్యనారాయణపురంలోని స్వగృహమగు "సాయిజ్ఞాన నిలయము" నందు స్థాపించి
నిత్యోపాసనలతో స్వామివారి పూజాక్రమములు నెరవేర్చుతూ 2011 లో కృష్ణానదీ ఆవలగట్టున గల మహానాడు గ్రామంలో "శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
త్రిశక్తి సహస్రలింగ సహిత సనారీ విలయము" నిర్మించి అచటే "వానప్రస్థాశ్రమ" జీవనమును చేస్తున్న సనారీ సంవాద గ్రంధార్ధముల కర్త
1) అన్నపూర్ణమ్మ
కొండూరు కమలాప్రసాద్
(ఆర్టిస్ట్)
2) పుణ్యశ్రీ దుర్గాంబ
కంటె శివకుమార్
(స్వర్ణ శిల్పి)
3) జ్ఞాన ప్రసూనాంబ
6సం॥లో
శివైక్యం
4) శ్రీ-సరోజిని(పాలూరి)
విప్రియ
శిప్రియ
5) శివప్రసాద్
గాయత్రి(మండా)
సు॥ సాయిజగదీష్
6) వెంకటేష్
పద్మజ (అలుగోలు)
భువనేశ్వరి,మీనాక్షి
7) రాజేశ్వరరావు
మాధవి (అప్పలబత్తుల)
పూజిత, హర్షిత

49. బంగారాన్నిచ్చు వ్యాపారునియింట బంగారు రంగుతో బంగారంవలే చక్కగా కూర్చబడిన త్రాగుపాత్ర పచ్చరంగుతో ప్రకాశిస్తూ అందు పెరుగన్నముపై మీగడ యున్నట్లుగా యున్న పుష్పాన్ని సమర్పిస్తున్నాను.

50. గుగ్గిలం, నెయ్యి, కుంకుమ, మహిసాక్షికంతో కూడినట్టిపొగను సర్వదేవతలు పీల్చుటకు ధూపంగా వేస్తున్నాము, ఆధూపాన్ని సర్వదేవతలు ఆఘ్రాణింతురు గాక. అట్టి ధూపాన్ని ప్రీతితో దేవతలు పీల్చుటకు సమర్పిస్తున్నాను.

51. ఓ అగ్నిహోత్రుడా, నన్ను హింసింపదలచిన క్రూరులెవ్వరుకలరో వారిని నశింపజేసి నీవు ప్రకాశింపుము నాకొరకుపశువులను కలుగ జేయుము. నేనేదిక్కున కేగినను నిరభ్యంతరముగా జీవించునట్లుచేయుము.

52. దేవతలు ప్రయాణించివచ్చుటకు, వచ్చిమమ్మల్ని రక్షించుటకు ఘంటానాదం చేస్తూలాంఛన ప్రాయంగా దేవతలను ఆహ్వానిస్తున్నాను. అందుకు ఘంటా నాదాన్ని సమర్పిస్తున్నాను.

53. మహామేరు పర్వతం సర్వమూ, వేదములందలి బ్రహ్మాదిసర్వదేవతలు నా దేహ మందు స్థిరంగాయున్నారు (యిలాచెప్పకుని శంఖాన్ని ఊదాలి).

54. నీటిబుడగవంటి జీవితమందు శరీరతాపముచే పశువువలేప్రవర్తించే

55. ఆ గుణములనుండి విముక్తుని గావించుటకు కామనరాన్ని త్రెంచి పశు గుణముల నుండి తప్పించమని భగవంతుని ధ్యానించుచున్నాను. మేకపోతు వలేప్రేరేపించు కామ విషయములందు యితరులు సావధానులై ఉండాలి.

56. **నివేదనా పదార్ధములకు గల శాపాన్ని పోగొట్టుటకు చెప్పుమంత్రములు** బ్రహ్మశాపమునుండి విమోచనకు ఓం- బాం- బీం- బూం- బేం-బైం, బౌం- బః బ్రహ్మశాపవిమోచనాయ ఈ పదార్ధములోఅమృతంరావాలి ఉంచుతున్నాము ఈలాగు పదిసార్లు చెప్పిదర్భలతో జలాన్ని సంప్రోక్షించాలి (నీళ్ళను చల్లాలి)

57. విష్ణుశాప పరిహారమునకు ఓం- వాం - వీం - వూం- వేం- వౌం-వః విష్ణుశాపవిమోచనాయ ఈ పదార్థములోకి అమృతం రాహలి (ఈలాగే పదిసార్లు చెపుతూ దర్భలతో నీళ్ళుచల్లాలి)

58. రుద్రశాప విమోచనకు - ఓం-రాం-రీం-రైం-రౌం- రః రుద్రశాపవిమోచనాయ ఈ పదార్థములోకి అమృతం రావాలి రావాలి ఈ లాగు పదిసార్లు చెపుతూదర్భతో నీళ్ళుచల్లాలి.

59. కృష్ణశాపవిమోచనకు - ఓం-క్రాం - క్రీం- క్రూం - క్రేం- క్రౌం- క్రః- కృష్ణశాప విమోచనాయ ఈ పదార్థములోకి అమృతం రావాలి రావాలి (ఈలాగు పదిసార్లు చెపుతూ దర్భతో నీళ్ళు చల్లాలి)





60. శుక్రశాప విమోచనకు- ఓం -శాం -శీం - శూం- శైం - శౌం - శః శుక్రశాప విమోచనాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి రావాలి (ఈలాగు పదిసార్లు చెప్పుతూదర్భతోనీళ్ళుచల్లాలి)

61. త్రిపురసుందరీ శాపవిమోచనకు - ఓం -ఐం- క్లీం- సౌః- సౌః క్లీం -ఐం -ఓం- మాం- మీం - మూం - మేం- మైం -మౌః-మః త్రిపుర సుందరీశాప విమోచనాయ ఈ పదార్ధములోకి అమృతం రావాలి (ఈలాగు పదిసార్లు చెపుతూ దర్భలతో నీళ్ళుచల్లాలి)

62. నివేదనా పదార్ధములగు సమస్త తినుపదార్థములు ఫలములు మొదలగునవి ఆరాధనమూర్తుల ఎదుట నుంచి పై విధంగా శుద్ధిచేయవలయును.

63. **కుంభస్థాపన :** నివేదనా పదార్థము వండిన పాత్రదైవం ఎదుట పెట్టి కుంభ పాత్రను పెడుతున్నాను. దీనిలోనిపదార్థము అమృతతుల్యము కావాలి. తేనెను ప్రేరేపించుతున్నాను.

64. దేవీ ఈ అమృతపాత్రను పెడుతున్నాను దీనిపై అధికమైన పాలతెరగలదు.మాకు ధనాన్ని, శుభాలను, జయాన్నియిచ్చి శత్రువులను నశింపచేయుము జగజ్జననీ

65. ఓం- ఐం- బీజాక్షరములందుగల త్రిపురాదేవిని తెలుసుకుందాము అందు కొరకు ఓం - క్లీం బీజాక్షరములందుగల కామేశ్వరీదేవిగా ధ్యానిద్దాం ఓం - సౌః బీజాక్షరములలో నిండివారు మనకు ప్రేరణనిచ్చుగాక యితరులు సావధానులై ఉండాలి అంటూ నమస్కరించాలి.

66. ప్రణవమంత్రంగాను, భూ=భూలోకం (శరీరం) భువః = పితృలోకం (మనస్సు) సువః= దేవలోకం ( ప్రాణం) ఈ మూడులోకాలలో శరీరమందలి ఈ మూడు స్థానాల్లో ఉంటూ ఎవరుమనబుద్ధిని ప్రేరేపిస్తున్నారో ఈ చరాచరలోకాన్ని సృష్టించినదైవమైన, జ్యోతిరూపుడగు ఆ విరాట్ విశ్వకర్మను ధ్యానించుదాం యితరులు స్థిరగుణంతో సావధానులైఉండాలి. యిలా ఐదుసార్లు చెబుతూ ఐదుసార్లు నివేదనా పదార్ధములపై నీళ్ళుచల్లూతూ సత్యాన్నిపాటిస్తూ ఆహారపదార్ధముల చుట్టూ నీళ్ళుచల్లి ఆహార పదార్ధములు అమృతతుల్యంకావాలంటూ ఐదుసార్లు చెప్పి పదార్థాలపై ఆకుతో నీళ్ళు చల్లాలి.

67. హృదయ మందుండు ప్రాణవాయువు, గుదస్థానమందుండు అపానవాయువు, నాభియందుండు సమానవాయువు, కంఠమందుండు ఉదాన వాయువు, శరీర మందంతటా ఉండు వ్యానవాయువు, ఈ పంచవాయువులు యధాస్థానము లందుండమని కోరుతూనివేదనచేయాలి.

68. దేవతామూర్తుల ఎదుట మూడు చిన్నగిన్నెలు పెట్టి ప్రధానపాత్రయందలి పదార్థాన్ని చిన్నగిన్నెలలో వేసి ఆ మూడు ప్రసాదపాత్రలకు పంచపూజలు చేయాలి. యిలా లం పృధివీతత్వాత్మనే ప్రసాద దేవతాయై నమః గంధం పరికల్పయామి.